C. M. Veerabhadra Sharma.

13. 90.

శ్రీరస్తు.



శ్రీమద్వీరశైవజనశ్రవణపఠనార్చనోపయుక్తంబగు

# చెన్నబసవపురాణము

ఇది

అత్తణూరి. పాపకవిప్రణీతము.

శ్రీమదష్టావరణపంచాచారాన్వితుండును భృంగిగోత్రపవిత్రుండును
వీరమాహేశ్వరస్వరూపుం డగు

గంగపట్టణపు. సుబ్రహ్మణ్యదేవరగారిచే

శ్రీబసవేశ్వరపాదారవిందసేవాధురంధరుండును వాసావంశసాగరసుధాకరుండును
లింగమూర్తిగారిసత్పుత్త్రుండును శివభక్తాగ్రగణ్యుండును కృష్ణాజిల్లా
పాలకొలనువాస్తవ్యుండును వదాన్యశేఖరుండు నగు

బసవరాజుగారి

ద్రవ్యసాహాయ్యంబువలన.

చెన్నపురి:

ఆదిసరస్వతీనిలయముద్రాక్షరశాలయందు
ముద్రింపించి ప్రకటింపంబడియె.

1916.



దీనివెల రూ. ౧-౮-౦.



# శ్రీబసవలింగాయనమః.

---

గీ. వీరశైవంబువృద్ధి గావింపఁదలఁచి, శంభునాజ్ఞనుక్షోణిని జననమంది
భక్తవత్సలుఁడై తగఁబ్రబలిబసవ, రాజువిలసిల్లెలోకవిభ్రాజితముగ. 1

గీ. ఆబసవరాజుతోఁ బుట్టునైనయక్క
నాగమాంబకుఁగల్గిననందనుండు
చన్నబసవేశ్వరుం డన జగతిలోన
శరణులకు శ్రేష్ఠుఁడైమించె సుఖచిరముగ. 2

క. శరణశ్రేష్ఠకులంబునఁ, బరఁగజనించియును కర్ణభక్తులనంగన్
గురుతరముగ బెంపొందిరి,వారచరణధ్యానపరవశాత్మకులగుచున్. 3

క. ఆవంశమందు ధరలో, వావిరి సద్వృద్ధిఁ బొందివాసాగోత్రం
బైవిలసిల్లెను సద్గురు, దేవునికృపచేజనించె ధీరుండొకఁడున్. 4

గీ. అతఁడుశంకరసద్భక్తుఁడై చెలంగి
మఱియు గంగాధరుండన మహినివెలసి
పరఁగవీరన్నశంభుఁడు బసవఘనుఁడు
రామలింగాఖ్యుఁ డనెడు పుత్రకులగాంచె. 5

క. వారలలోబసవాఖ్యుఁడు, కూరిమినంబమ్మయనెడుకువలయనేత్రన్
వారకఁబెండిలిమైచెలు, వారఁగఁబుత్రకులఁగాంచె నతిమోదమునన్.

గీ. ఘనుఁడుజ్యేష్ఠుండు నాగలింగంబనంగ
నయ్యలును వానిసోదరుఁడై చెలంగి
చనువుమీఱంగ పాపమ్మయనెడుచెలినిఁ
బరిణయముఁజేసుకొనెను సంభ్రమమెలర్స. 7

గీ. అయ్యలకు నాగబసవన్నయనఁగ కోటి
లింగమనఁగను వేడ్క శ్రీలింగమూర్తి
యనెడు మువ్వురు పుత్రకులనువుమీఱ
జననమందిరి నిర్జరావనునికృపను. 8

గీ. లింగమూర్తికోటమ్మను గంగమాంబ
వీరనాగమ్మ యనెడుశృంగారవతులఁ
బెండ్లియై గంగమాంబకుఁ బేర్మి బసవ
రాజనఁజెలంగు జ్యేష్ఠపుత్రకునిగాంచె. 9

గీ. గరిమఁగోటమ్మ మఱియు గంగాంబపుత్రి
యై చెలంగెను కోటనాగమ్మవీర
నాగమాంబసుపుత్రియనంగ వెలసి
మహిని మాణిక్య మనెడునామమునఁ దనరె. 10

గీ. ధరను శ్రీవీరశైవమతాభిమాని
లింగమ త్రివిధ మనిన శ్రీలింగమూర్తి
బసవరాజుకు సకలసౌభాగ్యమొసఁగి
శివునిఁ జేరెను గడువడి క్షేమముగను. 11

తరలవృత్తము. బసవరాజునుబోలిధాత్రిని బసవరాజువిభాసిలెఁ
గుసుమసాయకువైరిభక్తులఁ గోర్కులెల్లను దీర్చుచున్
అసమలోచనుకన్నవేలుపు లవనిలేరనివల్కుచున్
కసటునొందక వీరశైవము కాయమొందినరీతిఁగన్. 12

సీ. వీరశైవులమంచు విఱ్ఱవీగెడువారి
కన్నవాసాబసవన్న మిన్న
మతపతులను మించు మాహేశ్వరులనొంచు
నయ్యలనెంచు నీయనఘునంచు
శీలవంతులగెలిసేయుసద్భక్తియు
గలవాఁ డటంచుఁ బల్కంగఁదగును
పంచాక్షరీమంత్రపారీణధౌరేయుఁ
డాగమజ్ఞుండు సత్యవ్రతుండు
తే. భూతిరుద్రాక్షమాలికాభూషితుండు
చన్నబసవపురాణంబు సాంగముగను
నచ్చుగావించుటకు ద్రవ్యమతిముదంబు
తో నొసంగెను శైవు లద్భుతముఁజెంద. 13

# పీ ఠి క.

వీరశైవశేఖరులారా!

విన్నపమంగీకరింపుడు. శ్రీమద్వీరశైవమతంబున నష్టావరణపంచాచార షట్థ్సలాదివిషయంబు లావశ్యకంబై యుండు. నీవివరం బెరుంగకుండిన వీరశైవంబునకు మిక్కిలి లోపం బగు. మఱియు నీవిషయాదులలో షట్థ్సలాంతర్గతం బగుశరణస్థలంబు సుప్రసిద్ధం బైనది. యాస్థలసిద్ధిప్రదు లగువారు శరణులని యెన్నబడుదురు. శ్రీమచ్చన్నబసవేశ్వరులవారు శరణశ్రేష్ఠులనుటకు వీరశైవమతగ్రంథప్రమాణంబు లనేకంబులుగలవు. శ్రీబసవేశ్వరులవా రనేకదినంబులు గాచి వీరశైవజనావతంసులైన కక్కయ్యగారిప్రసాదంబు భగవత్కృపచే బడసినపిదప తత్ప్రసాదంబక్కనాగమ్మగారు గ్రహించుటవలన శ్రీచన్నబసవేశ్వరులవారు జనించిరనుట కీచన్నబసవపురాణము సాక్షిగను గానంబడుచున్నది. శ్రీబసవేశ్వరుల వారికాలమున భుజంగశేఖరులగు జంగమయ్యలకు లింగధారులగు వేశ్యలు వశీకృతులైనందున వారిసంబంధులకును బసవేశ్వరులవారికి క్షురకర్మ గావించిన అడపదప్పన్నవంశజులు మొదలుగాగలవారికి బసవేశ్వరులవారు శీలంబిచ్చిరనియు, నష్టావరణపంచాచారపరుల గావించిరనియు కర్ణాటదేశస్థులు పల్కుచు తత్కులజుల గలసి మఠపతులయ్యలు మహేశ్వరులనువారు సహపంక్తిభోజనంబులు గావించుచున్న వారీయాంధ్రదేశంబున గలదేవరదాసమయ్యగారివంశోద్భవులకు కిన్నరబ్రహ్మయ్యగారివంశసంజాతు లాదిగాగలవారికిని తొల్లిబసవేశ్వరులవారే శీలం బొసంగిరని వచించుచునయ్యలు మఠపతులు మహేశ్వరులనువారు సహపంక్తిభోజనంబు లొనరించుచుందురు. వీరెల్లరకు ప్రమాణములు బసవపురాణాదిగ్రంథములుగాని మఱి యేగ్రంథంబులందైనను గానం

బడవు. వీరిపూర్వులగలసి బసవేశ్వరులవారు సహపంక్తిగావించినటుల దృష్టాంతం బే గ్రంథంబుల నించుకైనగానరాదు. కక్కయ్యగారి ప్రసాదమునకుమాత్ర మనేకదినంబులు ప్రయాసపడి తత్ప్రసాదంబు భగవత్కారుణవలనబొంది యాప్రసాదమహిమచే మేనల్లుఁడగు చన్నబసవేశ్వరులవారిని బడసిన బసవేశ్వరులవారు కక్కయ్యగారివంశోద్భవుల కష్టావరణపంచాచారంబులు శీలంబొసంగనికారణంబేమి? చన్నబసవపురాణాంతర్గతంబగు కక్కయ్యగారికథ జక్కఁగాఁగాంచిన చన్నబసవేశ్వరులవారి జన్మవృత్తాంతంబు సవిస్తరంబుగను దెలియబడును. మడివాలుమాచయ్యగారికి శివనాగమయ్యగారికి బసవేశ్వరులవారు విధేయులైనటుల బసవపురాణ ప్రమాణముగలదు. తత్సంబంధులకేల బసవేశ్వరులవారు శీలంబియ్యరైరి? గణికావనితలకు నడప దప్పన్నగారికి దేవరదాసమయ్య గుండయ్యకు బసవేశ్వరులవారు విధేయులైనటులగాని తత్సేవనాసక్తులైనటులగాని సంస్కృతాంధ్ర బసవపురాణాదులం దెందుగాంచిన నొక్క ప్రమాణంబైనగానంబడ దిట్టియప్రమాణంబుల బల్కువారికి గలుగు పాతకంబునకేను మిక్కిలి భీతిల్లెద. నీశీలవంతులనువారికి చతుష్షష్టిశీలవివరంబించుకైన దెలిసినటుల దోచఁబడదు. శీలలక్షణం బెఱుంగనివారు శీలవంతులెట్లగుదురో జర్చింపుఁడు. గాయత్రీధారియగు బ్రహ్మచారిసంధ్యావందనం బెఱుంగకుండునే? శీలవంతుఁడగు సదాచారపరుండు శీలవివరంబు దెలియకుండునే? శీలవిలక్షణంబు దెలియక ప్రాతఃకాలంబున హస్తశౌచంబు సల్పువిషయమే తెలియని వీరికి శీలంబెట్లు సిద్ధించెనో దెలియ వీరిపూర్వులకు బసవేశ్వరులవారు శీలంబిచ్చిన ధర్మంబెట్లనో యోచింపుఁడు. శ్రీబసవేశ్వరులవారి సంబంధములేనివారికెల్లరకు పూర్వము శీలంబిచ్చుట నిక్కంబైయున్న కక్కయ్యగారి వంశజులకు తొల్లి ముఖ్యంబుగను శ్రీబసవేశ్వరులవారు శీలంబియ్యకుండు రే? మఱియు నీవల పండితారాధ్యస్వాములవారి సూత్రసంబంధులు లింగాంగులును జేసి పాదజులకు గొందఱికి నుజ్జయినీపీఠాధికారు లష్టావరణవివరము దెలి

యని జంగములకు మఱికొందరికిని శీలంబులొసంగిరి. ఇకగొన్ని దినంబులు జరిగిన పిదప వీరును మాపూర్వులకు బసవేశ్వరులవారే శీలంబిచ్చిరని పల్కగలరు. కర్ణాటాంధ్ర దేశంబులగల మతపతులయ్యలు మహేశ్వరులనువారు ధనాసక్తులై వారి కిష్టముగు వారికి శీలంబులిచ్చివారిని గలసి భోజనంబులు గావించుచు వీరశైవమతంబు క్షీణదశకుదెచ్చి రిందువలన వీరశైవుల శూద్రులనుటకు నిజంబైనకారణంబై యున్నది. శ్రీబసవేశ్వరులవారి నిపాల్కురికి సోమనాథస్వాములవారిని చతుష్షష్టివిచారధురంధరులని నిస్సందియముగా బల్కందగు నీమహానుభావులు శీలవిచక్షణదక్షులనుటకు బసవపురాణాది వీరశైవమతగ్రంథంబులు సోమనాథభాష్యము సాక్ష్యంబులై యున్నవి. చెన్నపురిని దధివిక్రయులగువారు గొందరు మేము లింగాంగులమని పల్కుదురు. వారికి గురువులుకర్ణాటదేశస్థులట. వారు గొందరు లింగంబులు లేకనే కానంబడుదురు. మీరు లింగాంగులమని పల్కుదురే లింగంబులుగానరావేమన పెరుగుగైకొనువారు స్పృశించుదురని లింగంబులిండ్లను దాచివచ్చితిమని పల్కువారు గొందరు. పెండ్లిగాకముందు మేము లింగధారులుగామని పల్కువారు మఱికొంద రిట్టిప్రాకృతులకు లింగధారణలుగావించి వీరికి శీలంబులిచ్చితిమని పల్కి వీరితోగలసి అయ్యలనువారు భుజించెదరు. దధివిక్రయులకులంబెట్టిదో యోచింపుడు. వీరినిగలసి భుజించువారెంత వీరశైవశేఖరులో చర్చింపు డిట్టిప్రాకృతాదికులజుల కెల్లఱకు ధారణలుచేసి సహపంక్తులు గావింపుచు వీరిపూర్వులకు బసవేశ్వరులవారు శీలంబులిచ్చిరని ప్రల్లదంబులు వచింపుచు ధనాసక్తులై వర్తించెద రిట్టివారెంత వీరశైవచూడామణులో మనంబున జక్కఁగా యోచింపుడు. మఱియు ద్విజునిష్టలింగధారిని గావింపఁదలచిన మూఁడువత్సరములవఱకు శైవదీక్షయొసంగి పిదప వీరశైవదీక్షితునిగావింపవలయుననియు నారీతిగ క్షత్రియు నారువత్సరంబులకు వైశ్యుని తొమ్మిదివత్సరంబులకు శూద్రుని పండ్రెండుసంవత్సరంబులకు నిష్టలింగధారులం జేయందగునని [illegible] ప్రమాణంబు

గలదుగాని నానాజాతులకు ధనాపేక్షచే లింగధారణ లొనర్చుటకు ప్రమాణంబులు కానంబడవు. ఉ. 'చాతుర్వర్ణానాం ధారణంభవతి' యని లింగోపనిషత్ప్రమాణం బింతియే కాక బసవపురాణము జ్ఞానయోగఖండము హారవిలాసము నీలకుంతలివిలాసము మొదలగు గ్రంథములుగాంచిన తేటతెల్లంబగు. నాధర్మంబుల ననుసరింపక నయ్యలనువారు శూద్రేతరులకు లింగధారణలొనర్చుచు వారికిష్టమగు వారిచే ధనంబార్జించి శీలమిచ్చితిమని వారినిగలసి భుజింపుచు నెవ్వారైన నయ్యలనువారిని శీలంబొసంగుట కర్తవ్యంబగునే యనివచింప బసవేశ్వరులవారు వారికి శీలంబొసంగిరని కల్లలాడుచు వర్తింపుదు రీయాంధ్రదేశంబునకు బసవేశ్వరులవారువచ్చి కొందరికి శీలంబిచ్చి మఱికొందరికి శీలంబియ్యక కళ్యాణపట్టణంబు జేరిరే? శ్రీబసవేశ్వరులవా రాంధ్రదేశంబునకువచ్చి కొందరికి శీలంబిచ్చినటుల దృష్టాంతంబెందుగలదు? బసవేశ్వరలీలలన్నియు తత్పురాణంబున విదశమైయుండ నీశీలవిచారంబామహద్గ్రంథంబున గానంబడనికారణంబేమి? గొడగూచి దీపదకళయారు మొదలుగాగల పురాతనభక్తులవివరము బసవపురాణమువిస్తరించుచుండ నాంధ్రదేశంబునగల శీలవంతులకుబసవేశ్వరులవారు శీలంబొసంగిన నాగ్రంథంబున గానంబడకుండునే? గతవత్సరంబున నరసారావుపేటతాలూకానుండి మఠపతులమని అయ్యలమని పల్కువారి సంబంధుండొకఁడునుండు వేలకొలఁది లింగములుదెచ్చి కృష్ణాజిల్లా పాలకొల్లుమొదలుగాగల గ్రామములో కొందరికా లింగంబులు బ్రతిమాలి ధారణములుగావించి వారలచే గొంతద్రవ్యంబార్జించెనని ప్రసిద్ధంబాయె. నింక గొన్నిదినంబులు గడువ మాకెల్లలకు బసవేశ్వరులవారు లింగధారణలుగావించిరని వీరు పల్కగలరు. ధరనాచారవివరం బెఱుంగనిశూద్రేతరులు మేము శీలవంతులమని పల్కుటెట్లన్న నక్షరాభ్యాసం బెఱుంగనిప్రాకృతులు సంగీత సాహిత్యాది సకలవిచారధారేయుల మన్న తెరంగుగాదె? చెంగల్పట్టు జిల్లాకు జేరువయగు చెన్నపురిప్రాంతంబున పెరంబూరుదగ్గఱ నగర

గ్రామవాసులై చెలంగుచు చతుర్విధవీరశైవవిచారధౌరేయు లనంబరఁగి త్రివిధలింగనిష్ఠాగరిష్ఠులగుచు నేకవింశతిదీక్షావిలక్షణాష్టావరణపంచాచారసహితగురులింగజంగమార్చనక్రియాకలితులన బెంపొంది సిమ్మల వంశాబ్ధిచంద్రు లనదగి వీరమహేశ్వరస్వరూపులగుచు జెన్నొందిన సుబ్బయ్య దేవరవారి సత్పుత్రకు లగు పెదమల్లయ్య దేవరవారిమహద్గ్రంథంబునకు బాసటమై చెలంగిరి గాన వీరిని శ్రీబసవేశ్వరులవారు పుత్రపౌత్రాభివృద్ధిగా రక్షింతురుగాత! శ్రీమద్వేదారణ్యభాష్యము నీలకంఠభాష్యము రేణుకాభాష్యము పరమతకాలానలభాష్యము యాయాశాస్త్రాంతర్గతం బగుశక్తిపాదము వీరశైవశ్రౌతకళానిధి అనాదివీరశైవసారసంగ్రహము మత్పితామహునిచే విరచింపఁబడిన వీరశైవచింతామణి మొదలుగాగల మఱికొన్నిగ్రంథంబు లచ్చొత్తించ బ్రయత్నింపుచున్నవాఁడ వీరశైవమతాభిమాను లగువారు వారివారిశక్తికొలంది ద్రవ్యసాహాయ్యంబు గావించెద రని కోరుచున్నవాఁడ.

ఇట్లు విన్నవించు
నెల్లూరుజిల్లా, కోవెలగ్రామవాసి
గంగపట్టణపు. సుబ్రహ్మణ్యదేవర.

# విషయసూచిక.

## పీఠిక.



## ప్రథమాశ్వాసము.



## ద్వితీయాశ్వాసము.



## తృతీయాశ్వాసము.

చతుర్థాశ్వాసము.



పంచమాశ్వాసము.



---

శ్రీ ర స్తు.

# అసావేరిరాగము.

చ. అసమగుణాఢ్యునందు శరణాగతవత్సలునందు జంగమ
శ్వసనమహిష్ఠునందు భవవారణకారణునందు భక్తమా
నసపరిపూర్ణునందు గణనాథుఁడు మాబసవయ్యయందు మా
బసవనియందు మాబసవపాత్రునియందు వసింపుచిత్తమా!

శా. మాయన్నాయలవెట్టిగొగ్గడుసు సన్మానించి ముక్తాయికిన్
శ్రేయఃప్రాప్తి యొసంగి రామయకృపన్ చేపట్టి నిష్కర్మచ
ర్యాయుక్తిం బసవేశ్వరాదులను లింగైక్యానుసంధానులం
గా యోచించిన యల్లమప్రభుని వేడ్కం గొల్తునశ్రాంతమున్.

క. శివకవిభృంగీవంశో, ద్భవుఁడై యన్యమతిమానిభవశైవనుతుల్
కవులెన్నఁగ విరచించుట, నవనము పాల్కురికి సోమనాథునొనర్తున్.

గ్రంథాదియందు యీపద్యములుపఠించి తదుపరి గ్రంథము చదువఁ
బూనుకొనియెద రని వేడుకొనుచున్న వారము.

---



శ్రీరస్తు.

# చెన్నబసవపురాణము.

---

## పీఠిక.



క. గిరిజనవవధూరో
జాగురుకాశ్మీరపంకిలాంకితవక్షః
శ్రీగిరిమల్లేశ్వరుకృప,
దాగందుకురమృతలింగధన్యుని బ్రోచున్. 1

ఉ. ఉన్నతకుంభముల్ నిజపయోధర మంద గజాస్య సంకవీ
థి న్నివసింపఁ జేసి బలుశేవ నిశేశ్వరుసాము మేనఁ దా
నున్నెడ మూఁడు మోముల గుహుండు స్తనత్రయ మంచుభ్రాంతినా
న న్నిగుడం దదిచ్ఛ గని నవ్వుభవాని కృతీశుఁ బ్రోవుతన్. 2

చ. ఘనతను దీప్తుఁడై సమదగండయుగచ్ఛవిదంతకాంతుల
న్వనజభవాచ్యుతాబ్జధరవైఖరి దోఁపఁగఁ జేసి యేసె చూ
గనుగొనఁగం త్రిమూర్తులకుఁ గారణమై తగుమూర్తి నంచు పెం
పెనయ గజాస్యుఁ డీవుత కృతీశునకీప్సిత మాదరంబుగన్. 3

చ. అరిధరణీధ్రదైన్యకరదాఘవనామయగంధవాహాభీ
కరకులిశానలాగ్నిఫణికల్పితశాతనఖాళిపక్షదు
ర్భరవిషమాక్షవాలములఁ బాటిలుశ్రీశరభాంకసాళువే
శ్వరుఁడు కృతీశుఁ గీర్తిబలశౌర్యశుభాన్వితుఁ జేసి ప్రోవుతన్. 4

ఉ. విశ్వకళాప్రవీణపరివీరుఁడ నీకు కృపాణవైనతే
యాశ్వశిలీముఖాంఘ్రికమలామలభక్తధురీణసత్కృపా
శశ్వదురీక్షకోణ యని సారెకు నామడి శాఁడికొండసం
దీశ్వరు మద్దురుం దలఁతు నెప్పుడు తా నుపదేశికాత్మజున్. 5

సీ. కందర్పముఖ దేవసందోహవినుతగో, విందాస్త్రవహనాభినంది నంది
రంగద్భుజంగేశ్వరాంగదపదపద్మ, సంగతమానసద్భృంగి భృంగి
రుద్రనిరాకృతిక్షుద్రదక్షవితాన, విద్రావణక్రియాభద్రు భద్రు
కాండసంభవకాండఖండనదూషక, కాండసంహరణప్రచండు చండు
గీ. సర్వసర్వంసహాచక్రశైలగేహ
భక్తమానససంశయభారతిమిర
పటలబోధాంబురుహసుహృత్ప్రభుని ప్రభుని
పూని వినుతించెదఁ బ్రణామపూర్వకముగ. 6
మ. వరసర్వజ్ఞశిఖామణిన్ ప్రథితసద్వారప్రమోదాకరున్
నిరతోద్యచ్ఛివధర్మసంచరుఁగళానీకాంచితావాసుభా
స్వరలింగాన్వితదేహు సర్వవిబుధప్రీతామృతాధారు భా
సురపాదుం గళితారిఁ బాల్కురికివంశ్యున్ గొల్తు సోమాహ్వయున్.
మ. వరవల్మీకజనన్నపార్యముఖగీర్వాణాంధ్రభాషాకవి
త్వరమాంభోనిధు లంజనాక్షయుగజీవంజీవతోషాక్రియా
కర తేజోవిధులం నిజానుపమవాక్యప్రీతసంపాదనా
స్ఫురదాశాంబుధులం దలంతు సతతంబున్ గార్యసంసిద్ధికిన్. 8
క. అని యిష్టదేవతాప్రార్థనమును గురుస్తోత్రమున్ పురాతనగణప
ద్వనజాధివందనము కవి, జననుతి గావించి యక్కజం బగు వేడ్కన్.
సీ. కమనీయధర్మార్థకామమోక్షసుఫలా, నీకంబునకు సురానోకహంబు
బంధురవిజ్ఞానభక్తివైరాగ్యని, ష్ఠామౌక్తికములకు శంబరనిధి
సాంఖ్యయోగాదికచందనభూమీరు, హావళులకు మలయాచలంబు
నలలితసాలోక్యసామీప్యసారూప్య, సాయుజ్యముక్తివజ్రములకుఁ గని
గీ. యైన శ్రీచెన్నబసవప్రధానుభవ్య
చరితమస్మద్గురూత్తమసత్కటాక్ష
గరిమ నా నేర్చుగతి జిహ్వ పరమపావ
నత వహింపఁగఁ జెప్పఁ బూనంగ నంత. 10
సీ. తనయశస్స్ఫూర్తి శీతనగాంబుజాతజా
తనభోవలగ్నలఘునత్వఁ దెగడు

తనశౌర్యకలన శంతనుసూనుకీచకే
తనజమదగ్ని నందనుల నొంచు
తనరూపగరిమ శ్రీతనయునైషధజయం
తనలకూబరుల వాదున జయించు
తనయోగి రాత్రికాంతనరనాహనదైవ
తనగకర్ణుల లెక్క గొనక నెగడు
గీ. తనవచోగరిమంబు ధాత నగఁ జాలు
తనప్రతాపంబు సూర్యు నెంతనఁగ నోవు
తనరు శ్రీ కందుకూరివంశాబ్ధిచంద్రుఁ
డరితిమిరహేళి యమృతలింగార్యమాళి. 11

వ. మఱియు సమస్తసిద్ధవిద్యాధరపరివృతుండును ననంతామరసంస్తూయమానుండును పరభూభృత్పక్షచ్ఛేదనదక్షుండును కమనీయసుధర్మాధివాసుండును నిరంతరగురువాక్యానుసారప్రచారుండును హస్తగతశతకోటిసాధనుండును నందనవిహారసంజనితప్రమోదస్వాంతుండును శుచిసమవర్తిపుణ్యజనధనేశమహాబలధనాధ్యక్షసర్వజ్ఞసమాకీర్ణుండును నగునమ్మంత్రిపురందరుం డొక్కనాఁడు శ్రుతిరంజకవిప్రవరవిహారకోలాహలం బై నిరుపమామోదసుమనోవిలాసభాసురం బై యశ్రాంతకమలాంచితాలవాలం బై సలలితనిర్జరాభినయనవిహారమూలం బై యాశ్రితాళిమనోరథపూర్ణకారం బై కల్పవృక్షం బన నొప్పునాస్థానసౌధరాజంబున జ్ఞాతిబంధుమిత్రామాత్యపురోహితసామంతదండనాయకకవిపండితపౌరాణికేతిహాసకపాఠకపరిహాసకతాంత్రికభిషగ్వైణికవాంశికనర్తకమురజికవైతాళికవందిజనపరివేష్టితుం డై మణిఖచితకార్తస్వరసింహాసనంబున నొడ్డోలగం బున్నసమయంబున నిజపితృపితామహాదులు మున్నందినసత్కృతులు ప్రసంగవశంబున సభాసదు లైనబుధజను లుపన్యసించిన విని సంతోషస్వాంతుం డై నప్తసంతానంబులలో కృతియ యుత్తమోత్తమంబు గావున నే నొక్కప్రబంధంబు గైకొనియెదఁ గాక యని తలంచి. తత్ప్రాజ్ఞులకు నిజాభిలాషం బెఱింగించిన వార లిట్లనిరి. 12

మ. అనఘా! మీరు దలంచినట్టితలఁపార్యాభీష్ట మాప్తాళిరం
జన మహోన్నదళనం బమేయఫలకృత్సంతానముఖ్యంబుగా
వున కీర్త్యాస్పద మైనయొక్కకృతి నీవు న్వేడ్కఁ గైకొమ్ము మున్
ఘనతాసింగయబాచయాదిసచివౌన్నత్యంబునం జెందెడిన్. 13

గీ. సుగుణసత్కులీను శుభవాక్యసర్వల,క్షణధురీణు సరసకావ్యరచను
వీరశైవగ్రంథవేత్త తేజస్విగా,నెఱిఁగి యందు మాతఁడిచ్చుసుకృతి.

చ. అనవుడు మందహాసవదనాంబుజుఁ డై యపుడత్తలూరిపా
వనకుల జక్కరాజునకు పౌత్రుఁడ శ్రీగిరిమంత్రిమాళికిన్
ఘనమతి సుందరాంబికకు నందనుఁ డబ్బసవేశుఁడే యనం
జనుబసవేశుమంత్రి కనుజన్ముని పాపయసత్కవీంద్రునిన్. 15

క. ననుఁబిల్వ బంచి తగు తెఱఁగున బూజ లొనర్చి యిష్టగోష్ఠివినోదం
బునఁ గొంతప్రొద్దుగడపిన,వినయవచోగరిమననియె వేడుకనాతోన్.

చ. శివకరుణాకటాక్షమునఁ జేకురె దక్కనయట్టిసంతతుల్
కవిజనహృద్యమున్ భువనగణ్యము భక్తిరసోల్బణక్రియా
భవనము కిల్బిషప్రకరపాటన మై తగు నొక్కసత్కృతిన్
దవిలె మదీప్సితం బిపుఁడు దాన మనోరథపూర్తిఁ జెందెడిన్. 17

క. సంతానభూజములలో, సంతానం బైనయట్టిసత్కృతి నీచేఁ
గాంతు ననికోర్కెఁ జెందితి, సంతసమున నొసఁగవలయుసరసకవీంద్రా!

మ. అని జాంబూనదనిర్మితాంబరమణీహారాగ్రిహారాశ్వచం
దనవీటీచతురంతయానసుమనోధామాదివస్తువ్రజం
బున నన్వేడ్క బహూకరించుటయు నేవూర్ణ్ణానమోదంబుతో
ననఘం బైనతదీయవంశకథనం బాసక్తి వర్ణించెదన్. 19

కృతిపతివంశవర్ణనము.

క. హృతకాముఁడు యుత వారిజ
హితధాముఁడు విష్టపత్రియీభరితయశో
జితసోముఁడు ధారుణిలో
హితసోముఁడు [illegible]సమ్మశ్రీ[illegible]యై. 20

క. అబ్బాసవాలుకులమున, బిబ్బోకవతీస్మరుండు పృథివితరుణీహా
నిబ్బరుఁడరిమృగతతికిం, బెబ్బులియన నప్పమంత్రి పెంపొందుధరన్.

క. ధీరుఁడగునప్పమంత్రికి, వీరేశ్వరుఁడనఁగనుద్భవించెనుసుజనో
ద్ధారుం డాతని కాత్మజుఁ, డైరంజిలెనప్పసచివుఁ డతిధార్మికుఁడై.

గీ. అప్పమంత్రిభార్యలైనపార్వతియుండు, గంగవలనసుతులఁగనియెజగ్గ
మాభిధానుమఱియునమృతకవీంద్రుని, శ్రీగిరీశ్వరునివిశేషమతుల.

ఉ. అందులపార్వతీతనయుఁడై చెలువొందినజగ్గనాహ్వయుం
డిందుధరాంఘ్రిభక్తి ధరణీశవశీకృత మంత్రశక్తి మె
చ్చందగుసూనృతోక్తి గరసాహసభోగకళాధురంధరుఁ
సందనురామకృష్ణఘననాముని గాంచె జగత్ప్రసిద్ధిగన్. 24

చ. ఘనుఁ డగు రామకృష్ణునివికాసమునీషకు మెచ్చి సంతసం
బున త్రిజగత్ప్రతాపకులభూషణరాయఁ డనంగ మేటి పే
రునుమణిభూషణంబులు హరుల్ గజదంతవుఁబల్లకీలఁగొ
మ్మని దయ గోలకొండవసుధాధిపుఁడాతనికిచ్చె హెచ్చుగన్. 25

సీ. భూనుతకీర్తియాభూషణరాయుండు, హేలానగరరాజ్యమేలుచుండి
నిడుదవోల్సీమలోనిరుపమవాసిష్ట, తటినీతలంబున ధరణిసురల
కగ్రహారములు కల్పాంతరస్థాయిగా, నొసఁగివనీపకవిసరములకు
వాంఛితార్థంబులవ్వారిగానొసఁగుచు, బంధులనరయుచుబహుళపుత్ర

గీ. పౌత్రకళ్యాణవృద్ధిచే బరిఢవిల్లె
కాంతిజితహేళిశివపాదకమలజాళి
దళితదుఃలతాళి నిరుపమదానకేళి
రమ్యగుణపాళి భూషణారాయమౌళి. 26

గీ. అప్పనకపిన్నయాలైనయట్టిగంగ
కుద్భవించినయాత్మజయుగ్మకమున
నమృతకవిచంద్రుఁ డలరుప్రఖ్యాతిమీరి
యరివిభేదియుఘనతమోహరుణుఁ డగుచు. 27

క. ఆతడుకొండాంబికయుం, దాతతశైవవ్రతుని సదాచారగుణో
పేతుని భేరయలింగా, ఖ్యాతామాత్యాగ్రగణ్యుగనిసిరులొందెన్.

క. పేరయలింగామాత్యుఁడు, భూరియశోలలిత మత్ప్రిపూఁడికులజుఁడై
వీరననుతయుగుకొండర్, భారతిపర మెప్పి పగిదిపరిణయమయ్యెన్.

క. ఆతన్వియందుగనియె, న్నాతతసంహరణచణుల పార్థివఫణులర్
ఖ్యాతికళామృతలింగ,జ్యోతిర్లింగాభిధానసూనృతగుణులన్. 30

మ. అమృతామాత్యుఁడు బుద్ధిరాజుకులపద్మాదిత్యుఁడై పర్వతుం
డమితామోదముతోడఁ గన్నగురువాంబాసాధ్వికేల్వట్టిత
త్ప్రియదారత్నమునందుఁగాంచె తనయుర్ భావాంతరస్థాద్రిజా
రమణుంబేరయలింగమంత్రిశశభృద్రామేయ సౌందర్యునిన్. 31

ఉ. పేర్కొనఁనొప్పుకందుకురి పేరయసత్ప్రభుచక్రవర్తిక
బ్జార్కసమానకీర్తి మఘవాత్మజతుల్య విలాసవృత్తిదు
ష్కర్కశవైరిసంఘభయకారణమూర్తి పరాంగనాళిసం
పర్కవిచారకల్మషవిపాలక సత్పథవర్తి ధారుణిన్. 32

గీ. భవ్యగుణధుర్యముదిగొండపర్వతార్య
వరవిశాలాక్షులకుఁ గల్గువనజగంధి
వీరమాంబనువరియించె విభవమెసఁగ
నంగజాకారిపేరయలింగసూరి. 33

ఉ. పేరయలింగమంత్రి తనప్రేయసియైతగువీరమాంబికా
సారసగంధియందు శుభచర్యులమేరుసమానధైర్యులర్
వారిధితూణభక్తుల దివాకరకాంతినియుక్తులర్ సిరుల్
జేరఁగఁగాంచె శ్రీయమృతలింగశుభాహ్వయు మల్లికార్జునిన్. 34

క. ఆయిరువురయందగ్రజుఁ, డై యలరినయమృతలింగమహితావనిభృ
న్నాయకభయదాయకవా, క్సాయకుఁడై యేలెనునరసాపురమెల్లన్.

సీ. అతిధార్మికుండై నయమ్మంత్రివర్యుఁడ, శేషదిగంతప్రసిద్ధిగాఁగ
మేటియాతనపేర పేటమాదేపల్లె, కాఁనిపల్లెయర్ గ్రామములను
రహిగుడుల్ కట్టించి రామలింగేశ మ, ల్లేశ్వర శరభమల్లేశ్వరాఖ్య
శర్వలింగప్రతిష్ఠలుజేసి శర్వవు, రాద్యగ్రహారములవనిదివిజ

గీ. వారములకిచ్చి సర్వాధికారిదత్త
దంతపల్యంకికావాహధవళచామ

రాతపత్రాది బిరుదచిహ్నములు మెఱయ
పూజ్యసామ్రాజ్యభోగవిస్ఫూర్తిఁ దనరె. 36

ఉ. శ్రీముదిగొండవంశ సరసీరుహభాస్కర వీరనార్యవు
త్రీమణిసంతతాశ్రితసుధీజన యాచకబంధులోకచిం
తామణి నాగ సర్వ వసుధాస్థలి నెన్నికఁ గన్న సోమమాం
బామహిళన్వరించె మును పద్మవరించినకృష్ణుకై వడిన్. 37

క. సత్యవ్రతు లగువారికి, కాత్యాయనివరునికరుణగలిగిరి కాంత్యా
దిత్యులు పేరయలింగా, మాత్యుఁడు వీరేశలింగమంత్రియుననఁగన్.

గీ. పృథివి నెన్నఁదగిన పేరయలింగంబు, బొమ్మకంటివంశ బుచ్చిరాజు
తనయమైనయట్టినబోణిశ్రీవిశా, లాక్షిఁ బెండ్లియాఁడియలరెసిరుల.

సీ. అతనికినవరజుఁ డైనవీరేశ్వరుం
డవని ప్రఖ్యాతిచే నలరి సత్క
శాశాలి కవ్వలి లక్ష్మీపతికి సుతా
రత్నమౌ వీరమ్మరమణిఁ బెండ్లి
యాడి తద్బింబోష్ఠి యందమృతాఖ్యకు
మారుశూరును దారు మేరుధీరు
గనియె నాతఁడు మానఘనుఁడైన ముదిగొండ
గౌరన్నపుత్రియై గణుతి కెక్కు

తే. పర్వతమఁ బెండ్లియాఁడి తత్పర్వహిమక
రాస్యయందునఁ గనె మల్లికార్జునాఖ్య
లేఖకాగ్రణి పేరయ లింగసచివ
సార్వభౌముని పర్వతీశ్వరునికరుణ. 40

గీ. అనఘతగదాని యగుమల్లికార్జునుండు
కూర్మి ముదిగొండ శరభన్నకూఁతు సుంద
రీసతీమణిఁ బెండ్లియై భాసురశ్రీ
మూర్తులనుబోలుతనయుల మువురఁ గనియె. 41

గీ. అగ్రజుం డొప్పు నమృతలింగాహ్వయుండు
నేపునను రెండవసుతుండు పాపరాజు

పరఁగ మూఁడవతనయుండు శరభమంత్రి
దానమానయశోభాగ్యధైర్యయుతులు. 42

సీ. వరమల్లికార్జునావరజుఁడై తగు వీర
యాఖ్యుండు బుద్ధిరాజామృతారు
వరసుతవియ్యంబ వరియించి యమృతలిం
గాహ్వయద్వయము మల్లన్నబసవ
రాజు పాపయ్యనురసికుల నేవుర
సూనృతవాక్యుల సుగుణయుతుల
కరుణాసముద్రుల గాంభీర్యవంతుల
గని మహదైశ్వర్యగరిమ గాంచె

గీ. వీరికూటస్థుఁ డగునట్టి వీరయాఖ్య
మంత్రివల్లభుతనయుండు మల్లికార్జు
నాహ్వయుం డొప్పు నమృతలింగాహ్వయుండు
వంశభూషణమణిజాలవలి నుతింప. 43

సి. నేర్చినాఁ డేజాణ నిషధకాశ్మీరాది, బహుళదేశామేయభాషణములు
జేర్చినాఁ డేమేటి శీతాచలాత్మజా, వరపాదయుగళిహృత్సరసిజమున
తీర్చినాఁ డేమంత్రి ద్విజవరాధీశాది, సకలవర్ణాశ్రమాచారసరణి
కూర్చినాఁ డేదానికుంభిసివ్యోమాష్ట, హరిదంతరాళసంభరితకీర్తి

గీ. యతఁడు పొగడొందు కందుకూర్యన్వవాయ
కలశవారాశిపూర్ణిమాకైరవాప్త
వీరయామాత్యతల్లజవీరమాంబి
కాబ్జసదనాత్మజుఁడు మల్లికార్జునుండు. 44

ఉ. ఆతతకీర్తికై కువలయాశ్వచరిత్రకృతిం గ్రహించి ప్ర
స్ఫీతము లైన స్రోత్తపలి యేలెటిపాఁడను నగ్రహారముల్
ఖ్యాతిగఁ జేసి బంధులకు గ్రాసనసమృద్ధు లొసంగి శాంభవ
వ్రాతముకోర్కు లిచ్చి విభవంబున మల్లనమంత్రి వర్ధిలెన్. 45

సీ. అతఁడు శాంత్యాదిగుణాఢ్యుఁ డై యేలూరు
రాజసు[illegible]

పల్లియర్ణదుర్గముల్ పాలింపుచుండి కొ
మరవోలుమూర్తికొమార్తె సద్గు
ణాలంబ దుప్కలుపావనీధరళంబ
యగుగురువాంబఁ బెండ్లాడి శోభ
నాంగులపేరయలింగంబు నమృతలిం
గంబువీరేశలింగంబు సాళ్వ
గీ. పతియు మూర్తిరాజు బసవరాజననొప్పు
సుతుల సుజనహితుల సుఖసహితుల
నతులవిభవయుతుల నార్వురఁ గనియె నం
దగ్రజుండు పేరయాహ్వయుండు. 46
ఉ. బాలశశాంకమాళిపదపద్మసమర్చనశీలసత్కళా
శాలి మదాంధశత్రుపరిషద్గహనోద్భట కేలి యాత్మభా
హేలి నిరంతరాలితమహీసురపాలనుసద్గభీరతా
వేలి యనంగఁ దేజరిలు పేరయలింగము మంత్రిమాత్రుఁడే. 47
గీ. అతఁడుశ్రీబుద్ధిరాజవంశాక్కరాజ, పుత్రిసోమాంబి కానామపుణ్యసీమ
విశ్వపావవిరామసాధ్వీలలామ, వరగుణస్తోమఁ బ్రేమనుద్వాహమయ్యె.
ఉ. ఆతనితమ్ముఁ డైనయమృతాహ్వయుఁ డీశ్వరతత్త్వవేది భూ
నేతృసభాంతరాళినుతనిర్మలసూనృతవాదిలోకవి
ఖ్యాతకళావినోదినమదాంధవిరోధివిభేది సంతతో
పేతశుభప్రమోది కడుపెంపు వహించె ధరాతలంబునన్. 49
ఉ. పుణ్యచరిత్రుఁ డాత్మకులభూషణుఁ డౌనయగారిభద్రస
ద్గణ్య సుతావరేణ్య నతతాశ్రితదీనశరణ్య భవ్యలా
వణ్య సమస్తబంధుజనవర్ణితనాయకహర్ష దాయిపా
ద్గుణ్య వరించె వియ్యమని కూర్కొను కోరిక సమ్మదాత్ముఁ డై.
క. తత్సోదరుఁ డాకృత్యవి, భిత్సూనుఁడు కీర్తివిజితభిదురాబ్జకళా
భృత్సింహుఁడు వీరేశుఁడు,పత్సారసవినమితారి ప్రబలె సిరులచేన్.
సీ. మహితపంచాక్షరీమాహాత్మ్యమనుకృతి
యంది త్రైలోక్యవిఖ్యాతిఁ గాంచె

యతిభక్తి శ్రీశైలమందు మానులు మెచ్చ
సంవత్సరము నివాసంబు చేసె
నిష్ఠాగరిష్ఠుఁ డై నేఁడు నాఁ డనక సాం
ఖ్యమహేశ్వరార్చనఁ దా నొనర్చె
హితుల రక్షించి యహితుల శిక్షించి భూ
పతుల వశ్యులఁ జేసి చతురుఁ డయ్యె
గీ. నితని కెన యైనమంత్రు లీక్షితితలమున
గలరె యని సర్వజనములుఁ బలుక నెగడె
కందుకురిమల్లికార్జుననందనుండు
నంగరగువాండు వీరేశలింగవిభుఁడు. 53

మ. అనఘుం డాతఁడు విన్నకోటవరవంశాభోధిశీతాంశుఁ డా
ననఁ బెంపొందినభీమరాజసుతయౌ యక్కాంబికాకాంతస
జ్జనసంస్తుత్య యశోనిరాకృతసుధాసత్కాంత నుద్వాహమై
కనియెన్ మల్లయపేరమాహ్వయులఁ దత్కంజాక్షియం దిద్దరన్.

ఉ. అగ్రజు మల్లికార్జునుఁ డహార్యవిఖండనతుల్యవైభవుం
డుగ్రసమర్చనానిరతుఁ డూర్జితసత్యవచోవిశాలుఁ డ
త్యాగ్రహవైరి సంహరణుఁ డంగజసన్నిభరూపవంతుఁ డా
శాగ్రణితాచ్ఛకీర్తిగుణశాలి తలంప నమాత్యమాత్రుఁడే. 54

సీ. వీరశైవుల కెల్ల వెండిబంగరులింగ
మేటిసూత్రంబు లేమేటియొసఁగె
శతములసంఖ్య దంపతిపూజ లొనరించి
శాటికాంబరము లేసచివుఁ డిచ్చె
కమనీయమారత్నకాంచననైచిక
ప్రముఖదానంబు లేప్రభువు చేసె
సతతంబు మడ్రిసహితాన్నములుభక్త
గణతృప్తి యేమంత్రిమణి యొనర్చె
గీ. నతఁడుఁ గొనియాడఁ దగుమల్లికార్జునుండు
కోరి [illegible]

వియ్యమాచంద్రవదనవివేకసదన
బెండ్లియాడి ధరాస్థలిఁ బెంపుఁ గనియె. 55

క. ఆరసికునియపరజుఁ డగు, పేరయలింగప్రధానిపేరొ్కన నొప్పున్
శారదఘనవారదఘన, సారదళనదక్షకీర్తిసహితుఁడు సభలన్. 56

ఉ. శాంతుఁడు దుష్టభావరిపుసంఘసుదాంధతమిస్రపద్మినీ
కాంతుఁడు భవ్యగూపజితకందరవాహనసంభవైణభృ
త్కాంతుఁడు సంతతాశ్రితబుధప్రకరావనతారణేందిరా
వంతుఁడు సారధైర్యహిమవంతుఁడు పేరయమంత్రియే సుమీ. 57

సీ. అతఁడు శ్రీబుద్ధిరాజాన్వయశ్రీశైలపతిసుతకామాక్షివలన సుతుల
పేరయలింగంబు వీరేశలింగంబు, బసవరాజననొప్పుభవ్యగుణులఁ
గనియెముప్పురనగ్రగణ్యుఁడౌ పేరన్న, బుద్ధిరాజయ్యన్నపుత్త్రి తాయ
మాంబిక వరియించి యవనియేలుచునుండె, వీరన్నగంద్రపువీరరాజు

గీ. తనయ వియ్యాంబ కేల్పట్టి ఘనతఁబ్రబలి
బహుళవిఖ్యాతిఁగనుచుండె బసవరాజు
బుద్ధిరాజవీరేశ్వరుపుత్త్రియైన
వియ్యమాంబను వరియించె విశదమతిని. 58

గీ. మఱియు పేరయలింగాఖ్యమంత్రిపిన్న
యతివయెద్దవపూఁడినారప్పపుత్రి
యైనకామాక్షివలన మల్లయ్య మొదలు
గాఁగలుగునందనుల గాంచి ఘనత నెగడె. 59

గీ.సుగుణులగుమల్లికార్జునసుతులలోన, నాలుగవనందనుండగుసాళువపతి
సంతతాత్మీయహృదయపద్మాంతరాళ,సంచరత్సాళువపతిప్రశస్తిగాంచె.

శా. ఢిల్లీనాయకుచేత దంతిహయధాటీముఖ్యవస్తువ్రజం
బెల్లం గైకొని కాశికాప్రముఖగౌరీశావనుల్ గాంచి ని
త్యోల్లాసంబున శంకరార్చనలు దీవుల్ మెచ్చఁ గావించి సం
ఫుల్లాంభోరుహలోచనావదనుఁడై పూర్వప్రభన్ వర్ధిలెన్. 61

గీ. అయ్యమాత్యపర్యుఁ డతిమోదమునభావ, రాజకులవతంసరామచంద్ర
పుత్త్రియైనలక్ష్మిపురుషోత్తముఁడులక్ష్మిఁ, బెండ్లియాడురీతిఁ బెండ్లియాడె.

గీ. భువనవిఖ్యాతి గలవారిపుత్త్రియగుట
సత్కళాఢ్యజై వాత్రుకసహజ యగుట
భవ్యగుణపురుషోత్తముభార్యయగుట
లక్ష్మియే యన వచ్చు నీలక్ష్మి నవని. 63

క. సరసుఁడు సాళువపతికి న, పరజుం డగుమూర్తిరాజువర్ధిల్లె రహిం
బురహరకులధరచలహర, ధరధరనలశరసమానధవళయశుండై. 64

సీ. బిరుదముల్ నృపతిచే పెదతండ్రివలె గాంచి
సత్యున్నతమగుస్వాస్త్యము ధరించి
గురువరులకు సింగవర మనుపుర మిచ్చి
వరనియోగుల కెల్ల వన్నె దెచ్చి
నగణిత భక్తగణార్చనములుఁ జేసి
యవనిభారము భుజమందు మోపి
లింగాంగసమరససంగతి నుతి కెక్కి
ప్రమథకథాశ్రవణమునఁ జొక్కి
గీ. సప్తసంతతు లొనరించి శాంతిమించి
యరులఁబరిమార్చి పౌరులసిరులకోర్చి
కుజనసంగతి మాని సద్గుణము పూని
కీర్తి గనె వాక్యగోరాజు మూర్తిరాజు. 65

క. అన్నమునకు జరుగక తా, నున్నపురిని లింగధారి యొకఁ డుపవాసం
బున్నను గుడువనివ్రతమున, నెన్నికపల్లోనఁగె వారికెల్ల ముదంబున్.

ఉ. అమ్మనుజేంద్రమాన్యుఁ డమృతాంశుమదాస్యుఁడు సమ్మదాత్ముఁడై
తుమ్మలపల్లివంశపరిథితుం డగువీరనముద్దుపట్టి పే
రమ్మయనంగ నొప్పుసుగుణాకర నుద్వాహ మయ్యె భారతిం
దమ్మి వసించువేల్పు ప్రమదంబునఁ బెండిలి యైనచాడ్పునన్. 67

సీ. పలుకు వేళలసత్యభాషణంబు లెకాని, యనృతవాక్యముజిహ్వనంటనీదు
భక్తపూజలు సేయుపట్లనోపికెకాని, మేనరాజసవృత్తి పూననీదు
దీనులకన్నంబుపూని పెట్టెడు వేళ, చేతసంకోచంబు చెందనీదు
పెనిమిటికినుక చేసిన సంతపమె కాని, చిడిముడి మనసునఁ జెందనీదు

గీ. సర్వసర్వంసహాపుణ్యసతులలోన
నిమ్మహాసాధ్వి యే గణియింప మేటి
యనఁగ నుతి కెక్కు మూర్తిరాజ్యనుగుఁబోటి
మహితగుణకోటి శ్రీపేరమావధూటి. 68

క. అమ్మూర్తిరాజుమంత్రికి, తమ్ముఁ డగుచు బసవరాజు ధరవర్ధిల్లెన్
తమ్ములదొరకెంపులమొ, త్తమ్ములదొర నైనసత్ప్రతాపోన్నతుఁడై.

సీ. నారదప్రభమించి నారదప్రభ నెంచి, యమరినకీర్తిదానములవాఁడు
చిత్రభానునిమీరి చిత్రభానునిగేరి, పరఁగునుచిత్ప్రతాపములవాఁడు
భీము పెంపును గెల్చి భీముపోడిమిమెచ్చి, వరలినభూతిసత్వములవాఁడు
ధర్మగర్వముదోఁచిధర్మగర్వముబాచి, తగుశివభక్తిసత్త్వములవాఁడు

గీ. జగతిఁ జెలువొందెనుదయాస్తశైలసేతు
శీతనగమధ్యరాజత్సభాంతరాళ
వినుతనుగుణుండు మల్లికార్జుననుతుండు
మహితధృతిశాలి బసవరాణ్మంత్రిమౌళి. 70

క. ఘనముగ నైతమపూఁడియు
ననుమించిలిపాఁడుసిరులు మించంగ నొసం
గెను గురుచరపరులగు బస
వనితోనెనమైనమంత్రి వసుధంగలఁడే. 71

క. తనమేనయల్లుఁ డావృత, వినయుం డగుబుద్ధిరాజు వీరనచేతన్
గొనె సత్యవతీపరిణయ, మనుకృతి శ్రీబసవమంత్రి యతిసంప్రీతిన్.

సీ. శరభమల్లేశ్వరస్వామిఁ బ్రతిష్ఠించె, నైతమపూఁడియందధికభక్తి
యారామనిధితటాకాదులైతగుసప్త,సంతతులొనరించె శాశ్వతముగ
రెండవబసవేశ్వరుం డన లక్షల, సంఖ్య గణార్చనల్ సలిపె నిష్ఠ
సాళువేశ్వరకృపానమలబ్ధఘనతర,భోగభాగ్యముల విస్ఫూర్తినలరె

గీ. యాతఁ డని యెన్నఁదగియె ధరాతలమున
నతిఫలదసోమవాసరవ్రతయుతుండు
మల్లికార్జునగురుపమాంబాత్మజుండు
శరణసమధాని బసవరాజప్రధాని. 73

గీ. రసికుఁ డతఁడు బుద్ధిరాజకులాగ్రణి
వీరభద్రతనయ వియ్యమాంబ
సకలబంధువినుత సద్గుణనికురంబ
ప్రేమ మది దలర్పఁ బెండ్లియయ్యె. 74

ఉ. ఇంతులు సాటి వత్తురె మహీస్థలి వియ్యముతోడ సత్కృపా
శాంతగభీరశీలపురసంహారభక్తసమర్చనక్షమా
శాంతవికీర్ణపూర్ణనతతాశ్రితపోషణసత్యభాషణా
శాంతనిజేశభక్తబుధసంఘముదావహనువ్రతంబులన్. 75

గీ. అనఘుఁ డైనట్టిబసవరాజునకు వియ్య
మాంబికకు నుద్భవించిరి యబ్జభూవ
ణాంఘ్రిసేవాభిమతులు మల్లయ్యమూర్తి
రాజు వీరేశలింగ మన్ రసికవరులు. 76

క. ఆముప్వురిలోనగ్రజుఁ, డై మెరసినమల్లికార్జునామాత్యుఁడు స
త్త్రాముఁడు తేజోధాముఁడు, ధాముఁడుకీర్త్యాకృతిప్రతాపగుణములన్.

గీ. అతఁడు శ్రీబుద్ధిరాజు వీరార్యతనయ
విశ్రుతనయు వీరాంబను బెండ్లియాఁడి
సద్గుణనిధాని బసవరాజప్రధానిఁ
గనియెఁ గలశాబ్ధి చంద్రుని గన్నపగిది. 78

గీ. భూతిసాతిసత్త్వ వీతులఖ్యాతిచే, వారిజారిధారిసారిశౌరి
గేరి మిరుకందుకూరిబసవరాజు, తోఁడ నీడు నేయు ప్రోడఁగలఁడె.

క. అక్కలువహరుఁడువాగ్జిత,వాక్కాంతుఁడుబుద్ధిరాజు బసవన్ననుతర్క
మక్కువ నెక్కొనిచక్కని,యక్కమహాదేవిఁ బెండ్లియైసిరులొందెన్.

గీ. అతనిపినతండ్రి మూర్తిరాజాహ్వయుండు
విశ్వరాజసభాంతరవినుతి గాంచె
తామరసజాండభరితప్రతాపచండ
కిరణవికసితనిజకీర్తికిరణుఁ డగుచు. 81

సీ. దానఘనంబున మానధనంబున, రాజరాజప్రభఁ బ్రబలువాఁడు
సత్ప్రతాపంబున సాధురూపంబున, నలరాజకలచేత నలరువాఁడు

భరితకళాపూర్తి బాహుస్థలస్ఫూర్తి, రేవతీరమణుని రేవవాఁడు
తతమంజుతరభూతి ధైర్యసుఖ్యాతి, చంద్రధరాభప్రశస్తివాఁడు

గీ. ధాత్రి నితఁడన నెగఁడెమంత్రాగ్రముఖ్యు, దేవకోటీరమణిసుప్రదీప్తపాద
శైరవేశ్వరదత్తసంపత్ప్రమోద, సౌఖ్యశుభశాలిమూర్తిరాట్సచివ [మౌళి.

గీ. రసికుఁ డాతండుశ్రీబుద్ధిరాజు బసవ
రాజపుత్రికమాధాత్రిరమ్యగాత్రి
యచ్చమను బెండ్లియాడి యత్యతివయందు
బసవరాజాదులను గని ప్రబలె సిరుల. 83

శా. ఆమంత్రీశ్వరుతమ్ముఁ డొప్పు మిహికాహార్యాత్మజాధీశ్వరా
ర్చామోదాత్ముఁడు కందుకూరికులదుగ్ధాంబోధిరాకాసుధా
ధాముం డుగ్రవిరోధిసంతమసమార్తాండుండు వీరేశలిం
గామాత్యుండు బిలేశయేశసమవాగ్వ్యాపారుఁ డిద్ధారుణిన్. 84

సీ. కాండసంభవదండిఖండనాఖండల, తుండిపాండురమల్లెఁ బెండొనర్చి
సారనీరదవారిసారమిూఱఁగ దేరి, రాజరాజఖ్యాతి మ్రందఁజూచి
కంతుజయంతవసంతనలాపనీ, కాంతతేజము మలినుమంతచేసి
గంగాతనూజవిహంగతురంగస, భాంగారజప్రౌఢి భంగపఱచి

గీ. మేవుగనుకీర్తి వితరణరూపశౌర్య
ములు ప్రసిద్ధివహించె భూతలమునందు
బసవమంత్రీంద్రవియ్యమూంబానుతుండు
సంగతావారివీరేశలింగసూరి. 85

గీ. అతఁడు భాషాజబుద్ధిరాజాక్క రాజు, కన్యగుణధన్యలోకైకమాన్యమైన
వీరలక్ష్మిని బెండ్లియై విశదకీర్తి, నలరు శ్రీమల్లికార్జునాదులను గనియె.

క. స్మరసుందరుఁ డీవీరే, శ్వరసచివుని పెద్దతండ్రి సత్యవచోభా
సురమూర్తిరాజు సుగుణా, కర యగు శ్రీ పేరమాంబికామణివలనన్.

క. చతురంభోనిధి వనజజ, చతురాస్యము లనఁగ జగతి సతతగభీరాం
చితభాషోన్నతి నొప్పెఁడు, సుతులఁగని యెనలువుర నువిశుద్ధచరితులన్.

క. అందగ్రనందనుండు పు, రందరసమువైభవుండు రాజకలాపా
మందకృపాకరుఁ డీభువి, యందం బ్రబలె మల్లికార్జునామాత్యుఁడనన్.

క. రెండవతనయుఁడు శాస్త్రవ,ఖండనుఁ డవనిశకార్యఘటనాధుర్యుఁడు భూ
మండలమునకీర్తి దిశల్, నిండించిన కాళహస్తిలింగము వెలయున్.

గీ. అయ్యమాత్యుఁడు ముదిగొండయయ్యనార్య
పుత్రియైనట్టి సుందరీపూర్ణచంద్ర
వదన సద్గుణసదన నుద్వాహ మయ్యె
సకలబంధుజనంబులు సమ్మతింప. 91

గీ. మూఁడవసుతుండు మల్లయ మురవిరోధి
బాణసుతసమశౌర్యసంపద్ఘనుండు
బహుళయాచకసురలోకపాదపంబు
ధారుణీస్థలి నొప్పె నుదారమహిమ. 92

గీ. అతనియనుజన్ముఁ డమృతలింగాహ్వయుండు
హరపదధ్యానబంధులోకాభిమాని
యబ్జసమధాని సకలవిద్యానిధాని
సతతసన్నుతభూజాని జగతి వెలయు. 93

సీ. అతులితరాజకళాభియుక్తుండౌట, ఘనవిబుధాధారగతిమ గనుట
ద్విరసనాభిప్రాయవిముఖత నొందుట, సహజలక్ష్మీవిలాసంబుగనుట
సమధికద్విజరాజసమ్మదాకర మౌట, వర్ధితస్వచ్ఛభావంబుగనుట
పటుచిత్రభానుప్రభాసంగతంబౌట, నాశ్రితజీవనాధారమగుట

గీ. నమృతమను పేరు రూఢిగా నతిశయిల్లి
వన్నెగాంచెవసుంధరా వలయమందు
కందుకూరికులాంబుధికైరవాప్తుఁ
డరితమోహేళియమృతలింగార్యమౌళి. 94

సీ. శివభక్తిచేఁగేణి సేయుటింతియె కాదు, వీఁడుధర్మసూ్ఫర్తివృషభమూర్తి
దానగుణంబున తగ్గొనర్చుటె కాదు, ధనవృద్ధినిరసించు ధనదుమించు
విక్రమాధికతను వెత్తిసేయుటె కాదు, శాశ్వద్ధిశేరుపార్వతికుమారు
వైభవారూఢిచే వంచించుటయె కాదు, పృథుభోగములనొప్పునింద్రు

గీ. సుందరాకృతి నపహసించుటయె కాదు [పెంపు
సరసతరకీర్తి చెన్నునైపుణి చెన్ను

భళిర! యితఁడనిశవినరుల్ ప్రస్తుతింప
నలరె రిపుజేత యమృతలింగార్యనేత. 95

గీ. శుక్రకాంతిచుల్కఁజూచి చంద్రప్రభఁ
గేరియర్కదీప్తిఁ గ్రేణిచేసి
కొమరుమిగిలె కందుకురియమృతాఖ్యకీ
ర్తిప్రతాపరుచులు దిశలయందు. 96

చ. ఎనిమిదిజాలు లేవరుస నీశ్వరుఁ బూష్ప సహస్రబాహువుల్
తనకుగలంగిచాలవఁట తన్మహిమంబది యెంతయంచు బా
ణుని నగి శర్వుఁ బూన్చె బదినూఱులహాఱులు నైదుజాలయ
న్నినమృతాఖ్యనించుక మనంబున గొంకక నొక్కకేలునన్. 97

సీ. యేఁటేటశివరాత్రి నీశ్వరప్రీతిగా, దీపాయుతంబు లెత్తెడిగుణంబు
కాలములందప్పక త్రిసంధ్యలందు ను, మాధీశుఁ బూజించునట్టినెళవు
శతసహస్రాయుతసంఖ్యలు శివభక్త, సంతర్పణంబులు సలుపుమహిమ
సమశీలతీర్థప్రసాదపాకంబుటు, నిరతంబుగొనియెడి నియమవృత్తి

గీ. యనిశ మాధవసేవ సేయనివ్రతంబు
ననుదినము లింగమునకు రుద్రాభిషేచ
నంబు గావించునిష్ఠ జనంబు లెన్న
ఘనతఁ జెన్నొందె యమృతలింగప్రభుండు. 98

సీ. సర్వముఖోదితషట్స్థలాచారమార్గ ప్రతిష్ఠాపనప్రాజ్ఞుఁడితఁడె
యనుపమవేదవేదాంతశాస్త్రపురాణ, సంగీతముఖకళాశాలియితఁడె
వననిధి కూపశేవధిశివాగారాది, సంతానకరణప్రశస్తుఁడితఁడె
సర్వంసహానాథసర్వకార్యక్రియా, విఘటనాఘటనప్రవీణుఁడితఁడె

గీ. తీర్థయాత్రపరాయణాతిథిసమర్చ
నాన్నపానీయదానగుణాఢ్యుఁడితఁడె
యనుచుసకలజనంబులు వినుతిసేయ
నవని వర్ధిల్లెనమృతలింగాహ్వయుండు. 99

గీ. బంధుపోషణుఁడాతండు భావరాజు
వేంకటేశ్వర వెంకమాంబికలకుద్భ

వించిజనసుతిగాంచినవెంకమాంబి
శాహరిణనేత్రుఁ బ్రేమ నుద్వాహమయ్యె. 100

సీ. విమలపతివ్రతత్వమునఁబోలఁగలేక, నగమయ్యెప్రాలేయశైలతనయ
వినుతక్షమాగుణంబున సాటిరాలేక, నడుగంటిదానయ్యెనబ్ధిరచన
సరసవాఙ్మాధురీసముకుగానేరక, వెల్లదనమునొందెవిధిలతాంగి
శ్రితభాగ్యదానప్రసిద్ధికిసరిరాక, చంచలమతియయ్యెజలధికన్య
గీ. ఖ్యాతిగలయట్టివారలీరీతిగాఁగ
పుడమిదక్కినసాధ్వులీపోలఁతికెనయె
యనఁగనుతికెక్క నమృతలింగార్యభార్య
శంకరపదాబ్జరోలంబ వెంకమాంబ. 101

క. బొంకుకలనైనఁబలుక ద,హంకారంబెప్పుడెఱుఁగదతిథులఁబ్రోచుం
శంకరుగనొచుశరణుల, వెంకాంబకుసాటియైన వెలఁదులు గలరే.

గీ. అమ్మహాసాధ్వియందమృతాభిధానుఁ
డతులసౌందర్యయుతుల దానాభిరతుల
వితతశుభకరమతుల సద్వ్రతతిహితుల
శాళహస్తిలింగాదులఁ గనియెఁబ్రీతి. 103

గీ. మఱియు నయ్యమాత్యమణి కొమ్మరాజయ్య
పార్యునకును లక్ష్మియాత్మజాత
యైనవియ్యమాంబ నతివేడ్కవరియించె
నఖిలబంధుసమ్మదావహముగ. 104

సీ. గోపాలబాలయై గోత్రమణఁచువాని, జెందులోపాముద్ర క్రిందుపఱచి
శివవిముఖునకు నంభవమందిన కళంకు, గూడినరోహిణి కాదవఁజేసి
భంగసంగతునకుఁ బట్టియైపుణ్యజ, నాలిఁబొందినలక్ష్మి నపహసించి
చట్టుపుట్టువయయి స్థాణునివరియించు, కాత్యాయినీదేవి గాకొనర్చి
గీ. బ్రహ్మతేజంబు శుభమునభంగమార్గ)
హృదయపద్మంబుగలవాని కుదయమంది
వంశరత్నామలార్యసంభరణ సరస
గుణగణునినొందె వియ్యమ్మ కోర్కెతోడ. 105

గీ. బంధుపోషణంబు పతిభక్తి శాంతంబు
సుకృతవర్తనంబు సూనృతంబు
తనకు సహజములుగ ధారుణివర్ధిల్లె
వినుతగుణకదంబ వియ్యమాంబ. 106

క. ఆసాధ్వియందువినుతద, యాసాగరుఁ డమృతలింగమాకృతివిజిత
శ్రీసుతుల నీశపదపూ, జాసక్తుల మల్లికార్జునాదులఁ గనియెన్. 107

## -:- షష్ఠ్యంతములు. -:-

క. ఏతాదృశగుణధీరున, కాతతకవిబంధుసముదయాధారునకున్
నేతమణిజాతఫణిరు, ట్ఫీతఘృణిత్యాగకీర్తి శృంగారునకున్. 108

క. అరిభయదాఘూర్ణునకున్, ధరణీసురవినుతవాక్సుధావర్షునకుం
శరణాగతశరణాంచిత, చరణానతశీర్షునకు సుజనహర్షునకున్. 109

క. భూలలనాపాలసభా, జాలనుతాగణ్యపుణ్యసంసక్తునకున్
శైలాధిపబాలానుప, మాలాపపరాంతరంగహరభక్తునకున్. 110

క. హృతరిపుధరణీపతికిన్, సతతాశ్రితదీనమర్త్యసమితికిఁ జతు
శ్శ్రుతిభూషణగతిదూషణ, మతిశోషణకృతికి దానమహిమోన్నతికిన్.

క. భూవిదితాత్మీయయశో, జైవాతృకముకుళితద్విషట్కమలునకున్
శైవాగమభావాగమ, ధీవాగమలునకు సాహితీకుశలునకున్. 112

క. శ్రీకందుకూరికులర, త్నాకరశశిమూర్తి రాజహర్షదవేరాం
బాకమలాత్మభవునకుం, బ్రాకటగుణ్యమృతలింగవరసచివునకున్.

వ. అభ్యుదయపరంపరాభివృద్ధిగా నాయొనర్పం బూనిన చెన్నబసవపురా
ణం బను మహాప్రబంధంబునకుఁ గథాక్రమం బెట్టిదనిన. 114





శ్రీరస్తు.

# ప్రథమాశ్వాసము.



## కథాప్రారంభము.

మ. చైత్రలసుతాధినాథ పదరాజీవాళి సద్గుణ్యలో, పాము
ద్రాహృదయానుకూల్యయుత భాస్వత్కేళియాదిత్యభూ
స్వామిబ్రహ్మముఖామరోభినుతనిష్ఠాశాలిపాపాటవీ
స్తోమానగ్నిశిఖాకేళి యైన ఘటజాతుండొక్కనాఁ డిమ్ములన్. 1

సీ. అతులిత వేద వేదాంత చర్చలఁ బ్రహ్మ,నైనకోడిగఁ బాడుహంసతతులు
వాదించి పాంచరాత్రాదికంబులదిన, కరునైన దెగడుశుకప్రతాన
మాగమమంత్రరహస్యార్థములచంద్ర, ధారినైననహసించు శారికాళి
మహితపురాణవిమర్శసాత్యవతేయు,నైన నెంచెడిభుజంగాళినికర

గీ. మలరఁ జెలువందుచుండు నిజాశ్రమమున
శిష్యసంఘంబు సేవింపఁ జెలువుతోడ
కూర్మికుశపీఠమున నిష్టగోష్ఠిఁ బ్రొద్దు
గడుపుచున్నెడ నాకస్మికంబుగాఁగ. 2

శా. శ్రీరుద్రాపరమూర్తి మౌనిముఖరాజీవార్యమస్ఫూర్తిస
ద్వారోదారమనోనువర్తి హృతభక్తవ్రాతజన్మార్తిమో
గారూఢాగ్ర్యగతకీర్తి రేణుకగణాధ్యక్షుండు భూలోకసం
చారేచ్ఛం జనుదెంచి యత్తరి మహాసంతోషసంయుక్తుఁడై. 3

క. తనయాశ్రమంబునకు రాఁ
గని యెదురుగ నేఁగి మ్రొక్కి ఘటజన్ముఁడు దో
డ్కొని వచ్చి యర్ఘ్యపాద్యా
ద్యనుపమపూజలొనరించి యతిభక్తిమెయిన్. 4

శా. స్వామీ! యిచ్చటనుండి వచ్చితిరొ భవ్యంబైన మీరాకమ
ద్ధామం బేను ... ప్వ... చ్ఛవా

రామాధీశ్వరమూర్తిగాంచినటులన్ రంజిల్లె మత్స్వాంతమ
య్యా మీపాదసమర్చనల్ సలుపు భాగ్యంబబ్బె నేఁడియ్యెఁడన్. 5

క. అనవుఁడు దరహసితానన, మున నాతండిట్లనల్కు మునిపుంగవ నీ
వనఘతపోనిధివని ని, న్గనువాంఛనవచ్చినాఁడ కౌతుక మొదవన్. 6

వ. అని మఱియును. 7

ఉ. కంతువిరోధియాజ్ఞ ననుకంప దలిర్పఁగవీరశైవసి
ద్ధాంతము నీకుఁదెల్పి విదితంబుగఁ దత్క్రియమెల్ల సర్వరా
ద్ధాంతము నీముఖోదితపథంబునఁ జేయఁగఁబూనిభూమి భృ
త్కాంతతనూభవాధిపునిధామము వెల్వడి సత్వరంబునన్. 8

క. వచ్చియిట నిన్నుఁగాంచితిఁ, దచ్చరితము వినుచుటంచు తప్పక నాతం
డచ్చొప్తినగతిఁ జెప్పిన, నచ్చరితుఁడు కుంభజుండు సంభ్రమపరుఁడై.

చ. అనఘ దయారతిం ఘనరహస్యము దెల్పితి బుద్ధమయ్యె పా
వనమతి వైతి నింకొకటివాంఛిత మెట్లన విన్నవించెదం
మనసిజవైరియాజ్ఞ మెయినాగభుగర్వుఁడు భూస్థలిం గరా
శనమహిమంబు బెంచెనని సంయమిసత్తముఁ డొక్కనాఁడిలన్. 10

వ. స్కందపురాణంబునకు నాయకరత్నంబైన శంకరసంహితయందలిశివరహస్యఖండంబునందు వక్కాణింప వింటి నక్కుమారుం డెవ్విధంబున మహీతలంబు పావనంబుగా భక్తివర్ధనం బొనరించెఁ దద్వృత్తాంతం బంతయుం దెలిపి కృతార్థుం జేయవలయు ననిన, నప్పారిషదగ్రామణి యత్యంతసంతోషితస్వాంతుండై యొక్కింత సేపునకుఁబూర్వంబున శర్వుం డార్యాసమేతుండై పేరోలగంబున్న సమయంబునఁ దద్దర్శనకుతూహలంబున జనుదెంచి విరించి క్రమ్మఱి పోవుచు తన్ను ప్రణవార్థం బడిగినకుమారునితోడఁ దత్ప్రణవార్థంబు లేన యని యపార్థంబుగా నెదురెఱుంగక పలికి యతనిచేత కారాగృహబద్ధుం డగుటనురలవలన పరమేశ్వరుండు విని యతని విడిపించి తదోంకారార్థంబు సవిస్తరంబుగా తేటపడం బలికిన నిజతనయుప్రజ్ఞావిశేషంబునకుఁ బరితోషంబునొంద మేదినీతలంబున మన్మహిమం బు[illegible] దదనంతరవృత్తాంతం

బును తత్క్షణంబ హృదయగోచరం బగుటయు నానందబాష్పధారా
పరిషిక్తాంగుండును కంచుకీభూత రోమాంచుండును గద్గదకంఠుండు
నై యతనితో ని ట్లనియె. 11

మ. అనఘా నీవు వినంగ గోరిన మహోపాఖ్యానమత్యంత పా
వనమంహోదళనంబహీనఫలదప్రాగల్భ్యభూర్యైశ భ
క్తనికాయప్రమదాస్పదం బతులమోక్షప్రాప్తిసంసూచకం
బని మేవప్రకరాభిగణ్యమయి పెంపొధారుణీమండలిన్. 12

గీ. కుంభసంభవ నీమది కోర్కి దీర
వినుము శర్వునికరుణ నేఁగనినభంగి
తెలుపుదు నటంచు రేణుక దేశికుండు
చెన్నబసవేశుచరితంబు చెప్పదొడఁగె. 13

సీ. శ్రీకరాంబరచుంబిశిఖరాభిరామంబు, బహురత్నసానువిభ్రాజితంబు
శరభమృగేంద్రాదిసత్త్వసంకీర్ణంబు, దేవవృక్షోద్యానదీపితంబు
కనకాంబుజోజ్జ్వలకాసారకలితంబు, బహుళనిర్ఝరీచయభ్రాజితంబు
కిన్నరబృందసంగీతనాదయుతంబు, పటుతాపసావాసభాసితంబు
గీ. దళితపాపంబు ముక్తిప్రదాయకంబు, ప్రమథనిలయజ్ఞసర్వజ్ఞపాలితంబు
వేదవేద్యంబు తారకవిలసితంబు, భవ్యవిభవంబు కైలాసపర్వతంబు.

ఉ. ఆయతతద్ధరాధరశిఖాగ్రసముంచితహీరదేవతా
నాయకరత్నకాంచనఘనద్యుతిసంచయమెల్ల నేకమై
తోయదమార్గదేశమునఁ దోఁగముగాఁ గనుపట్టు టొప్పె గం
గాయమునాసరస్వతులు పకంధి నభిన్నతఁ జేరుకై వడిన్. 15

సీ. పున్నాగవిస్ఫూర్తిఁ బొల్పుటింతియె కాదు
పున్నాగవిస్ఫూర్తిఁ బొల్పు మీఱె
చమరికాకీర్ణమై జెన్నొందుటయె కాదు
చమరికాంచత్ప్రభల్ చాల మిగిలె
కుంజరాశనదీప్తి గొరలుటింతయె కాదు
కుంజరాశనదీప్తిఁ గొమరు మిగిలె
ప్రియకబృందంబునఁ బెంపొందుటయె కాదు
ప్రియకబృందంబునఁ బెర్మిఁ గనియె

గీ. వనఁగ వృక్షమృగాకీర్ణ మగుచు సకల
భువనసన్నుతి గాంచె నద్భుతము గాఁగ
శతసహస్రసుధాభానుసన్నిభప్ర
కాశమహిమాస్పదంబు తత్క్ష్మాధరంబు. 16

వ. మఱియు నద్ధరాధరరాజంబు విరాజమానం బై స్వర్గలోకంబునుం బోలె రంభాదేవవల్లభసురుచిరవిలాసం బై యర్చిష్మతీపురంబునుం బోలె నిరుపమశుచిప్రదేశం బై సంయమనీనగరంబునుం బోలె విలసితధర్మావాసం బై నిరృతిభువనంబునుం బోలె సంతతపుణ్యజనస్థానం బై వరుణపట్టణంబునుం బోలె భాసురభువనోన్నతం బై గంధవతీపుటభేదనంబునుం బోలె శంకరప్రవాహవిలసితం బై యలకాపురంబునుం బోలె శంఖమకరపద్మాకరం బై యీశానలోకంబునుంబోలె నీలకంఠసంచారం బై పాతాళంబునుంబోలె నాగలోకకలితం బై యొప్పుపర్వతశిఖాగ్రంబున. 17

చ. పగడపుఁ గంబముల్ తళుకుబంగరుబోదెలు తమ్మికెంపురా
నిగనిగ లీనువాకిలులు నిద్దపువెన్నెలరేనిరాలఁ జె
న్నగుజిగిగోడలుం బొగనులై తగుపచ్చలతోరణంబులుం
దగఁ జెలువొందునొక్కమణిధామము శర్వనివాసయోగ్యమై. 18

క. ఆమహనీయ సభాభవ
నామలమధ్యప్రదీపితార్కాయుత తే
జోమయనవరత్నాంచిత
హైమసుఖాసనమునందు నతిముదమొదవన్. 19

సీ. కమలభవాండముల్ కంపకంబులరీతి, బట్టియాడెడుగణప్రభులుగొలువ
సహజైకలింగనిష్ఠావ్రతస్ఫూర్తిచే, జరియించు భృంగిలాస్యంబొనర్ప
నాదిని వృషభేశ్వరావతారంబయి, తగు నందిసందడి తలఁగజడియ
నతులితాష్టాంగయోగానందపరవశు, లైనమహానీశ్వరు లభినుతింప

గీ. నమర గజగామినులు చామరములు వీవ
గరుడగంధర్వముఖులిరుగడల నిలువ
శైలతనుజాతయునుదానుఁ జంద్రమౌళి
నిండుకొలువుండె కన్నులపండువుగను. 20

వ. అనసమయంబున. 21

ఉ. పాలును నీరు నేర్పరుచు పక్కిపయిన్వడినెక్కి స్వప్రభా
జాలము మేరువుం దెగడ సంచితపుణ్యనదీనదాచ్ఛతో
యాలయమౌకమండలువు హస్తమునన్ వెలుగొంద శారదా
లోలుఁడు వచ్చె సర్వసురలోచనపద్మము లుల్లసిల్లఁగన్. 22

చ. అటు చనుదెంచుచున్ గిరిసుతాత్మజుఁ డొక్కఁడె బాలకేళిఁబ
ర్యటన మొనర్చుచున్నతరి నాతని లెక్కయొనర్పకేగ ది
క్పటు గని తత్పదాబ్జములపై నుదురంటఁగ సాగిమ్రొక్కి వి
స్ఫుటనిగమాంతసూక్తులఁ బొంగుచు సన్నుతిఁ జేసె నీగతిన్. 23

సీ. ఫాలేందుకోటీరపన్నగకేయూర, పాథోధితూణీరభవవిదూర
పద్మాక్షసుతశిక్ష పావనమునిరక్ష, భక్తసంచయపక్ష పావకాక్ష
కలితకృపావాల కార్ముకాయితశైల, కందరకాకోల ఖలవిఫాల
నీరజాంబకమిత్ర నిర్జితాసురగోత్ర, నిరుపమ శుభగాత్ర నిగమసత్ర

గీ. పార్వతీసంగ రవినిశాపతిరథాంగ, గగనధునిజూటహస్తపంకజకరోట
కోటిరవితేజ తారక కుధరరాజ, నిరుపమోల్లాసదారువనీవిలాస.

చ. అని యిటు సన్నుతించి ప్రమథాధిపు లోచనసంజ్ఞ నొక్కఁడున్
వినయము మీర నిల్చి యతివిస్మయమందుచు నాతఁ డాత్మహృ
ద్వనజ మెలర్ప గొంత పడి తద్గిరిజేశసభావినోదముల్
గనుఁగొని శర్వువీడుకొని క్రమ్మరి పోవుచు దొంటికై వడిన్. 25

ఉ. శంకరతుల్యుఁడై నళరజన్మునిఁ జూడక నేగుచుండఁ ద
త్పంకజగర్భుపైఁ గినుక పర్వఁగు మారకుఁ డౌర వీఁడు ని
శ్శంకతఁ బోవుచుండె నను సడ్డయొనర్పక యంచు నుగ్రుఁడై
కింకరుచేత రాఁ బనిచి గీష్పతి తా నిటు పల్కె నత్తరిన్. 26

గీ. ఎవ్వఁడవు నీవు నీనెల వెచటనుండు
నామ మెయ్యది యుద్యోగ మేమి యిప్పు
డిటకు రాఁగత మెద్ది మా కెఱుఁగఁ దెలుపు
మని యడుగ నట్టు లడిగిన నబ్జభవుఁడు. 27

మ. అమరజ్యేష్ఠుఁ డసత్యలోకము మదీయంబైనధామంబు నా
మమునన్ బ్రహ్మయటండ్రు నెల్లెడల నన్మత్కృత్యమొన్నంగ న్వ

ర్గము భర్గుంగొనియాడఁగా నిటకు వేడ్కన్వచ్చితి న్నావుడుర్
మిము నింకొక్కటి వేఁడెద నే నడిగెదర్ సిక్కంబుగాఁ దెల్పుమా.
క. ఏమేమి చదువుకొంటివి, తామరసభవా! యటన్నఁ దనమది వాణీ
కాముని ననుచదువడుగఁగ, నేమిటి కని తలఁచినగుచు నిట్లనిపలికెన్.
క. వేదములునాముఖంబునఁ, బాదుకొనన్నివిద్యలదుఁగఁబనియున్నది యే
నేదెలియనియది యెయ్యది, లేదు తలఁప నాకుసాటి లేరు జగములన్.
వ. అనిన దరహసితాననుం డై కుమారుండు. 31
గీ. సకలవిద్యలలోపల సారమైన, విద్యయొక్కటి వినుటకు వేడ్కయయ్యెఁ
గానననుఁ జిన్నవాడనిగడుపకివుడు, పన్యసింపుమటన్నఁ బద్మభవుడు.
క. వేదముల కాదియా బు, గ్వేదముఁ బఠియింపు మొదల విస్పష్టముగా
నాధానుస్వారసువర్ణోదారంబై నప్రణవ మొప్పఁగఁ బలుకన్. 33
చ. విని తలయూఁచి చాలు నరవిందజ! యీ ప్రణవార్థమెట్టిదో
కినియక తెల్పి నాహృదయ కీలితసంశయమెల్ల బాపు మా
యనిన నజుండు లేఁతనగ వాననసీమఁదలిర్ప నంబికా
తనయునితోఁడ గర్వమెద దార్కొన నిట్లని పల్కె నత్తరిన్. 34
గీ. మాటలేల ప్రణవమంత్రంబు నేనత, దర్థమేన యనిన నగ్నిభవుఁడు
గనులఁ గెంపు గదుర గండచపేటికా, పూర్వకముగ నతనిగర్వమణఁచి.
సీ. అంతటఁ గినుక చల్లారక కారాగృ
హాద్యత్తుఁ డతిరోహితాత్ముఁడైన
వీరబాహునిబిల్చి విమలప్రణవమంత్ర
మంత్రార్థములు చంద్రమౌళి యగుట
యెఱిఁగి యుండియు జ్ఞానహీనుఁడై నే నని
పలికెఁ గావున వీనిఁ బట్టి కట్టి
స్కంధశైలంబున బంది నుంచుమటన్న
నాతఁడు పరమేష్ఠి నట్లచేసె
గీ. లోకసృష్టిపిదప లోపంబుగానీక
స్కందుఁ డెప్పటట్ల జరుపుచుండ
నంతసురలు మునులు నంబుజాసనునకై
చింతనొంది సాంబశివుగుఱించి, 36

చ. ఘనతర మైననిష్ఠఁ జిరకాలతపం బొనరించి పార్వతీ
వనజముఖీసమేతుఁడయి వత్సలతం బొడజూపినట్టి భ
ర్గునివిమలాంఘ్రియుగ్మమునకుఁ బ్రణమిల్లి యనేకభంగుల
న్వినుతియొనర్చి వాంఛితము వేఁడుఁడటన్న మహేశుతోడుతన్.

క. శరజన్మునికోపంబున
సరసీజాసనునకైన సంకటమెల్లం
గరుణ జనింపగఁ బలికి ఖ
చరమునిసంఘంబు మఱియు సవినయ మొప్పెన్. 38

క. దేవాదిదేవ విను మీ
సేవకుఁ డగుబ్రహ్మకైన చిక్కెడలుటయే
మావాంఛిత మని పలికిన
భావజసంహారుఁడు మిగుల ప్రముదితుఁడగుచున్. 39

క. పరమేష్ఠి న్విడిపించెద, నరుగుఁడు మీమందిరంబులకు వడి నందీ
శ్వరుగనుగొనినీవిప్పుడు, సరగునమత్సుతునికడకుఁజనియాతనితోన్.

శా. స్వాతంత్ర్యంబు వహించి గర్వ మెద బర్వం బల్కు నీ రేజ సం
జాతుంబందిని బెట్టె శీతలకుభృజ్జాసూనుఁడంచుఁ సురల్
నాతోఁ గూయిడి రట్లుగావున దయాలంబుండవై యాతని
న్వీతాజ్ఞాలయుఁ జేసి పుచ్చుమిప్పుఁడే విశ్వంబు నిర్మింపఁగన్. 41

మ. అని నావాక్యము గాఁగఁ బల్కు విగతాహంకారుఁగావించి జీ
వనజాతోద్భవుఁ డాఁక వీడి సుఖియా వార్తల్వడిందెమ్ము పొ
మ్మని పంపంజని నందికేశ్వరుఁడు స్కందాద్రిం సఖుల్ దాను దా
రొక్కనిగ్రీడించుచున్న షణ్ముఖు హతాఖుఁ గాంచి మోదంబునన్.

క. నిటలతటిఘటితకరసం,పుటుఁడై యిటుపల్కెనతఁడుస్ఫుటవాక్యములఁ
జటివినతుఁడైన దిక్పటుఁ, డిట కనిచిన వచ్చినాఁడను నసంఖ్యాతా.

క. వనజాసను చెఱమాను పు
మని యనిమిషమునులు వేఁడ ననలాక్షుఁడు దా
విని యిటు లొనరింపుదు నీ
వని యెం గావున దదాజ్ఞ యాదల నిడుమా. 44

చ. అన విని యీశ్వరాజ్ఞ దల[illegible] ధరించి[illegible] దుర్మదం

బునఁ దను దానెఱుంగక ప్రపూర్ణమహాత్వ మనుస్వరూపమే
నని వచియించినట్టినలినాసను ముక్కు జెఱవెట్టి యూరకే
చనుమని యిత్తరి న్విడచి చక్కఁగఁ బంపగ నంతవెట్టినే. 45
గీ. నలినసంభవు విడుమంచు నందికేశ
నీవువచ్చితిగావున నేసహించ
నయ్యె నిఁక నొండుపలుకకు మరుగుమనిన
నాతఁ డరుదెంచి శివుని కారీతిదెలుప. 46
చ. వినిదరహాసనక్తుఁడయి విశ్వగురుండు గిరీంద్రనందనుం
గనుఁగొని వింటి నీతనయు గొళకుమచ్చటికింక వేగ నే
జనక విధాతృమోక్షణముసల్పఁడు వాఁడని తెల్పి యప్పుఁడో
య్యనఁ గడు ప్రేమమీఱ సతి నంతిపురంబున కన్పిచెచ్చెరన్. 47
క. పారిషదామరముని పరి, వారుండును దివ్యవృషభవాహుండై నీ
హారికిరణార్ధధారి కు, మారగిరీంద్రమున కరిగె మదిముదమొదవన్.
చ. అటుచని కాంచె శంకరుఁడహార్యసుతావరపుత్త్రు సన్మణీ
కటకకిరీటకుండలవికాసితశోభనగాత్రు సృష్టిసం
ఘటనవిలాససమ్ముదితకాంచనశైలనివాసగోత్రవి
స్ఫుటనుతిపాత్రుఁ దీప్తిపరిభూతసహస్రపయోజమిత్రునిన్. 49
మ. కని డాయంజనునంతలోపలన తత్కాంచోర్వీభృద్భేది ది
గ్గన స్వర్గంబటునిల్పి లేచి వృషరాట్కాండావతీర్ణుండు సం
జనితామోదియునైన తండ్రికి నమస్కారంబుగావించి ని
ల్చిన పట్టిం గని కౌగిలించి నెదలోఁ జెన్నొందు మోహంబునన్. 50
గీ. అంత గిరి ధన్వి పరిచారికాళి సత్వ
రముగనుంచినసింహాసనమునఁ గూరు
చుండి సుతు నంకతలమున నుంచికొని శి
రంబు మూర్కొన బొజ్జమొగంబు దువ్వి. 51
మ. తనయా యాటలు మాని వేతెపనిమీఁదన్నిల్పుచందంబు దో
చెనదే కార్యము దెల్పుమా యనిన నేసృష్టిక్రియారూఢవ
ర్తనచేనుంటినటన్నఁ బద్మజుని గాదా మున్ను తత్స్రష్టినే
య నియోగించినవార మిప్పు డిటుసేయంగారణం బేమొకో! 52

వ. అనిన నతం డిట్లనియె. 53

క. తను నెదిరి నెఱుఁగఁ గాఁడిన, వనజాసనుఁ బట్టి బందిపై చితిసన నా
తని మాట లేమొ పిదప, న్వ్వని యెదఁ గాకివుడు వాని విడువుము పుత్రా!

చ. అనవుడు నేమియుం బలుక కాతఁడు మోమరవాల్చియున్నఁ గ
న్గొని శివుఁ డబ్జజన్ముపయి నూల్కొను కోపమునాదు వాక్యము
న్మనమున లగ్న మౌఁగ తనమారనజాలక మిన్న కుండెనీ
తనిసదలంచి చెప్పక విధాత చెఱ న్విడఁ డంచు నత్తరిన్. 55

ఉ. నేరువు నేరముల్ పిదప నిర్ణయమయ్యెడుఁ గాని యిప్పుఁడా
నీరజసంభవున్విడుము నీమది కోపము గూడ దంచు నే
గారవ మొప్ప దెల్ప వినఁ గాన వుతండ్రి యనుజ్ఞ మీఱి సం
చార మొనర్చుకుచ్చితుల పాటికి రామదినెంచినాఁడవో. 56

గీ. అనిన గిరిజేశు భావంబు గనుల కెంపు
బొమముడియు గాంచి పార్వతీపుత్రుఁ డాత్మ
జంకి వినయంబుతో లేచి జాగి మ్రొక్కి
వీరబాహుని గనుఁ గంత వేగ మతఁడు. 57

క. జంభారిముఖులు చూడఁగ, నంభోరుహభవునిఁ దెచ్చి హరుమ్రోల నిడం
గుంభిని జాగిలఁ బడి వా, గ్జృంభణ మొప్పంగ నతఁడు గీల్కొను భక్తిన్.

దకారగుణితము.—

చ. దరసమ దేవదానవవిదారణ దిక్పట దీనపోషకా
దురితతమస్సహస్రకర దూషకసంహార దేవదేవ దై
న్యరహిత దోర్బలాంతకవినాశన దాత్యభృగాది తేయదం
భరసవిశోషణప్రథితపావక దర్పకదర్పభంజనా. 59

చ. అని వినుతించు నాతని ప్రియంబున గన్గొని శూలపాణియి
ట్లను శిఖిసాది నీవనుచు నాటతమిం దెలియంగ లేక వం
చన మొనరించె నందుకు విచారముఁ జెందకు మెప్పటట్టులన్
జని సుఖవృత్తినుండు మని సారసగర్భుని వీడుకొల్పినన్. 60

క. మదిముద మందుచు నాతఁడు, మదనారికి తత్కుమారమణికి వినుతుఁడై
కదలిచని తొంటిగతిఁ నిజ, సదనంబున భువనసృష్టి జరుపుచునుండెన్.

క. తదనంతరమున నిచ్చట
బొదలెడు మోహమున మగుడఁ బుత్రుని తనపే
రెదఁ జేర్చి యంకతలమున
గదియించి లతాంతకాండఘస్మరుఁ డనియెన్. 62

శా. ఏరా చిన్నకుమార నీరజభవుం డేనేరముల్ జేసెరా
సారోదారుఁడు వజ్రముఖ్యసుమనస్సంసేవ్యుఁ డా నాతనిం
ఘోరంబౌ చెఱ నుంచ నీకుఁ దగునా కోపించి నీవట్లనన్
ధీరత్వంబున బాహులేయుఁడును తండ్రిం గాంచి కేల్మోడ్చుచున్.

సీ. అన్నవిధాతమిమ్మర్చింప వచ్చెఁడు, వేళక్రమ్మఱిపోవువేళనైన
నన్నులక్ష్యము సేయకున్న నాతనిఁ బిల్చి, యెవ్వఁడ వీవిట కేలవచ్చి
తన తనపేరును తలమునుద్యోగంబు, ఘనతయువచ్చినపనియువిద్య
పెంపునఁ జెప్పినపిదప నే ప్రణవార్థ, మెఱుఁగ వేఁడఁగ నాతఁ డెదురు దన్ను

గీ. నరయక యపార్థముగ ప్రణవాఖ్యమంత్ర
మును దదర్థంబు నేనని పెనుమదంబుఁ
దొలుకఁ బలికిన తులవయా నలువ బంది
నిడితి వదలితి మీ రిప్డు విడువు మనిన. 64

చ. అనవుఁడు పిన్ననవ్వునగి యబ్జధరుండు కుమారధాతృసం
చనమొనరించినాఁడ వది సమ్మతమే యిఁక నీవు చెప్పుమా
యనితరసాధ్యమైన ప్రణవార్థము తేఁటపడంగ నావుఁడున్
జనకునితోడ నిట్లనియె శైలసుతాతనయుండు నమ్రుఁడై. 65

క. సర్వజ్ఞుల రగు మీకున్, సర్వేశ్వర యొకటిఁ దెలుపఁ జాలుదు నేత
ద్గుర్వాధిపకథితమంత్రం, బుర్విని శిష్యుండు దెలుప నోపునె యెందున్.

గీ. అయిన నాయందుఁ గలుగుదయాసమృద్ధి
కతన మన్ముఖమున వినఁగాంక్ష చేసి
నారు గావున మీపాదనలినబలము
చేత విన్నప మొనరింతుఁ జిత్తగింపు. 67

ఉ. నావుఁడు శంకరుండు నిజనందనువాక్యము లాలకించి తా
భావమునందు సంతసము బర్వ రహస్యముగాఁగ విందు సా
ఖ్యావహమంత్రరాజమని యాతనికి చెవి యొగ్గి సంశయా

భావముగాఁగఁ జెప్పె ప్రణవప్రకటార్థ మతండు ధీరుఁడై. 68

ఉ. ఆగతిఁ జెప్పినన్మరురహస్యము వీనులవిందుగాఁగ ది
వ్యాగశరాసనుండు విని యద్భుతమోహదయానుమోదసం
యోగమనస్కుఁడై నిజసుతోత్తము నెంతయు గారవించి యా
రా గుణధుర్య చెప్పితి పరాత్పరమంత్రము తేటతెల్లఁగన్. 69

ఉ. నీకును మాకు భేదము గణింపఁగ లే దణుమాత్రమైన భూ
లోకమునందు భక్తి కడులోపముఁ జెందిన దట్లుగాన మ
ర్త్యాకృతిఁ బుట్టినాదగు మహత్త్వము బోధ మొనర్చి మానవా
నీకములం భవాబ్ధిదరిఁ జేర్పుము నీదగు నేర్పెలర్పఁగన్. 70

గీ. ఏతదర్థంబు మును నందికేశ్వరుని ధ, రాతలంబున కనిచితి నాతనికిస
హోదరీరత్నమై భక్తినొప్పునాగ, మాంబికాదేవి తనయుఁడవై జనించి.

చ. అసదృశనందికేశ్వరునియంశమునం జనియించి మించు త
ద్బసవనితోడ సంతతశుభప్రద భక్తిశుభానుభూతి పెం
పెనగుఁచు మర్త్యమానశరణేశ్వరపద్భజనం బొనర్చుచు
న్వసుమతిఁ గొన్నివర్షములు వర్తిలు మత్సమదాజ్ఞ వెంబడిన్. 72

వ. అని యిట్లానతిచ్చిన జనకుని వాక్యములు విని కుమారుం డవనీతలోద్భవంబున కసమ్మతంబును జనకాజ్ఞోల్లంఘనానర్హ విచారంబును మనంబునం బెనఁగొనుటయు నేమియుం బలుకక నమ్రవదనుండై యూరకున్న నతని భావంబు శంకరుండు దివ్యచిత్తంబున నెఱింగి ధరాతలంబున భక్తివర్ధనం బొనరింపవలయు ననుతలంపు ప్రేరేపవీఁ డంబికా నంబోధనంగాని చక్కంబడఁ డనియూహించి పార్వతిం దలంచిన సమస్తజగద్వృత్తాంతవేదినియగు తత్సతీవతంసం బనర్ఘ్యమణిభూషణాలంకృతయు నిరుపమవాసనాసమాగతచంచరీకనాదమేదురాదితేయమేదినీజలతాంతదామాభిరామయు మందస్మితసుందరవదనారవిందయు రాజకీరలీలాసరోజాతహస్తయు దేదీప్యమాన కాంచనాంబరసహితయు నై యనేక నాకలోకైకకోకస్తనీలోకంబుల ధరసమానమణిమయంబు లగు నాలవట్టంబులు గొందఱు వజ్రమయదండచామరంబులుం గొంద ఱతులితశాతకుంభశుంభద్దండపుండరీకంబులుం గొందఱు చిత్రవిచిత్రపట్టాంబర కేతనంబు

లుం గైకొని యరుదేర విద్యాధరకిన్నరకింపురుషగంధర్వకామి
నులు సంగీతసాహిత్యవేణువీణాదివినోదంబుల నింపు సంపాదింప
యక్షగరుడోరగసిద్ధసాధ్యమిథ్యామధ్యలు ఖడ్గవేత్రపాదుకాజలకలశ
వీటికా పేటికాధారిణులై నడువదివ్యవిమానంబధిరోహించిస్కందమ
హీధరంబునకు వచ్చి విభావరీశభూషణసభానికటప్రదేశంబున
తదావాహనావతరణంబు గావించి తనుంగనుగొని లేచినమఃపూర్వ
కంబుగానిటలతటఘటితకరులగు సురలనిరుపమకరుణాకటాక్షేక్షణం
బున నీక్షింపుచుప్రాణేశ్వరుఁడాయుంజనుదెంచిప్రణమిల్లి తదనుమతి
నర్ధాసనాసీనయైయుండి చింతాననుండై ననుతుంగని వీఁడిట్లు చింతా
క్రాంతుండై యున్నకతంబేమని పతినడిగిన నతండు మందస్మితవద
నుండై సతితోడ గతవృత్తాంతంబంతయుందెలిపి యేతదర్థంబుగా దే
నిన్ను దలంచితిగావున నీతని క్షితితలంబున కరుగునట్లు సమ్మతిప
రుపుమన విని నగతనయ మనంబున నొక్కింత విచారించితొల్లి
భూతలంబున సంభవంబు నొందు నిజవయస్యయగు నాగేంద్రగమ
నకు కుమారుని కుమారునిగా నిచ్చెదనన్నవచనంబున కనురూపం
బుగా నీశ్వరుండానతిచ్చుట కానదంబు నొంది తనయుం డాయుం
దిగిచి తొడలపై నిడుకొని కూకటులు పుణుకుచు నిట్లనియె. 73

సీ. అన్నకుమారమీయయ్య చెప్పినమాట, కీవియ్యకొనఁదగునిలజనించు
కతననీకుకొంత గలుగదు తనకు నీ, కొక్కింత వేఱులే కునికినిన్నుఁ
బంచె తాజనునట్టిపని కదిగాక నే, మున్నె పంపదలంచి యున్నదాన
గావునమాయాజ్ఞ గైకొనిభూతలం, బున కేగియచ్చట పొనుగుపడిన

గీ. భక్తినుద్ధరించి పరవాదుల నడంచి
యఘముద్రుంచి దెసల యశము నించి
ప్రౌఢిమించి శర్వభక్తుల రక్షించి
మరలిరమ్ము చింతమాను మనిన. 74

గీ. సమ్మతించి గుహుఁడు జననీజనక పాద
సరసిజాతములకు సాఁగిమ్రొక్కి
మీయనుజ్ఞ నేను మీరంగనేర్తునే
యట్లు సేయువాఁడ ననుచుఁ బలికె. 75

వ. అట్లుపలికిన కుమారుని వాక్యంబులకు పార్వతీపరమేశ్వరు లానందం
బు నొంది యతనిం గౌఁగిలించుకొని దీవనలొసంగి పొమ్ము వేగమ్మున
మరలిరమ్మని యనేకవిధంబుల గారవించి పారిషదబ్రహ్మర్షిముఖ బ్రహ్మ
దేవర్షిపరివారంబులతో నిజనివాసంబున కరిగి యిష్టవినోదంబులం
దేలుచుండి రక్కుమారుం డవనీతలంబున చెన్నబసవేశ్వరుం డన
బసవేశ్వరభాగినేయుం డై జనియించి యసదృశమహిమావిశేషం
బున భక్తివర్ధనంబొనరించె కుంభసంభవా తద్విధంబు విస్తరంబుగా
వినుమని రేణుకుండు చెప్పందొడంగె. 76

-- కళ్యాణపురవర్ణనము. --

సీ. శ్రీసమంచితరాజశేఖరాగారంబు, వరసర్వమంగళావాసభూమి
ప్రాకటవీరభద్రాకరవిభవంబు, పటుదంతిముఖబలభానురంబు
నతులరంభాదికోద్యానవిలాసంబు, రమ్యవిద్యాధరభ్రాజితంబు
నగణితపురుషరత్నావళీకలనంబు, ప్రబలగంధర్వవిరాజితంబు
గీ. నగుచు మారటకైలాస మనుచు సకల
జనము లద్భుతపూరితస్వాంతు లగుచు
వినుతిఁగావింపఁదనరెఁ బృథ్వీతలమున
భాగ్యజనకంబు కళ్యాణపట్టణంబు. 77

మ. జ్వలదత్యున్నతసౌధసంఘటితభాస్వద్వజ్రినీలోపలో
జ్జ్వలకాంతిప్రకరంబునద్దెసల బర్వంబౌరలోకంబు ని
చ్చలు శ్వేతాసితపక్ష మానిశల లేశంబైనస్వాంతంబునం
దెలియంజాలక సంశయించుఁ బురివర్ణింపఁగ వశంబే ధరన్. 78

గీ. ఆకసంబంటుకొమ్మల నమరినద్వి
జాధిపాగారమగుచు జంభారివినుతి
పాత్రమై మూలబలముచేఁ బరిఢవిల్లి
సాలముదనర్చుఁ బురికల్పసాలమనఁగ. 79

గీ. రాజమండలసంశక్తి దేజరిల్లి
పుష్కరఖ్యాతిఁజెలువొంది భువనవినుత
మేఘపదసంగతిదనర్చి మెప్పుగులుకు
కరినికరమొప్పు దివిఁబోలుపురమునందు. 80

చ. జలజసఖాశ్వముల్ గతులు సాటికిరాఁగని తన్మనోద్ధతిం
దొలఁగఁగఁజేయనింగి కయిదూగగనై జఖురోత్థితావనీ
తలరజమంబరాంబరము దార్కొని క్రమ్మిన దానిచాటునం
బలువిడి భీతిపారఁగని వానిహసించు పురీవరాశ్వముల్. 81

చ. అతులితతత్పురీపథమహాధ్వజసంఘటితాచ్ఛఘంటికా
వితతిజయాభిరావములు విశ్వమునిండినఁ దద్భయార్తి న
చ్యుత జలజాతబాణ పురుహూతరథంబులు గానలందు ప
ర్వతగుహలందదీయశిఖరంబులుఁ జేర రయంబుమీరఁగన్. 82

క. తెలతెలఁబోవుచుదమనీ,డల కులుకుచు బిలములోన డాగెడుసింహం
బులుశౌర్యకలనమాసరి,వెలయునెయనినగుదురచటివీరనృసింహుల్.

ఉ. చేడియవల్లనించుకఁ బ్రసిద్ధిఁ సహించెనుగాని నిల్చిమా
టాడిన నాల్గుదెస్లధరనాతనిప్రౌఢిమలెక్కవెట్టఁగాఁ
గూడునెయంచుపద్మజుని కొద్దిగనెంచి వసింతురప్పురిఁ
బాడబులుత్తమోర్జితులు భవ్యనిరూఢవచోధురంధరుల్. 84

చ. నిరుపమపద్మినీహితులు నిర్మలమూర్తులు సత్ప్రతానభా
సురతరమోదదాయకులు సుస్థిరమిత్రసమేతులప్పురీ
వరనిలయాభిరాములయి వర్ధిలురాజులు రాజులెక్కసే
యరు తమవిక్రమస్ఫురణ నాతఁడు వర్తిలలేక యుండుటన్. 85

క. బేహారులు మృదుసత్య, వ్యాహారులు కీర్తివిజితహారశైలసమీ
కాహారులు కవిదంతిమ,ణీహారులుగలరు పురి ననింద్యవిహారుల్. 86

క. శూద్రులుహాలనిర్జితబల, భద్రులుసద్గుణగణాధిభద్రులునుఖని
ర్ణిద్రులువితతగభీరస, ముద్రులు గలరచటబుధసమూహసురేంద్రుల్.

సీ. ఏవీథిజూచిన నిభదానవాంతక, సదనసముత్కరసంభ్రమంబు
లేవంకనరసిన నేణాంకకోటీర, పాదపంకేజాతభక్తమహిమ
లేచాయనాలింప హిమగిరిజాధిప, లలితకథాసుధాలాపచయము
లేచక్కిగణియింప హేమధరాధర, బాణానుసేవానుభావనంబు

గీ. లెచటఁ దలపోయపద్మినీహితసుమృగాంక
జాతవేదాంబకాభంగశా…చర

లప్పూరీవరమాహాత్మ్య మభినుతింప
నలవియే శేషఫణికైన నజునికయిన. 88

క. ఆపుటభేదన మేలెడు
భూపాలకుఁడర్థినికరపోషణుఁడు సమి
ద్వ్యాపారచణుఁడు శుభముల
నేపుడరన్ బిజ్జలాఖ్యుఁ డీవ్వసుమతిలోన్. 89

ఉ. జైనకులప్రవర్ధనుఁడు శాశ్వతకీర్తియుతుండు నిర్మలా
నూనగుణాభిరాముఁడు ధనుర్గుణటాంకరణారిమండలీ
మానససాధ్వసప్రదుఁడు మన్మథమాధవరూపశాలినా
నానరనాథసన్నుత సనాథుఁడుతత్క్షితినేతవర్ధిలెన్. 90

క. ఆరాజమంత్రివర్యుం, డైరాజిలు సకలదిగధిపాంబుజవదనా
భూరిస్తనహారాయిత, చారుసమాఖ్యుండు బసవసచివుండెలమిన్. 91

సీ. యేధన్యమానసం బిందుశేఖరపాద
తోయసంభూత భృంగాయమాన
మేకృతార్థకృపావలోకనంబర్థిదై
న్యాశుశుక్షణివార్షికాంబువృష్టి
యేపుణ్యచారిత్రు కోపయుగ్భ్రూభంగ
మఖిలాన్యమతజాతిహారణమూల
మేమంత్రిమాహాత్మ్య మిందాబ్జభవముఖ
బృందారకానీకవినుతిపాత్ర

గీ. మతఁడు గొనియాడఁ దగు మిహికాచలేంద్ర
సంభవావల్లభనియోగసకలమర్త్య
పావనార్థమాదాఖ్యసత్పత్నిమాద
మాంబికాగర్భజుఁడు బసవార్యవరుఁడు. 92

సీ. సతతంబుగురులింగచరసమర్చలెకాని, యితరార్చనంబుల నేవగించు
జంగమతీర్థప్రసాదసేవయెకాని, యితరంబురుచిగొన నేవగించు
మాహేశ్వరవ్రాతమాహాత్మ్యమేకాని,యితరంబువినుటకు నేవగించు
సతతగణాధీశసద్గోష్ఠియెకాని, యితరంబుగనుగొన నేవగించు

గీ. నెంత సజ్జనుఁ డీధన్యుఁ డెంతధీరుఁ
డెంత మహిమాఢ్యుఁ డని జను లెన్నుకొనఁగ
రాజ్యభారంబు శివభక్తి రాజ్యభార
మెలమిఁ బాలించె శ్రీబసవేశ్వరుండు. 93

గీ. అనుదినము లక్షతొంబదియాఱు వేల
జంగమంబులకిష్టాన్న సమితియొసఁగి
మిండజంగమములకు పండ్రెండు వేల
కనుచు వేశ్యాగృహంబుల కట్టెపగిది. 94

క. అచలితతత్కైంకర్య, ప్రచురశ్రవణాను మోదభరసకలదిశా
నిచయసమాగతశరణుల, ఖచరజ్యేష్ఠునకువశ మెగణుతింపఁగన్. 95

సీ. సుజ్ఞానశీలురు సూనృతవాక్యులు, త్రిభువనపూజ్యులు ధీరమతులు
వేదాంతవేదులు వీరశైవాచార, సంగ్రహాకర్తలు శాంతిసహితు
లష్టవిధాంగ యోగానందపరవశు, లసదృశలింగలీనాత్మవర్గు
లంతకదూరులత్యంతకరుణాసముద్రులు నిరుపమభద్రగుణులు

గీ. సత్ప్రసాదాంగు లకుటిలస్వాంతరంగు
లతులభవదూరు లన్యదుర్మతవిదూరు
లచలదాసోహమతులు భక్తాధిపతులు
శర్వపదపద్మభృంగముల్ జంగమములు. 96

క. పరవికచాబ్జేక్షణసో
దరిము క్తిసతీలలామ దారకశుకు బం
గరు పెంచురుణముగరళిము
కరుణయుపూన్కిగనటంచు గణసింహంబుల్. 97

గీ. నిండికళ్యాణపురము పండ్రెండు యోజ
నముల నెల్లెడ నెడలేక నమితులగుచు
కాలకంధరువరభద్రగజము లనఁగ
నతిముదంబున వసియించి రంచితముగ. 98

చ. వినయవివేకభక్తగుణవిశ్రుతుఁ డాబసవేశ్వరుండుదా
ననయముతద్గుణాధిపుల కందఱికీప్సితవస్తుజాత మిం

పానరంగనిచ్చుచుఁ బ్రమద మొంది సుధామయతత్ప్రసాదముఁ
వననిధిఁ దేలుచుఁ మహిమ వర్ధిలఁ జేయుచునున్న యత్తరిన్. 99

## కక్కయ్యగారికథ.

శా. దృక్కర్ణేశకలాపమూర్తిసురధాత్రీజపరిభాకీర్తియు
గ్దిక్కూలప్రకరుండు శామముఖవిద్వట్సంహరుండాశ్రిత
ప్రాక్కర్మాంబుధి బాడబానలుఁడు భాస్వత్తేజుఁడప్పిలిలో
కక్కాఖ్యుం డొకభక్తసత్తముఁడు శ్లాఘ్యఖ్యాతివర్తిల్లఁగన్. 100

గీ. బసవదండాధినాథుండు భక్తితోడఁ
దద్గణాధిపవరుప్రసాదంబుఁగొనఁగ
దలఁచి పండ్రెండువత్సరంబులు మహాప్ర
యత్న మొనరించియుంతట నబ్బకున్న. 101

మ. కమనీయామలతత్త్వయుక్తుఁడగునాకక్కయ్య దివ్యప్రసా
దము నే గాంచగ నేరనైతినకటా తద్భాగ్యమేతీరునన్
సమకూరున్ ననుఁబోలువానికనుచున్ స్వాంతంబులో నెంచి యు
త్తమమైయొప్పు తదీయమందిరముచెంతం జేరియచ్చోటునన్. 102

ఉ. అంగనసీమనల్లడల నంతట నింతట నిల్చి కాంచుచున్
ముంగలనొక్కచీమకొనముక్కున నొక్కకణంబువట్టియే
గం గనిజ్ఞానిగానయిది కక్కయగారిమహాప్రసాద మె
బ్బంగిననంశయంబనుచు భావమునందు దలంచి వేడుకన్. 103

చ. భవములబాసితిన్నిగుల భాగ్యముఁ జెందితి కోరుకోర్కిచే
దవిలె సమస్తసద్గుణవితానములోపల పన్నె గాంచితిన్
భువనసుతాభిరామ గుణపూజ్యుఁడు కక్కయసత్ప్రసాదమీ
భువిగనఁగొంటిమంటి నతిపుణ్యచరిత్రుఁడనైతి రూఢిగన్. 104

క. అనయము గురుసంగయదేవునిగొలిచినయట్టిఫలముపొందుగగణప
ద్వనజములుపూజగావించిన ఫలమునుతోడుఁదోడ చేకూరెబళే.

గీ. అనుచుముదమంది యప్పు డయ్యనఘమూర్తి
చీమనోటిప్రసాదంబు చేకొనంగ
నొకయుపాయంబుగని యటనున్నయినుక
జగతిపై మ్రుక్కి మాత్రంబు చల్లుటయును 106

క. అక్కజముగనవ్వాలుక, చక్కెరపాడియైన తత్ప్రసాదకణంబుల్
లెక్కగొనకప్పిపీలిక, యక్కడనిడి పంచదారకై యరుగుటయున్.
క. ఆనందమందిబసవఁడు, దానాకణమాత్రహస్తతలమునచిడిబల్
దీనునకు నిధియువాడిన, చేసికివర్ణంబుపగిది చేకురెనాకున్. 108
గీ. ఈమహాప్రసాద మిష్టలింగార్చన
చేసికానికొనఁగఁ జెల్లదనుచు
బలువుమీరి తనదుతలపాఁగకొంగున
విడకయుండముడియ వేసి యంత. 109
వ. భక్తాగ్రగణ్యుం డైనకక్కయ్యగారియంతర్గృహంబునకుంజని ప్రసాదోపభోగానంతరంబున సుఖగోష్ఠి నున్నయతనింగాంచి వినయభక్తి ప్రమోదంబులు ముప్పిరిగొనఁగ సాష్టాంగవందనం బాచరించి కరంబులు మొగిచి దేవా! బహుకాలంబుననుండి కాంక్షించుచున్న నాకు మద్భాగ్యంబు పిపీలికారూపంబై భగవత్ప్రసాదంబు గొనితెచ్చి యిచ్చె నేటికికృతార్థుండనై తిననినవప్పరమపురుషుండు విస్మయంబంది గురుకటాక్షలబ్ధు లగువారికెయ్యది యసాధ్యం బనితలంచి యతనితో ని ట్లనియె. 110
చ. అనవరతాఖిలాంచితనిశాధిపభూషణ సుప్రసాదభా
జనరసనాంచలుండనఁగ జాలిననీకుమదీయకర్తయై
జనసుతిగాంచు చెన్నయప్రసాదము సంభవమాటచోద్యమే
ననునొకపెద్దసేయుటకు న్యాయమెనీకు వివేకభూషణా! 111
చ. అని సరసంబుగాఁబలికియంపిన బండరితత్ప్రసాదముం
గొనుతమినాత్మగేహమునకుం జనుచో నెదురేగుదెంచి పా
వనసుగుణాభిరామ శివభక్తిలలామ దయాబ్ధిసీమయా
ననదగునక్కనాగమ నమంచితసంభ్రమమొప్ప ని ట్లనున్. 112
గీ. ఎచట కేగితయ్య యిష్టలింగార్చన
సమయమయ్యె వేగస్నానవిధులు
సలుపుమనినతనదుతలపాఁగయొక్కచో
నునిచి తడుపుగట్టుకొనిరయమున. 113
క. జలకంబాడఁగనేగిన, నలినీదళనేత్రయక్క నాగాంబికయా

తలపాఁగకొంగుముడిఁగని, దలమగుసంశయమునదన యెదంజనియింపన్.

క. నాముద్దుతమ్ముఁ డెన్నం, డేమియు దామూఁటగట్ట నెఱుఁగఁడి దేమో
యీమూడుపుజూడవలెనని, బ్రామినకుతుకమునముల్లెవదలిచి కాంచెన్.

ఉ. కాంచి గణప్రసాదమగుఁ గా యని సంతసమంది ఫుల్లనే
త్రాంచలమోదబాష్పయుతుడై బసవండు గణాలయంబులన్
సంచితభక్తివారల ప్రసాదము గోరికదీరమెక్కి యొ
క్కించుక దెచ్చెనాకొసఁగ నెంతయు కూరిమిగల్గు గావునన్. 116

గీ. ఈప్రసాదమహిమ మెంచి వర్ణింపఁగ
నలవియగునెతమ్మి మొలకకైన
కలుషవిదుల రేని తలమానికముగాఁగ
దాల్చినట్టిదొరకుఁ దప్ప జగతి. 117

సీ. ప్రబలారివర్గద్విపప్రతాపంబున, కంకుశంబగు నిమ్మహాప్రసాద
మతులితదుర్విషయావనీధరముల, కశనిరూపం బిమ్మహాప్రసాద
మత్యుగ్రతాపత్రయాంభోదములకుజం,ఝానిలంబగునిమ్మహాప్రసా
మచలితమాయాబలాటవీస్థలమున,కనల తేజం బిమ్మహాప్రసాద

గీ. మఖిలవేదాంతవేద్యమా హారునిభక్తి
కాస్పదంబయి తగునిమ్మహాప్రసాద
మలఘుతరనాదబిందుకళాత్మకంబు
తలఁపగా నిమ్మహాప్రసాదంబు జగతి. 118

క. అనికొనియాడుచు మోదం, బునఁదద్దివ్యప్రసాదమునకతులితవం
దనము లొనరించి వేగం,బున లింగార్పితముఁ జేసి భుజియించె నటన్

గీ. బసవదండేశుఁడామోదకుసుమవారి
స్నానమొనరించి ధౌతవస్త్రములు దాల్చి
లీలఁజెన్నొందు లింగార్చనాలయంబుఁ
జేరిచిత్రాసనమున నాసీనుఁడగుచు. 119

గీ. భూతి రుద్రాక్షమాలికల్ పొసఁగఁ దాల్చి
కరతలంబున నిష్టలింగంబుఁ బూని
సద్గురుఁదలంచి తనయగ్రజాతఁ బిలిచి
నిరుపమానందభరితహృత్సరసుఁడగుచు. 120

క. అక్కాపాగాకొంగున
కక్కయ్య మహాప్రసాదకణ మున్నది నే
మక్కువ మెక్కఁగవలయును
జక్కఁగ కొని తెమ్మటన్న సతి యిటు పలికెన్. 122

క. పాగాకొంగునప్రసాద, మేఁగనినా కొఱకు తెచ్చి తీవనికడకం
వేగభుజించితి నన విని, తా గుండె ధిగుల్లుమనఁగఁ దలపోసె మదిన్.

ఉ. అకటా నాకిపుడేలగల్గు నిజచిత్తాంభోజపీఠస్థితాం
తకసంహారసదావిలీనకరణోద్యత్కృత్యకక్కాఖ్య భ
క్తకలాపప్రథితప్రసాదకసుధాకల్లోలినీసౌఖ్య మీ
గకు సౌరభ్యము చేకురంగలదె లోకంబందు వీక్షింపఁగన్. 124

సీ. కారణజన్ముఁడౌ కక్కయ్యసత్ప్రసా, దముగొన నెమ్మదిదలఁపనేల
తలఁచిపండ్రెండువత్సరములుపొంచనా, తొంటిపుణ్యంబునదొరకనేల
దొరికినచటసంతోషినై మెక్కక, తలపాగకొంగున దాచనేల
దాచిననాగాంబతత్ప్రసాదముగని, తొడరినన్నడుగక కుడువనేల

గీ. కుడువనేర్పరి మాయక్క కుమతినేను
బేలనైనట్టినాబోటి కేలగల్గు
సంగమేశ్వరుకరుణ యీచాయనుండె
నెంతచింతయొనర్చిన నేమిగలదు. 125

క. వేమరునిటుదలపోసిన, పామరునకు ముక్తిగలదె పామాడినచో
కామితజోగులు చేకొనె, నీమహిలో ననెడుమాటయే నిజమయ్యెన్.

క. అని యిట్లు నాగమాంబా, వనజాతాస్యప్రకృష్టభాగ్యంబునకుం
దనవొఱుకలేమి కెంతయు, మనమునదర్కించుచుండె మాటికినంతన్.

ఉ. భోగివిభూషణాజ్ఞ మెయి భూమికివచ్చు మయూరవాహనుం
డాగమవేద్యసర్వమహిమాకరకక్కయసత్ప్రసాద నే
వామహిమంబున న్మిగులఁ బావనమై కనుపట్టె నివ్విడీ
నాగమగర్భసీమ యిక నాదుమనోరథసిద్ధిగాంచితిన్. 128

క. ఈసుదతీమణికడుపున, భాసురముగఁ బుట్టి కీర్తి ప్రబలెద నని యు
ల్లాసమునఁ గార్తికేయుం, డాసతిగర్భప్రవేశమై చెలువొందెన్. 129

క. జలజాయతాక్షిగర్భ
స్థలమందుఁ గుమారమూర్తి తగనిల్చినచో
దలమగుచు గర్భచిహ్నం
బులు గానఁగనయ్యె జనులు ముక్కుమ్ముడువఁగన్. 13

మ. ఇదియేమో విపరీతమంచు దను దానేవంబునుం జెందుచు
న్మదిలో సిగ్గున నెవ్వరిం గనక యానాగాంబ యున్నంత నా
సుదతీరత్నముచొప్పు గాంచి బసవేశుం డెంతయుం జింతచేఁ
జెదరంబాఱెఁడుచిత్తమందు దలపోసెం జెక్కుచందంబులన్.

క. అవివాహ పుణ్యచారిణి,ప్రవిమలసద్భక్తియుక్తభావాంబుజ యీ
ధవళాక్షియిట్టినిందం, దవుల న్వలసెం విధాతతలపేమందున్. 13

క. కలలోననైన పురుషుని, తెలియంజూడనికళావతీతిలకము తె
క్కలిగర్భము దాల్చునెయని, నలుగురువినినింద చేసి నవ్వఁగవలసెన్.

క. ఏమని యాడియుండుదు, నీమహిజను లాడుకొనెడు హీనోక్తులు నే
నేమని చెవులంజొనుపుదు, నామదిదరిలేని చింత నాటఁగవలసెన్.

గీ. లోకనిందఁ బాపి మాకు సద్గతిఁ జూపి
యరయు మిట్టితఱి మహానుభావ
నీవె దిక్కునమ్ము దేవసంగయ దేవ
యనుచు గురుని దలఁచునవసరమున. 135

సీ. బాగైనతగటంచు పాగలోఁ జెక్కిన
కమ్మపువ్వులబంతి యెమ్మెగులుక
వగమీర పైవల్లెవాటుగా వైచిన
జిలుగు రెంబెపుడాలు చెలువుమెఱయ
డాకాల దవిలించు డంబైనరతనాల
కడియంబు రవలచే ఘల్లురనఁగ
మెయినిండ నలఁదినమెఱుఁగు గంధపుఁదావి
మించి నల్దిక్కులు ముంచికొనఁగ

గీ. కేల నందంబు గలబొందెకోల దనర
సుదుట యెఱుపైనబొంది సొవదలు సింప

వెడదయురమున లింగంపు వేటుదనర
సంగమేశ్వరుఁ డొక మిండజంగమగుచు. 136

గీ. నెదుట నిల్చినఁ గని బసవేశ్వరుండు
జంగమాంఘ్రిద్వయమునకుఁ జాఁగిమ్రొక్కి
వేదసూక్తుల నెంతయు వినుతిఁజేసి
సముచితాసనమునసుంచి సంభ్రమమున. 137

గీ. అర్ఘ్యపాద్యాదు లిచ్చి యయ్యనఘమూర్తి
పార్శ్వతలముననంజలిఁ బట్టుభయము
భక్తియును నాత్మలోపలఁ బాదుకొనఁగ
వినయముననున్న శిష్యునిఁగని గురుండు. 138

గీ. బసవ! నీమోము వెలవెలఁబారియున్న
దేమికత మని యడుగ నోస్వామి యొకటి
విన్నవించెద తోఁబుట్టువెలఁదికతన
యొక్కబలుసింద సంభవమొందె ననిన. 139

క. చింతలకు నిందకై యా, వంతయు నీమనసుతో నయంగన యితర
భ్రాంతివహించు నెగర్భ, దంతమునకు వేతెయొకకతముగలదనఘా.

గీ. అంబ పులిననితంబ దయావలంబ
వృజినగిరశంబ ముఖవిజితేందుబింబ
చికురపరిభూతరోలంబ శ్రీవిడంబ
డంబుగా నొకనాఁడు ముదంబుతోఁడ. 141

ఉ. రాజితశైలకూటనవరత్నమయాంచితసౌధమధ్యవి
భ్రాజితరత్నపీఠమున వాణిశచీప్రముఖాదితేయసీ
రేజవిలోచనల్ గొలువ శ్రీదళుకొత్తఁగనున్న వేళఁ దే
జోజితకోటిసూర్యుఁడగుచుఁ శరజన్ముఁడు వచ్చెఁ జెచ్చెరన్. 142

గీ. వచ్చి సుతునిఁజూచి వాంచి కేల్గవసాచి
నాధసంబుకుప్ప నాదుహంస
నన్నుగన్నతండ్రి నాపట్టినాచిల్క
రార యన్న యనుచు గారవమున. 143

శా. తాముద్దాడుచుఁ గౌఁగిలించుకొని మూర్ధఘ్రాణముం జేసి బ
ల్మావ్యమోహంబున నంకమందిడి తదీయాలాపముల్ ప్రేమచే
నేమేమీయని మాటిమాటి కరుదై యింపొంద నగ్గింపుచుం
గామారిప్రియభామ తోష మొదవం గా నన్నచో నత్తరిన్. 144

క. నాగేంద్రగమన యన మిహి
కాగతనూభవకు ప్రియవయస్య యపుడు త
ద్రాగంబుఁ గాంచి యొకసఖి
తోఁగీల్కొనుమందబుద్ధిదోఁపఁగఁ బలికెన్. 145

చ. అరయఁగ నాత్మగర్భజనియట్టుల నీశరజన్ము వేడ్కమీ
దరయక గాంచువారు తనునాలము నేయుదురంచు నెన్న వే
గిరికరజాతముద్దు దిలకింపఁగ లాలన మాచరించె నో
కరివరయానయీమె యెడఁ గాంచితి మొందున లేనిచోద్యమున్. 146

క. అసినెలవి బారనవ్విన, వనితం దిలకించి కోపవహ్నికణంబుల్
కనుగొనలఁ జారఁగా నిట్లని యోర్మి మిహికాదరాధరాత్మజ పెలుచన్.

ఉ. దైవతసంచయాధిప సుధాకరశేఖర వీర్యజన్ముఁడౌ
నావరపుత్రుఁగన్గొని మనంబున నోరువజాల కిట్లు పా
పావహవాక్యముల్ సుదతి యాడఁగ గూడునె మేలు మేలు నీ
భావముగాననయ్యె నిఁక పల్కులు వేయును నేలమాటికిన్. 148

క. ప్రేలరితనమున నిటు నిం, దాలాపము లాడి నవ్వి తిటు గావున న
భ్భూలోకంబున నిందల, కాలయమై జననమందు మంబుజవదనా.

మ. అని యాతీరున శాపమిచ్చిన నపశ్యాయాద్రిజానవ్యప
ద్వనజాతంబులపై నొరంగి మదిలో దైన్యంబు రెట్టింపఁగా
ననిమె న్వారణయానతల్లి యిటునాయందొక్క యెగ్గెంచఁగా
జను నే నవ్వుచునాడినట్టిపలుకుల్ సత్యంబుగాఁ గొందు రే. 150

ఉ. దావునసుండనీక వసుధాస్థలి సంభవమందు మంచు బల్
శాపమొసంగ నీకగునె జన్మమునొందఁగఁ జాలతత్క్రియం
బాపఁగ దేయటంచు బహుభంగుల వేఁడిన గౌరినెమ్మదిం
గోపమొకింత డిందుపడఁ గోమలి కిట్లనియెం బ్రియంబునన్. 151

సీ. తరుణి నాశాపంబు దప్పదు గావున
ధరణీతలమున నుద్భవమునొంది
పరిణయరహితలై భక్తభక్త్యవశేష
మాహాత్మ్యమునగర్భ మమరఁదాల్చి
ప్రజలెల్ల నిందింపఁ బంద్రెండువర్షముల్
భరియించిపుట్టెఁడు పట్టివలన
లోకాపవాదంబుఁ బోకార్చి సద్భక్తి
చర్యచే కొన్నివత్సరములుండి

గీ. మరలి యిటురమ్ము నావుడు మగువమ్రొక్కి
దేవి నీయాజ్ఞ జననమొందెదను గాని
యిక్కుమారు కుమారుగా నిమ్మటన్న
నట్లయగాక యని గౌరియానతిచ్చె. 152

క. నాగారిగమనయానతి, నాగాంతకవాహుఁడయ్యెనందనుఁడనుచుఁ
నాగేంద్రగమనముదమున, నాగమయైజగతిపావనంబుగఁబుట్టెన్.

క. కావుననీతోఁబుట్టువు, పావనగుణశీల దీనిభావముదెలియం
గావళమె యేర్పికైనను, నీవింకేట చింతలుడుగు నిరుపమ చరితా.

సీ. ఘనభక్తవర్యుఁడౌ కక్కయ్యనత్ప్రసా
దంబుగైకొనుమహత్త్వంబువలన
తరలాక్షిగర్భంబుఁ దాల్చి తద్గర్భస్థుఁ
డై యున్నవాఁడు షడాననాఖ్యుఁ
డిటమీఁదఁ బదియురెండేళ్లకు బిడ్డలు
సభ సర్వజనులు నాశ్చర్యమొంద
జనని దక్షిణ కర్ణమునఁ బుత్రుఁ డుదయించు
ద్వాదశవత్సరబాలుఁ డగుచు

గీ. నాతనికిఁ జెన్నబసవరాజనెడునామ
మెలమి గావింపుమని వృత్తమెల్లఁదెలిపి
సంగమేశుఁ డంతర్ధానసరణిఁదాల్చె
బసవఁడంతట లింగదర్పణమునందు, 155

సీ. పద్మాసనస్థుఁడై పరమేశ్వరునకు హృ
త్పద్మంబు నెలవుగాఁ బఱఁగువాని
పశ్చిమనాళసంభవఘంటికారవ
పరవశభావుఁడై వఱలువాని
కడునధోముఖము లౌకమలంబులాఱును
నూర్ధ్వముఖములుగా నొనరువాని
శశిరథస్యందన శర్మనిర్మలసుధా
స్వీకారవృత్తిచేఁ జెలఁగువాని
గీ. నమలబిందుకళాతీతుఁడైనవాని
నయుతసూర్యప్రభాభాసుఁడైనవాని
నాత్మసోదరిగర్భమునందుఁ గాంచి
యాపె కెఱిఁగించి సంతోష మందియుండె. 156

గీ. ద్వాదశాబ్దంబు లంతటపరియరాఁగ
నెలమితో నొకనాఁడు మహీశుఁజేరి
గూఢచారుఁ డొకండు దా గొంకికొంకి
పలికె జోహారొనర్చుచు భయముమిగుల. 157

క. జననాథ నేఁడు ప్రోలం, జనియించినవార్తలిపుఁడు సర్వము దెలియ
న్వినివచ్చినాఁడఁ దెలుప,న్మనమున శంకింతుననిన మనుజేశుఁడనున్.

చ. మనమున భీతిదక్కు మనుమానముఁ జెందకు మెట్టివార్తలై
నను వినుపింపుమా యనిన నాథుని తోడుత గూఢచారుఁ డి
ట్లనుఁ బురిలోపధూజనము లంతట నింతట గుంపు గుంపులై
మనబసవన్నఁ బేరుకొని మాఁటికి నిట్లనసాగి రెంతయున్. 159

క. బండారితోడఁ బుట్టువు, నిండినయశ మెల్లవరద సీటగలపితా
పెండిలిగాకటమున్నే, యుండెన్గర్భమున లజ్జ నొందెడుమదిలోన్.

మ. బసవామాత్యుఁడు శైలజారమణ సద్భక్తాగ్రగణ్యుండ ని
వ్వసుధ న్నాకెదు రెందు నెవ్వరనుగర్వస్ఫూర్తినో తోడఁబు
ట్టుసరోజానన వీఁడజాలకరయె మూఢుండై మనోవీథి సా
ధ్వసముం జెందక [illegible] లోన్. 161

ఉ. ఏమనవచ్చునింక ననియింతులు కొందఱు వల్కనంతలో
తామరసాయతాక్షులు విదగ్ధులు వారి నదల్చి తాళరే
యేమిటికీకఠోరపరిహేళనవాక్యములయ్యమాత్యుఁడే
భూమివరుండు గాన మనబోటికి నేటికి మాటి కిట్లనన్. 162

గీ. అనుచు పెక్కు విధంబుల నాడుకొనఁగ
విని తెలుపవచ్చినాఁడ నుర్వీకళత్ర
యనిన నాఁగాక యని వాని ననిచి నృపతి
తనమనంబున నిట్లని తలఁచె నపుడు. 163

గీ. బసవఁడిట్టి కలుషబద్ధుఁడై యుండుట, తెలిసీ యూరకునికి వలనుగాదు
వసుధలోన సకలవర్ణాశ్రమాచార, సరణులెల్ల జనవువరుసతోడ.

క. సకలమెఱుఁగురాజారా, ష్ట్రికృతం పాపంబటంచు చదువులు భువిలో
ప్రకటింపదెలసినేనూ, రకయుండుటచనునెయనుచురభసముతోడన్.

ఉ. కంచుకినొక్కనిం బిలిచి గ్రక్కున నేగి ప్రధానుఁ దోడి తె
మ్మంచు ననుజ్ఞ యిచ్చినతదాజ్ఞ శిరంబున దాల్చి వేగ నే
తెంచి వినమ్రుఁడై బసవ ధీమణి సద్మనయుం బెలర్పరా
జంచితలీల నిన్బిలువ నంపిన వచ్చితి నంచుఁ దెల్పినన్. 166

క. ఘనుఁడగునబ్బసవాగ్రణి, దనపరివారంబు గొలువ తగుఠీవిమెయిన్
జనిధరణీనాథుఁగనుం,గొనియుచితాసనమునందుగూర్చున్న యెడన్.

చ. కనుగవ కెంపునింప నలుకన్ బసవేశునిఁ జూచి బిజ్జలుం
డనియె ప్రధానశేఖరుఁడవై నుతిగాంచుటవన్నె కెక్క యి
ట్లనుచితవృత్తికిందగిలి యగ్రజచీఁకటితప్పుసైఁపఁగూ
డు నెకులశీలమానములు డొంకి చనన్ ధరణీతలంబునన్. 168

క. బలయుతులము మా కేమని,నలుగురిలోనిందఁజెందన్యాయమెమిమ్ముం
గలసివసించుటమాకుం, జులకనయగుకన్నె కెట్లుచూలయ్యెనన్. 169

మ. ధరణీకాంతుని జూచి యిట్లనియె శాంతస్వాంతుఁడై కల్మషా
కరవాక్యంబుల లాభమేమిటకు నాకంజాక్షి రప్పింతుదు
ర్భరగర్భస్థితిదాని నేయుడుగుఁ డేర్పాటయ్యెడు న్మీకునం
చు దయంబొప్పఁగ బిజ్జలానుమతిచేఁ జోద్యంబుగాన త్తరిన్. 170

చ. తనకగునాప్తుఁడొక్కరుని దాదరిఁ జేరఁగఁబిల్చి నీవువే
చనియిటకక్కనాగమను సయ్యనదోడ్కొనిరమ్మటన్న న
య్యనఘచరిత్రుఁడేగి సతియంఘ్రులకుం ధరజాగి మ్రొక్కియా
యనుజుఁడు ధారుణీపతి సభాంతరమందుననుండి చెచ్చెరన్. 1

చ. అచటికి నిన్నుదోడ్కొని రయమ్మునరమ్మనిసంపవచ్చితి
న్విచికిలగంధియంచు సభవృత్తములెల్ల నెఱుంగఁజెప్పఁగా
నచలితచిత్తయైగురుపదాబ్జము లాత్మఘటించి మ్రొక్కి భ
క్తచయదయాకటాక్షమునఁ దార్కొను వేగ శుభంబులంచొగిన్.

క. మేలగుసన్మణిఖచితాం, దోలికలో నెక్కిసఖులుతో నడువఁగన
బ్బాలామణిబిజ్జలునిస, భాలయమటుచేరియుంతి కావనినుండెన్. 1

క. అప్పుడుగోత్రాకాంతుం, డప్పావనిఁజూచియజ్ఞుఁడైయాహో యీ
యొప్పులకుప్పకు చెప్పఁగ, చొప్పఁడనిగుణంబు పుట్టెతోఁ ణీస్థలిపై.

ఉ. పాపుబ్రహ్మవ్రాత నగుపద్ధతిదప్పదటంచు నెంచియా
భూపపురందరుండనియె పొల్తుక పెండిలిలేనియట్టినీ
వేపగిదిన్ సగర్భవయి తేర్పడఁ జెప్పుమటన్న భూమిభృ
చ్ఛాపపదంబులాత్మనిడి సాధ్వధరాధిపుతోడ నిట్లనున్. 1

క. ఏకర్మంబెఱుఁగనినే, నేకైవడిఁదెలుపనేర్తు నీగర్భస్థుం
డేకొమరుమిగులుశిశువుం, బ్రాకటముగనడుగ నాత్మపద్ధతి దెలుపున్

చ. అన విని విస్మయాన్వితహృదంబుజుఁడై ధరణీశుఁ డెన్నఁడు
న్వినని యపూర్వవాక్యములు వింటిమి యీసతిపల్కులెట్టులై
నను గనుగొందమంచుఁ జిరునవ్వొలయన్ సభవారలబ్బురం
బున వినుచుండ నిట్లనియె నప్పుడు పెద్దయెలుంగునన్వడిన్. 1

వ. తద్గర్భాంతరార్భకునుద్దేశించి. 1

ఉ. ఓహో యీసతిగర్భదేశమున నేయోజం బ్రవేశించితీ
వ్యాహారంబు వినంగ నీసభజనుల్ వాంఛించియున్నారనన్
నీహారాచలకన్యకారమణపన్నీరేజభక్తుండు క్రో
ధాహంకారమదాదిదూరుఁడగు కక్కయ్యాఖ్యుభాస్వత్కృపన్. 1

క. ఈనాగాంబ గ్రహించిన, మానితదివ్యప్రసాద మహిమమువలనన్
నేనంగకలనఁ జెందితి, భూనాథయటంచు శిశువుపాలువుగఁ దెలుపన్

చ. వినిసభవారలెల్ల నతివిస్మయమందఁగరాజు నెమ్మనం
బునసభవాంశుజాతుఁడని బుద్ధినెఱింగియు డింభకావలో
కనకుతుకంబుచేనమరి క్రమ్మర నిట్లనియెఁద్వదీయద
ర్శనమొనరింపమాకిపుడు చాలఁగవేడుకయయ్యెగావునన్. 181

## చెన్నబసవేశ్వరావతారఘట్టము.

ఉ. తావకదర్శనంబొసఁగి ధన్యులఁజేయుమటంచు వేఁడ న
బ్బావరవాక్యముల్ విని యపూర్వమహామహిమంబుఁ జూపఁగా
భావమునం దలంచి హరుపాదములాత్మఘటించి నాగమాం
బావరగర్భసంగతకుమారుఁడు భూరిగుణాఢ్యుఁడయ్యెడన్. 182

గీ. తల్లికంటెనితరదైవంబులేదని, సకలవేదసమితిచాటుఁగాన
నట్టితల్లిప్రాసనాయాసమొందింప,పలవదనుచునొకయుపాయమెంచి.

చ. సురుచిరలీలదేహమతిసూక్ష్మముగా నొనరించిదూషకో
త్కరములవాక్ప్రబంధములుగాఁగ మొఱుంగువిధంబునందిగం
తరగతతేజుఁడై జననిదక్షిణకర్ణమునిర్గమించిసుం
దరతనువొప్పఁగానిలిచె ధారుణినాథునియంతికంబునన్. 184

క. అలరులసోనలుగురిసెఁ, దెలివింజెలువొంది సకలదిక్కులుదలమై
నెలకొనుచు దేవదుందుభు, లొలసెఁ నాగాంబికాత్మజోదయవేళన్.

గీ. అపుడుతత్కుమారుఁడంబికాంఘ్రిలకున
మస్కరించితదనుమతినిబసవ
దండనాయకునిపదంబులకొఱఁగిన
లేవనెత్తి కౌఁగిలించుకున్న. 186

గీ. ఫాలమునభూతిధరియించి ప్రణవసహిత
శైవపంచాక్షరము కర్ణశష్కులికను
జొనిపివరదివ్యలింగయుక్తునిగఁజేసి
శిష్యునిగఁజేయుకతనరోచిష్ణుఁడగుచు. 187

గీ. పదియురెండేళ్ల బాలుఁడై యెదురనిలచి
వెలయుడింభకుగాంచి యుర్వీవిభుండు
నిరుపమాద్భుతమందాకుభరితుఁ డగుచు
నాత్మలోపలనవు డిట్టు లనుచుఁ దలఁచె. 188

చ. కుఱుచతనంబువచ్చునని కొంకువహింపక నిర్మలాత్ముఁడై
వఱలిన యట్టిశ్రీబసవవల్లభుసన్మహిమంబు ముందుగా
నెఱిఁగియెఱింగియుండి యిపుడేటికి కానివరీతు చేసితీ
వొఱివిని నెత్తిగోకికొనుకూళలభంగి వివేకహీనతన్. 1

క. ఇప్పరమపవిత్రులకున్, జొప్పడు నేయొక్కయఘముతో శీర్షలిపై
యుప్పాటనై సజూఢఁగ, నిప్పున చెదలంట నేర్చునే వివరింపన్. 19

చ. అనుకొనిదండనాథుఁగని యాదొర యిట్లను నీవుసత్కృపం
గనిన తృణంబు మేరువగుఁ గాదనినం దృణమైన మేరువౌ
ననఘ నుతింపశక్యమగునయ్య భవన్మహిమంబులంచు హె
చ్చినమృదుభాషలన్వినుతిచేసె జనావళిచోద్యమందఁగన్. 1

మ. కమనీయామలరత్నభూషణములన్ గాత్రస్వరాంభోమిళ
త్సుమహాచ్చేలములిచ్చె గాఢతరసంతోషాత్ముఁడై యక్కనా
గమకున్ శ్రీబసవాదినాథునకు లోకవ్యాప్తి సత్కీర్తిసం
గమతన్మించినయుర్భకోత్తమునకున్ కల్యోత్సవం బొప్పఁగన్. 1

క. అంతట నాగాంబామణి, కాంతాసంఘంబుగొలువ ఘనసంతోషా
క్రాంతస్వాంతాంబుజయై,యంతగనిజభవనమునకును విజయముచేసె

సీ. బసవేశుఁడానందభరితాంతరంగుఁడై
రాజానుమతిచే విరాజమాన
దంతావళంబుపై తనయల్లు నెక్కించి
తానును తానెక్కి ధవళచామ
రాతపత్రంబుల నల్పంబులై యొప్ప
భేరీమృదంగముల్ బోరుకొనఁగ
గణికాంగనానృత్యగానముల్ చెలగంగ
వంధిమాగధులు కైవారమొసఁగ

గీ. తరుచు చతురంగబలము క్రిక్కిరిసినడువ
వేత్రహస్తసాహేరవవితతిదనర
నమితమంగళాలంకృతంబైనపురము,
రాజవీథులనరిగ విభ్రాజితముగ.

చ. ఘనబనవేశు నర్భకుని గన్గొని పౌరనికాయముప్పు శో
భనసహజాకృతిస్ఫురణపాటితశక్రతనూజ కాముల౯
వనరుహసంభవాదిసురవర్ణితదివ్యగుణాభిరాముల౯
ధనదసఖాంఘ్రిసేవకహితప్రదనాములకీర్తిధాములన్. 195

చ. ఎడనెడకామినీమణులు హేమమయోన్నతసౌధవీథుల౯
గడుముద మొప్పఁగా నిలచి నవ్యసుమాక్షత భవ్యలాజ లిం
పడరగఁజల్లిరంతట వృషాధిపుపై మఱినాగమాంబికా
జడజ ముఖీతనూజుపయి సర్వజనావళి చోద్యమందఁగన్. 196

గీ. జన్నిగట్టు ముత్తైదువల్ జతల జతల
నిలచియాడాడ బుత్తడితళుకుపళ్లె
రములతో మంగళారతుల్ ప్రమదమెసఁగఁ
బట్టియిచ్చిరి యమ్మహాభాగులకును. 197

క. విలసితమణిమయసౌధ, స్థలములపై నుండిచూచు తామరసాక్షుల్
తెలియఁగనొండొరుతోడ౯, బలికిరిపికకలనినాద పద్ధతినిటులన్.

సీ. నలినాక్షియీతఁడే నాగాంబికాకర్ణ, సంభవుండైనట్టి డింభకుండు
ఘనవేణియీతఁడే గర్భంబులోపల, పదియురెండేండ్లున్న బాలకుండు
మానిని యీతఁడేమారట రుద్రుఁడై, యవతారమెత్తినయర్భకుండు
చంద్రాస్యయీతఁడే జననిందలనుబాపి, పతిచేతమన్ననబడయుకుట్టి

గీ. కంటిమిగదమ్మ కన్నులకరువుదీర
పుట్టువులు నేఁడు సఫలతఁబొందెఁగాదె
యనుచు నీరీతిఁ బురజనులందు నిందు
వినుతి సేయుచునుండిరి వివిధగతుల. 199

వ. మఱియును. 200

సీ. ద్వాదశాబ్దంబులుతల్లిగర్భములోన, నుండుటయాశ్చర్యమేయువిదలార
యుండెఁబోతనుబిల్వ మండలేశునిసభ, పలుకుటంతకువింతభామలార
పలికెఁబోయంతలోపడతికర్ణమునందుఁ,బుట్టుటచిత్రంబుపొలతులార
పుట్టెఁబోతనతల్లిపొట్టనుండేండ్లతో, నిలుచుటచోద్యంబు నెలతలార

గీ. యీజనానుమోదుఁడీభానునిభతేజుఁ, డీదయాసముద్రుఁడీశుభాంగు
డీప్రసాదజనితుఁ డెంతపుణ్యాత్ముఁడో, యన్న నేరిశక్య మింతులార.

మ. కలికీ శంకరుభక్తులెల్ల ప్రమథుల్గాకున్న యీవింత ము
న్కలనైనన్ గనుగొంటిమే యిపుడుకక్కాఖ్యప్రసాదంబుచే
మొలచెన్ గర్భమునాగమాంరమణికాముగ్ధన్విచారింపనే
తలపుంజెందనెఱుంగ నట్టియబలం దప్పెంచుటే తప్పగున్. 202

చ. పరమపవిత్రయైనసతి భావమెఱుంగక కానిచేష్టలం
దరగెనునాగమాంబ యనిపల్కితిమయ్యయొ మున్నునిందగా
దురితము వచ్చె నీయఘము దొల్గఁజేసెడుమార్గమెయ్యదో
హరహర తెల్పుమాలిన జనావళికెక్కడిసత్యవాక్యముల్. 203

చ. అసమశిలీముఖాంతకముదావహమూర్త్యపరావతారమా
బసవనితోడఁబుట్టువఁట భక్తవరేణ్యపదావలగ్నమా
నసయఁట సర్వపావనగుణంబులప్రోవఁట యట్టిసాధ్వికి
న్వసుమతిలోనవేఱయొకవాంఛజనించునె యెంచిచూచినన్. 204

క. తెలియకయాడిన క్రిందటి
పలుకులవలనన్ ఘటించుపాతక మిపుడీ
యలఘుమహాత్ములఁ గనుటన్
దొలఁగెన్ సమకూరుముక్తి తుదిమనకరయన్. 205

చ. ఇటు వినుతింపుచున్ గరములెత్తి నమస్క్రియ లొప్పఁజేయుచున్
పటహఢమామికాహళరజబంధురనాదము లాలకింపుచున్
స్ఫుటనటనాదిచోద్యములు చూచుచునచ్చెరువొందుచుండి ర
క్కటకనివాసులయ్యెడ వికాసమనోనలినాభిరాముఁడై. 206

క. ఈచందంబున పురజన, లోచనపర్వంబుగాఁ గలుగుచు ప్రభులై
యాచకవాంఛితమొసఁగుచు, ఖేచరులద్భుతమునొంది కీర్తింపంగన్

గీ. రాజ్యలక్ష్మీనివాసమై పరిణతికెక్కు
నిజగృహమునకుఁ జనుదెంచి నిరుపమాన
భద్రదంతావళము డిగ్గి భాగినేయు
కరముచేఁబట్టి బసవఁడక్కజము మిగుల. 20

క. కంచుకులుపాయదొలఁగుచు, టంచు బురోవీథినడువహర్షముతోడ
గాంచనసింహద్వారం, బంచితగతిఁజొచ్చి యరిగి యచ్చటరహిచే

ఉ. ధర్మమణీసమంచితసభాభవనాంతరరత్నపీఠి...

నిర్మలభావుఁడైనభగినీసుతునుండగఁజేసి భూమిభృ
ద్ధర్మసమానమూర్తియగుతానునునందె వసించి కొంతసే
పర్మిలిసర్వచోద్యనివహమ్ములుఁ జూచుచు నుండి యంతటన్. 210

చ. నిరుపమకాంచనాంబరమణీమయభూషణసంతతిన్నృవీ
శ్వరబుధవర్యమారజకవాంశికవైణికనర్తకాదులకా
సిరిదొలుకాడఁ దృప్తులుగఁజేసి ముదంబున వారినెల్ల మం
దిరముల కన్పి యబ్బసవధీమణి లోపలికేగివేడుకన్. 211

గీ. గంగమాంబికాదికామినీమణులకు, భాగినేయుచేతఁ బ్రణుతిసల్పఁ
బనిచియప్పుఁడుచితపరివారయుక్తుఁడై, యొనరియిష్టగోష్ఠినున్న వేళ.

సీ. చీరలంటినభవిఁజేరిక్రమ్మరివాని, ననుయుక్తుఁజేయు మాచయ్యగారు
పదడుచేపట్టిమేల్పసిఁడిగాఁజేసి ప్రఖ్యాతికెక్కిన కలకేతవరుఁడు
శరణపదాంబువుల్ జల్లికట్టెలుపైఁడిఁజేయు మోళిగమారశేఖరుండు
మృడునిచేబల్కించిమిత్రిపాలగుగొల్ల,ప్రాణమిచ్చినకిన్నరయ్యగారు

గీ. వసుధలోపలనేడు నూర్వత్సరములు
వేదమితిమీరి వర్తించుమాదిరాజు
మొదలుగాఁగలజంగమంబులు మనోజ్ఞ
భరితసంతోషులైవచ్చి రురుతరముగ. 213

ఉ. వచ్చినఁగాంచి యబ్బసవవల్లభుఁడందరకర్థి మ్రొక్కితో
డ్తెచ్చినుఖాసనంబుల నతిప్రమదంబుననుంచి యల్లుని
న్మచ్చికమీఱ వారికి నమస్కరణంబులు సల్పఁబంచి దా
హెచ్చినభక్తినున్నడగణేశ్వరు లిట్లనిరయ్యమాత్యుతోన్. 214

సీ. బసవనీమహిమంబుఁ బ్రహ్మాదులకునైన, వర్ణింపనలవియే వసుధలోన
తరివచ్చినవుఁడు పరిత్యయములుగాన్పింప, నీకుచెల్లెనుగాదెనిత్యసత్య
నీతోడబుట్టువైఖ్యాతికెక్కిననాగ, మాంబికమహిమయేమనఁగవచ్చు
తత్కర్ణమున నద్భుతంబుగఁబుట్టిన,యిక్కుమారునినుతియింపదరమె

గీ. యొకపురత్నములన్నియు నొక్కచోటఁ
దెచ్చికూర్చినయీశ్వరుమెచ్చవలదె
యనుచు నుతియించి మఱియు నయ్యర్భకేంద్రు
నెలమి నుద్దేశమొనరించి యిటు లనిరి. 216

ఉ. ఈసుచరిత్ర మీవినయ మీయుచితజ్ఞత యీమనోజ్ఞభా
షాసముదాయ మీయచలజంగమపాదపయోజభక్తి యీ
భాసురశాంతియుం బసవభావమునందు దలంచిచూచిన
త్రాసునఁ బెట్టితూచినవిధంబున నీసరి వచ్చుమెచ్చఁగాన్. 216

సీ. శ్రీకరశివభక్తలోకపికంబుల
కేధన్యచరితుండు మాధవుండు
జంగమసముదయచాతకాండజముల
కేయనఘాత్ముండు తోయదుండు
శరణసముచ్చయచక్రవాకంబుల
కేకృతార్థుండు ప్రభాకరుండు
కలితమాహేశ్వరగణచకోరంబుల
కేసత్యసంధుండు హిమమయూఖుఁ

గీ. డట్టి యాదివ్యపురుషుని నభినుతింప
కన్నులఁ గనంగభాగ్యంబు గలిగెఁగాదె
యితని దర్శించు మాత్ర ముక్తిభయాన
వలచిపైకొన దేమెట్టి వారినైన. 217

క. ఈవిధమున సకలావని, పావనముగఁ జేయదుష్టపరమతశిక్షా
గాపించి భక్తిబ్రోవఁగ, నావిర్భవమొందు నీమహాత్ముఁడు బసవా

సీ. ప్రబలభక్తిజ్ఞానవైరాగ్యసిద్ధుల, నీసరిగాననిసిర్మలాత్ము
నీపేరఁబిలచుట నిఖిలభక్తాభీష్ట,మైయున్నదనుచు మాచయ్యముఖు
లనవుడునాతఁడట్లగుగాక మద్దేశి, కాజ్ఞయు నీగతియయ్యెఁగాన
కరుణమీరలునామకరణంబుసేయుఁడు,నావుడువారలందఱునుసము

గీ. దాత్ములై చెన్నబసవరాజనుచు నుడువ
బసవడత్యంతసంతోషభరితుఁడగుచుఁ
చెలువు మీరంగ జంగమంబులకు భూతి
వీడ్యములు వస్త్రభూషణవితతులొసఁగి. 218

గీ. దళితపాపులైన యలభక్తవర్యులుఁ
దాను నలమితోడఁ దత్త్వగోష్ఠి

పలుకుచున్న యట్టిసమయంబునం దొక్క
ద్వారపాలకుండు వచ్చి మ్రొక్కి. 220
శా. దేవా యొక్క విచిత్రమిప్పు డతి దేదీప్యప్రభారమ్యము
క్తావైడూర్యపురంద రాశ్మముఖరత్నస్వర్ణ సంయుక్తభూ
షావిద్యోదితహస్తయుగ్మమున భాస్వత్సత్వరాయాతమై
భావాశ్చర్యముగాఁ బడె న్వడి బహిర్ద్వారప్రదేశంబునన్. 221
క. ఆకలితభూషణావళు, లాకరములు గనినశ్రీకరాకృతి దోఁచెన్
మాకెల్లననుడు బసవం, డాకాంక్ష తదీయ వీక్షణారంభుండై. 222
ఉ. అచ్చట నున్నభక్త నివహంబును దానును సత్వరంబుగా
వచ్చి యపూర్వశోభలఁ గనంబడు హస్తయుగంబుగాంచిలో
నచ్చెరు వందియప్పతిశయంబులు మెచ్చుటనుంచివచ్చెనో
యిచ్చటికన్న చారుఁ డొకడిట్లనిపల్కె నమస్కరింపుచున్. 223

— చిత్రకన్యకథ. —

గీ. అధిప బిజ్జలు తోఁబుట్టు వైనచిత్ర
కన్య యనునది మదనవికారమొదవ
గుఱ్ఱముల కావరినిగూడె కులమునీతి
శీలమును మాన మెంచక సిగ్గుమాలి. 224
క. పెఱవానిననుజ గూఁడిన, తెఱఁగాప్తుఁడు పిళ్లవరద దెలిపినచో య
క్కొఱగానిమాట చెవులకు, గొఱవిం జూపినటులైనగుం దెడుమదితోన్.
క. ఏమియుబలుకఁగఁ దోచక, భూమిగనుంగొనుచుగొంతప్రొద్దుండి విభుం
డాధన్యునితో ననునా, హా మానిని యెంతసాహసాత్మక యయ్యెన్.
చ. సకలుపమైవిభున్విడిచి సాధ్వసమర్మము లుజ్జగించి బం
ధుకులము విన్నతన్ను వెలిద్రోయునటన్న భయంబుమాని యీ
సఖి యొకయన్యమానవునిసఖ్యమొనర్చెఁగదే పయోజజా
తకృతము వ్రాయఁగాఁదరమె ధారుణిలోపల నెట్టివారికిన్. 227
చ. అని మఱి యిట్లు పల్కు బసవాధిపుసోదరి నేనునిందచే
సినఫలమూరకే చనక చేకురునాకిక తోడుతోడున
న్మనసిజవైరికాంత కెన నాఁజనుదత్సతి నట్లుపల్కఁగాఁ
జనునెమెఱుంగనైతి కడచన్నపనుల్ నుడువంగనేటికిన్. 228

చ. నలుగురు నిందచేసినను నవ్వఁగనే కరణిక సహింతున
క్కలుషమనస్కమోమెటులఁ గన్గొనఁజాలుదునంచుఁ గోపము
గ్గలముగఁ బూని గుజ్జములకావరి గొల్లున నేయఁబంచిలో
పలికి రయంబుమీరఁజని భావముగొల్వ వసించుచెల్లెలిన్. 229

చ. కనుఁగొని మోమునన్ వెనుక గానఁగ నీయకనాతి యిందుర
మ్మని సఖనేకతంబ భవనాంతరసీమకుమెల్లమెల్లఁదో
డ్కొని చని దాను మున్నట నిగూఢత నిల్పిన నిల్చునారెకుల్
గనుగని మ్రొక్క భూధవుఁడు కామిని వారికిఁ జూపి యిట్లనున్.

క. ఈవనితంగొనిచనివిపి, నావనితలమందు నొక్కయసియంత్రముపై
వైవుఁడుతుత్తునియలుగా, నావుఁడునొఁగాక యనుచు నతులైనంతన్.

చ. చెలియలదిక్కు గన్గొనక చెచ్చెరనవ్వలి కాతఁడేగినన్
దలవరు లంతటం దరుణి దవ్వులకుం గొనిపోయిచంపఁగా
దలఁచి తదీయ్యరూపమును దైన్యమునుంగని సంహరింపచే
తులవెసరాకయిట్లనిరి దుఃఖితమానను లొచు నొండొరుల్. 232

సీ. అక్కటాశుద్ధాంతమందునుండెడు తన్వి
కళ్వపాలకసఖ్య మబ్బెనెట్లు
కట్టన్గుచెల్లెలిఁ బట్టిచంపు మనంగ
నాలుక యెట్లాడె నరవరునకు
మిగులసౌఖ్యాన్విత యగు రాజసుందరి
కేగతిపరమేష్ఠి యెచట వ్రాసె
నబలఁజంపఁగఁగూడదని రాజుతోఁ దెల్పి
మతిమంతు లెవ్వరు మాన్పరైరి

గీ. దైవ మిటుతప్పఁ జూచినతరిమ తెవ్వ
రెంతచింతయొనర్చిన నేమిగలదు
కఠినుఁడగు రాజుఁ గొలచినకతన నిట్లు
గోరివధియింపఁగా నియ్యకొనఁగవలసె. 233

క. అనివగచి వగచివిభుపం, పొనరింపక తీరదనుచు నొకయసియంత్రం
బునపై చి[illegible]త్తుని[illegible]రుగఁగనంతన్.

క. మారుతరయమునతత్కర,వారిజములువచ్చియిచటఁ బ్రాసెనటంచున్
చారుఁడు దెల్పినబసవఁడ, వారితవిస్మయునియుక్తభావుండయ్యెన్.

ఉ. అప్పుడు ఖండజంగమము లచ్చెరువందుచు యౌర చేతులే
యిప్పగిదిం వసించెమఱి యీకరముల్ గలయింతిరూపమే
చొప్పుననుండునో యిపుడు చూచిననోఁ గదయంచు కోరికల్
విప్పుదలిర్పఁగా బసవవీరుని గన్గొని పల్కిరందఱున్. 236

మ. బసవాధీశ్వర యీకరద్వయమునన్ భాసిల్లుపద్మాక్షిసొం
పెసగంజూడఁగ వాంఛఁ జెందినది మాయిష్టంబుచేకూర్చి త
ద్బిసజాతానన నెవ్విధిన్మనిచి ప్రీతింజూపవే యిప్పుడో
యసమాస్త్రామితగర్వనిర్దళనపాదాబ్జాతపుష్పంధయా. 237

చ. వలచిన వాంఛితంబొసఁగి వారవధూజనతామనోజ్ఞలీ
లలరిజయింపఁబంచి మములాలనసేయుట కెల్లమూలమై
యలరుగదయ్య మామనవి యాత్మఘటింపుచు నీప్రయోజనం
బెలమినొనర్చి తేనియని హెచ్చగు వేడ్కల వేఁడునంతటన్. 238

సీ. భక్తులెయ్యదివేఁడఁ బ్రత్యుత్తరం బీక
నొసఁగునేమముగాన బసవమంత్రి
తనతోడమున్నుఁ దెల్పినచారుఁ బిల్చి నీ
వరిగివేగంబతదంగనాంగ
శకలంబులన్నియు సమకూర్చి కొనిరమ్ము
నావుఁడు జని విపినంబులోన
నాడాడఁబడియున్న యత్తునకలన్నియు
జతఁ జేసికొనివచ్చి సచివమౌళి

గీ. యెదుటనుంచిన చారునియిష్టమొసఁగి
శరణసందోహమున కెల్లఁ జాగిమ్రొక్కి
సంగమేశ్వరు మదిలోన సంస్మరించి
యతులలింగవసాయత హస్తుఁడగుచు. 239

గీ. వెలఁది తనుఖండచయములు వేరువేర
నేర్చి యంగాంగములు జతఁగూర్చి యచటి

భక్తపాదాంబువులు దానిపై నీఁజల్లి
యించుక విభూతిఁగొని చిలికించుటయును. 240

గీ. తత్పదాంభోజజలము సంధానకరణి
పావనంబగు తద్భూతి జీవకరణి
యైన నిద్దుర మేల్కొను నట్లుగాగ
చిత్రకన్యక యపుడ సజీవమయ్యె. 241

ఉ. మారుని మేల్కటారిమొలమావిసిగుర్కొనుకొమ్మ మేలిబం
గారుమెఱుంగుతీవ రతికామిని కేలపసించుచిల్క సిం
గారపుక్రొవ్విరత్నవు జోకాటవుఁ బొమ్మయనంగ నప్పుడా
వారిజగంధినిల్చె బసవప్రభుమ్రోల విలాసధుర్యయై. 242

వ. ఆసమయంబున. 243

ఉ. అక్కడ నున్నమర్త్యనివహం బతివిస్మయసంగతాత్మలై
యెక్కడనైనఁ జూచితిమె యిట్టివిచిత్రము ఛేదితంబులై
యక్కఁడ నక్కడంబడినయట్టికళేబరఖండముల్ భళీ
యొక్కటఁగూర్చి యీబసవఁ డొప్పుగఁజేసె సతిన్ సజీవుఁగాన్.

చ. ఇతనిప్రభావముల్ గనిన నీశ్వరుఁడే యగుఁగాక మర్త్యుఁడ
న్మతిగనఁ బోలునే యనుచు మాటికి సన్నుతిసేయుచుండఁద
త్ప్రతిబసవేశ్వరాంఘ్రిజలజాబులపైఁబడి మ్రొక్కి పల్కెన
న్నతులభవత్కృపామృతరసాంబుధిఁ దేల్చిపునీతఁ జేయవే. 245

ఉ. నీకరజాతనౌట నతినిష్ఠురపాపభయంబణంచితిన్
బ్రాకటసౌఖ్యసంపదకుఁ బాల్పడి యుండితిఁ గాన నేక్రియం
జేకొని నన్నుఁ బ్రోచెదవొ నిర్మలచిత్తనొనర్చి ప్రోవవే
లోకనుతప్రభావయని లోలవిలోచన వేఁడునంతటన్. 246

గీ. బసవనామాత్యచంద్రుండు ప్రమదమెసఁగ
క్రమముగా నూర్ధ్వరేతయ్యగారిచేత
లింగధారణ మపుఁ డొనర్పంగఁజేసి
విమలసుజ్ఞానిఁ గావించు వీని పిదప. 247

సీ. అక్కల్కిక్రమ్మర మ్రొక్కుచునిట్లను, బసవేశ నావిన్నపంబువినుఁడు
ధరణిపై నవ్వయతిమతమయ్యుష్టదై, వాభిధానంబుల నమరియుంట

జనవేద్యమే కాదె సకలవిధంబుల, నా వేల్పువరయంగ నీవె కాన
భవదీయనామసంప్రాప్తగానను( జేసి, యవనివర్ధిల( జేయుమనినబసవ(
గీ. డఖిలశరణవరులయాననంబులుగాంచి
నవ్వుచూరకున్న నగళరాన
భక్తులతనిభావపద్ధతి బసవయ
టంచు నామమిడిరి యబలకపుడు. 248
మ. అతిలీలావతియై ధరంబర(గునయ్యంభోజపత్రేక్షణాం
చితశోభాకలనాభిరూప్యవిలసచ్ఛృంగారముల్ గాంచి య
ద్భుతమొప్పన్ వడిమిండజంగమవరుల్ పుష్పాంబకోద్యచ్ఛరా
తతవైశ్వానరహేతికానిచయసంతప్తాత్మచేతస్కులై. 249
ఉ. అంగజకేళి దేల న్హృదయంబులగోరినవారి వాంఛితం
బంగద కూర్ప(బూని బసవాధిపు( డాజలజాక్షి( బిల్చి యీ
జంగమమూర్తులన్ కుసుమసాయకక్రీడలలోన నేలుపొ
మ్మంగనయన్న మొక్కి జలజాసితవేణి రచించెనీగతిన్. 250
క. క్షితితలముననొకసతికొక, పతియుండినయోగ్యమగుచు భాసిలుగాకే
గతిదల(ప నొక్కయువతికి, పతిబాహుళ్యంబుయుక్తపద్ధతియగునే.
క. మితిలేనిజంగమావళి, మతివాంఛలు దీర్ప(గా సమర్థనెనాకీ
గతికల్పింపక కరుణో,న్నతిచే మీదానిచేసినను( బ్రోవ(గదే. 252
చ. అన బసవేశు( డిట్లనియె నంబుజపత్రవిశాలనేత్ర యి
ట్లన( బనిలేదు భక్తనివహమ్ములు( గామసుఖాభిలాషలిం
పెనయగ(దీర్ప నిన్ను సృజియించె శివుండటుగాన చింతలం
జనకుమదీయ సత్కరుణ సత్త్వసమర్థత గల్గునీకి(కన్. 253
గీ. పొమ్ము వారియధీనవుగమ్ము నిన్ను
గ్రమ్ముకలుషమ్ములను విడ(జిమ్ము మదిని
నమ్ము నామాట మేలుచేకొమ్ము సుస్థి
రమ్ముగనుముక్తిదొరకు నిజమ్ము సుమ్ము. 254
చ. అని నవలా నొడంబఱచి యాత్మలనువ్విళులూరుమిండభ
క్తనిచయము న్ముదంబలర( గన్గొనిమీరలు వేడ్కనీశుభా
ననవలనన్మనోబ్జముల నాటినకోరికలెల్ల దీర్చికొం

డని యనుపఁగ వడిం జనిరి యంగన దోడ్కొని వారలందఱున్. 25

క. ఈకరణివారలేగ కృ
పాకరుఁ డగుబసవమంత్రి యద్భుతమహిమం
బాకాంక్షం గొనియాడుచుఁ
బ్రాకటమహిమాఢ్యమాదిరాజప్రముఖుల్. 25

గీ. నాగమాంబాపలోక హర్షాత్ము లగుచు
యంతిపురికి వేగ నరుగువారి
నమ్మృగాక్షి చూచి హర్షంబుసద్భక్తి
దొలుకవందనములు సలుపునంత. 25

క. వనజాక్షి భక్తివైరాగ్య నియమమాహాత్మ్యనిష్ఠ లాత్మలకుముదం
బొనరింప బెక్కువిధులం,వినుతింపుచునొక్కహర్మ్య విమలతలమునన్.

చ. బసవనితో సమస్తశివభక్తనికాయమతిప్రమోదహృ
ద్బిసరుహయుక్తమై మహిమ పెంపెసఁగన్ సభదీర్చియుండె నిం
పెసఁగ హిమావనీధర సుతేశ్వరసంగతమై నిరంతరో
ల్లసనమునొందు నాప్రమథులంబురణించి విలాససంపదన్. 25

వ. అని చెప్పిన కుంభసంభవుం డవ్వలి కథ యెఱింగింపు మనుటయు. 26

మ. మిహికాహార్యసమానధైర్య మధురామేయాబ్జసౌందర్యపూ
ర్వహరిద్రాజితధైర్య శౌర్యఘనపారావారగాంభీర్యదు
స్సహ తేజోజితసూర్య భాసురమనీషా దేవతాచార్య వే
దహయాంఘ్రిద్వయసంతతార్చనకళాతాత్పర్యవీర్యోన్నతా. 26

క. లబ్ధనికాయవిదూరా!, యబ్ధిసమగభీరవైరిహరణవిచారా!
లబశివాచారా! ప్రారబ్ధసుకృతభవశరీర! రమ్యాకారా! 26

తోటకవృత్తము. శ్రీకరబంధువశీకరచర్యా, ప్రాకటభూపరిపాలనధుర్యా!
లోకనుతేశశిలోచ్చయధైర్యా,భీకరశత్రువిభేదనశౌర్యా. 26

గద్య. ఇది శ్రీమ చ్చెన్నమల్లికార్జునకరుణాకటాక్షలబ్ధకవితామాధు
ధురీణ కాశికగోత్రపవిత్రకవిజనస్తుత్య పాపయామాత్యప్రణీతం బై
చెన్నబసవపురాణంబనుమహాప్రబంధంబునందు ప్రథమాశ్వాసము



శ్రీ ర స్తు.

# ద్వి తీ యా శ్వా స ము.



మద్భ్రమరాంబా హృ
త్తామరసవిహారషట్పదన్మల్లేశ
స్వామికృపాలబ్ధశుభ
స్తోమా శ్రీయమృతలింగశోభననామా. 1

వ. అవధరింపు మయ్యగస్త్యమునీంద్రునకు రేణుకగణాధీశ్వరుండు తరు
వాతివృత్తాంతం బిట్లని చెప్పందొణంగె. 2

చ. అటువసియించు భక్తనిచయంబులు జంగమసత్ప్రసాదవి
స్ఫుటమహిమల్ వినం దివిరి భూరథమూర్తి దిగంతపూరితో
త్కటనిజకీర్తియై వెలసి ధన్యతఁ జెందినమాదిరాజుహృ
జ్జటిలమదంబునంగని రసస్ఫురితోక్తులఁబల్కె నీగతిన్. 3

మ. అనఘా శైవరహస్యముల్ భవదభివ్యక్తంబులై యుండుఁ గా
వున శ్రీజంగమసత్ప్రసాదమహిమంబుల్ దెల్పి రక్షింపవే
యన నాథన్యుఁడు మున్నుమీకరుణ నాద్యంబై నభక్తాళిచే
వినినట్లేనచియింతు నంచుఁబలికెఁ విస్పష్టమౌనట్లుగాన్. 4

గీ. అమృతసంధాయకంబయియుప్పరసప్ర, పూర్ణమైమత్తసారంగకీర్ణమైచ
రన్మరుద్వారగంధర్వరాజమగుచు,నతిశయిల్లెశ్రీజీమూతమవనియందు.

వ. తద్గిరీంద్రంబున. 6

మ. అకలంకోజ్జ్వలమల్లికార్జుననుతివ్యాహారయుక్శారికా
శుకముఖ్యాండజనాథసంశ్రుతిముదస్తోకప్రరోమాంచకం
చుక దేవర్షి నివాస దేశవిలసచ్ఛోభాపహాచ్ఛాయద
ప్రకటామ్లాదిమహీజమాకదళికారణ్యంబునం దొక్కచోన్. 7

### గంధర్వునికథ.

క. కమలాధివాసవిలస, త్కమలాసవపాయిభసలకమనీయంబై
కమలీకకిరణశీతల, కమలంబగు నొక్క కొలను గడు వెలుఁగొందున్.
క. తత్తీరంబున గంధ, ర్వోత్తముఁడచలుండునై మహోక్షతురంగుం
జిత్తమున సందిడి సురముని, సత్తములగ్గింపతపము సల్పుచునుండెన్. 9
ఉ. అంతటనొక్కనాఁడు సిటలాక్షపదార్చకులాజవంజవ
భ్రాంతివిదూరులంతరచరద్రిపుదూరులు యోగమార్గవి
శ్రాంతులుపంచవర్ణమనుజాధిపమూర్తులు నైనశాంతుఁ డే
కాంతుఁడనంగ నిద్దరుమహాత్ములు శ్రీగిరి సంచరించుచున్. 10
గీ. అచటిజంగమదివ్యగేహంబులందు
మాధుకరభిక్షఁగొని శివారాధనంబుఁ
జేసి భుజియింతమనుచు విలాసమలర
తత్సరోవరతీరంబు దరియనేగె. 11
సీ. విమలమానొకచోఁ బ్రవేశించి తద్భక్త,మంబులగడిగి పాత్రంబులందు
నించియోంకారయుక్పంచాక్షరీమంత్ర, పూజితలోపేతభూతిఁజల్లి
ఇష్టలింగార్చన నెలమితోనొనరించి, యర్పితంబగుతన్మహాప్రసాద
మొదటికడికడికగపరచుచుభుజియిం,పుచులింగయోగవిస్ఫూర్తినున్న
గీ. వారలనుదత్సమీపనివాసమందు
తపముసల్పుచునున్న గంధర్వవిభుఁడు
వీక్షణముచేసితచ్చర్య వెగటుదోఁప
నిట్టులనిపల్కె నజ్ఞానహృదయుఁడగుచు. 12
చ. శివుధరియించి సంతతము శ్రీవరబాణుని బూన్చి యాత్మసం
భవుహరుఁజిత్తమందునిడి ఫాలవిలోచనలాంఛనంబులే
యపిరశభక్తిఁదాల్చి ఘనులౌననవర్తిలుమీరలీగతిఁ
సవనవిరోధికెంగిలిప్రసాదము కొంకకయుచ్చుటొప్పునే. 13
క. నరులెవ్వారైన మీగతి, హరునకు నిటుభక్తశేష మర్పించుట యీ
ధరణీతలమునగలదే, దురితాత్మకులారయనుచు దూషించుటయున్.
మ. వినికోపజ్వలనావృతాత్ముఁడగుచుఁ వేగంబగంధర్వునిం
గని మో[illegible]ప్రసాద మెఱుఁగంగా లేక యుచ్ఛిష్టభా

వనదూషించితిగాన నీయఘము పోవంజాలఁ దేవెంటనీ
ఘనతేజంబఱ గ్రామసూకరవుమై నైకొమ్ము పొమ్మింకిటన్. 15

చ. అనవుడుభీతినొంది వినయంబుననిట్లను గేలుమోడ్చి రో
యనఘతరాత్ములార తెలియంగనకేమిమునాడినట్టిదు
ర్వినయవచోఫలం బనుభవింపకతీరునె యింకశాపమో
చనమెటులయ్యెడుం దెలిపి సంతస మందఁగఁజేయ రేయనన్. 16

ఉ. కోపముమాని యిట్లనిరి కొన్నిదినంబులు ధారుణీస్థలిం
బ్రాపితపోత్రిరూపమున పర్యటనంబొనరింపుచుండి రు
ద్రాపరమూర్తియైనశరణాగ్రణిడించుప్రసాద సేవఁద
చ్ఛాపమువీడిహేమగిరిచాపుని ప్రాపునఁ జేరెదట్లనన్. 17

గీ. అమృతసంపాదనంబు ఘోరాఘమోచ, నాదికారణమైనదివ్యప్రసాద
మేవగింపఁగవచ్చినయేనమితర,గతిఁ జెడదుతత్ప్రసాదభోగమునఁగాని.

క. అనిజంగమవరులానఁగిన,ఘనశాపాక్రాంతుఁడగుచుగంధర్వుఁడుశో
భనసిజరూపముఁగోల్పడి, కొనియెందతక్షణమగ్రామకోలంబగుచున్.

చ. గొరగొర లాడుచుంబుడమి గ్రుచ్చుచుబల్విరతోడ నోరగాఁ
బిరిఁదికిఁజూచుచుం గడువువేగునవంకరగాఁగ బోవుచుం
గరకరపండ్లుగీటుచు నెగంబడిముట్టెను తుంగముస్తెలం
దెరలిచిమేయుచుం బాదలతీఁగలడాగుచు నేగెజాగునన్. 20

క. ఈకరణింజనిచనియా, సూకరమూరూరదిరుగుచుంజనుచునుశో
భాకలనధరిత్రిలన, న్నాకంబగువిజయవాటినగరముచేరెన్. 21

గీ. ఆపురంబున నెపుడుండు కాపురంబు
మొలుకకులమునజనియించుఁ బెరుకుపుండ్ర
పామరుండనఁ గలఁ డొకపామరుండు
సకలకల్మసుగుణరాశి సత్యరాశి. 22

వ. వానియాలు బండంగి యనునది. 23

బండంగికథ.

సీ. సందెజెంగినదొంగ సాఁపెనగొట్టు పి,సాసిదిమ్మరిజెరజముబటాని
తచ్చునగొండిపోతరకత్తెకల్లరి, వల్లింతమాయలబెల్లికటికి

నక్కచిక్కులమారి పెక్కుఱురూపిదూ, బరదిండిబొంకులచాన మొండి
బొజుఁగులాఁడిలడారి బిల్లిపల్లాకిజూ, దరియుబ్బెరాసిగాతలకోటారు

గీ. మగనికంటినెరుసు వగలాఁడిశివసత్తి
బలుగయాళిపోరుగుపాలిజాలి
మందులాఁడిచెడుగుమానిసిబూతంబు
పిసిఁడిబిచ్చగాండ్ల వెన్నుగుదియ. 24

గీ. అట్టివారి యింట నఱుతగానున్నట్టి
పెరటిపంచలోన గురుకులిడుచు
నచటనచటఁ దిరిగి యులవందియులవంది
పండియున్నపుంద్రసామరుండు. 25

చ. కనిసతిఁ బిల్చి యిక్కటిని కామిని చూచితె యెన్నడిప్పురిఁ
గనుగొను పందిగా దిది దినంబును గంజియుఁగాటవోసి పెం
చిననిటనుండు నంచుఁ బతి చెప్పిన సంతసమందిదాని నొ
య్యనఁదరిఁజేరబిల్చి పులియంబలియించుకవోసె మాకుటన్. 26

గీ. అంబకళిముద్రావి యది మొదలావంది
యెచటికరుగఁబోక యెఱుకునింట
గంజికడుగుచేత కడుపునింపుచుఁ గొంత
కాలముండె జాతిగతులనంత. 27

సీ. శివరాత్రికతిభక్తి శ్రీశైల వల్లభుఁ, గను వేడ్కవృద్ధజంగమ మొకండు
చనిచని బెజవాడ సాయంతనమునకుఁ, జేరి పేరాఁకటిచిచ్చుచేతఁ
బడలేకభిక్షకై భవభక్తభవనంబు, లెచ్చోటఁగలవనివచ్చివచ్చి
యెఱుఁగజాలకయిదికకకంతుభక్తమం, దిరమనిపుంద్రసామరునియిం[టి

గీ. కరిగి తద్ద్వారదేశమునందు నిల్చి
ఘంటవాయించితోడ శంఖంబునొత్తి
భిక్ష యనవుడు బండంగి వినియడంప
రానికోపంబునను మందిరంబు వెడలి. 28

సీ. కనుగొనె వళులఁ గ్రమ్మిన మేను వ్రాలిన

కనుబొమల్ లోతులౌ కనులదోయి

వణఁకెడుశిరమును బెణఁకెడు గమనంబు
భగ్నదంతావళిపక్కకంతి
చొల్లుగారెడు నోరు తెల్లనిగడ్డంబు
తెగనిశ్లేష్మంబు చేదగులుమాట
వెన్నంటుడొక్కయు సన్నపుఁజేగోల
పొడిదగ్గుకాకిచూపులును మఱియు

గీ. జడలుకట్టు పాలగొడుగుఁజీర్ణపుగంద
చెవులతగులుబడఁగవూడుగోచి
యదను శివునిసెజ్జ రుదురాకలునుబూది
యమరుముసలిజంగమయ్యనపుడు. 29

చ. కనుగొనఁడాయ వచ్చి శునకంబువిధంబున కక్కరించియి
ట్లనుననునొంటినుంటగనియద్దమరాతిరి కాఁడబిచ్చముం
గొనునెపమూని వేఱొకటి గోరిటు వచ్చినజాడఁదోఁచె నా
పెనిమిటిఁ గన్ననిన్నిడుమ బెట్టక యూరకపోవనిచ్చునే. 30

ఉ. కల్లరులైనయాపొరుగుకాంతలెఱింగినగేలి సేయుచుం
దొల్లిటివైరమెంచిపతితో వినుపింపక పోవరంతతో
చెల్లునునాదుకాపురము చిక్కననీకునుభంగపాటగుం
దెల్లముగాఁగ నింక నిటద్రిమ్మరఁ గూడదుపొమ్ము క్రమ్మరన్. 31

క. అనియదియాడినమాటలు,వినిజంగమమూర్తిమదికివెగటుగఁదోఁపఁ
గనలిశివాయునికర్ణము, లనుకరములఁ జేర్చిచదికిలంబడియనియెన్.

ఉ. అక్కటయిట్టులాఁడ దగునమ్మయనర్హతకామచారియా
తెక్కలికానినాఁడు వగిద్రి సిరిగట్టునివాసుగొల్వపె
న్మక్కువ నేగుచోజనసమాజము గూఁడఁగ లేకనాకల
జిక్కటచేతఁ భిక్షకయిచేరితి నీగృహసీమ కోమలీ. 33

ఉ. కాలము సర్వముంగడచి కార్శ్యము మేనునఁజెందివృద్ధునై
కాలుకదల్పలేనినను కామపికారివటన్న నవ్వరే
యేలప్రధాకులాపముల నేచఁగబిచ్చము తెచ్చిపెట్టినం
జాలు మరేమియున్ వలదునావుడు కోపముతోడ నిట్లనున్. 34

క. ముదిమదిదప్పెనో పైత్యము
గదిరెనో యటుగాకయు మెతకాయ నమలితో
మదనారిభక్తవర్యుల
సదనములకుఁగాక యిటకుఁ జనుదేనగునే. 35

వ. అనిన నతం డిట్లనియె. 36

గీ. నెలఁత నీవను మాటయే నిజముగాని
మాకు గలదొక్కవ్రత మేరి మందిరమున
మునువు వేఁడితి నచటన గొనఁ గవలయు
గాన తగుభిక్ష పెట్టుము గడప వలదు. 37

క. నావుడు కామిని యిట్లను, మావంగడమందు జంగమములకు బిచ్చం
బావంత బెట్టనొప్పదు, నీ వెఱ్ఱితనంబు మాని నిలువక చనుమా. 38

గీ. అనిన జంగమయ్య యనియె తొల్లిటివారి, చర్యలెల్ల సూరసాని మొదలు
శైవవరులు పూజనేయుటచే గాదె, యిహపరార్థసిద్ధులెల్ల గనిరి. 39

క. కావున జంగమవర్యుల, సేవించుటవలనఁ గీడు చెందుట గలదే
కేవలపాపపువాక్యము, లీవిధి జను లెవ్వరైన నిలననఁ గలరే. 40

చ. అని విని క్రోధఘూర్ణితనిజాననయై శివసత్త్రికై వడిఁ
విన వెగటైన పల్కు లివియే యన నేటికి వారిచాట్పునన్
ఘనమున కొల్చుగాది యులగల్గిన వారము గాము మిన్నకే
చనుమిఁక నిల్చితేని పెలుచన్ నినుగొట్టక మాన గట్టిగన్. 41

గీ. ఆఁకటను బోవజాల వేయంగడింట, గంటతాకట్టుగా నుంచి కడుపునిండ
గుడుపుమిచ్చుట నీడ్గిలబడి తెలారు, దాఁకనోరలిన గలుగదు తథ్యమునిన

చ. అడిగిన చోట భిక్షఁ గొనునట్టి వ్రతంబున నొండుచోటనే
నడుగఁగఁబోదు నేతగిన యట్టు లొసంగక పోవరాదనన్
చెడుఁగు పిసాసి బల్గుదియ చేకొని జంగమ పొమ్మటంచు బె
న్వడిఁగదియంగఁ బోవు తరినాతి మొగం జరుదెంచి చెచ్చెరన్. 43

ఉ. కోమలి యేల భిక్షుకుని గొట్టఁగఁ బోయెదవన్న నాథుతోఁ
గామిని పల్కునట్టి తరిగాదని నన్విన బోక భిక్షుకై
గాము తెరంగుసన్ దగిలెఁ గావునఁ గొట్టక మాననన్న న

ప్పామరుఁ డాలితో నిటులఁ బల్కెదయాసమవేతచిత్తుఁడై. 44

గీ వృద్ధువేళగానివేళ నాఁకటడస్సి, వచ్చినాఁడఁగాన వలదు గడుప
కలుగుకొలఁది పెట్టుమలుక యేమిటికిటు, లనినవిభునిపల్కులరుచిదోఁప.

ఉ. ఈనడుపీనుఁగెక్కడ మఱెవ్వరిఁ గానకవచ్చెనంచుఁగో
పాననయాచ నెక్కడివ్యయం బరుదెంచెనటంచునాథులో
లోనగొనంగి తిట్టుచువిలోలత దోఁచక సంచరించుచుం
దా నిటుకొంత ప్రొద్దుఁగడు తల్లడ మందియొకింత కిన్కతోన్. 16

గీ. తనదుప్రాతమగఁడు మనిన నాఁడొకమూల
దొంతికుండలోనదొంగతనము
దనరడాచినట్టితమి దెపిండియొకంత
పెట్టిపొమ్మటన్న భిక్షుకుండు. 47

సీ. అఖిలంబు నెఱుఁగ 'క్షుధాతురాణాంనరు
చిర్నపక్వం' బనఁ జెల్లుఁగాన
నాఁకటిపెల్లున నప్పిండియంతయు
నతివేగమునఁ గొసియాత్మలింగ
మునకు నివేదనం బొనరించి యించుక
యారగింపం బొడియగుటకుతుక
కడ్డమైయువ్వలికరుగక యున్ననూ
ర్పెడలమి గేల నెత్తడచి కొనుచు

గీ. డిల్లపడియిలపై బోరగిల్లికొంత
తడవునకు లేచి కూర్చుండి దరిననిల్చు
నెఱుకుజవరాలిఁ గనుగొనిమెలుఁగురాక
సన్నముగ నిట్టు లనిఘోతజ్జంగముండు. 48

క. కనుగొనిన మదికసహ్యత, దనిపెడియీపాత్ర సున్నితగనాకైడా
చినదానవెచాలునుమా, యనిమిగిలిన దచటనునిచియతఁడేగవెసన్.

చ. అనఘతరాత్ముఁ డిట్లరుగ నంతటనక్కలుపాత్మయాప్తులై
తనరెడికాంతలంబిలచి తామరసాయత నేత్రులారనా
పెనిమిటినేయుదుండుఁగము వింటిరె తానొక పెద్దదాతనం
చును గృహమెల్లఁ పారడి చెదర్చ దలపోసె వివేకహీనుఁడై. 50

ఉ. ఎక్కడనుండి వచ్చెనొకొ యీముదిజంగము వానిమాయలో

జిక్కితరాలనుండి యొకచీమకు బోవఁగ నీక డాచు నా
చక్కనిపిండినగ్గదిమి సర్వము బెట్టఁగఁబంచె యింక నే
నెక్కరణి న్వసింతు మరులెత్తి వ్యయం బొనరించు వీనితోన్. 51

క. అప్పిండియు పులగముపై, పప్పగతిన్ సైప కతఁడు పారఁగఁజల్లెన్
తప్పొనరించితి నెచటనొ, తప్పదనినవానిమీఁద దయ దలుపుదురే.

గీ. ఏననేకపతులనెనసి కాపురముంటెఁ, గానియింత బెరుకువాని నెఱుఁగ
జంగమయ్యతోడజరుపుకాపురముదా, నింకననుచునువిదయిల్లువెడలె.

ఉ. తోడనయేగి పామరుఁడు తొయ్యలిఁజక్కఁగఁబట్టినాతిని
స్వీడిని మేషమేనియును నేవసియింపఁగనేర యిట్టులం
గూడునె నాపయిం బెలుచఁ గోపము సేయక తప్పుసైచి ర
మ్మేడకుఁ బోయెదంచుఁ దనయింటికి దోట్కొనివచ్చె క్రమ్మరన్. 54

చ. అటుచనుదెంచుమర్త్యు తపసి యచ్చటడించు ప్రసాదమవ్వడ
క్కిటి భుజియింపఁగాంచి కడుఁ గేరుచు సొమ్మున సొమ్మఁ జెందె మే
లిటు వసియింపఁగా వలువదేమన భాగ్యములంచు నత్తరిన్
దటుకొన నిల్లుఁజొచ్చి ప్రమదంబున నిద్దురఁజెంది రిద్దరున్. 55

గీ. అంత నప్పార్తిభక్తినిశాంతజంగ, మ ప్రసాదోపభోగసన్మహిమవలన
విమలసుజ్ఞానమాత్మఁబర్వినగిరీశ, భక్తులిచ్చినశాపంబు వాసె ననుచు.

వ. ప్రమోదంబునొంది యప్పుడ దేహంబు విడనాడి గంధర్వరూపంబు వహించి ఈశ్వరపదంబు నొందం దలంచియు నంతలోన తన మనంబున. 57

గీ. ఇక్కిరాతవర్య నింటనుంచుట సుఖ, నైతి సత్ప్రసాదమబ్బె శాప
ముజ్జగింపగంటి నొక్క మేలైన నీ, తనికి కూర్పకున్న తప్పుగాదె. 58

క. కావున ప్రత్యుపకారము, గావించినపిదప ముక్తికై కొనదగు నే
నేవిధి నంతటిదాఁక, భూవలయమునందు నిల్తుఁ బొల్త్యాకృతిచేన్.

వ. అని తలంచి యచ్చట వాసి చని యొక్కశివాలయప్రాంతంబున నిజ జన్మవర్తనంబులు మాని యీశ్వరపదధ్యానం బొనరింపుచు నుండె నిచట. 60

క. తెలవారుటయు కిరాతుం, డలసతి మేల్కాంచి యాలయప్రాంగణభూ
తలమున కిటిగానక మది, గలవలపుం దుచుచు దుర్గ్రకా రాకృతులై.

గీ. పెఱడు నిరుగు పొరుగు మఱి వాడవాడలు
పురము బయలు వెదకి సరవిపంది
గనక ముసలి జంగమయ్య గైకొనిపోవ
వలయు నింత నిక్కసంబు దలఁప. 62

గీ. బత్తుఁడని వచ్చి యెంతటి కెత్తుకొనియె
బడుగు జంగము కూళుఁడు కుడుచునింటి
కెగ్గుచేసిన దుష్కర్మి కేటిగతియొ
యనుచుఁ జింతించి యటకొన్ని దినము లరుగ. 63

క. శరవికసనంబు నిర్మల, శరసరసీభాస్వదబ్జసముదయమగు నా
శరదాగమమున మాధవ, శరదేవ్యర్చాదినములు చనుదే సంతన్.

క. నిండినవేడుక ధరణీ, మండలపతి చండికకు సమర్పణసేయన్
పండుగ వేటలు వేగొని, తెండని తలవరులఁబంపెఁ దృఢగతి వారల్.

చ. పురిగలచోటుల న్వెదకి పూర్వ మొసంగెటిచోట్ల మేషకా
సరకిటితామ్రచూడములఁ జయ్యన గైకొని యంత పుండ్రపా
మరుగని యోరిపామర యుమాసతి పండువుగాన నీదుమం
దిరమున నిచ్చవచ్చు కిటిదెమ్మురయమ్మున నాతఁ డయ్యెడన్. 66

క. మందిరమున వసియించెడి, పంది యెటకొ తప్పి చనియెపండువుకీక నే
చందమునఁ దెత్తునని డో, లాందోళనచిత్తుఁడగుచు నతఁడుండుతరిన్.

చ. వనజశిలీముఖాంతకనివాసమున న్వసియించెసూకరం
బని యొకరుండు దెల్పిన రయంబున నచ్చటి కేగి దానిబం
ధన మొనరించి తెచ్చి నరనాథుని సన్నిధినుంచి చెంచుదా
జనిసతదీయపోత్రిగని సమ్మదమొందె మహీశుఁడంతటన్. 68

క. ఎవ్వరు గొట్టఁగఁ జనఁగ, గ్రొవ్వినకిటిఁ బట్టినేన కొట్టెదననిచే
రివ్వునసిగొని వ్రేసిన, యవ్వరఖడ్గంబు భస్మమై కనుపట్టెన్. 69

మ. నరనాథుం డతివిస్మయాన్వితమనోనాళీకుఁడై మంత్రి శే
ఖరు గావించి విచిత్రమయ్యెడు కిటిం గన్గొమ్ము ఖడ్గంబు బం
గరువై కన్పడె దీనిపోకి యిటులోకంబందునం గంటిమే
కరిమాత్రం బని చూడరాదనుచు లెక్కింపంగ నమ్మంత్రియున్. 70

క. అరుదందిదేశమున నిజ, పురమునఁగల యినుము దెచ్చి పోత్రివరకళే

బరముదగిల్చినచామీా, కరమై ధీయెకపర్వతంబు కైపడినుంజెన్. 71

వ. అంతట దద్గ్రామవరాహం బాత్మశరీరంబు వీడుకొని గంధర్వుండై తత్సమయాగతభర్మరత్నాంచితదివ్యవిమానం బధిరోహించి జంగమప్రసాదోపభోగంబునం జేసి శాపమోచనం బందితి సుఖనై.తి నని సంతసింపుచు శివపురి కరిగె. తత్కోలాంగంబతివిమలశాతకుంభంబై వెలుఁగుచుండె నంతయుం గని రాజపురందరుండు విస్మయం బంది యయ్యాటవికు రావించి నీకీవరాహం బెట్లు దొరికెనని యడిగిన వాఁ డి ట్లనియె. 72

సీ. నరనాథ విను మొకనాఁడు మాగృహమున
కెచ్చోటనుండియో యేగుదెంచి
గంజికడుగు ద్రావి కదలకయున్నంత
కొంతకాలమునకు కుధరభక్తి
భజియింపఁ బోవుచు బహుగుజంగముఁ డొక
డద్దమరేయి మాయాలయమున
కశనార్థియైచేర నతని కించుకచోడ
సున్ని వెట్టిన నదిచొరక కొంత

గీ. డించిచన నది యుక్కిటిగాంచినమలె
నదియ మొదలిల్లువెడలి శివాంగణమున
నున్నయాజాడదెలసినేఁడుత్సవమున
కీశ్వరికిప్రీతిగాఁదెచ్చితిటకుననుడు. 73

పంచచామరము. రసాతలాధినాథుఁ డబ్బురంబు నొంది జంగమ
ప్రసాదసన్మహత్త్వమెంచ పంకజాతసూతికిౕ
వసంబెఱుంచు సన్నుతించి వస్త్రభూషణాదివ
స్తుసంతతి న్ముదం బొనర్చి తోలెచెంచు నంతటన్. 74

వ. ఇట్లయ్యవనీశ్వరుచేత బహుమానాన్వితుం డై శబరాన్వయభూషణుం డాత్మగతంబున నిప్పందివలనం గాదె రాజు మెప్పంది రాజు లెక్కలేనిధనంపుకుప్పం దిలకింపఁగంటి మత్పూర్వజన్మసుకృతఫలం బివ్వరాహరూపంబై వచ్చి నాయింట కష్టంబున కోర్చియుండి యంతంబున నన్నుం గృతార్థునింజేసి యిట్టిసంతోషం బొసంగెఁ గాన దీనికి సంతి

సంభోనగూర్చి తనువు వీడ్కొని చనియెం గాని కేవలసాకారంబుగా
దని ప్రమోదంబు నొందుచు నిజగృహంబున కరుగునవసరంబున.

చ. సిరిమల రేనిగాంచినిజసీమకుఁ గ్రమ్మఱఁ బోవునట్టియా
శరణునిరథ్యగన్గొని ససంభ్రముఁడై శబరుండువచ్చిభూ
వరునకు మ్రొక్కి నాటిగణవర్యుఁ డిదే చనుదెంచెనన్న ను
స్థిరతరసమ్మదాంబునిధిఁ దేలిమహీతలనాథుఁ డయ్యెడన్. 76

శా. ధీరామాత్యులఁబంచి జంగముని దోడ్తెప్పించిమాణిక్య పీ
ఠారూఢుందగఁజేసి యర్ఘ్యమును పాద్యంబిచ్చి శశ్వన్నమ
స్కారవ్రాతమునన్నుతుల్ సలిపి లోకస్తుత్యప్రాంచత్కృపన్
మీరిచ్చోటికి వచ్చుట న్మిగుల నెమ్మిం జెందె మాభాగ్యముల్. 77

శా. స్వామీ తావకభుక్తశేషము భుజించం గల్గి కోలంబయు
స్నామగ్రింగనకం బొనర్చిపిదపన్ సద్రూపగంధర్వుఁడై
హేమస్ఫారవిమానమెక్కి సురవామానీశాదులగ్గింపఁగా
సోమార్ధాంకితజూటుపీఠికరిగెన్ చోద్యంబు రెట్టింపఁగన్. 78

ఉ. కావున నీమహామహిమ గన్గొనశక్యమె యంచునెంచున
భ్భూవరువాక్యము ల్వినయపూర్వదయారస ముప్పతిల్లఁగా
భావజవైరితుల్యుఁ డగుభక్తవరేణ్యుఁడు వల్కెనోర నీ
భావముగానన య్యెఁ గులపావనమూర్తివిరాజశేఖరా. 79

క. భువిజంగమప్రసాదము, భవరోగౌషధముగాన పార్థివనీకే
వివరింతుదన్మహత్త్వము,ప్రవిమలమతివినుమటంచుఁబలుకఁదొడంగెన్,

చ. కలఁ డొకభక్తుఁ డబ్జశరఘస్మరపాదపయోజషట్పదుం
డలఘుతరప్రభావుఁ డతఁ డక్కడ నక్కడ శైవమందిరం
బులఁ దగుభిక్షమెత్తి జలపూర్ణతటాకసమీపధారుణీ
తలమునఁ జేరియచ్చట సుధాకరశేఖరుపూజసల్పుచున్. 81

గీ. తత్ప్రసాదంబు భోజనాంతరమునందు
నుంచి లింగార్పితంబు గావించియార
గించి యాభాజనం బప్డుగెడతటాక
జలములోవైచి చరమూర్తి చసిన యంత. 82

వ. అట్లు వీటన్వైచినతరియుం దొక్కకణంబుండి రాలిన. 83

చ. అతులితపూర్వజన్మసుకృతాతిశయంబున తజ్జలాంతర
స్థితశరణప్రసాదమతితీవ్రతనొక్కఝషంబు మ్రింగిన
ర్ణితనుషమాంగమై యచట చరించుచునుండిన గొన్నినాళ్లక
ద్భుతముగ చెంచొకండడవిదూరపువేఁటల కేగివచ్చుచోన్. 84

క. చెరువుననీరముఁగనుగొని, తరుచుగఁగలవిచట మీలుతథ్యమనుచున
య్యెరుకపుఁడుసంతసంబున, మెరయుచువలవైచితిగిచెమక్కువతోడన్.

గీ. జాలమునఁ జిక్కవచ్చిన మీలతోడ
సత్ప్రసాదోపభోగిఝషంబుదగుల
గాంచిసంతసమున మెయివెంచి చెంచు
చిక్కమునవైచి కొనిగృహసీమకరిగి. 86

చ. తనసతిఁ జేరబిల్చి వనితా యిది చూచితె మంచిచాయమీ
న్గొనిచనుదెంచినాఁడ యిది గొబ్బున గూరగవండి తెమ్ము నీ
వనవుడు నట్లచేసి యది యన్నము రెట్టిగ తట్టఁబెట్టినం
దినెశబరాన్వయోద్భవుఁడు తేపకు తద్రుచు లుగ్గడింపుచున్. 87

చ. అదిమొదలాకిరాతపతి యందఱు మేలన హింససేయుటల్
వదలిగిరీశ్వరాంఘ్రులు దలంచుచు నెమ్మది నుండినంత కొ
న్నిదినములేగ భీకరవనీకిటియొక్కటిపక్కణంబులో
మదమునఁజొచ్చి యందుఁగలమానవులంగలగుండు సేయుచున్. 88

క. చనుదెంచియాశబరుఁగ, న్గొనివడి దంష్ట్రావిటంక కోటినబడఁజి
మ్మినవిగతజీవుఁడైయు, య్యనఘుఁడు భువినొరగె వజ్రహతగిరివోలెన్.

ఉ. వానిపరేతరాజభటవర్గము నారకబాధఁ జేయఁగాఁ
బూని కఠోరచర్య గొనిపోవఁగ వచ్చిన నీశదూతలో
హో నిలువుం డితండు మహిమోన్నతజంగమసత్ప్రసాదభు
జ్మనచరప్రభావమున మేలగుపుణ్యశరీరిగావునన్. 90

చ. యమనిలయంబుఁ జేరఁగ ననర్హుఁడుపొండని కల్పభూజసూ
నమయవిమాన మాతనిమనఃప్రమదంబున నెక్కఁబంచిది
వ్యమునులుసన్నుతింప ప్రమథాధిపలోకముఁ జేర్పనాతఁడం
దమితసుఖానుభూతిఁ గనియుంచితలీలవసించె గావునన్. 91

క. శరణప్రసాదమహిమము
ధరణీశ్వరయిట్టిదని ముదం బిగురొత్తన్
చరమూర్తి తన్మహత్వము
దిరముగఁ దెలుపుటయు వసుమతీపతియంతన్. 92

ఉ. క్రమ్మఱ మ్రొక్కి యోశరణరత్నమజంగమసత్ప్రసాదసౌ
ఖ్యమ్మొనగూర్చినన్విమల కాయునిఁ జేయుమటన్నమందహా
సమ్మొగురొత్తనిట్లనియె శాంకరవంశసుధాబ్ధిరాజునీ
కెమ్మెయి తద్విభూతి ధరణీశ్వర కల్గఁగ నేర్చుచెప్పుమా. 93

గీ. భస్మరుద్రాక్షధారియై పంచవర్ణ
మంత్రపఠనం బొనర్చుచు మహితనిష్ఠ
లింగమునుదాల్చి గురుభక్తిసంగుఁడైనఁ
గాక దివ్యప్రసాదంబు గలుగునెట్లు. 94

చ. అనుఁడు మహీశుఁ డిట్లనియె నయ్యతదీయ మహత్త్వముల్ క్రమం
బున నెఱింగింపు నావుడు విభూతిమహామహిమంబు దెల్పెదన్
వినుము వసుంధరారమణ నిశ్చలచిత్తముతోడనంచు
నయ్యనఘుఁడు చెప్పఁగాఁదొడఁగె నాత్మదయారసముప్పతిల్లఁగన్.

-- విభూతిమహిమ. --

సీ. ఉడురాజధరుపశ్చిమోత్తరదక్షిణ
పూర్వాభిముఖములఁ బుట్టెపింగ
శాసితధవళధూమ్రారుణవర్ణంబు
లనునందభద్రసురభినుశీల
సుమనయన్నామభేదములగోవులువాని
వలన విభూతియు భసితభస్మ
ములుక్షారరక్షలు జనియించె నభ్భూతి
గావించు నట్టిమార్గములు నాల్గు

గీ. గలవు కల్పానుకల్పోపకల్పములను
కల్పమును నన నందులో కల్పభూతి
యుత్తమం బది దొరకక యుండెనేని
తక్కినవిమూఁడుఁ జేయంగ దగుమహీశ. 96

సీ. క్షితివిభూతియొనర్చుగతి విను ముత్తమం
బగుగోమయము భూమి నంటనీక
నంభోజపత్రంబు నందు సద్యోజాత
వరమంత్రమునుబట్టి వామదేవ
మునఁబిండములుసేయుచునుతత్పురుషమున
నారంగనిడుచునఘోరమునశి
వాగ్నిలోదరికొల్ప నదికల్పమడవినెం
డినగోమయపుపొడి మునువుఁజెప్ప
గీ. కరణిగాల్చిన నది యనుకల్పమయ్యె
తానెకాలినభూతివస్త్రమునధూళి
తంబుగాఁజేసి గోవుమూత్రమునఁజేయు
కరుడుగాల్చిన నదియు సంకల్పమయ్యె. 97
వ. ఇట్లుగాక తక్కినయదియ కల్పంబనియెఱింగి యేతద్విభూతి కాలాగ్ని రుద్రోపనిషదాదిశ్రుత్యంతోక్తమార్గంబున సతతంబు నుత్తమాంగ ప్రముఖాంగంబుల త్రిపుండ్రధారణం బొనర్చునది. 98
క. ఇట్టివిభూతిధరించిన, యట్టిమహామహుఁడుజగతి నవయవయుతుఁడౌ
గట్టువిలుతుండెయగునె, ప్పట్టుననంశయము లేదు పార్థివతిలకా. 99
సీ. శ్రీకరమోక్షలక్ష్మీ వశీకరణ కృ, త్యాంకితతిలక విఖ్యాతిభూతి
యత్యంత ఘోరమహాపాతకౌఘమ, హీధరామరవర హేతిభూతి
కాకోదరాధీశకంకణ సర్వేశ, రీర విలేపనప్రీతిభూతి
ఫాలతలాంభోజభవపూర్వవిలిఖిత, పాపకాక్షరతమోజ్యోతిభూతి
గీ. సంతతాత్మీయమానసాసదృశభక్తి,భావనాధారిమానవవ్రాతనిరుప
మైహికాముష్మికోరుదివ్యప్రభావ, పూరణాభవకారుణ్యభూతిభూతి.
వ. ఇవ్విభూతి మాహాత్మ్యంబున నొక్క యితిహాసంబు గల దెట్లనిన నొక్క పాపాత్ముం డత్యంతరోగబాధితుం డై యెందేనిం జనిచని ప్రాణాంతసమయంబున నొక్కపట్టణ బాహ్యాంతరదేశస్మశానవాటికాసమీపంబున కదలంజాలక పడియున్న నొక్కసారమేయం బచ్చటిశ్మశానభస్మసంగతపాదమై వచ్చి యప్పాపాత్ముపాదతలంబు ద్రొక్కి చదివ [illegible] గొని చని

వైవస్వతాంతికంబున నిల్పినకృతాంతుం డతనిప్రాణాంతసమయం
బునం దైనభస్మధారణమహత్వంబువలన కల్మషంబులుం దొలంగి
పుణ్యాత్ముం డయ్యె నితండు మదీయదండనంబున కనర్హుం డనిన
బహుమానంబుగా నతనిశివలోకంబున కనిచెం గావున భస్మధా
రణమాహాత్మ్యం బిట్టిదని మఱియు నిట్లనియె. 101

మ. ఒకచో దేవుఁడు ఘోరపాపకరుఁడై యుండంగ తద్బాంధవ
ప్రకరంబాతనిదుష్కృతంబులు సహింపంజాలక వెళ్ళఁగొట్టినం
సకలంబుం విడిపోయి ఘోరవిపినస్థానంబునం బల్కి రా
తక దేశంబునఁ జేరియుండు నతిఖేదంబంది వర్తింపఁగన్. 102

గీ. అతఁడు ఘోరాఘ మహిమంద యనుభవింప
వలయు ననుమాట జనులకుఁ దెలియునట్టు
లమ్మహీపవరు దేహంబునందుకుష్ఠ
రోగము జనించెనోరులకు రోఁతదనర. 103

గీ. ఓడలుచూచిన జనులెల్ల నోకిలింప
గాలిచేదూరమునకు దుర్గంధ మొదవ
నడుగిడఁగ శక్తియించు కంతైనలేక
పట్టదెగిపడు మేనుచే పాఱుఁదుండి. 104

క. ఒకనాఁడాకటబడనో, పకతత్పక్కణసమీపవనిదిరుగుచునం
తకమున్నదవానలదగ్ధకుజామితభస్మమచట గనుగొని యందున్.

గీ. మండిచల్లారినట్టిగోమయపుకరడు
గాంచియాఁకటడస్సిన కతనవేగఁ
బుచ్చుకొని తిని యబ్బాధి ప్రోవునందుఁ
బడియెనడువంగ లేక యాబ్రాహ్మణుండు. 106

చ. అటుబడియున్నతీవ్రగహనానలదగ్ధమహీజలోష్మతం
బటపటమేనుప్రక్కలయి పాఱుని దేహము వీడన త్తరిం
గుటిలభయంకరాకృతులు ఘోరగదాయుధపాణులై నను
ద్భటగతివచ్చికింకరులు దట్టుచువేగొనిపోయియాతనిన్. 107

ఉ. కాలునిమ్రోలనిల్ప నతికంపితదేహముతోడదూతలం
దూలఁగఁ బల్కె యీతఁ డతిదుష్టవిచేష్టితుఁ డైనయేనియుం

గాలము సేయు వేళ భవనాశకభస్మము మెక్కపూయుటల్
దాలిచె శైవతేజమిటఁ దావసియింప ననర్ఘఁ డెమ్మెయిన్. 108

క. అనివై వస్వతుఁడాతని, ఘనతరపుష్పకవిమానగతుఁ జేసి ముదం
బునసురలచ్చెరువందఁగ, ధనదప్రియనగరికతిహితంబుగ ననిచెన్.

క. కావున నిట్టిది త్రిజగ, త్పావనభసితప్రసిద్ధి పార్థివ యికస
ద్భావమున వినుము దెల్పెద, కేవలరుద్రాక్షఫలముకృతభవహరమున్.

ఉ. రాక్షసవంశనాయకపురంబులు గూల్పఁదలంచినూటిగా
వీక్షణమొప్పఁ జేయు పృథివీరథులోచనకంకణోత్కరం
బీక్షితిరాలిభూజనుల నెల్లఁ బవిత్రులఁ జేయఁ బూని రు
ద్రాక్షనగంబులై జనన మందె మహామహిమంబు మీరఁగన్. 111

-:- రుద్రాక్షమహిమ. -:-

చ. అకలుషసోమవహ్ని మిహిరాంశసమిద్ధశివాక్షసన్మణుల్
శికితలచుట్టి కర్ణయుగళింగళవక్షములందు కక్షబా
హుకరతలాంతికంబుల సమున్నతిచే ముఖసంఖ్య లేర్పడన్
ప్రకటితభక్తి దాల్చిన నృపాలకచంద్రధరుండతండగున్. 112

సీ. ఒకకిరాతకుఁడు మహోగ్రాటవికి వేఁట, లాడంగఁ జనిచని యందునొకన
రోవరతటమున రుద్రాక్షఁగనిదాని, సారమేయునికంధరమున వేడ్క
గీలించి యాఖేటకృత్యతనుండంగ, ఘనవనక్రోడంబు గాంచి శునక
సహితంబుగా వాని జంపిననంతట, నీశ్వరుకింకరు లేగుదెంచి

గీ. హస్తవారిరుహమునరుద్రాక్షమట్టి
నట్టిఫలమబ్బె నీకని యతని వాని
జాగిలంబును జేర్చిరి శర్వపురికి
గానరుద్రాక్షఫలమిది మానవేంద్ర. 113

వ. అని మఱియు పంచాక్షరీమాహాత్మ్యం బిట్లని చెప్పందొడంగె. 114

-:- పంచాక్షరీమహిమ. -:-

ఉ. శ్రీతుహినాద్రిజాత్మసరసీజశిలీముఖుఁడర్కపావకా
బ్జాతవిలోచనుండు సురసంయమిపూజితపాదపద్ముఁడు
ద్యోతితదేవహుఁడంగజసముద్ధతగర్వవిదారియైలస
త్ఖ్యాతిమహోంచమిశమనుజాధిపపంచముఖుండు లీలచేన్. 115

గీ. అట్టి శ్రీమన్మహేశపంచాననముల
వలనఁ బంచాక్షరము లుద్భవంబు నొంది
పరుసపంచాక్షరియనంగ వన్నెఁగాంచె
నదియు వేర్వేఱ వివరింతు నాలకింపు. 116

సీ. వరుస సద్యోజాత వామదేవాఘోర, తత్పురుషేశానతతముఖముల
కలితనకారమకారశికారవా, కారయకారముల్ గడు జనించె
నవి ప్రోవుగూడి పంచాక్షరంబన నొప్పె, నదిమంత్రరాజమై యలరెజగతి
తన్మంత్రమాతసత్ప్రణవయుక్తంబుగా, జపియించినను షడక్షరియనయ్యె

గీ. సతతపంచాక్షరీమంత్రజపవిధాన
వేదియరయ సాక్షాత్పృథివీరథుండు
గాని కేవలుఁ డగుజనుఁ డనఁగవలదు
శంక యించుకలేక రసాతలేంద్ర. 117

క. పంచాక్షరి సురధేనువు, పంచాక్షరి కల్పకంబు పరికింపంగా
పంచాక్షరి చింతామణి, పంచాక్షరిఁ బోలఁ జగతి ఫలదము గలదే. 118

గీ. మఱచియును నొకమారు నమశ్శివాయ
యనినమాత్రన బ్రహ్మహత్యాదిపాత
కావళులు ద్రుంగు ననిన నిత్యంబు సలుపు
జపఫలం బెన్న నలువకు శక్యమగునె. 119

వ. ఇప్పంచాక్షరీమహాత్మ్యంబున నొకయితిహాసంబు గల దెట్లనిన; తొల్లి దాశార్హమహీవల్లభాఖండలుండు కాశికారాజతనయ యగుకళావతిం బెండిలియాడి ప్రథమసమాగమదినంబున నఖిలమంగళాభరణాలంకృతసౌందర్యగాత్రయగుచు విచిత్రం బయిన కేళికామందిరంబునఁ దనపజ్జ వసియించు దానింగని మదనప్రదరవిదళితహృదయుం డై యుపగూహనం బొనరింపం బోయి నచ్చపలాక్షి మున్ను కన్నియ యై పిన్నతనంబున కన్నవారింట నున్నసమయంబున దన చేసినయుపచారంబునకు మెచ్చి భర్గసమానుం డగు గర్గుఁ డొసంగు పంచాక్షరీమంత్రోపదేశప్రభావంబున పవిత్రం బైనగాత్రంబు గల యదిగావున నపరిగృహీతమంత్రుం డగునిజనాథుం గదియనొల్లక శివమంత్రోపదేశంబు గనినపిమ్మట మదీయ సంభోగం బనుభవింపు

ముని పెక్కుభంగుల వారించిన వినక పుడమితేఁడు కామాతు
రుండై పయింబడఁ బోయిన నమ్ముద్దియ మేను కాలిన యినుపము
ద్దకన్న తద్దయు వేఁడిమిదై పొడచూప వెఱచి దూరంబున నిలచి
హరమంత్రప్రభావం బిట్టిద యని తలంచి యప్పు డప్పతి యనుమ
తంబున గర్గాశ్రమంబునకుఁ జని యతనిచే శైవపంచాక్షరీమంత్రో
పదేశంబుఁ గైకొనునంతలోనన పశ్వ్యజ్జనులు విస్మయంబు నొంద
పూర్వజన్మఫలంబులు కాకంబులై పక్షంబులుగ మఱి నిజదేహంబు
వలన వెడలిపడుటయు నారాజశేఖరుం డానందకందళితహృదయా
రవిందుండై యాచార్యున కిష్టవస్తువు లొసంగి వీడ్కొని తనకు
సద్గతిచూపుటకు భార్య పెక్కుభంగుల నుపలాలించి తజ్జలదాలక
వలన నిష్టోపభోగంబు లనుభవింపుచునుండెఁ గావున పంచాక్షరీ
మాహాత్మ్యం బిట్టిదని తెల్పి యోగిపుంగవుం డద్ధరావరునితో మఱి
యు నిట్లనియె. 120

మ. అతిథీ సద్గురుభావసంభవము వేదాతీత మత్యుత్తమం
బతులం బవ్యయ మప్రమేయమగపుం బానందకందంబున
తతమాద్యంతవిహీనమై పరఁగు లింగంబున్మహాభక్తి సం
గతుఁడై దాల్చినవాఁడు ముక్తిపనితాకాముండు గాకుండునే. 121

ఉ. ఇట్టిపరాత్పరుఁ శివు మహేశ్వరునవ్యయు భావమందునఁ
బుట్టఁగఁ జేసి సంతతముఁ బూజలొనర్పఁగ శిష్యుచేతితోఁ
బెట్టిషడక్షరంబనఁగఁ బెంపువహించెడి మంత్రముం జెవిం
దొట్టఁగఁ జేయుసద్గురినితో నొరుల న్సరిసేయవచ్చునే. 122

క. గురుఁడే తల్లియు దండ్రియు
గురుఁడే దైవంబు దాత గురుఁడ సకలముఁ
గురుఁ డనఁగ హరుఁ డనంగా
పరికింపఁగ వేఱెకలదె పార్థివతిలకా. 123

సీ. ఆచార్యసత్కరుణాలోకనము నేవ
కాజ్ఞానతిమిరంబడంచు జ్యోత్స్న
గురుహస్తదత్తభానురభసిదాదాన
భక్తి మహారాజ్యపట్టకలన

యుప దేష్టభవ్య పాదోదకంబులు శిష్య
కల్మష దావాగ్నికమలవృష్టి
వర దేశికేంద్రుదివ్యప్రసాదామృతం
బాశ్రితజన్మరోగౌషధంబు
గీ. ధ్యానమూలంబు గురుపురందరునిమూర్తి
మూల మగుఁబూజలకుఁ గురుముఖ్యపదము
మంత్రమూలంబు గురువర్యుమాట మఱియు
మూల మగుసద్గురునికృప ముక్తికనఘ. 124
క. గురుపాదభక్తిపరులకు, పరికింపఁగ నందరానిపదవులుగలవే
నరవరతత్ప్రతిబింబిత, శరణమహత్వంబునుడువశక్యం బగునే. 125
చ. శరణులకర్థిమ్రొక్కి నుపచారము సేయ తదీయ సద్గుణో
త్కరమునుతింపతత్పదముఁ గన్గొన వారలసచ్చరిత్రముల్
వరుసవినంగ బొల్పడినవాని పశీర్షకరాబ్జజిహ్వకా
వరనయనశ్రుతుల్ మనుజవల్లభయిట్టులగాని వేటికిన్. 126
క. జంగమవర్య దయారస, సంగతమగు నేని యట్టిజంతువుని దిర్నగ
గంగాధరుకృపగనున్నృప, పుంగవయితిహాసమొకటిపోలువుగవినుమా.
ఉ. ఆగమవేదియైనశరణాగ్రణియొక్కఁడు భక్తియుక్తుఁడై
శ్రీగిరిమల్లికార్జును భజింపఁగఁబోవుచు నెండకాకచే
దాఁగఁదలంగలేక యొకతావునసిల్పి జనాళిమించనే
నేగతియేగువాఁడ పరమేశ్వరయంచు దలంచుచుండఁగన్. 128
మ. ఒకభేరుండము శాల్మలీస్తబకమయ్యుర్వీస్థలింగాలిచే
శకలంబై పడియున్నఁగాంచి యదిమాంసమ్మంచు నెందేనిబో
వక మింటం నిలదానిచాయమెయి బర్వన్వేగ నత్తెత్తికాం
చి కడుం దెప్పిరి మస్తమూచి యతఁడక్షీణప్రమోదంబునన్. 129
మ. అహాహాయీపతగాధినాథుఁడు మదీయంబైనతాపంబు పెం
పుహరించెన్ ఘటియించెనాకుఁ ద్రిజగత్పూతాపగాదివ్యవా
ర్లహరీసంతతఖేలనోత్సుకరమారాజేషురత్నోల్లస
ద్గృహశృంగాగ్రవినూతనాంకపటదేదీప్యప్రభాలోకమున్. 130
చ. ఇతఁడు మదీయమిత్రుఁ డనియెంచి కులాయముఁ గన్గొనంగమో

పతగవరేణ్య మాదయకు పాత్రుఁడవై శివిగానమీఁదటన్
క్షితితలమందు నీమహిమచేరమరాయుఁడనంగరాజసం
తతివయిపుట్టి భూభరణదక్షుఁడవై తుదిఁజెందుమీశ్వరున్. 131
చ. అని యిటులానతిచ్చి శరణాగ్రణి శ్రీగిరికేగి మల్లికా
ర్జునిపదముల్ భజింపుచు మరుల్లలనాళరచామరాఘవీ
జనభవవాతలోలవిలసద్భ్రమరద్భ్రమరన్నదామనం
బుననిడి కొల్చుచుంభవనపూజితుఁ డచ్చట నుండెనంతటన్. 132
శా. భేరుండాండజమంతకొన్నిసమముల్ పృథ్వీతలంబందుసం
చారంబొప్పఁగఁ జేసి యంతరమునన్ సత్పాలయాధీశపూ
జారాజింగని క్రమ్మరంభువిని భాస్వద్రాజవంశంబునన్
వీరాగ్రేసరిచేరమాధిపతినా విఖ్యాతి సంజాతుఁడై. 133
ఉ. వైరుల సంహరించి పరవాదులయేపణగించి యిష్టలిం
గారవ మొప్పఁబెంచి శితికంఠుని దేహమునం ధరించిప్ర
జ్ఞారతిమించి లింగగురుజంగమభక్తి వహించిదిక్కులం
దోరవుకీర్తినించి పరితోషమతిం ధరయేలె నెంచఁగన్. 134
శా. ఈరీతి న్వివిధేష్ట భోగములచే నేకాతపత్రావనీ
భారంబొప్పఁగ దాల్చి దేవతలు సంభావింపనంతంబునం
శ్రీరాజార్ధకిరీటపీఠి కరిగెన్ జెన్నొందు భక్తప్రభా
వారూఢిన్వినుతింపశక్యమగునే జ్యాలోకరత్నామణీ. 135
క. అని తెల్పినజంగమప, ద్వనజములకు జాగ్రిమొక్కి వసుధావరుఁడి
ట్లనియెన్నటులంగాదే, ననుము క్తిని జేయుదనుచు నమ్మితినిన్నున్.
క. కావునదీక్షయొసంగుము, దేవాయనుటయుతదీయధృతిమతులకుఁదా
భావమున నలరినీక్ష్టావాప్తిఘటింతుననుచు హర్షముతోడన్. 137
సీ. స్నానసంధ్యాదులు నల్పఁగానియమించి
తతభూతిరుద్రాక్షధారిఁ జేసి
శ్రుతిహితంబుగ పరంజ్యోతిరాకారలిం
గముధరియించి మోదమునఁ బ్రణవ
సహితపంచాక్షరీసన్మంత్ర ముపదేశ
మొనరించి భక్తిచిత్తుని గజేసి

చరణాబ్జతీర్థ ప్రసాదముల్ కృపచేసి
నిజశిష్యుఁగాఁగ మన్నించియంత
గీ. వీరశైవరహస్యముల్ వెలయఁదెలిపి
తన్మహీవరుచేత సత్కారమంది
భూజనులు తన్ను గొనియాడ నైజదేశ
మునకు వేంచేసె జంగమముఖ్యుఁ డంత. 138
క. ఘనముగ నచ్చుననొత్తిన
యనువుననాశరణుబోధ మాత్మవహింపన్
జనపతి నతతము త్రివిధా
ర్చనములు సల్పుచునుతనదు స్వాంతము నందున్. 139
క. నాయేలు భూమిలోపల, గాయజహారభక్తుఁడొకఁడు గానఁగబడఁడ
య్యో యెటులసైఁపదగుజను,లాయతదుష్పాపభాజులయ్యెదరుగదే.
ఉ. వారొనరించుపాతకమవశ్యము నాకు ఘటించుఁగాననే
నూరక చూచుచుండు టది యుక్తము గాదని యెంచి యప్పుడే
చారులనంపి యందఱి వెసం దనయొద్దికిఁ బిల్వఁబంచి యా
భూరమణుండు భక్తిరతిపుట్టఁగ శైవమతాధికత్వమున్. 141
ఉ. గౌరవ మొప్పదెల్పి తిరుగంబడువారికి మేయువస్తుసం
భారములిచ్చి దృష్టములు భావమురంజిలఁజూపిలింగ సం
స్కారులఁజేసి పూర్ణముగ స్వాస్థ్యము లచ్చెరువందఁజేసిన
న్వారలుసంతతప్రమదవారిధిఁ దేలి వచించిరీగతిన్. 142
ఉ. ఔరా యెంతటిభాగ్యమబ్బెఁ గడు మేలౌ నిత్యముక్తిక్రియా
పారీణత్వము సంభవించె పటుదుష్పాపౌఘ మెల్లన్ మహా
దూరంబై చనె నిమ్మహీశువలనన్ దోషంబుగా బిడ్డలం
బేరుల్వొట్టెద మింతరాజు సరియాపింపంగ లేరెచ్చటన్. 143
గీ. గ్రోలవలెనని చెంపలుగొట్టి తల్లి
బాలురకుఁబాలు ద్రావించువగిదిమనల
పెక్కుభంగుల శిక్షించి యక్కజముగ
పుణ్యమార్గంబుఁజూపె నిప్పుడమిరేఁడు. 144
క. అనియొండొరులాడుచున,జ్జనపతి యనుమతినియాత్మసదనంబులకున్

జనిసంతతభర్గారా, ధనరతివసియించిరతిముదంబిగురొత్తన్. 145

వ. కావున ప్రసాదమాహాత్మ్యం బిట్టిదని తెలిపి చూచి దేవాదిగణంబులతో సకలేశ్వరమాదిరాజయ్య యేతత్ప్రసాదమాహాత్మ్యం బింకను వినుమని యిట్లనియె. 146

సీ. రాజితకాంచనరత్ననిర్మితసౌధ, గోపురావరణసందీపితంబు
కమలినీకల్హారకుముదనిర్మలనీర, కలితకాసారవికాసితంబు
నిర్జయకామినీదుర్జయశృంగార, విభ్రమాజ్ఞానావిశ్రుతంబు
సంతతసముచితజాత్యనుగుణమార్గ, పథికచాతుర్వర్ణ్యబంధురంబు
గీ. భవ్యచతురంగబలచయభ్రాజితంబు
నిరుపమోద్యానవాటికాసురుచిరంబు
దేవతాగారసందోహభావితంబు
పుణ్యనిలయంబుసింహాద్రిపురవరంబు. 147

వేదపితామహుని కథ.

ఉ. ఆనగరంబునందు ఫణిహారపదాంబుజభక్తుఁడంతర
జ్ఞానిత్రిలోకపూజితుఁడు షట్ప్రతిపక్షవిదారణుండు భ
క్తానుగుణప్రబోధయసహాయుఁడు వేదపితామహుండు నాఁ
గానొకభక్తపుంగవుఁ డఖండితశైవమతప్రచారుఁడై. 148

క. నివసించు నతనిశిష్యుఁడు
ప్రవిమలతరభక్తిపరుఁడు బంధువిదూరుం
డవితథవాక్యధురీణుఁడు
భువివామనుఁ డనఁగనొక్క పుణ్యుఁడు వెలయున్. 149

గీ. అతఁడనిశంబు గురుపదాబ్జాతములకు
సేవసేయుచు తద్భుక్తశేషసుధము
దమునగాంచుచు నొకసంశయమున నతని
తోడ నొకనాఁడు వినయంబుతోడఁ బలికె. 150

గీ. అమరగణములలో నెవ్వఁ డధికుఁడట్టి
చందమున మోక్షసుఖ్బ నిజ్జగమునందు
నేమతం బుత్తమం బగు నెత్తెఱంగు
తెలియ [illegible] 151

చ. అని యిటువల్కు శిష్యు వినయంబున కాత్మ ముదంబు నొంది యో
ఘనతరపుణ్య నీదుమదిఁ గల్గినసంశయ మెల్ల దీర్తునం
చనఘుఁడు లింగజంగమమహామహిమంబులు సత్ప్రసాదసే
వనఫలముం దయారసము పర్వఁగఁ జెప్పఁదొడంగె నత్తరిన్. 152

సీ. బ్రహ్మాది దేవతాభర్తజగత్కర్త
శంబరదానవశత్రుహర్త
యమితతాపసనేత యఖిలభక్తత్రాత
యత్యంతబలపురదైత్యజేత
ఫాలసంగతకీలి భవవిభంజనశీలి
భానురానంతవిలాసశాలి
కుముదబాంధవధారి యమమదసంహారి
గ్రావరాజసుతామనోవిహారి

గీ. యవ్యయుం డచ్యుతుండు సర్వాత్మకుండు
భావనాతీతుఁ డగుమహాదేవుఁ డెందు
దేవుఁ డగుఁగాని తక్కనదేవతులను
దైవమనికొల్వవల దిది తథ్యమనఘ!. 153

ఉ. భూవిదితంబు లోకచయపూజితమాతత ఘోరపాపసం
ధావనధుర్యమీశ్వరపదప్రతిపాదకముత్తమోత్తమం
బావృతపాశబంధహరణాకరమై వెలుగొందునట్టియా
శైవమతంబుతోడ నెనసల్పఁగ వేఱమతంబు గల్గునే. 154

ఉ. ఇట్టిది శైవమిందు కడు హెచ్చగు నుత్తరశైవమూర్తి చే
పట్టినపుణ్యమూర్తి సుమబాణవిరోధియనంగవచ్చు నే
పట్టున సంశయింపకుము భర్గుఁడె భక్తుఁడు భక్తుఁ డీశుఁడా
గట్టిగ నీశభక్తులకు గల్గదుభేద మొకించుకేనియున్. 155

గీ. పుడమి నొక్కొకభక్తుఁడు నడుచుచర్య
లహహ! యెబ్భంగి లెక్క నేయంగవచ్చు
వారిమాహాత్మ్య మంబికాధారుఁ డెఱుఁగుఁ
గానఁ దదధీనుఁడై యుండు మానకెపుడు. 156

క. చరలింగార్చన సేయక, గురులింగార్చనలు సేయఁగూడదు వినుత

ద్గురులింగంబులకంటెను, చరుఁడేయధికుఁడనిపల్కు సకలశ్రుతులన్.

సీ. భక్తుండు గురుఁ డుమాపతిశిష్యుఁ డనుటకు
గుఱుతుగా గణపాలకుండు సాక్షి
భక్తుఁడు తండ్రి శ్రీపతిబాణుఁడాత్మజుఁ
డనుటకు భల్లాణఘనుఁడె సాక్షి
భక్తుండు దొరబంటు భవుఁడనియనుటకు
రూఢిగా బాణాసురుండె సాక్షి
భక్తుండుగెల్వరి పరమేశుఁడోటరి
యనుటకు శ్వేతవాహనుఁడె సాక్షి

గీ. తానుగోరినవస్తు వేమైనగాని, భక్తులీయక గతిలేదు భవునికెందు
శరణవర్యునిసత్కటాక్షంబు దేవ, భూజమాణిక్యధేనువుల్ పుట్టినిల్లు.

సీ. కాలారిగణపాదధూళి మైసోకిన, మర్త్యునిదురితముల్ మ్రగ్గిచన వె[డడె
ధూర్జటిభక్తులుద్రొక్కినదొరవయి, బొరలు వాఁడఘతతుల్ బోవన
శర్వభృత్యులతనుచ్ఛాయ మైబొలసిన, నరుఁడు కల్మషములఁబొరిగొనండె
హరశరణస్నానశరకుండతలపంక, మలఁదిన జనుఁడు నిర్మలుఁడుగాఁడె

గీ. పరమపావనజంగమప్రతతితోడ
నమరకిన్నరయక్షవిద్యాధరాహి
సాధ్యగంధర్వమునిసిద్ధసారసాప్త
చంద్రముఖ్యగ్రహాదులు సాటియగునె. 159

గీ. శ్వపచుఁడైనను హరలింగసహితుఁడేని
యవనిలో నుత్తమోత్తముఁ డనఁగఁబరఁగు
నట్లుగావున శరణదివ్యప్రసాద
సేవనము లేక ముక్తిని జెందవశమె. 160

క. ఏవిధముననైనను మో, హావహాశరణ ప్రసాదమానఁగవలయున్
పావనసద్భాండస్థం, బావంతయు దొరికెనేని యమృతము జెందున్.

క. అని తెల్పిన దేశికస, ద్వనజములకుఁ జాఁగిమ్రొక్కి వామనుఁడుముదం
బునఁ దేలెనసన్నకరుణం, గ నెగురుఁడనియంతకొంతగాలముచనఁగన్.

ఉ. ఆపురిలోననుండుగొడగవ్వయను నన్నొకభక్తురాలురు
ద్రావిడమూర్తియైనశరణాధ్యులపాలిటి పాలుమేలుదు

ష్పాపవుఁగొండఁద్రోవునకు పాకనిషూదనుచేతివాలు చి
ద్వ్యాపితవాక్యసంచయసుధారసమీనఁగజాలు లీలనన్. 163

క. ఆవెలఁది ప్రసాదముఁగొనఁ, గా వేదపితామహుండు కాంక్షించిమది౯
నేవిప్రకులుఁడ జననిం, దావాప్తుఁడు నగుదు నిచటికరుగుదు నేనిన్.

క. నిందకులోఁబడియుండినఁ, జెందదుతత్సత్ప్రసాద సేవగొనకనే
నిందు ధరుజెందుటెటులీ, బొందివిడచి వేఱబొందిపొందికొనిమెదన్.

చ. అనియిటు లాత్మలోఁదలఁచి యంతట శిష్యుఁడుదానునిచ్ఛలం
జని మఱికొన్నినాళ్లకు నిశాకరశేఖరతుల్యుఁ డైనయ
య్యనఘుఁడు గంగలో జలకమాడి మఠంబునకేగుచుండిదా
శునకకళేబరం బొకటి చూచె మఠంబునఁ బ్రాణహీనమున్. 166

గీ. చూచి దీనిశరీరంబు జొచ్చిమఱుఁగు
దనరఁగొడగవ్వసత్ప్రసాదంబుగొందు
ననుచు సంతోషపూరితుం డగుచు హృదయ
పంకజంబున నొక్కయుపాయమపుడు. 167

చ. కనుగొని తత్సమీపమున తమ్మజముచెంతలఁజేరి శిష్యుతో
ననియె ముహూర్తమాత్ర మిట నాతపవహ్నినివారణార్థమై
యనువుగ విశ్రమింతి మనియాతఁడు దానును దాసినీడచ
ల్లనిపవనూనమందున వసి౯వసియించిరి మోదచిత్తులై. 168

ఉ. అటువసియించి యాత్మకృత మాతనికేర్పడ నీకశిష్యనే
నిట నిదురింపఁగావలయు నీవతిజాగ్రతతోడ నుండు మె
చ్చుటికిఁ జనంగఁబోకు మని ఛాత్రునియూరువు మేత్తలాడఁగా
కుటిలవు నిద్రఁజెందె మది గొంకక తద్గురువర్యుఁ డత్తరిన్. 169

గీ. అసమమైనట్టి యితరకాయప్రవేశ
విద్య తనయందుగల్గుట చోద్యమలర
యాత్మదేహంబు వెడలి తదంతికస్థ
శునకదేహంబుఁ జొచ్చి గ్రక్కునను లేచి. 170

ఉ. నాలుక బైటవేయుచు ఘనంబుగఁజూచు నావులించుచు౯
నేలను మూరుకొంచు గడునిక్కుచుఁ బొర్లుచు చొంగ రాల్చుచు౯
వాలము ద్రిప్పుచు౯ శిరము వాల్చుచు కర్ణముల న్విదల్చుచు౯

మూలుగుచుఁ వెసఁ జనుచు మోర యొకించుక మీఁది కెత్తుచున్.

మ. చనితత్పట్టణబాహ్యదేశగతమాచండాల వాటిన్వసిం
చినదానింగొడగవ్వభక్తసహితంజేరంగనే తెంచి యా
వనితామాళికిభక్తిమ్రొక్కుచు పురోభాగంబునఁ నిల్చినం
గనిదివ్యైతుణ సంగతిందెలిసి యుగ్రస్వాంతయై యిట్లనున్. 172

మ. స్వకులభ్రాంతిని వీడఁజాలక విశిష్టంబైనతజ్జంగమా
ధిక వేషంబు పరిత్యజించి శుచివై తేమేలు మేలౌరజీ
వికభావింప కులంబొకండుగలదే వింతయ్యె నీమందబు
ద్ధికి సద్భక్తులు నవ్వరే తెలియరా దేభక్తిమార్గంబులన్. 173

క. ఎందరిరోమునఁబుట్టితి, వెందరిచనుఁబాలుఁద్రావి తెన్నికులములం
బొందుగవసియించితివిపు, డందమె విప్రుండననియహంకృతిఁజెందన్.

గీ. పెద్దలెల్లఁ బ్రతిష్ఠించుపిదపలింగ
మూర్తి యగుఁగాని శిలయును మొరకుగలఁడె
యట్టిగతిదివ్యలింగాంగియైనవాని
జాతిభేదంబులెంచుట నీతియగునె. 175

క. అనిపల్కి కుక్క యిటుర
మ్మని పెంచుకలోన సింత యన్నమువైవం
దనభాగ్యమింతె యానని
కొని యతివకుమ్రొక్కి యతఁడు గుందుచుఁ జనియెన్. 176

చ. చని యొకచోట యాశునకసంహననంబును వీడి నిద్రమే
ల్కనుగతిలేచి కన్నులు కరంబులనల్పుచు బిట్టునీల్గుచుఁ
దన ప్రియశిష్యుఁజూచి సదనంబునకుం బదమా యటన్న వా
మనుఁడుగురుండొనర్చు బలుమాయలెఱింగి సభక్తియై యనెన్. 177

చ. ననువిడనాడి మీరు కుహనాగతినా గొడగవ్వమందిరం
బునను ప్రసాదముంగొనఁగ బోలునె దేశికతావకీనభా
జనగతనుప్రసాద మని శంబుభుజింపుచు నేఁడుమిన్న కే
యనువుననుండువాఁడ నిఁక యబ్బుట లెట్లు భవత్ప్రసాదమున్.

ఉ. ఇత్తరియైన నాకు నెలవీదగు నచ్చటి కేగి వేగమే
వత్తు [illegible]

దత్తరలాక్షి నన్నుఁ గనినట్టుల యా కృతకాంగివై ననీ
వెత్తెఱఁగొప్ప నేగనవొ యేగిపరిసాదము గొమ్మునావుడున్. 179

చ. గురువరపాదపద్మములకుం బ్రణమిల్లి మహాత్మజంగమో
త్కరకులమెంచఁగా దని పితంబుగమీరలు చెప్పవించునె
ప్పరుసునలోకనిందలకు భావమునందు భయంబునొందెనే
శరణ వరప్రసాదఫలసౌఖ్యము గాంచుట లెట్టులెంచఁగన్. 180

క. కావున సహజాకృతిచే, యావనితామాలియింటికరిగెదననిన
ద్భావముసగురునియనుమతి, భూవిదితముగాగనతడుబోవగురుండున్.

ఉ. శిష్యుని మేలిబుద్ధిననుఁ జెందకపో మెస్మృతీతిహాసన
ద్భావ్యము లెన్నియేని సతతంబు గ్రహించియు భక్తిమార్గవై
దుష్యముగాన నైతి మదిఁదొట్టిన మందత లోకులెల్ల నన్
దూష్యము సేతురన్ భయముతోఁ జరియించితి మీ దెఱుంగమిన్.

క. అనివగలమిగులఁ బొగులుచు, తనమఠమున కేగనందతచ్ఛిష్యుఁడుప్రా
క్తనసుకృతమహిమవలనన్, జనియాగొడగవ్వదివ్యసదనముగాంచెన్.

గీ. కాంచిలోపలి కేగి యుత్కాంత యడుగుఁ
దమ్ములకు జాఁగి మ్రొక్కి యోయమ్మ నీకు
హాప్రసాదంబు మద్గురుఁ డారగించు
పాత్రిమందిడికరుణించి పంపుమనిన. 184

గీ. ఎంతిదాసోహపరుఁ డితం డెంతధీరుఁ
డెంతగురుభక్తినిష్ఠాత్ముఁ డెంతధన్యుఁ
డెంతసాహసుఁ డనియెంచి యింత యతఁడు
వేఁడుమాడ్కి ప్రసాదంబు వెట్టుటయును. 185

క. పరమామృతమనివామనుఁ, డరుదందుచుగుడిచిలేచి సంతటనెదుటన్
సురమానియత్కవిద్యా, ధరగరుడోరగులుగొలువదయమదిబొందన్.

సీ. ఘనవృషభేంద్రుఁడుగాలిమేపరిపిండు, వాజిగాభూషణరాజిగాఁగ
గట్టులదొరచూలుకడిదిబెబ్బులితోలు, వాలుగావలువన్నెశాలుగాఁగ
కడలిబుట్టువిషంబు కాముని భసితంబు, మేతగానెమ్మెనిపూతగాఁగ
పావకజ్వాలంబుబలువైనశూలంబు, బొట్టుగాగడుపోటుముట్టుగాఁగ

గీ. రమ్యతరసుంధరాధరాధరము లు, తేరుగాఁగవింటి తీరుగాఁగ

దనరునట్టిశ్రీసుధాకరశేఖరుం, డభవుఁ డచట నిల్చెహర్ష మలర.

గీ. ఇట్లుప్రత్యక్షమైనసర్వేశ్వరునకు, వామనుండష్టసాష్టాంగవందనంబు
లాచరించిఁయమంద మోదాత్ముడగుచు,విమలసద్భక్తినిట్లనివినుతిచేసె

నిరోష్ఠ్యస్వరలఘుగీత. —

శరనిధిశయన శరఖరకరదహనర, జనికరనయన కరిదితివిహరణగర
గళసకలయతితతినతికలితచరణ, ధనదసఖక్షితిరణరజితనగశరణ.

చ. అనినుతియించువామనుదయామతిఁ గన్గొని యోకుమారనీ
యనితరపుణ్యభావమున కచ్చెరువందితిఁగాన మానికే
తనమగురౌప్యభూధరము దార్చెదరమ్మనిపల్కనంతన
య్యనఘుఁడువిన్నవించె వినయంబునఁ గ్రమ్మరభక్తిఁ మ్రొక్కుచున్.

ఉ. ఓపరమేశ! యోనరద! యోబుధవత్సల! యోమహేశ! మీ
రీవగిర్రి వచింపఁదగునే ననుధన్యునిఁ జేయుమద్గురుం
బాపవిదూరమున్న నిరపాయభవత్పురిఁ జేర్చి వెన్కన
న్నీపదమందఁజేయు టది మేలగునట్టుల చిత్తగింపవే. 191

వ. అనిన విని పరమేశ్వరుండాత్మగతంబున వేదపితామహుండు భక్తభు
క్తశేషోపభోగపరిభావంబున నిజపదప్రాప్తుం డనియెఱింగియు, జంగ
మకులభేదనంబొనర్చుటవలన హీనజన్మంబగునని లోకుల కెఱుకపర
పను, శిష్యునిమనంబరయనుం దలంచి వామనుం గనుంగొని. 192

మ. అనఘుండీతఁ డనంగ వన్నెగనుమీయాచార్యవర్యుండుపా
వనసద్భక్తిపథంబెఱుంగక జనవ్రాతంబులగ్గించునో
యనిచిత్తంబున గొంకి దాశునక దేహంబంద గాంక్షించె గా
వుననిమ్మాదిభవంబుగుక్కయగుచుం బుట్టంగసర్వాండనన్. 193

సీ. బిట్టులిక్క వామనుండిట్టులబల్కె మ,ద్గురునిరాహీనకుర్కరభవంబు
జగములఁబుట్టింప నెగడఁజే నణగింప, శక్తులౌమీరలీసమయమందు
వేదపితామహు వెల్తినేయక భవ,త్పదసంబుఁ జేర్పఁగఁజాలవయ్యె
యిడగాక యేహూపమేనిబూనియు భక్తి, భుక్తశేషముగాంచిపుణ్యుఁ
[డమ్యె

గీ. యతని విడనాడి యేనచ్చుటర్హమగునె
గాన నాతనితో ...

నన్నుఁ గొనిపొమ్ము నావుడు నందివాహుఁ
డాత్మలోపలనంతొసఁవ మానహిల్ల. 194

క. నీభ క్తివలనఁజిక్కితి, శోభితగతినీవువేడు చొప్పుననడుతుఁ
వైభవమునఁగురుఁదొడ్కొని,నాభవనమ్మునకురమ్ము నయగుణశీలా.

క. అనితద్గురుశిష్యులనా, త్మనికేతనమునకు సురసమూహమువొగడన్
ఘనపుష్పవిమానమునం,గొనిపోయెశివుండుచిగురుకొనుదయతోడన్.

వ. కావున ప్రసాదమహాత్మ్యంబిట్టిదని తెల్పి మాచిదేవాదులతో మాది
రాజయ్య మఱియు నిట్లని చెప్పందొడంగె. 197

బిల్లమరాజుకథ.

గీ. రాజగురుబుధకవులచే తేజమెసఁగి,భానమానసుధర్మాధివాసమగుచుఁ
బ్రబలజిష్ణుప్రభూత్తమపాలితమయి, నాక మననొప్పుకరిదిగియనువు

ఉ. ఆపుర మేలురత్నకటకాంచితపాదుఁడు ఘోరఖడ్గసం ట్రంబు.
దీపితుఁడాత్మగండతలనిర్మలరాంకవభానమానుఁడ
ష్టాపదసానురాగుఁడు విశంకటవర్తితపాపినీచయు
వ్యాపితుఁడొరమేలన ధరాధిపుఁడొక్కఁడు బిల్లమాఖ్యచేన్. 199

మ. అసమానోత్తరశైవతద్విదుఁడుసద్యద్దేశికాధీశప
ద్వినజాతాలయమానసుండు సతతార్థివ్రాతసంపోషకుం
డసమాస్త్రాంచితరూపసంతుఁడచలేంద్రాతీతధైర్యుండనన్
వసుధామండలమేలె నాతఁడుజనానందంబుగా నెప్పుడున్. 200

క. జాతిశుఁడసఁగధరప్రఖ్యాతిగనరదేశికాగ్రగణ్యకృపావి
ద్యోతితశివలింగధరుం,డై తొరపుభక్తినలరియనిశముఁబ్రీతిన్. 201

ఉ. భోజనలేపనాంబరవిభూషణవాదననృత్తగీతికా
వాజిగజాధిరోహణశివప్రదసత్కృతిముఖ్యముల్ప్రమోదం
భోజమెలర్పసద్గురుఁడు ముందుగఁగైకొనఁ గనుగోనటం
చాజగతీశచంద్రుఁడు మహోనియమంబొనరించెమించుగన్. 202

క. మఱియును బ్రాతఃకాలము, తరిగురుదర్శనము నేతుతప్పకననియే
డ్రైఅవ్రతముఁబూనియాగతి,జరిపెంగాలంబుకొంతసద్భక్తిమెయిన్.

సీ. అంతటచామయ్యయనదొమ్మరీల మే,తరితనవీడునుదానుగదలిఁ
మసకతిత్తులుతుంగకసవుచాపలుపసి,గొఱ్ఱెలుజనపమోకులుసువలల

చిక్కముల్మోలలుమూసిన చింపిబొంతలు దామెనతాళ్లుగోతములు వెద్రు
కలమోవులునుదువ్వెనలు గేదెకొమ్ములు, పాత్రకుండలుచిన్ని బాడిత
గీ. వంపుఁగుడిసెలసామగ్రిదంపురోళ్లు [లును
కురుచరోఁకండ్లుచిన్ని దాగరలు మొదలు
గాఁగలుగువస్తుజాతంబు గార్ధభములు
మోచితే వెంటసూకరములు చనంగ. 204
క. అరుదెంచితత్పురీవర, పరిసరమునవీడువిడిసిభావములలరన్
ధరనీశుదర్శనోత్సుక, పరులై తగువారియుక్తపద్ధతితోడన్. 205
చ. మురుగులు కాసికోకలును మువ్వలుఁగ్రుచ్చిన చల్లడాలుకం
ధరలు మెఱుంగుగుండ్లు పగడంబులు పెందులినంటుపోగులున్
గరములు చెక్కడంపుఁ జెవి కమ్మలుకత్తులు తట్టపాగలీ
గరిమను వేషముల్ దనరఁగాఁ గన నయ్యెను వీటిపెద్దలన్. 206
సీ. రతనాలకుప్పెసౌరపుజడకుచ్చులు, శశిపూలచందురుల్ సరిగెలు చెవు
లనుబవిరెలుకమ్మలునుముక్కుముక్కెర,లడ్డకమ్మలుముత్తియంపుకమ్మ
లలరుమాక్తికహారములుభుజకీర్తులు,కడియముల్ మొలనూళ్లు కాళ్ల సజ్జ
జిలుగుపావడలునుచీనాంబరంబులు,వన్నెకంచెలలు హారంబట్టుమునుకు
గీ. లమర మేనుల దీధితులతిశయిల్ల, నోరచూపులవిటులను జేరబిలువ
తలిరువిలుకానిపట్టపుదంతులనఁగ, జతనమైరంత దొమ్మరిసానులంత.
క. ఈచందంబున నిజవ, ర్ణోచితవేషములుదాల్చి యొండొరుగడనం
జూచుజనుల్ వెరగందఁగ, ప్రాచుర్యంబొప్పనగరిపద్ధతినంతన్. 208
చ. అడిదములానుగజ్జలసి యాంత్రములున్ మురుగాళ్లుడోళ్లునం
గడిపలయంబులున్ మెఱుఁగుకంచము లభ్రతలోన్నతంబులౌ
గడలుగుడార్లుపగ్గములకత్తులబోనులుఁ గడ్డపారలున్
వడిఁగొనిమేటిదొమ్మరులు వచ్చిరి బిజ్జమహీశుపాలికిన్. 209
గీ. అరుగుదెంచితద్ధరాధిపుగృహాబహి,రంగణముననిల్పియుంబువాహ
నినదమట్లవినిజనులకు చెవుడొంద, పెక్కుడోళ్లుగొట్టిరొక్కమొగిని.
ఉ. ఆరవమాలకించి సభనందలుబమ్మెరపోవునంతటం
భూరమణుండ దేమి యటబోయిఁ కనుంగొనుఁ డన్న వేత్రకుం
డారసివచ్చినిల్చి వినయంబున నిట్లని విన్నవించె దే

వా రమణీయ వేషముల వచ్చివసించినవారు దొమ్మరుల్. 211

క. అనవుడు దరహాసితాననమున సచివునిఁ గనిన నతఁడు ముదమున విద్యా
ఘనులగుటవారు దేవర, యనుకంపకు యోగ్యులగుదురని నతనితోన్.

సీ. భూమీశుఁ డనుమంత్రిపుంగవ యేవిలా
సములై ననమ్మ బాచాచార్యుఁ డెలమి
మున్నగాఁగనక నేకస్సులఁ జూడనే
వ్రతము పూనితిఁ గాన వారి నచటి
కనుపంగఁదగు నన నోఁగాక యనిచారు
చేనత్తైఁబంగెల్లఁ జెప్పి పనుప
వాఁడు సత్వరమున వచ్చి సందడి పెను
బొబ్బలు డొల్లు చప్పుడును నణపి

గీ. పెద్దయగుచాము దేవరఁబిలిచి మనుజ
పతిని యోగంబు దెల్పిన పరమహర్ష
మెసఁగ తనువారు దానుజాతీశుఁ డున్న
రాజితోద్యానమపుడు చేరంగఁబోయి. 213

మ. కనియెందొమ్మరి మేదరీఁడు విలసత్కంజాశుగాప్తానన
త్యనిశాంతాయితచూతభూజఫలసారాస్వాదనాశాలన
ద్ఘనకీలోద్భటరావసంచరితపాంథవ్రాతఘర్మాపనో
దనదక్షానిలసంచలత్కదళికాతండంబునుద్యానమున్. 214

వ. కని యొండొరులతోడ. 215

మ. వనమొప్పెం ఘనమై స్వకీయసితభాస్వచ్ఛాయతో నేకమా
కనశాఖోకతమాలముఖ్యసుమనగ కాంతీంద్రచాపంబుతో
జనితామోదలతాంతవిశ్రుతరసాసారంబుతో వన్నగా
శనశారీశుకముఖ్యనీడజరవాంచద్గర్జతో నెంతయున్. 216

క. అనియీతీరునఁ బల్కుచు, వనజాతాక్షరవిలాసవసతులుగను చుర్క
ననలలరులు గోయుచు లో, చనపర్వంబులుగ వారుఁ జని చని యెదుటన్.

శా. హీహోదారకవాటబంధురము రాత్రీశాశ్మకుడ్యంబు దై
త్యారాతీశ్వరనీలకుట్టిమము ముక్తాంచద్వితానంబున

ద్భూరిస్తంభము రత్నతోరణమునై పొల్పొందు భాస్వచ్ఛతు
ర్ద్వారాగారముగాంచిర త్తరి సముద్యన్మోదచేతస్కులై. 218

వ. తదీయమధ్యప్రదేశంబున. 219

సీ. కేవలశాంతిచేఁ గృష్ణాజినంబున, పద్మాసనస్థుఁడై పరఁగువాని
మస్తకముఖ్యసమస్తాంగముల భసి,తోగ్రాక్షధారియై యొప్పువాని
శమదమానూననిశ్చలచిత్తవృత్తి స,దానందకలితుఁడై యలరువాని
కరతలన్యస్తలింగధ్యానపరవశ, మతి నితరం బెల్ల మఱచువానిఁ

గీ. గాంచి మ్రొక్కి పరాకు భూకాంతుఁడనుప
వచ్చినారము దేవర వారి సముఖ
మందు మా నేర్చు విద్యలింపొందఁ జూప
నవధరింపుము గురువర్య యచలధైర్య. 220

క. అని పల్కుచుఁ దోడ్తోడన, వనధిధ్వానముగ ఢోల్లు వాయింపుచు మ
ల్లనఁ బొబ్బలిడి భుజాస్ఫా,లనములు గావించి మదిఁ జెలంగుచు నంతన్.

గీ. గడలు సిల్పి నాల్గు గడలపగ్గంబులు, గట్టి మొ్రక్కి పుడమి మట్టెఁ దిగిచి
ఫాలములనలంది పైఁ జల్లుకొని విద్దె,లాడఁ దొడఁగి రప్పుడతి ముదమున.

క. పలువురు బిల్లమెరంబులు
తిరుగుడు లంతరమునందుఁ ద్రిమ్మరుటలు దు
ర్భరమత్స్యపుటము లొండొరు
లురువడి సరిబెనఁగుటలు జనోత్సుకమయ్యెన్. 223

క. కత్తులబోనులుఁ దూరుచుఁ, గుత్తిగఁ బెక్కండ్ర నొకటిగొని మోయుచు ను
వ్వెత్తున పంటను దూలము, లెత్తుచు మఱికొందరాడి రెలమి వహింపన్.

ఉ. మూఁపున రాసభంబులను మోచుచు దండెపు తోలు మోకుపై
నేపున జంకు లేక మెదు రేగి శరీరము లంటనీక కా
ల్జాపుచుఁ దప్పరించి పదిలంబుగ నొండొరు లీవలావలై
చూపరు లాత్మ మెచ్చ జనుచుం నటియించిరి కొందరందులోన్. 225

క. వాయునిరోధముఁ జేసి వి, హాయసమధ్యంబునందు నసియంత్రముపై
కాయము నిల్పెను జనులా, హా యన నంచాకసరోరుహానన చులకన్.

సీ. తలకొన్న దొంతికుంటలు నిల్పి తలఁకక
గడమెక్కి నటియించె పడతి యొకర్తు

నాభియందమ్మొన నాటించిచక్రింబు
　　కైవడిఁ దిరిగెను కాంతయోర్తు
చివరవెన్నున మోపి యవలీల మ్రొగ్గుగా
　　వ్రాలెచెల్లింపక బాలయోర్తు
కాలడ్డమైయున్న కఱ్ఱకుఁ దవిలించి
　　తలక్రిందుగా వ్రేలె తరుణియోర్తు
గీ. పదయుగంబునందు పాదుకల్ దవిలించి
మోకువెంటదిగియె ముదితయోర్తు
మీఁదనుండి పిల్లి మొరములు వేయుచు
వచ్చిపుడమినిల్చె వనితయోర్తు. 227

ఉ. ఈవగిదిన్ సమస్తమను జేతుఃణపర్వముగా నటించి ని
ష్ఠాపరిపూర్ణుఁడై యలరు సద్గురుసన్నిధి నిల్చి మ్రొక్కి దే
వా పొలుపొందు మీఁదయుకుఁ బాత్రుల మింతియె కాని యిట్టివి
ద్యాపరికింపఁగారణము ధారుణి మిమ్ముల మెచ్చఁజేయఁగన్. 228
క. అనియందరొక్కమొగిఁద, న్వినుతించినపల్కులతఁడు వినక కనకపా
వనలింగలీనవీక్షా, జనితామోదముననున్న చానయు వగచెన్. 229
చ. కటకటమీరలాడు పెనుకష్టపువిద్దెలుచూడడాయెము
చ్చటకుఁబనేమిపోదమని చామయపల్కిన తత్తనూజమా
రటసురవేశ్యయోయనఁగ రాజిలుచుండెడిచెన్నసానినీ
విటువగఁజెందనేమిటికి యేగురిఁజెప్పెదనంచు నిట్లనున్. 230
ఉ. ఉల్లములోననుంచు సమయోచితభంగి దలిర్పఁగట్టురా
జిల్లునిచూచు నీగురుమహాత్ముని నెవ్విధినైనతమ్మినూ
డల్లునిఁబారిద్రోచి హృదయంబుగలంగ నొనర్చిరేపె నీ
యల్లునిఁజేసి తెచ్చెద రయంబుననేకనుగీటివీటికిన్. 231
క. అనిపల్కియవ్విలాసిని, జనకునియొడఁబఱచితిరుగఁ జనుదెంచుతలం
పునతనవారునుఁ దానును, మునువిడిసినవీటికరిగి ముదముదలిర్పన్.
సీ. చిత్రదుకూలంబు చెలువుమీఱఁగఁగట్టి, రవపైఁడి మొగ్గల రవికదొడఁగి
సొగసుగాఁ దుఱుము కస్తురిరేఖఁగీలించి, పూలదండలు సిక్రవేలఁజుట్టి

కన్నులసన్నముగా కజ్జలముదీర్చి, లీలాసరోజంబు కేలనునిచి [ల్పి
యగరుగంధము చెక్కులనుపల్చగనలంది, యెదలింగపేటికకుదురుగా
గీ. యాకుమడు పొకచెలి యివ్వ నందికొనుచు
వీణ గైకొని యొకసఖి వెంటరాఁగ
వీరమోహినికై వడి వీడు వెడలె
సిరులవెదజల్లునగఁ బూని చెన్నసాని. 233
క. ఇవ్విధమున నాజవ్వని, పువ్వులవిలుకానిదంతి పోలువమరునడల్
నివ్వటిల మొగమునను చిఱు, నవ్వొలయఁగ గురునియుపవనస్థలిఁ జెందన్.
సీ. అటుచని తద్దేశికాంతికస్థలమున
నాసీనయైనసరోజాయతాక్షి
చలిచేతివీణియ చేనందిగవిసెన
సడలించి సారెలు చక్కనొత్తి
క్రొవ్వాఁడి గోళ్లతంత్రులుమీటి యొండొంట
జతమేళవింపంగ శ్రుతులమర్చి
విరచితాత్మీయకంఠరవమ్ముమహాస్తవి
పంచికాస్వనము లోపల మెలంగ
గీ. రమ్యతరధృతమధ్యవిలంబితముల
తాళమానక్రమంబులు దప్పనీక
లలితమందరమధ్యతారములు మెఱయ
క్రమము మీఱంగ సప్తస్వరములు చెలఁగ. 235
ఉ. భైరవినాటతోడి సిరిపాళి దశాదిశి దేశిమారువా
గౌరి బిళావురీలలిత కన్నడ గౌళ ముఖారి దేవగాం
ధారి వరాళి కన్నడ ధనాసరి ఘూర్జరి పూరిబేగఁడా
యారభిరామఖల్లి మొదలై తగురాగము లింపుమీరఁగన్. 236
క. మొరఁడులుచిగురింపఁగ రా, ల్దేలఁగ చిత్తరువుబొమ్మ తెగతలలూఁచన్
తెరపలతల మాసికనే, ర్పెరఁబాడుచు వీణపై జతిం బలికించెన్.
క. అంతట లింగగతధ్యా, నాంతంబగుటయును దేశికాగ్రణికరయు
క్కంతువిదారుని పేటిక, సంతసనగా కుదురుకొల్పువసమయమునందున్.
క. ప్రమదాళిశ్శీస్వనంబున, ప్రవదారత్నంబు పాడుపాటలు చెవికిన్

భ్రమదంబెనయింపవిడీ, ప్రమదనహరమూర్తిచలితభావుండగుచున్.

మ. కనియెంగట్టెదుటన్ మనోజ్ఞశశభృత్ఖండాలికన్ మేఘవా
హననీలోపలనీలకైశికను మోద్యన్మాలికన్ భవ్యయా
వనగంధానిలధూతకామిజనభాస్వద్ధీరతాతూలికన్
వనజాతాంబకహస్తకీలితమణీ పాంచాలికన్ బాలికన్. 240

చ. కనుగొనునంతలోన సుమకార్ముకుఁ డాత్మవిరోధికల్పునిన్
ఘనుని మదింగలంచ తరి గన్నడె నంచు గుతూహలాత్ముఁడై
కనుగలవింట దమ్మిసెలకట్టియ లెక్కిడి చక్కఁగానుర
మ్మున గురిచేసి వేసిన సముత్కటమోహము నిల్పజాలమిన్. 241

సీ. ఘనపురాతనభక్తకథలు విన్వీనుల
వెలఁది లేఁబల్కులు వినఁగగోరు
గురుచరేశ్వరుల మక్కువఁబూన్పకరముల
నంగనకుచయుగం బంటదివురు
కరతలన్యస్తలింగముఁగనుకన్నుల
సుదతిచక్కఁదనంబుఁ జూడనెంచు
త్రివిధప్రసాదముల్ చవిగొనుఁజిహ్వచే
నతివసుధారసం బానఁదలఁచు
గీ. కలితనిర్మాల్యవాసనల్ గాంచుగాన
చెలియనెమ్మేనతావులుఁజెందగోరు
నట్లు పంచేంద్రియవ్యవహార మెల్ల
నంబుజాతాక్షియందున హత్తుకొల్పె. 242

క. ఇటులుండికొంతవడికా, కుటిలాలకపలుకు వినెడి కుతుకంబునఁబె
జ్జటియిటులబల్కెనత్తరి, పటుతరమోహాతిరేకభావుం డగుచున్.

క. ఎవ్వరిదానవుజవ్వని, యివ్వనికేకతమవచ్చు టేమనిమదిలో
నవ్విభులూరుచుఁబల్కిన, నవ్వారణయానయిట్టులనియెనతనితోన్.

ఉ. దేవ మహానుభావ భవదీయపదాంబుజదర్శనేచ్ఛధా
త్రీవరమాళియంప నరుదెంచితి దొమ్మఁశీటిమేతరిఁ
డైవిలసిల్లుచామయకు నాత్మజ చెన్నకపేరుగాన వి
ద్యావిభవంబు గాంచి కరుణామృతదృష్టిఁ గృతార్థఁ జేయవే. 245

క. అనవినివనితాతనునూ, తనయావనఘనతగనిముదమునొందినయ
మ్మునియప్పలుకులకెంతయు, ననురాగమునొందియిట్టులనిమొవనితతోన్.

చ. కలితభవద్వియోగరిమకన్నుల కింపుగగాంచినంతనే
తలిరులవింటిజోదుబెడిదంబుగ నీకడకంటివాఁడిచూ
పులఁ బలునారసంబులుగఁ బూనిమెదంగురిచేసి యేయునో
చిలుకలకొల్కిసాహృదయ నీమచెలింపఁగజొచ్చె హెచ్చుగన్. 247

క. కలతెఱఁగుదాఁచనేటికి, చెలియా నీయెడలవాంఛ చెందినయదియ
వ్వలరాజుబారిద్రోయం, దలఁపక రతినేలుమతిముదంబిగురొత్తన్.

ఉ. కూరిమిశిష్యుఁడై వినుతిగొన్నమహాత్ముఁడుగానవేడ్కనా
కోరికదీర్పఁగాబుడమి కొమ్మమగండిటు నిన్నుబంపెనో
వారిజగంధినీచిగురువాతెరతేనియగ్రోల నిచ్చి య
మ్మారునితాపవేదనలు మాన్పఁగదే యిదె నిన్ను వేఁడెదన్. 249

ఉ. నావుడు చెన్నసానివదనంబునలేనగ వంకురింపఁగా
నావలజిక్కమేటి ద్విజనాయకుఁడంచు మదిందలంపుచున్
ధీవరయిట్టులాడఁదగునే మిముబోటి మహాత్ములైనవా
రీవిధికిచ్చఁజేతురె గణింతురె కంతుభవానురాగమున్. 250

ఉ. కామసుఖారిసంచయము గండడగించి మహేశదివ్యనా
మామృతపానతృప్తి దనరారి కరస్థలలింగలీడవీ
తామతి నాజపంబుననుఖంబెడగోరక రాజయోగని
ష్ఠామయులైనవారికి కటాతగు నేయిటువంటిమోహముల్. 251

చ. అని యిటుపల్క విన్నదనమాననమందునగానుపింప ని
ట్లనుననబోఁడి నీవిటులనారడి పల్కులు పెక్కుపల్కుచు
లక్కననువీఁడనాఁడి చనఁగాఁదగునే సొగసైన నీదుచ
న్నొనల నురమ్మునంబిగియనొత్తి కవుంగిటఁజేర్పు మిత్తరిన్. 252

గీ. మున్నొడయనంబిముఖ్యులు మోహవృత్తి
వాసిగోల్పోయిరేయందువారికంటె
నేను ఘనుఁడనే మరుమాటలేల లీల
పూవువిలుకాని కేళిననేలుకాల. 253

చ. అనవుడు కేలుమోడ్చి వినయంబున నిట్లని విన్నవించెన
జ్జనసుత తాపకీనతను సంగతి నేగడు ధన్యనౌదు మీ
యనఘతపోబలంబునకు హాని ఘటించునటంచు గొంకి తిం
పెనయఁగ మీయభీష్టమిపుడెట్టుల నట్టుల చిత్తగింపవే. 254

గీ. అనిన నమ్మాటకర్ణరసాయనముగ
చెవులు సోకినయంత దేశికవరేణ్యుఁ
డార కోరినకోర్కి చేకూరెననుచు
నాత్మసంతసమందు నయ్యవసరమున. 255

ఉ. వారిజమిత్రసింహము దివస్పతిదిగ్గిరినిర్గమించి దై
త్యారిపదాటవీస్థలిదినాఖ్యమదేభము వెంటనంటి శ
త్సారమదం బెసంజరము శైలతటంబున జెంది సక్తర
క్తారుణదేహమై యరిగె నగ్గిరిమాటునకుత్తరయంబునన్. 256

చ. వనరుహమిత్రుఁడ స్తగిరిద్రావాలుతరిం గవపీడుజక్కవల్
ఘనతరశోకమందఁగని కాంతుఁడు నల్గవయుంగరామనం
బునఁగడు సైఁపలేక నివి పొక్కఁబనేమి యటంచు వారుణీ
ఘనకచవానిబల్కినుకఁ గన్గొనె నానెఱిదోచె తద్దిశన్. 257

చ. పనిగొని కాలమాంత్రికుఁడు పాంథవిదారణరాత్రిశక్తి నే
ఫునన్సృజియింపఁగాఁ జరమభూధరవేదికసాంధ్యరాగవ
హ్ని నిలిపి పద్మబాంధవఘృణిస్ఫుటవల్లవరాజి వెల్వ హె
చ్చిన సిత ధూమముల్ దెసలఁజెందె నినాదము లొప్పె నెల్లెడన్.

చ. చటులధ్వాంతగజాధినాథుపయి నాచ్ఛాదింపఁగా నొప్పు వి
స్ఫుటతారాపథనీలపట్టవననాభోగంబునం జిత్రితో
త్కటపాండుప్రసరంబులో యనఁగ దిక్కాండంబులంగాంతి మి
క్కుట మై పర్వఁగ తారకావళులు గన్గొనయ్యె నప్పట్టునన్. 259

ఉ. ఖ్యాతమహీధ్రసంగతదవాగ్నులనిచ్చె నదీపముల్ చకో
రీతతి పేరట్రాంద్రు దివి రెక్కలు నీలవుపాత్ర నేసబ్రా
లాతతరాత్రియుత్ సరసిజాక్షి వరింప గజాధిరోహణుం
డై తనరారె నాఁగ నుదయాద్రిపయిన్ శశిదోఁచెవింతగన్. 260

చ. త్రోవ వికసించె... యుజ... ముల వ్యసించె ప

క్షితితిసిడ సంయమునిఁ జేరి సుషుప్తి సుఖంబుఁ గాంచె య
ర్ణవములఁ బ్రమోఁకమించె వలరాజుముదంబు నహించె చక్రముల్
కనవిడిసంచరించె శశికాంతశిలల్ ప్రవహించె నీరమై. 261

ఉ. ఆసమయంబునన్ గువలయాంబకబాణము లిందుపాదవి
న్యాసము లంగవేదన మొనర్పఁగఁ దాలిమి నిల్పలేక త
ద్వాసవరత్న వేణికరతామరసగ్రహణం బొనర్చి దా
భాసురసూనయుక్త మగుపాన్పునఁ దార్చి గురుండు వేడుకన్. 262

మ. సరసాలాపనఖక్షతాధరసుధాస్వాదాచ్ఛతాంబూలదో
ద్భరితాలింగనచుంబనాదికములన్ రంజిల్లు కందర్పసం
గరకేళిన్ రసవార్ధిఁ దేలి మలయాగస్పర్శనాంకూరకో
త్కరముల్ పర్వఁగ గొంతపొద్దుసుఖనిద్రం జెందె నవ్వేకువన్. 263

చ. సతి గురునాథుమేల్కొలిపి సామి భవత్కరుణాకటాక్షసం
గతిఁగడుధన్యనైతి చనఁగావలె వీటి కనుజ్ఞ నేయుఁ డీ
గతి తెలవారి నన్నిచటఁ గన్గొని కిన్కవహింపకుండు నే
క్షితిపతి మీకు లాఘవముఁ జెందకపోవ దటన్న నిట్లనున్. 264

చ. ఘననిభవేణి యొక్కత్రుటికాలము నిన్నెడఁబాసి నిల్వ నే
ర్తునె విరహాంబురాశి ననుఁదోఁచి చనం జరణంబు లాడు నే
పనిగొని నీవు నాదయినభాగ్యమునం జనుదెంచి తిప్పు డ
జ్జనపతియాజ్ఞ నేయు సని సాధ్వసమేటికి నే గలుంగఁగన్. 265

ఉ. నావుఁడు మీరువల్కువచనంబులు సత్యము గాని నే వినన్
భూవిభుఁ గానఁబోవలయుఁ బొమ్మనినం జని రాజుచేత సం
భావన లంది వేగ నిట వచ్చెద నే జనకున్న తండ్రికిన్
భావమునందు వేరె యొకపద్ధతి దోఁచు ననుజ్ఞయీఁగదే. 266

చ. అనవుడు దేశికుండు కమలాననభూపతిఁ గానఁబోవుటల్
ధనమునకై కదా వలయు ద్రవ్యము లిచ్చెద గొమ్మటంచు కాం
చనమణిభూషణావళులసంఖ్య మొసంగిన సంభ్రమంబునం
గొని వినయంబుతోఁ బలికె కోకిలవాణి నమస్కరింపుచున్. 267

ఉ. కన్నది యాది మజ్జననికన్నఁ బ్రియంబున గారవించు మా
యన్న యొకప్పుడుం దరియ యన్నముపొత్తున నాకు ముద్ద లీ

కున్నభుజింపఁ డల్లుగుట నొద్దిక పొద్దటిచద్దివేళదా
ర్కొ_న్నది కాచియుండు జనకుండిదె వేగమెపోయి వచ్చెదన్. 268

క. అనవుఁడునెన్నివిధంబుల, జనవలెననువాంఛనీదుస్వాంతములోనన్
జననంబయ్యెను గావున, జని వేగమ మరలి రమ్ము సరసిజనయనా.

గీ. ఈవువచ్చినదనుక నాహృదయమెందు
నొందదనికన్నుగవబాష్పబిందులురుల
గబ్బిచనుగుబ్బ లెదనంటఁ గౌఁగిలించి
సెలవొసఁగిపంప నంత నచ్చిగురుబోఁడి. 270

ఉ. అచ్చటవానియాత్మ ముదమందుచుఁ గ్రక్కున నీడు జేరఁగా
వచ్చినిజక్రమంబు తమవారల కంతయుఁ జెప్పి సద్గురుం
డిచ్చినవస్తుభూషణము లెల్లనుదంద్రికొసంగి మెచ్చిలో
నచ్చెరువంది కూఁతుగొని యాఁడుచు వేఁడుకనుండె నత్తరిన్. 271

మ. ఘనమందేహనిశాచరు ల్బలసి గ్గల్వెట్టనే తెంతురో
యనిపూర్వాచలదుర్గసీమజలజాద్యత్యాజ్ఞ తత్పూతనూ
తనసేనాపతి వెల్గుకై నిలువుచంద్రజ్యోతియోనాగ మిం
చిన తేజంబున వేగుచుక్క యుదయించెన్ చంద్రుతో నుద్ధియై. 272

ఉ. వాసిగకర్మసాక్షి యిదె వచ్చె నుషస్సమయోచితక్రియా
ధ్యాసులుగాక నిప్పు డనయంబున నిద్దురఁజెందఁ జెల్లదో
భూసురులారమీరకనుచుఁ బోద మొనర్చినమాడ్కి వేకువన్
గూసెవదాయుధప్రతతి క్రోయని కాలమెఱుంగు గావునన్. 273

చ. తెలతెలవారవచ్చె నలుదిక్కులు చీఁకటిఁబుచ్చెనండజం
బులరొద హెచ్చెవన్నగసమూహముపుట్టల జొచ్చె కైవరం
బులుమదినొచ్చె జక్కవలు పొందుగ మెచ్చె మనోభవుండుపూ
విలురతిచేతికిచ్చె నరవిందదళంబులు విచ్చె నచ్చుగన్. 274

సీ. అంధకారాతిబలాపహారుఁడవుట, పద్మాప్తసంజ్ఞ చేఁబరిఢవిలుట
జననుతంబగుత్రయీయాత్మనుతసర్తిల్లుట, సంతతనాకసంచారివగుట
కువలయోల్లాసవిఖ్యాతియుతుఁడౌట, చిత్రభానుఖ్యాతి ధాత్రిగనుట
బలుపలాశుల [illegible] సేయుట, [illegible]వారివగుట

గీ. నీవశివుఁడవు హరివిధులీవవజ్రి
నీవచంద్రాగ్నులును వాయువీవగుహుఁడ
నీవ యనిభక్తిచే జనులెల్ల మ్రొక్క
పూర్వదిగ్భూధరంబునఁ బొడిచె నినుఁడు. 275

గీ. అపుడు చెన్నఁడు నిత్యకృత్యములుదీర్చి
తండ్రి యనుమతిఁగైకొని ధరణినాథ
దర్శనం బొనరింపఁగ దగినవేష
మొకటినెమ్మది నూహించి యొరుపుదనర. 276

చ. పదకటినేశహస్తగళఫాలశిరంబుల నొప్పవన్నగాం
గదకవిచర్మశూలగరగంధవహప్రజటాళియుక్కెడక్
కుదురుగనిల్పి మున్నె తనకుంగలయట్టియలంక్రియల్ శుభా
స్పదముగ నొండువైవునఁ బొసంగనెసంగువిలాస మేర్పడన్. 277

క. తరుణి యిటులర్ధనారీ, శ్వరవేషముదాల్చి యాప్రజనములతోనా
గరికులరుదంద ధరణీ, వరునాస్థానంబుఁ జేర వచ్చిముదమునన్. 278

చ. ప్రకటమృదంగతాళఘనరావము లుప్పతిలంగ నిల్వ నం
తకమును దేశికప్రవరదర్శనకృత్య మొనర్చి సింహపీ
ఠకవసియించుభూపతివడిం గనిదిగ్గున లేచి నిల్చిహ
స్తకమలముల్ మొగిడ్చిమది దార్చె శివాధవుఁ డన్న భావమున్.

గీ. ఇటులభావించి యవు డమ్మహీతలేంద్రు
డీశ్వరాకృతిదాల్చిన యింతిప్రజ్ఞ
కద్భుతం బంది మితిమీఱునట్టివస్తు
వాహనాంబరభూషణావళు లొసంగె. 280

ఉ. ఇచ్చినవేడ్కఁ గైకొనిమహీతలనాథుననుజ్ఞ గాంచి ము
న్నెచ్చట నెవ్వ రిప్పగిది నీప్సితమిచ్చెరె యంచు నాత్మలో
నచ్చెరువందుచు న్మరలియందరితోఁ దమవీడు జేరఁగా
వచ్చి వినోదలీలలఁ బ్రవర్తిలుచుం జెలియుండె నచ్చటన్. 281

మ. సతితర్కజాల మొనర్చి చన్న మొదలా జాతీశుఁ డత్యంతమా
హితుఁడై వేగము వత్తునంచుఁ జని యామేణాంకబింబాస్యన
స్మృతినూహింపక యుండెనిప్పు డకటా నాభార్య యిట్లుండెనే

గతివేగింతు నటంచుఁ గ్రమ్మినమహాకామాంధకారంబునన్. 282

సీ. కొమ్మకై చిగురాకుఁ గొరికికోయిలగూయ
 నబల పల్కెనటంచు నాలకించు
కొలకులకై యంచకొదమరా గనుగొని
 ముదితవచ్చెనయనికదియుదివురు
సుమగుచ్ఛములవ్రాలి భ్రమరిఝంకారింప
 చెలివీణపల్కని చెవులఁ జొనుపు
కలికిగంధవుగట్టు గాడ్పుమైఁబొలయుంగ
 సకిమేనివల పని సంతసించు

గీ. నాత్మసంభవ హస్తవిన్యస్తనూన, చాపనిర్ముక్తకోరకశరసికాయ
మాతరిశ్వాపకీలాసమాజకృభ్రి, భాజనాత్మీయమానసాంభోజుఁడగుచు.

చ. కలవలమందు కుందుకడకన్నులనీరము హెచ్చు దెచ్చులో
నలమటమారు దూరుచెలియా యిటురమ్మని పిల్చునిల్చు మి
క్కిలివెతజిక్కుస్రుక్కువలకేలనొసల్ గదియించు మించద
న్వలగొను తాపవేదనలవాసి దొలంగి గురుండు దీనుఁడై. 284

చ. జలచరకేతనాబ్జపికచందనశైలసమీరహంసముల్
వలగొని తన్ను వొంపతలనంచుచు హాశిఖినేత్రహాసము
జ్జ్వలశశిభూష హాఘరణిజాధవసేవితపాదహాయధో
నిలయవిభూష హాశరదనీలగళాయని పేర్కొనున్ శివున్. 285

గీ. ఈరీతి వగలఁ బొగలుచు, నారీమణియందుమిగుల నాటినమదిచే
నీరమునన్నము ముట్టక, భారముగానొక్కగతిదినంబెడలించన్.

గీ. తరణిగ్రుంకె ఘోరతమమునల్దిక్కులఁ, గ్రమ్మెచీకురాలరవములెసఁగె
జారచోరనికరసంచారములుమీరె, విరహిజనులనొంపవెడలెమరుఁడు.

క. అత్తరిమత్తిలు చిత్తజు, కత్తులచే మొత్తఁబడి ప్రకంపితతనువై
హత్తినయుత్తలమునయా, బిత్తరిగనుతత్తరంబు పెంపెసలారన్.

క. శివపూజోపకరణములు, భవనంబున నొక్కచోటపదిలపఱచి శి
ష్యవితానమునకుఁ జెప్పక, శివమెత్తినవానిపగిది శ్రీగురుఁడలతన్.

చ. జనపతివిన్న నొమ్మనుచు జంగమభక్తులెఱుంగ చుల్కఁగాఁ
గనిమొదన్న కొంకుమదిగానక పౌరులుచూచి కేసి త

న్వెనుకొని గేలి సేతురని వెల్వెలబోవక లజ్జమానివ
ర్తివనతమినేగ వీటికయి వేగమ తామును విన్న జాడలన్. 290

క. ఈలీల కాముకన్యక, తోలజ్జాయ నెడు మాటధుర్యముగ నవుడ
బ్బాలామణినా వాసవ,టాలయమరయంగఁ జనుచు నంధతమము చేన్,

సీ. దామెన మోసులు దగిలియించుక మొగ్గి
గడలుపగ్గము లూతఁగా నిలుచుచు
కొ్రొత్త యాతనుగని కుక్కలు గురుపెట్టి
కరచునో యని దవ్వుగానరుగుచు
చిరుగు వెల్గులను క్రొంచెము దారిగనుపింప
వెసజనుచది యార దెసలరయుచు
నెడనెడ గుడిసెల పడతులను డువులు
పని చెన్ని మాటలో యని తలఁచుచు

గీ. నంధకారంబు గాఢ మోహాంధకార
మొక్క మొగివెలిలోఁగ్రిమ్మి పిక్కటిలఁగ
రేవుడప్పి చరించెడి వానకరణి
వీడుకలయంగ దిరుగుచు వేసరిలఁగ. 292

క. ఇట్టిమహాత్మనిశాహో,పుట్టెఁగదా చెడ్డవెతలు పొలతుకనిక గ
న్పట్టుగఁ జేయుదు ననిదయ, చట్టుల పగవాని దెస నిశాపతి దోఁచెన్.

గీ. అట్టితరిపండు వెన్నల పట్టపగటి
సరణిగా యంగ నందలి జనములతని
గాంచి జాతీశుగా నిశ్చయించి పలికి
రొండొరులతోడ నగుచు హాస్యోక్తులలర. 294

క. ఓహో చూచితిరే యీ, మోహాదివికారదూరు మునిచర్య బుధ
స్నేహార్జనరతు యువతీ, వ్యూహావిముఖు స్థైర్యచిత్తు నుత్తమచరితున్.

గీ. అతనుగురుధర్మగుణకాండహాతికినసురె, ... ... ... ...
వీటిలో రాజముఖులు సేవింపనిలక, వీటిలో రాజముఖులును వెదకవచ్చె

ఉ. ఎక్కడబోయెనో నియమ మెందున డాగెనో మానివృత్తియే
దిక్కునసుంజెనో తపము జేశికుఁ డన్నియు నుజ్జగించి మా

చక్కరబొమ్మకై యిటునిశాసమయంబున నేగుదెంచెన
మ్మక్క కనంగ నయ్యె యొకపై యిపుడీతని విద్దెయంతయున్. 497

చ. అనవుడు నొక్కచేడియ మహాత్మ్మని మీరిటులాఁడ గూడునే
యనియదలించి చెన్నక గృహం బిదెచూపెద రమ్మటంచుఁ దో
డ్కొని చని నిద్రిచెందునుమకోమలిలేపి గురుండువీఁడెవ
చ్చెననినఁనుల్కి లేచి వెరచెన్నెదు రేగి నమస్కరింపుచున్. 298

శా. సామీ నాయెడ చాలతప్పుగలదే చందంబున న్వచ్చెదో
యేమీరంపినవచ్చి చద్దితినిభూమీశాఢ్యుచే కామిత
స్తోమంబుల్ గొని వీడుఁ జేరినిలనిచ్చోఁకార్య మేమన్యమా
సీమం జేరుద మంచు నయ్యయనిర్గ సేవింపరాకుండితిన్. 299

చ. అనుచుఁ గరంబువట్టి వినయంబునఁ దోడ్కొనిపోయి శయ్యపై
నునిచి మనోజకేళి ముదమొంద నొనర్చి నెలంత కొంత సే
పునకిటువల్కె నాదయినపుణ్యమునం నినుగూడఁగంటిని
ట్లనిశము బాయకుండునటు లబ్బకపోయె నిఁకేమి సేయుదున్. 300

గీ. వీఁడుదరలిపోవు వేళయామాకిఁక, సెలవొసంగి మీరుశీఘ్రమేగు
డవనిపతిప్రభాతమైన మిమ్మర్చింప, వచ్చునప్పుడుండవలయునచట.

క. ననుచి త్తంబునమరువకుఁ, డని తక్కిడివగలలోచనాంబువులురులఁ
వనితామణికౌఁగిటఁజే, ర్చినగుండెధిగుల్లురనఁగ శ్రీగురుఁడనియెన్.

ఉ. కువలయపత్రినేత్రినినుగూడి సుఖంపక యున్న నాకుభూ
ధవునిసపర్య యేలమణిధామము లేలసమస్తభోగ్యవ
స్తువితతు లేలనీవరుగఁదోఁ జనుదెంచెదనీకటాక్ష మే
యవిరళవాంఛితార్థములకన్నిటికింగురు కాదెనావుడున్. 302

క. దొమ్మరికొమ్మఁ దగుల్కొని, దిమ్మరెనను లోకనిందఁ దెల్లకుమిదెళీ
ఘ్రిమ్మేనుమరలివత్తుని, జమ్ముగ నామాటనమ్మిచనుమనుడనియెన్.

సీ. జలజాక్షికిపెక్కుమాటల సనియేమి, నిందాస్తుతులాత్మకుఁ దగల నేర
వటుగా వునననిత్యమగుదేహమునవంటు, నిందకువెరవనీవిందుదిరిగి
వచ్చునంతకు నిలువఁగ నేర్తునేనిను, గలసిరా నీకుండుతలపుపుట్టఁ
జేసెనికా స్యము శుద్ధమనలదని, మానిచి తేలిమాయావనిక

గీ. మనుఁడు నేమియునన నేర కయ్యగారి
చిత్తమని సమ్మతించి యా చిగురుఁ బోఁడి
తండ్రిఁ బిలిపించి వార్తయంతయును దెలిపి
పీడు దరలింపు మిప్పుడ పీడననిన. 304

క. వీటిజనములకుఁ బయనము, చాటఁబనిచి సకలవస్తుసహితము గాన
చ్చోటు వెడలిరప్పుడ వే, హాటకనగచాపు భక్తుఁడరు దేరోఁడన్. 305

మ. చని కాశీనగరంబుఁ జేరియు చటుల్ సర్వంసహాభర్తనే
గిన కాలోచిత కృత్యముల్ సలిపి రక్తిం దేశికాధీశుద
ర్శనవాంఛం జను దెంచి తన్మణిగృహస్థానంబు నందాతనిం
గనకెచ్చోవసియించెనో యనుచు దానల్దిక్కు లీక్షింపుచున్. 306

ఉ. అచ్చటనచ్చటం దిరిగి యాతనిశిష్యులఁ గాంచి దేశికుం
డెచ్చటనున్నవాఁడన మహీధవ నిన్నటనుండి కానలే
దెచ్చటికేగెనో యెఱుగలేమని గుందుచుఁ బల్క వారితో
చెచ్చెరనవ్వనస్థలమశేషముగాఁగని యందు లేమికిన్. 307

ఉ. నమ్మినచారులం బిలచినాగురుఁ డెచ్చటనున్నవాఁడొ శీ
ఘ్రిమ్మున గాంచి రండు మణికాంచనవస్త్రము లిత్తునన్న వా
రమ్మనుజేశ్వరాజ్ఞఁ బురమంతయు నారసి యంద రొక్కటై
క్రమ్మరవచ్చి యుందతనిఁ గానఁగలేదని తెల్పనార్తుఁడై. 308

చ. హా యనుసన్మనోబ్జమిహిరా యను నన్విడి పోవనీకుఁ జ
న్నే యను నా యెడన్మిగులనేరము గల్గిన శిక్షసేయరా
దే యనునింతవింత గల దే యను నేగతిఁ దాళుదింక స్వా
మీ యను నెవ్వరింక కృపనేలఁగఁ జాలుదు రయ్యరో యనున్. 309

చ. ఇదె గురులింగజంగమమహిష్ఠపదాంబుజసేవనాపథం
బిదినిరపాయము క్తిరజనీశముఖీపరిలబ్ధిసాధనం
బిదిన గజామనోహరగణేశమహత్వమటంచు నెప్పుడు
న్విదితముగాఁగఁ దెల్పి కరుణించు గుహేశ్వర యెందుడాగెనో. 310

క. ఇటులరుగుదువని తెలిసిన, నెటుబోవక నీపదంబు లేబూన్చుచుని
చ్చటనిల్తు మోసమందితి, కటకటనను విడిచిపోవఁగా ళ్లైటులాడెన్.

ఉ. తల్లియుఁ దండ్రియున్ [illegible] దైవము నీవె యంచు నా

యల్లమునం దలంచిపరమోత్సుక వృత్తిభజింపుచుండునా
కెల్లడ నెవ్వరుంబడనియట్టిమనోవ్యథసంఘటించెబో
చెల్లునె రాజనఖ్యములిసీయనిరోసితి వేదయాకరా. 312

క. అనిపగలఁబొగులు జననా
థునిఁగనియొకమంత్రిపలుకుఁ దోఁచకదుఃఖం
ప నగునె తెలియనివాఁడవె
విను యొక్కయుపాయ మిప్పుడు వినుపింతు నృపా. 313

క. గురులింగజంగమంబులఁ, బరికింపఁగ నొక్కఁడగుటఁ బరమేశ్వరుద
ద్గురుఁడనిపూన్పుముజాతీశ్వరు నర్చించినఫలంబు సమకూరుననన్.

క. మఱియొకఁడుపల్కుమున్నొక
యెఱుకన్మనియొసఁగుమంత్రమే కాదె తుదిం
దరిఁజేర్చ నతఁడు చెప్పిన
నెరమంత్రముచేతముక్తి నిత్యతగనుమా. 315

క. అనవుడు నానియమం బెఱుఁ
గనివారలుబోలె పల్కఁగాదగునే యా
ఘనునిఁ గనుఁగొనినతుదిభో
జనమొనరుతునంచుఁ బల్కుసమయమునందున్. 316

గీ. చారుఁ డొకఁడేగుదెంచి జోహారుచేసి
నేటిప్రొద్దున దొమ్మరవీటితోడ
కాశికాపురికరుగంగఁ గాంచినాఁడ
ననఘుజాతీశునముడునయ్యవనివిభుఁడు. 317

ఉ. సంతసమందివానికి నసంఖ్యధనంబు లొసంగి భూతలం
బంతయు మంత్రిశేఖరున కప్పనఁజేసి మితాప్తవర్గుఁడై
భ్రాంతదరీఝరీసరిదరణ్యమృగంబులనెన్నకాతఁడ
త్యంతరయంబునంజనియె నాత్రిగుహాత్తముఁడేగుజాడలన్. 318

క. చనికనియె నెదుటకాశిన్, ఘనకల్మషభేకనికరగంధవహాశిన్
మునిసేవ్యతీర్థరాశిం, బినతాశ్రితభక్తలోకవిబుధవరాశిన్. 319

క. జనిఘురలక్ష్మీహారం, బన దగుగంగానదీతటాంతికమునని
ల్చినవీడుఁజొచ్చిజాతీశుసినగానరుయను చునడుగుచుంజనియొకచోన్.

ఉ. చామయయిల్లుగన్గొనిరసావరుఁడచ్చటచెన్నసానితో
సామెతగాఁగ నొక్కతళియం భుజియింపుచునున్న దేశిక
స్వామినిగాంచిమంటి భవసాగరముం దరియింపఁగంటి నీ
వేమహితప్రసాదమని యెంతయుభక్తినమస్కరింపుచున్. 321

క. డగ్గరికరమొగ్గిననవు, డగ్గురుఁడచ్చెరువుఁగదుర నవనతముఖుఁడై
సిగ్గుననూరకయుండిన, తగ్గనిధృతినతియుననియె ధరణీపతితోన్.

ఉ. ఈయననన్నుఁగూడివసియించుటకై చనుదెంచినెమ్మదిం
బాయనిప్రేమనేకమగు భాజనమందుభుజింపుచుండనీ
వీయెడగాంచియుంగొనెదవేని ప్రసాదముఁగొమ్మునావుడ
బ్జాయతనేత్రి కిట్లను ధరాధిపుఁడెంతయు భక్తిపెక్కువన్. 323

క. లింగశరీరవుదేశిక, పుంగవుదివ్యప్రసాదభోక్త్రివినీవీ
భంగిమదిసంశయించుట, కంగనగణియింపఁజాలనచ్చెరువయ్యెన్.

క. నామదిఁదెలియకపలికెదు, కామితమిబ్భంగి దేశికస్వామి ప్రసా
దామృతముగొనకచనని,యామానవపతిగురునకుహస్తముసాచెన్.

క. కరమొగ్గినధరణీశ్వరుఁ, గరుణామృతదృష్టిఁజూచికైవల్యపదా [మిన్.
కరసత్ప్రసాద మొసఁగిన, పరమామృతమనుచుగొనియెఁబార్థివుఁడెల

క. ఆసమయంబున శైలశ, రాసనుఁడవనీశుభక్తికత్యంతసము
ల్లాసంబునొందినలినజ, వాసవముఖసురలఁగొలువవాత్సల్యమునన్.

చ. అరుణజటాలిపల్లవములబ్జవికోధిఫలంబుపన్నగో
త్కరములతావళుల్ గరళకాంతిశిలీముఖరాజిభూమిభృ
ద్వరసుతచేగమానితతిపక్షిసమాజముగాధరిత్రికిఁ
సురతరుభాతిదోఁపఁ బొడఁజూపెఁగదంతికనీమనమ్యేడన్. 328

గీ. ఇట్లుప్రత్యక్షమైనసర్వేశ్వరునకు
పుడమిజాగిలిమ్రొక్కియాభూమిభర్త
ఫాలతలమునకెంగేలుకీలుగొల్పి
భక్తినొలుకంగ నిట్లనిఁబ్రస్తుతించె. 329

లయగ్రాహి. దండధరదోర్మదవిఖండనపయోజరిపు
ఖండధరపక్షివిభుకాండవపుకాండా

కాండావరిశోషఘునకాండజళరాపహార
భండశిఖినేత్ర ఫణికుండలధరిత్రీ
మండలశతాంగమునిమండలమనోనిలయ
పాండురశరీరగణకాండభవమేఘో
ద్దండపవమానకరమండితకరోటఖల
తుండిపలభాశిజయభండనవిహారా. 330

గీ. అనుచు సన్నుతించుజనపతిఁగని శర్వు
డాదరించి నీప్రసాదనిష్ఠ
కలరినాఁడ దివ్యయానమెక్కుము రాజి
తాచలమున కిప్పుఁ డరుగవలయు. 331

ఉ. నావుడు దేవదేవ గురునాథుకతంబునగాదె నీదు సం
భావనగాంచితీయెడల భావ్యమెయీఘనుఁబాసిరానర్క
భూవర వీని సిన్నుగొనిపోయెదనాఁగ గురుండుచెన్నక
న్నేవిడలేనటన్ననగి నీలగళుం డటుసమ్మతించినన్. 332

గీ. ఆసతీమణివయిటుపల్కు నాసపూని
నన్నుగనిపెట్టియున్నమాయన్నయప్ప
మొదలయినవీటిజనములవదలివచ్చు
టుచితమేయనదరహాసమొనరహరుఁడు. 333

క. గురురాజచెన్నకంద, త్పరసిజముఖివీటిజనులస్వర్ణవిమానో
త్కరములనిడికొని చనెనీ, శ్వరుఁడరుదుగరజతశైలసదనంబునకున్.

వ. కావునఁ బ్రసాదమాహాత్మ్యంబిట్టిదనిమాచిదేవాదిగణంబులతో సక
లేశ్వరమాదిరాజయ్య వివరించుటయు నందఱు నత్యాశ్చర్యంబున
నతనిఁబెక్కుభంగులంగొనియాడి నాగమాంబికచే ననుజ్ఞాతులై త
మతమనివాసంబులకుం జని రని తెల్పిన నగస్త్యుం డవ్వలికథ యెట్ల
య్యె నని యడిగిన. 335

శా. విద్వత్పూర్వసుపర్వవైరిపుర్ధపృథ్వీజాతభాస్వన్నభ
స్వద్వాహాంకకళాకిరీటపదపూజాశాలిమాహేశ్వరో
ద్యద్వాక్యశ్రవణానురంజితనిజాత్మాంభోజవిఖ్యాతసిం
హద్వారాంగణవేదశాఖలనరేశామాత్యజాతాంచితా. 336

క. ఉద్వధిపముఖీమన్మధ, రాడ్వల్లభ రాష్ట్రిదుర్గరక్షణదక్షా
షడ్వర్ణమంత్రవదనను, రేడ్వైభవపద్మభూమహితవాగ్విభవా. 337

పంచచామరము, ప్రభాతిశంబరప్రభూతబంధుకల్పభాకరా
శుభావహవ్రతప్రతానసూరిహృద్వశీకరా
విభావరీశఖేచరేంద్రవృక్షదానభాసురా
ప్రభూతనమ్రదోరుచిత్తపాలితాప్తభాసురా. 338

గద్యము. ఇది శ్రీమచ్చెన్నమల్లికార్జునకృపాకటాక్షలబ్ధకవితామాధురీధురీణకౌశికగోత్రపవిత్ర సుకవిజనస్తుత్య పాపయామాత్యప్రణీతంబైన చెన్నబసవపురాణం బనుమహాప్రబంధంబునందు ద్వితీయాశ్వాసము.



శ్రీరస్తు.

# తృతీయాశ్వాసము.



మద్గౌరారాధ్యశి
ఖామణ్యుపదిష్టమంత్రగతపదవర్ణ
స్తోమజప్రకరణరసనా
సీమా యమృతేశనామసేవితసోమా. 1

వ. అవధరింపుము కుంభసంభవునకు రేణుకుండు తదనంతరవృత్తాం
తం బిట్లని చెప్పందొడంగె. 2

ఉ. ఆగ్రహదూరుఁ డన్యసమయప్రవిదారణశూరుఁ డాత్మవిద్యా
గ్రహణప్రచారుఁ డఖిలామరలోకవిహారుఁ డంబికా
విగ్రహభక్త్యుదారుఁడు వివేకవిచారుఁడు సిద్ధరామయో
గ్యగ్రణిసొన్నలాపురమునందువిలాసగతిన్వసించుచున్. 3

మ. ఫలకృద్దేశికపాదపంకరుహషట్పాదుండు వేదోక్తషట్
స్థలవిజ్ఞానవిశారదుండు శిఖిగంధర్వావతారుండుని
ర్మలకీర్తిద్యుతనిర్జితాద్రిరిపుసారంగాయుధుండంచుభ
క్తులుసెప్పన్వినినాగమాత్మజునిగనోర్కుల్మదింబర్వఁగాన్. 4

ఉ. అణిమమాదియాపలములన్నియడంచుచుశాతకుంభముం
గాణవరాటకంబుసరిగాఁగనుచున్ జరియించుసింధురా
ట్త్రాణపదాబ్జసేవకులతోనెడమించుక లేకయుండుక
ల్యాణపురంబుఁజేరి హృదయాద్భుతమొప్పఁగఁజూచిమెచ్చుచున్. 5

గీ. అరిగిచెన్నవృషేశుమందిరముగలసి
ద్వారపాలకుచేఁ దనవార్తఁ జెప్పి

పసుపుఁ జనిసిద్ధరామయ్య యను నొకండు
వచ్చె దేవరదర్శనవాంఛ ననిన. 6

చ. అతఁడు మహాత్ముఁ డీశ్వరకృపాయుతుఁ డేయుగుగా నిషట్స్థల
వ్రతసహితుండుగా మియిట రాజనదచ్చట నుండ జెల్లఁ డే
గతియని నెమ్మదిం దలఁచి గ్రక్కున వేఁడ్కొ భక్తిఁ బిల్చి మా
స్థితులను జెప్పి సమ్మతిలఁ జేయుము నేని దెవత్తు నావుడున్. 7

క. చనియతఁడు సిద్ధరాముని, గనుఁగొని మీరాక కతివికాసహృదయుఁడ
య్యెను చెన్నబసవధీమణి, యనిక్రమ్మర నిట్టులనియె నతివినయమునన్.

చ. అనఘప్రసాదభోగసమయంబిది తద్వ్యధిదీర్చి మిమ్ముఁ గ
న్గొననిటవచ్చు దచ్ఛరణకుంజరుఁ డన్నమదింగలింగిపా
ఘనతరలింగసంగతుఁడు గామిగ దాయిటులయ్యెఁ గాన
యీతనిగురుగా భజించి యమృతప్రదచిన్నయదీక్షఁ గాంచెదన్. 9

గీ. ఎంతవిజ్ఞానయుతుఁ డైన నిష్టలింగ
ధారకునితోఁడ సరిబోల్పఁదగదటంచు
వేదశాస్త్రములెంతేఁగింప వినియు నింత
కాలమూరకవృధచేసి బేలనైతి. 10

గీ. ఇవుడు నాభాగ్యవశమున నిందుజూటు
తుల్యుఁ డైనట్టిగురుమూర్తి దొరికెననుచు
నాత్మసంతసమందు నయ్యవసరమున
భక్తతతితోడ శ్రీచెన్నబసవవిభుఁడు. 11

సీ. చనుదేర రామయ్యకనిభక్తి జాగ్రమొ
క్కన లేవనెత్తి కౌఁగిట నమర్చి
యనుభవమంటపంబునకుఁ దోడ్కొనిపోయి
యుచితాసనంబున నునిచి తాను
భక్తులతో మణిభర్మాసనస్థుఁ డై
రామయ్యగని పల్కె రాజయోగ
నిష్ఠాగరిష్ఠ నిరతిశయానంద
పరిపూర్ణ నిరుపమభావశుద్ధి

గీ. నిన్ను బేర్కొనుచో నోరు నెన్నఁదగునె
సదయమీరాకచే నేఁడు సుదినమయ్యె
నిందుధరభక్తలోచనానందమొదవె
ననుచు ముకుళీకృతకరాబ్జుఁ డగుచుఁ బలికె. 12

ఉ. లౌల్యగుణప్రచారు నవిలక్షణయోగవిహారుచారుసా
శీల్యవిదూరు నన్ను శశిశేఖర పాదపయోజభక్తరా
ట్తుల్యునిగాఁగ మీరిపుడు తూగివచించుట దానుసందువా
త్సల్యముగాక నేనరయ తద్వ్రతనిష్ఠులసాటివత్తునే. 13

ఉ. దేవ మహానుభావ భవదీయవచోగరిమంబు రిత్తయై
పోవఁగ నేరదట్లగుటఁ బూర్ణకృపామతి తత్ప్రసాదపా
ఖ్యావహు జేయుమార్గమిపుఁడారసి యారసికాగ్రగణ్యభ
క్తావళిలోనొకండనగు నట్లగు నన్ను ననుగ్రహింపవే. 14

చ. అనుడు ముదంబునొంది దరహాసము మోమునఁ బర్వ సిద్ధరా
మునిగని పల్కు నోకలుషమోచన నీమదిగంటి సంతతం
బును హృదయారవిందమునఁ బూని శివున్భజియింపుచుండుపా
వనుఁడవు నీకు వేఱె యొకవాంఛితమేటికి దీక్షగైకొనన్. 15

ఉ. నావుడు ప్రాణలింగభజనంబున నెంత సమర్థుఁడైన దీ
క్షావిధి నిష్టలింగధరకాయుఁడు గామి ననూనవీరశై
వావహుఁడౌనె కావున దయాపరతన్భవదీయశిష్యుఁగా
భావనచేసి యిక్కొఱఁత బాయఁగ జేయఁగ దేరయంబునన్. 16

వ. అనిన చెన్నబసవేశ్వరుం డిట్లనియె. 17

క. నీకు గురుత్వము నేయుఁగ, నాకోలఁదియె నిష్టగామనంబున దృఢమై
యీకోరికయే గలిగిన, గైకొను మొక్కరుని గురుసిగా వీరలలోన్. 18

గీ. అనుచుఁ బల్కిన సిద్ధరామయ్యభక్త
సంతతికిఁ జాగి మ్రొక్కి మత్స్వాంతమెఱఁగి
దీక్ష యొనరింపుమని కృపాదృష్టి మెఱయ
చెన్నబసవేశ్వరునితోడఁ జెప్పరయ్య. 19

వ. అనిన. 20

ఉ. అమ్మాటల్విని యందునున్న ప్రమథాధ్యక్షవ్రజంబేకవా

ద్యమ్మింపొంద మహాత్మ రామయకు మీాయం దేసురత్వంబుహృ
ద్యమ్మైయున్నది గాన మాయనుమతిం దద్వాంఛ చేకూర్పిగ్గై
కొమ్మామ్మయన్నగణాజ్ఞమాలినిడెమెం గోటీరభావంబునన్. 21

శా. ఈలీలన్ గణశేఖరాజ్ఞగొని నీయిష్టంబుచేకూర్తుర
మ్మామ్మలింగార్చన సేయఁగావలయు లెమ్మామ్మయంచుమున్నట్లుల
వ్వేళందీర్వనొనర్చి దీక్షగొనశే వేమంచిదంచున్ని యో
గ్యాళిం గేహమలంకరింపఁబనుపన్ హర్షించి చోద్యంబుగాన్. 22

సీ. సౌరభంబీనుకస్తూరిగేహములల్కి, ముత్తియంబుల దేలిముగ్గుదీర్చి
గోడలుసొగసుగాగుంకుమచేఁబూసి, బహువిధచిత్రరూపములవ్రాసి
పొందుగా వెలిపట్టుచందువాలమరించి,నవరత్నమయతోరణములుగట్టి
కదళికాస్తంభముల్ పొదిక్కెళ్లనమరించి, కేతువులందందగీలుకొల్పి

గీ. మఱియునివ్విధమునఁ బెక్కుతెఱఁగులమర
మంగళప్రదలీలచే మందిరముల
లంకరించినఁగని మెచ్చిసాంకరేష్ట
గోష్ఠినవ్వేళగడిపి వేగుటయు నంత. 23

వ. చెన్నబసవేశ్వరుం డరుణోదయంబునమేల్కాంచి నిత్యకృత్యంబులు దీర్చి సమస్తభక్తసంఘపరివృతుం డై దీక్షాగేహంబునకుం జని తన్మధ్యంబున శాతకుంభ చతుస్స్తంభ గుంభితంబును ప్రవాళప్రసూనమంజరీఫలముక్తాదామాభిరామోల్లాభ శోభితంబును నానావిధపరిమళోపేతధూపధూపితంబును కర్పూరదీపదీపితంబును నగుమంటపంబు గదియం జని యందు పంచవర్ణచూర్ణంబులచే గౌరీతిలకం బనురంగవల్లి రచియింపం జేసి తచ్చతుర్దిఙ్మధ్యస్థలంబుల శాలితండులంబులపోయించి వానియందు పానీయపూర్ణకలశపంచకంబు నిలిపి తత్పశ్చిమప్రదేశంబున దానుదివ్యసింహాసనంబున నాసీనుం డై చతుర్దిశికుల చతుఃకలశంబులనొద్ద నధికారులయియుండునట్లుగా నియమించి తక్కిన భక్తానీకంబుల నుచితాసనంబులనునిచి మధ్యకలశంబుగాఁ గొని వారునుం దానును తత్కలశంబుల గంధపుష్పోదకంబులం బూజించి తదుపరి నూతనవస్త్రావరణంబుగావించి కాంచనరత్నంబులు వానియం దిడి చూతప్రవాళతాంబూలీదళంబులు తన్ముఖంబున

నిలిపి మైదుకలశంబులకుఁజుట్టి రాతంతువేష్టనంబొనరించి తత్కలశంబులు పంచాక్షరీపంచబ్రహ్మమంత్రంబులనభిమంత్రించి ధూపదీపాదులొసంగి యచ్చటనున్నభక్తపుంగవుల విభూతితాంబూలపూర్వకంబుగానారాధించి వారిచేదీక్షయొనరింప ననుజ్ఞాతుండై భేరీవేణువీణాదిరావంబులు చెలంగ నంతకమున్న సుస్నాతుండై భస్మరుద్రాక్షధారణంబొనరించి మంటపపూజానంతరంబునవచ్చి యచ్చటవసియించి సిద్ధరామయ్య డాయంబిలచిన నతండు పరమాత్మైక్యంబున నరుగుదెంచి భక్తసమూహంబునకు సాష్టాంగదండప్రణామంబు లాచరించి తదనుజ్ఞ గాంచి గురుపదంబులకెరఁగి ముకుళీకృతకరుఁడై యున్నఁగృపావలోకనమాత్రతత్ప్రాప్తనకర్మంబడంచి మంటపప్రదేశంబున శిష్యుంబూర్వాభిముఖుంగాఁగూర్చుండంజేసి, తాను నుత్తరాభిముఖుండై తత్కలశోదకంబుల నభిషేచనం బొనరించి శైవసంస్కారుంజేసి వీరశైవదీక్షావిధానంబునఁదప్పనీక ఫాలసంగతదుర్లేఖలణంగునట్లుగా భూతిపట్టంబుగట్టి నిజహస్తస్పర్శనంబున తత్తనుగత పంచభూతవికారం బుడిపి పంచాక్షరీమంత్రోపదేశంబుఁ గావించి మాయాధ్వాంతాహంకారాదిగుణరక్షితుంజేసి బ్రహ్మంబును బ్రహ్మేంద్రాదిలోచనాగోచరుండును సర్వగతుండును నగుపరశివమూర్తి నవయవరహితంబును జ్యోతిర్మయాకారంబును సకలమూర్త్యతీతంబును నగులింగమూర్తిగానియమించి షడ్వర్గపూర్వకంబుగా గాంచి యాలింగంబునకు పంచామృతస్నపనంబుగావించి సర్వోపచారంబులర్చించి శిష్యమస్తకస్థితకళభావానుగతంబుగాఁగని యాకర్షించి లింగంబునందు మంత్రోక్తంబుగాఁ బ్రతిష్ఠించి యాలింగంబాత్మచ్ఛాత్రనికరంబునందునిచి వీని నెడఁబాయకుండుమని యద్దేవుంబ్రార్థించి శిష్యుంగాంచి లింగమూర్తిం బ్రాణపదంబుగా ధరియింపుము ప్రమాదంబుఁజెందెనేని దేహపరిత్యాగం బర్హంబని తెలిపి లింగాంగైక్యక్రియానిపుణుంగావించి ప్రసాదాంగుంజేసి వాయుప్రాణసంబంధం బెడలించి లింగప్రాణుఁగావించి జీవన్ముక్తిహేతు వీరశైవరహస్యంబు లన్నియుం దెలిపి తీర్థప్రసాదోపభోగుం గావించిన సిద్ధరామవిభుండును పరమానందకందళితహృదయారవిందుం డై

నిత్యనిర్గుణానుపమానందమాయాద్యంతరహితబ్రహ్మంబగు లింగ
మూర్తినొసంగు గురుమూర్తి యైనచెన్నబసవేశ్వరపదంబులు
కెరఁగి దేవా భవదీయకరుణావశంబున గురుచరేశ్వరులసపర్య
లొనరింపంగంటి మీప్రసాదంబున కర్తుండనైతి భక్తగణంబుల
లోవన్నియ కెక్కితి నని పెక్కుభంగులం గొనియాడుచుండు సమ
యంబున నచ్చటిగణంబులు. 24

క. జలజాసనాదిసురలకు, దెలియంగానలవిగాని దివ్యామృతముం
జలపట్టి కాంచితౌరా, భళి రా శ్రీసిద్ధరామ పావననామా. 25

గీ. మలయజమునఁబువ్వమానికంబునదీప, మమృతమందుచేగహాటకమున
పరిమళముచెరకున పండుచిత్తరువున, జీవముక్తులిన్నఁ జెందెనీక.

చ. అనివినుతింపవారు బసవాధిపుఁ డిట్లను నయ్యలారయీ
యనఘుఁడుపిన్ననాఁడె మదికందని శ్రీగిరినాథు మల్లికా
ర్జునుగొని తెచ్చి యాత్మపురిఁ జోద్యతరంబుగనిల్పెఁ గాదె యీ
తనిచరితంబు లెక్కయిడఁ దామరచూలికి నైన శక్యమే. 27

క. అనవుడునత్యాశ్చర్యం, బునవారలు చెన్నబసవపుంగవుగనియే
యనువునశ్రీగిరినాథుని, గొనితెచ్చెను వినగమాకు కోర్కిజనించెన్.

ఉ. ఆవిధమానతీవలయు నన్నఁగరంబులుమోడ్చి పల్కెనో
ధీవరులార తత్క్రమము దెల్పెద నెప్పుడు సొన్నలాపురిం
దావిహరించు ముద్దయయసంభవపాదపయోజభక్తుఁడా
పావనుఁడీశునింగనియె భర్గజయాప్తి శుభాంగియందునన్. 29

గీ. కాంచియల్లారు ముద్దుగాఁబెంచుచున్న
నాఁడునాఁటికి తనయీడుజోడువారి
గూడి వేడుకనాడుచుఁ గొన్నినాళ్లు
శైశవక్రీడలెల్లను జరుపుచుండి. 30

క. తలిదండ్రులయనుమతిదూ, డలగాయఁగబూనిగొరువడముచల్లడముం
దలచీరకోలకిగుచె, ప్పాలుబిల్లనగ్రోవి యమరబాలము దిరుగుచున్.

ఉ. శ్రీగిరినాథుదర్శనము సేయఁగనేగెఁడు నట్టిసర్వదే
శాగత [illegible] యచ్చోపరమూ నరదట్టగతిం

ఁబోగులు గూడి యచ్చటికిఁబోయెదరో యని యెంచి యందు వే
దాగమవేది యైనశరణాగ్రణి నొక్కరిఁ జేరి యిట్లనున్. 32

ఉ. కావటిబొట్టెలేకుసారకాయలు బుఱ్ఱలుకంట్లపెద్దలు
న్నోమఁగవెక్కసం బైనమూటలుమున్నగు వానిఁగొంచుమీ
రీవిధినెందువోయెదరొ యేర్పడనాకెఱుఁగంగఁదెల్పవే
నావుడు మందహాసవదనంబున నిట్లని పల్కెవానితోన్. 33

చ. మునులకు టెంకి భక్తులకు ముంగిటిపెన్నిధి తీర్థకోటికిం
జననపుటావునర్వసురసంతతినిల్కడపట్టుముక్తిభా
మినికి నివాసభూమి ఘనమేచకకంతువిహారదేశమై
ఘనతవహించు శ్రీనగముఁగన్గొనఁ బోయెదమన్న నిట్లనున్. 34

ఉ. అందఱుగుంపులై చనఁగ నచ్చట నెవ్వనిగల్గె బెండ్లికో
బందుగులున్నవారొ తెలఁబల్కుము నావుడు వత్సతన్నగం
బందునమస్తదేవనిచయాధిపుఁడై తగుమల్లికార్జునా
ఖ్యేందుకిరీటిగన్గొనుట కేఁగెదమంచు వచింపఁ గ్రమ్మరన్. 35

గీ. అనియె గిరిమల్లికార్జునుఁ డనఁగ మునియొ
దేవుఁడో నేలఱేఁడొ యత్తెఱఁగుదెలియఁ
జెప్పవే యనిపల్కినఁ జిరుతవాని
మాటఁబోద్రోవఁజాలక మగుడ ననియె. 36

గీ. తాపసుండును గాఁడు భూధవుఁడుగాఁడు
దేవతాధీశుఁ డగుమహాదేవుఁ డనిన
సామియాసామిరూప మేచందమొక్కొ
యెఱుఁగు దేతేఁటపడఁ జెప్పు మిప్పు డనిన. 37

ఉ. కేలనుపోటువాలు దులకింపఁ దలందొగ మేలుమేనిసా
బాలున నాలుకెంజెడలపట్టినదొక్కసలాడుచుండుపె
న్జాలుపిరుందగబ్బిపొడచారలవన్నెమెకంబుతోలు
డాకాలునగండపెండెవుచొకారవుడాలుమగల్గుసామికిన్. 38

గీ. నందియెక్కుగిత్త నాగులుసొమ్ములు
చేదుమెడనుబ్బునుకచేరుబూది

నుదుటనరలుగొన్నరుదురాక లెదగల్లు.
నయ్యయొరవుదెలుప నలవియగునె. 39

క. అనుటయు నాజేజేదొర, గనుగొనఁగామనసువుట్టె గావున నీవ
జ్జనదుగుదెంతుననుఁదో, డ్కొని చని కాన్పింపుమనినకుఙ్ఞనికనియెన్.

చ. అడవులగొండలన్నడిచి యన్నము వేళకులేక యెండలం
బడలికఁజెంద లేవు పసిబాలుఁడ వాప్తులతల్లిదండ్రులం
విడిచను డేరనీకగునె వీరడిబుద్ధులుమానుమీడనే
దడవువసించిరన్ వరుస దవ్వగునేగెదనన్న నిట్లనున్. 41

ఉ. కూడదు దారికష్టమని కొంకు జనింపఁగఁ జెప్పకయ్యనా
యీడగుకుట్టలీవపున నెందఱు లేరటు చూడువారితో
జోడుగనీపిరుందనగుచుం జనుదెంచెద తల్లిదండ్రులన్
వీడఁగఁజాలుదంతబలు వేలువుగన్గొనుభాగ్య మబ్బినన్. 42

చ. అనవినివీనిరమ్మనుట కర్హము గాదిది మాన్పగూడ దె
ట్లని మది సంశయించి శరణాగ్రణి యూరక పోవుచుండి
ద న్వెనుకొని వచ్చుబాలుఁగని వీఁడెటులన్విడఁ డంచు నెంచిదో
డ్కొని యులయంగనీకసిరి కొండకు వేడుకఁబోయి యచ్చటన్. 43

వ. తదీయమహిమావిశేషంబు లిట్లని చెప్పందొడంగె. 44

సీ. ఇదితీర్థసందోహ మిదికుండసంఘాత, మిదిమంటపవ్రాత మిది వనా
యిదిగోపురానీక మిదినందులిపిభృంగు, లిది శిఖరావళియిదివనంబు
లిదినదీనదజాల మిదిసాలమిదిగంగ,యిదిమూలికోత్కరంబిదిసరంబు
లివిమునిస్థానంబు లిది పరిఘా వార,మివిచిత్రకంబులునివిరథంబు

గీ. లివిమహాశక్తు లివి జ్యోతు లివి మఠంబు
లివియమణిమయఫుందంతు లివికుళంబు
లివినువర్ణాశ్మసముదయం బివితటంబు
లనుచు వేశ్వేరఁ జూపుచు నరిగి యంత. 45

సీ. కలితవజ్రోపలకల్పితకుడ్యంబు, శాతకుంభస్తంభసంభృతంబు
వైడూర్యరజితకవాటసందీప్తంబు, శక్రాశ్మజాలకాసముదయంబు
ఘనధూపపరిమళాక్రాంతదిగంతంబు, ప్రాజ్యకర్పూరదీపావృతంబు
నానాదిశాగతమానవాక్షీణంబు, వేత్రహస్తార్భటావిశ్రుతంబు

గీ. పటుచతుర్విధవాద్యవిభ్రాజితంబు, వేదవేదాంతపాఠకవిలసితంబు
రమ్యవారాంగనాలాస్యరంజితంబు, నైనశ్రీమల్లికార్జునాలయముగదిసి.
చ. పదిలముగాఁగ రమ్మనుచు బాలకుహస్తము వట్టి యబ్జభూ
త్పదనముఁ జొచ్చియందుఁగల సందడి మెల్లన యోసరింపుచు
న్మదమున నేఁగి యీశ్వరునిముందట మ్రొక్కుచు నిల్చియీతఁడే
సదయుఁడు మల్లికార్జునుఁడః చక్కఁగఁజూడుకుమారనాపుడున్. 47
మ. ఇతఁడా శ్రీగిరిమల్లికార్జునుఁడు స్వామీ లెస్సబాగాయెనీ
మతిలో నేమితలంచి దైవమనిసంభావించి కాన్పింపఁజూ
చితి నేవెట్టినిగాను వేలుపనిదర్శింపం గనాతోడనా
చతురత్వంబులు చాలు దేవునికదాచంబోక కాన్పింపవే. 48
వ. అనిన. 49
శా. ఏమేమీ వెడమాట లాడదవు వారిచ్చ న్విచారించక
స్వామీస్వామియితండుగాఁడనుట యేచందంబుగాకున్న చో
నీమర్త్యావళు లెల్ల భక్తిరతులై యేతెంచి వాంఛాఫల
స్తోమాపేక్షలఁగొల్వ నేమిటికి నీతోఁజేతునామేలమున్. 50
గీ. అనిన చిరునవ్వునవ్వి యోయయ్యతలఁప
కేరడంబున కిఁక వేరె దారిగలదె
బెల్లమనిచోడిపిండిచేఁబెట్టినట్టి
చందమయ్యెనునీవాఁడు జూడచూడ. 51
గీ. ఏమి వినుజాలు కనువాలు నిట్టికేలు
నేదితోల్చిరమెడచార యెముకకోర
యేదినెలకూనసామేననిడినచాన
యితఁడు జేజేలదొర యని యెటులనందు. 52
చ. అనవుఁ డితండు సావయవుఁ డైనతరింధరియించుచిన్నెలీ
యనవుననన్ను నీవడుగునట్టివిభావనగానికర్మదృ
ష్టినిగనరాదుగానమదిఁజేర్చకుసంశయమీశుఁడీతఁడే
వినుతియొనర్పు మొక్కు పదవెట్టితనంబులుమానిక్రమ్మరన్. 53
వ. అనిన నచ్చెఱుతండిట్లనియె. 54
చ. వారుఁడుమదిందలంప నొకయాకృతిగన్పడుఁగర్మదృష్టిచే

నరసిన వేరెరీతిదగునంచు వచించితివయ్య మున్న యా
దరమున మీరలాడునుడిదప్పగఁగూడునె నన్ను మీరలి
ప్పురసునఁబిన్న గాదలఁచి పల్మరుజిక్కులఁబెట్టఁ బాడియే. 55
వ. నావుడు తజ్జంగమనరుం డతనితోడ. 56
చ. హరుఁడెటువంటివాఁడనిన నాకృతిజెప్పితిచెప్పినట్లయా
స్మరహరుగానుపింపఁ దరమానుముబోటికిధ్యానగమ్యుఁడై
పరగునతండెయాత్మదయపర్వఁగసన్నిధియైనఁగాక యీ
ధరజనులెల్ల గొల్చుపరతత్త్వమిదే యిఁకలేదుకావునన్. 57
గీ. భక్తితోడమొక్కువరునక్రమ్మరిపోవు, చున్నదీడనింకయునికిగాదు
పోదమూరికిపుడు వాదులేమిటికిర, మ్మనినసిద్ధరాముఁ డతనికనియె.
చ. దయజనియించియూతని కతండిటురావలెగానినీవుని
ర్ణయముగఁజూపలేవుగదనాటకరాఁబనియేమిమీరుపొం
డయనకనేనువచ్చి జనులారడిసేయగసిగ్గుఁజెందనా
యయుతసమంబులైనళివునారసిక్రమ్మరివత్తునావుడున్. 59
చ. కలఁగుచుజంగమయ్య కనుగందునుదుర్గమసీమడించియే
కొలఁదిజనంగవచ్చుననుకూరిమిమీరఁగ బుజ్జగించియు
గ్గలముగమందలించి కొరగాదని బిట్టదలంచి యెన్నిభం
గులదనతోడ రామికేఁ దగులొఁకనునంచనియేగెనంతటన్. 60
చ. ఇటుతనుఁబాసియాశరణుఁడేగినపిమ్మటసిద్ధరాముఁడు
త్కటముగమూర్ఛఁజెంది బెడిదంబుగఁ గన్నులనశ్రుబిందువుల్
పొటపొటకాలనేలపయిఁ బొర్లుచులేచుచు నుస్సురంచుది
క్తటములుచూచి బెగ్గిలుచు గ్రమ్మినశోకముతోడ నాత్మలోన్. 61
ఉ. శర్వునిగానుపింతునని జంగమపర్యుఁడునన్నుఁదెచ్చి యీ
యుర్వరిడించిపోయె నయయో యిఁకనెవ్వరుదిక్కటంచులోఁ
బర్వినచింతరాముఁడటఁబాసిగనుంగొనువారినెల్ల వే
డార్వునిఁజూపలేరుగద యాదరణంబున నంచునార్తుఁడై. 63
గీ. గిరులచరుల ఝురులశిరులవీరులఁదగు, తరుల సిరులవరలు దరులఁబరుల
హరులకరుల నరుల బరగినవనముల, శరధి శరధి వరున నరసియరసి.
సీ. శారదకాన వేశారదాంబుదపర్వు, మన్మథకాన వేమన్మథారి

శాండిల్యకానవే శాండిల్యనుతపాదు, పాటలకానవే పాటలజటిలు
వారణకానవే వారణాజినచేలు, నమృతంబకానవే యమృతదేహు
స్యందనకానవే స్యందనాయితధరు, నభయంబకానవే యభయహస్తు
గీ. రాజవృక్షమకానవే రాజధరుని
బాణభూజమకానవే బాణవరదు
నందివర్ధనకానవే నందితురగు
ననుచు కుజములశివుజాడలరసి మఱియు. 64

గీ. ఘనుని శ్రీగిరిమల్లికార్జునుని మీరు
గనరె శ్రీగిరిమల్లికార్జునములార
యతులఖర్జూరశిఖరిప్రియాళుఁగనరె
యతులఖర్జూరశిఖరిప్రియాళులార. 65

వ. అని యడుగుచు. 66

క. తిరిగినచోటులె తిరుగుచు, నరసినతృణగుల్మలతలె యరయుఁగఁజనుచుఁ జూ
చౌరఁబారుగుహలె చొచ్చుచు, సిరిగిరిపతిగానలేక చింతిలియంతన్. 67

గీ. నడవలేక చిక్కువడి మేన చమటలు
గ్రమ్మ పెదవులెండ గంపమడర
నాదరించి జిడ్డు మనుదారి సింగాన
నుండియొక్కచోట గూరుచుండి. 68

ఉ. అక్కట జంగమయ్య యదుదందఁగఁ దెల్పిన నీదురూపమే
నెక్కడగాననైతి పరమేశ్వర నన్నలయింపఁ బూని యే
దిక్కున డాగితో యడవిద్రిమ్మరి వేసిరి నాడ యాఁకటం
జిక్కితిదప్పి స్రుక్కితిని నేనోకపల్కు కనైనఁ బల్కవే. 69

చ. కరుణదలిర్పనీవె పొడకట్టెదవంచు వచించె మున్నుయా
శరణుఁడు సేనుజాలిఁబడి సందుల గొందుల నుట్టి మెట్టలం
దిరిగియు నెల్లచోటులను దేవరరూపము గాననైతినీ
వరవుడనయ్యెదం నెనరువారఁగ నీవిక నైనరాఁగదే. 70

చ. కటికితనంబు నంబనుల కాపరికుఱ్ఱఁడువీఁడటంచు న
న్నిటువలెఁ గాసిఁబెట్టఁ జనుసే తలిదండ్రులఁ బాసి నన్ను మ
న్నుటకు గురుండ వీవనుచు నొచ్చితి మీములుగానయింక నే

సటపడనీఁక నాకనులు చల్లఁగ నిన్గనఁజేయు మ్రొక్కెదన్. 71

చ. నను వెతఁబెట్టకిప్పుడకనంబడితేని రయంబుమీఱనే
నినుఁగొనిపోయి మాకుఁగల నెయ్యుల బంధుల తల్లిదండ్రులం
బనుపడు వేగటాలసిరిబాయని యిందుల దొడ్డిమందలం
దనియఁగఁజూపెదన్నడువు దప్పబిరాలున నీవు రాఁగదే. 72

చ. తడయఁగ రమ్మునిన్నతిముదంబునఁదోడ్కొనిపోయి పాలుమీ
గడ నెయి వెన్న జున్నులు ఖండము గొబ్బరి పవ్వనాన బ్రా
లటుకులు దేనెపండులొడ్డియంబులు పానకమూరగాయల
ప్పడములు జీటిలాఁబెరుఁగుఁ బాళముకజ్జము నీకొసంగెదన్. 73

గీ. అనుచు నీరీతి సిద్ధరామయ్యతన్ను
దలఁచి ముగ్ధానులాపముల్ పలుకునట్టి
సమయమున మల్లికార్జునస్వామి నెనరు
దవుల నొకజంగమై వాని దరియవచ్చి. 74

ఉ. ఎవ్వఁడవీవు కాడుపడి యేకతమేటికి సంచరించెదీ
వివ్వనసింహగండకమదేభములాదిమృగంబులెల్లెడం
గ్రొవ్వియనేకముల్ తరుచు గ్రుమ్మరు నిన్నిటడించి పోవువా
రెవ్వరు మాకుఁ దెల్పుమిపుడేర్పడఁ జాలక యన్న నిట్లనెన్. 75

ఉ. సొన్నలయూరు ముద్దయకుసూనుఁడ దూడలగాయుచుండఁగా
నన్నొకజంగమయ్య గిరినాథునిఁజూపెదనంచు దెచ్చిము
న్నెన్నినవాసిఁజూ పిడకయిచ్చటనవ్వఁడనాడియేగెనే
తెన్నునగాంతుసామి నని ద్రిమ్మరి డస్సితినెందుఁగానమిన్. 76

గీ. అయ్య నీవైన నెరిగినయాతఁడుండు
చోటుఁజూపింప వేలుపుజూచినపుడె
యెలమినాపయిగోర్పడమిత్తునీకు
నమ్ముమనుటయుఁ జిరునవ్వు నవ్వి హరుఁడు. 77

చ. జడియకు మేలయేడ్చెదవు జంగమవర్యుఁడు చెప్పినట్టి యా
మృడుని గనంగఁజేతుఁ గడు మేలగు రార కుమార యన్న య
బ్బుడుతఁడు నెన్నొసల్ పుడమిఁబొందఁగ జాగిలి మ్రొక్కి వేడుకల్
వడసితి నయ్య మిమ్ము నెడఁబాయక వచ్చెద సామిఁజూపవే. 78

క. అనుఁడబ్బాలునిదోడ్కొని, చనిమల్లేశ్వరమనోజ్ఞసదనసమీపం
బున నిలచి లోన వసియిం, చినవాఁడదె చూడు రాజశేఖరుననిన్.

క. మనుజంగమువర్యుఁడు చూ, పినతల మే యిచట లేఁడు వేల్పాతనిలా
గుననన్నుఁ గాసిబెట్టక, చనమల్లేశ్వరుని బెంకిఁ జెప్పందగవే. 80

ఉ. నావుడలీకజంగమమునమ్మము నావచనంబు తప్పదీ
తావున నే వసించుకనుదమ్ములొకించుక మూసివిప్పుమా
దేవుఁడు కానుపించునని తెల్పి యదృశ్యతఁ జెంద బాలకుండా
విధమాచరించి ప్రియమందుచు గ్రమ్మరఁ దేరి చూచినన్. 81

మ. అనఘుండవ్యయుఁ డప్రమేయుఁ డచలుం డాద్యంతశూన్యుండనూ
తనుడానందమయుండగమ్యుఁ డఖిలాద్యక్షుండ చింత్యుండవా
మనుఁడద్వంద్వుఁడనామఁ డచ్యుతుఁడసూక్ష్మజ్యోతిరాకారుఁడా
ఘనుఁడాభక్తుఁడు చెప్పినట్లసగుణాకారంబుసంధిల్లఁగాన్. 82

క. కనుపట్టసిద్ధరామయ, యనుపమమోదమున నీతఁడయ్యా యెఱుఁగఁజె
ప్పిన వేల్పని జాగిలివం, దన మొనరిచియిట్టులనియె తద్దేవునితోన్.

ఉ. ఎక్కడఁడాగి యింత దడవెయ్యెడనారసి కాననైతి సీ
విక్కడికింతలో మరలియెప్పుడువచ్చితి వయ్య కానలోఁ
జిక్కియొకండ నే వెతలఁ జెందఁగనాదగుపుణ్యమూర్తియై!
యిక్కరుణాకరుండభయమిచ్చిటు రమ్మనిచూపె మిమ్ములన్. 84

క. కాకున్న నేమిగతియగు, నోకదయనితిరిగి యటగనుంగొనగణప
ర్యాకృతియచ్చటగాఁనఁగ, రాకుండినయతఁడుతత్తరంబగుమదితోన్.

చ. కటకట మోసపోతిగదె కన్నునుమూయు మటన్న మూసిన
న్నిటదరిఁ జేర్చు భక్తవరుఁ డెచ్చట కేగెనొ యేమి సేతునే
నెటుగనుగొందు నింక భ్రమియించి వెసం జననీక గట్టిగాఁ
జటికెనబట్ట నైతి ననిచింతిలుచుండ దయానుశక్తిచేన్. 86

సీ. చిరుతనిఁ జేరంగఁజీరి కౌఁగిటఁజేర్చి
తొడలపై నిడుకొని యొడలు నిమిరి
కూరఁటి పుడికి వైకుంఠాస్త్రి డిట్లను.
తనయుని ముద్దత్వమునకు మెచ్చు

వచ్చె నిన్నిటదోడి తెచ్చుట కై యల
భక్తు నీకడకు నేఁ బంపినాఁడ
యతఁడగపడడని యడలకు మనివాని
పై గప్పిగొనుగోరుపటము వజ్ర

గీ. కవచముగఁ జేసి యోగనేగములు పాల
నయనమును మరిస్పర్శవేదియు నొసంగి
యింటికేగుదుగాని నీ యీప్సితార్థ
మింక నలసినయదిగోరు మిత్తుననిన. 87

శా. గౌరీవల్లభ వాంఛితంబొకటి నేకాంక్షించెదన్నిన్ను నీ
వీహూపంబున నీశుభాలయముతో నీవేళ నావెంబడిన్మా
వారందరు సంతసంబునఁ గనన్మాయూరికే తెంచిబ
లాకారుణ్యంబున నెల్లకాలమట సౌఖ్యంబొప్పఁగా నిల్వవే. 88

క. ఇదిదప్పవేతెవాంఛిత, మదిలేదననీశుఁడనియె నాగతిసీవిం
పొదవఁగఁగోరినకోరిక, లొదవఁగఁ జేయఁదగుగానయొక్కటివినుమా.

గీ. లోకమునకుఁజూడ నీకుమున్జంగము, వరుఁడుచూపినట్టి పగిదినిల్తు
నీకుఁజూడనట్టియాకృతినుండెద, ననినసమ్మతించి యస్భకుండు. 90

వ. గౌరీశ్వరానుగ్రహంబున నసాధారణమేధాయుతుండై యద్దేవు
నిట్లని స్తుతియించె. 91

ఉ. ఫాలకృశానుకీలభవపాశవిమోచనశీలమానివ్యా
ల్లోలదయాలవాలహితలోకనుథాశనసాలకంఠకా
కోలవిధూతకాలశతకోటిధరాదినుతాలుపాలన
ల్లీలశినానుకూలవినుతించెద నిన్నిదె మల్లికార్జునా. 92

ఉ. శారదకందకాదపతుషారపటీరమృగేంద్రకుందఖ
ర్జూరమరాళవారిజమరుద్గజపారదహారహీరమం
దారసమీరకజేమనసుధాకరచంద్రనురేశ్వరరాశ్వభా
పారమణీశరాభనిజసంహననాంచితమల్లికార్జునా. 93

చ. అనివినుతించునాతనిప్రియంబునఁ గన్గొనిచెన్నమల్లికా
ర్జునుఁడనువత్సనీకెదురుచూతురు నీ తలిదండ్రులాప్తు లొ
కకనిముష మెండగాగనటు గావున శోధమటంచు నతఁణం

బునిజపాద సేవకసమూహవిహారిణి పొన్నలాపురిన్. 94

చ. కనకమణీమయాలయము కల్పనచేసి తదంతరోర్వినూ
తనఘనలింగరూపమునఁ దావసియించి యమేయభక్తిభా
జనమగుసిద్ధరామవరుసన్నిధినుంచి జగజ్జనాను
రంజన మొనరింపుచు న్నిలిచె శర్వుఁడు శ్రీగిరినుండి చాడ్పునన్. 95

చ. అటుకనిపట్టి పౌరజనులందఱు గన్గొని యద్భుతాత్ములై
యిటుమును పెన్నడిప్పగిది నీమణిదామముగాన లేదు
మిక్కుటమగు కాంతి నల్దెసలఁగప్పుచు నున్నదిచూడుఁ డంచునొ
క్కటప్రమదం బెలర్ప గుమిగాగుడి జేరఁగ నేఁగియుందునన్. 96

చ. అనుపమలింగమూర్తిఁ గనియందలి భక్తివసించు సిద్ధరా
మునిఁ దిలకించి యద్భుతము మోదము స్వాంతములందు నొక్కటం
బెనగొనసందు గొంద ఱతివేగమ ముద్దయచేరఁబోయి
నీతనయుఁడువచ్చి నాఁడనినఁ దక్షిణమాత్ర వధూనమేతుఁడై. 97

క. భవనము వెలువడితజ్జన, నివహముఁజూపించు దారినేనని యెదుటన్
నవరత్నఖచిత్రమైతగు,భవగేహముఁగాంచిచొచ్చి ప్రబలినతమిచేన్.

క. రెండవరుద్రుని కైవడి, నుండుతనయుఁజేర జపమహోత్సుకుఁడై యా
తఁడుజననిజనకసత్ప్రద, కాండజములకెరఁగి నిలువఁ గడువేడుకతోన్.

సీ. జనకుఁడు గూరిమితనయుఁగౌఁగిట జేర్చు
నాకులపావనా నా యశంబ
నాపెన్నిధానమ నాతండ్రి నాపట్టి
నాతపఃఫలమ యిన్నాళ్లునన్ను
నెడఁ బాసి యెచ్చటి కేగితివిచ్చటి
కెప్పుడు వచ్చితి వీగుడేమి
యీలింగ మెక్కడి దింతయు నేర్పడ
నెఱిగింపు మనుటయుఁ జిరుత తాను

గీ. వరుసతోఁగూడి శ్రీగిరికరుగునాఁడు
మొదలునగరుప్రవేశంబు తుదిగజరుగు
తనదువృత్తాంత మంతయు వినఁగఁదెల్ప
నెల్లవారలు సంతోషహృదయులగుచు. 100

గీ. భళిరజితకామ శాంభవభక్తిధామ
కమలసుఖధామ సమదృష్టకాంచహేమ
భువననుతనామపరిపంధినివహభీమ
సేవకావలి రాను శ్రీసిద్ధరామ.

క. బాలుఁడవై యుండియు నీ 101
లీల మహామహుఁడ వగుట లేశము దెలియం
జాల మయితి మిఁక నీ సరి
యేలోకమునందు నైన నెన్నంగల దే. 102

వ. అని యిత్తెఱంగునఁ గొనియాడి యేతల్లింగమూర్త్యభిధానంబెద్ది యని యందఱువిచారించి సిద్ధరామునిచే గొని తేబడు మల్లికార్జునమూర్తి గావున సిద్ధమల్లేశ్వరాభిధానంబిడి షోడశోపచారంబులం బూజించి గీతవాద్యాదులఁ గొంతప్రొద్దు వినోదంబు సలిపి తదనంతరంబ యబ్బాలుం దోడ్కొని తదీయ నివాసంబునకుం జని ముద్దాఖ్యదత్తోచితాసనంబుల నాసీనులై భూతివీడ్యంబులుగై కొని యొండొరులు తమలోన. 103

మ. ఘనగిరి మల్లికార్జునుని గన్గొనితత్కృపగాంచి యిందుఁదోడ్కొనిచను దెంచు వీనిజనకుం డగుముద్దయభాగ్యవృత్తిచెప్పనగునె సొన్నలాపురి శుభంబునహించె బురంబులోని యాజనులు నిరంతరంబతులసౌఖ్యముఁ జెందుదు రింక మీఁదటన్. 104

గీ. ధీరుఁడైనట్టిషోడ్డల దేవుబాచి
రాజుసౌరాష్ట్రముననుండి రాజమాళి
వచ్చెఁగళ్యాణమునకు మందిరముతోడ
వచ్చెనీతనిభక్తికిమెచ్చి హరుఁడు. 105

వ. అదియునుంగాక. 106

క. శ్రీమెరయమున్న మైధున, రాముఁడునిటలాక్షపాదరాజీవార్చాకాముఁడునగపతినిబుతన, ధామమునకుఁ దెచ్చెఁదద్విధంబెటులన్నన్.

⁓ మైధునరాముని కథ. ⁓

క. హైమప్రాసాదచర,త్సోమాస్యాకచవిరాజ సుమనస్సుమనస్తోమాయితనతక్షత్రము, భీమావతిను నెడుపురము పృథివిఁదనర్చున్.

వ. తత్పురంబున. 109

ఉ. ప్రాకటనైజవంశజలరాశివిధుం డొకసోమయాజిని
ష్ఠాకలితాత్ముఁడై తపము సల్పి కులాంగనయందుఁ బుత్రశో
భాకరుఁ గాంచె నీశ్వరకృపారతి మైథునరామనామమై
నాకునితొల్లి శీతనగనాథుఁడు గాంచినరీతిఁ బ్రీతిగాన్. 110

గీ. కనిమనోరథమీడేరె ననుచు సతియుఁ
దానుసంతోషకలనచేదనరిబంధు
రాజితో నియాడతత్సోమయాజిభూత
లస్థసౌఖ్యాప్తి గొంతగాలంబుజరిపి. 111

ఉ. అత్తఁయునప్యయాత్ముఁ బ్రమదాధిపధ్యానతఁ గంటిఁ గాని ప్ర
త్యక్షముగాఁగ దివ్యవిమలాకృతిఁ గాంచఁగనైతి నింకఁ ద
త్ప్రీతునిఁ జూడఁగావలెనటంచు ముదంబున నేఁగి యాసహ
స్రాక్షముఖామరాభినుతమాశివలోకముఁ జెందెనంతటన్. 112

క. జనకుఁడు పరమేశ్వరుఁ జెం, దినపిమ్మటఁ దల్లిఁ జెనుపదినదినమును మై
థునరాముఁడు ప్రబలుచు మహో, యనసత్తకమైనపిదపయంబపనువునన్.

మ. ఒకనాఁ డాటలకుజ్జ్ఞలంగలసి తానుద్దండకాంతారభూ
మికిపర్ణేంధనసంగ్రహార్థమయి తాల్మింబోయి యందొక్కచో
సకలాండోద్భవసన్నివేశవటవృక్షచ్ఛాయయందాత్మను
త్సుకలీలన్వసియించువేళ సహవర్తుల్వేడుకల్మీరఁగాన్. 114

క. ఒండొరులతోడ దివ్వెల
పండుగ యిదెవచ్చెనింక పదిదినములకు
న్వండుదురరిసెలుగజ్జవు
టుండలుమాయింట ననుచునొక్కఁడు పలికెన్. 115

క. మతిరొకఁడు నలుకు సన్నవు, నెరవగు దుప్పటులు పూలు నేసినయంగీ
లారపుగలుగుతలపాగలు, నరిమురిగొని తెచ్చునాటికయ్యయటంచున్.

క. మాయక్కలమాబావల, దోయంబులవారినెల్లఁ దోడ్తేరఁగనే
నాయత్తపడఁగవలెఁజుం, డోయని వేఱొకఁడు పల్కెనుత్సుకలీలన్.

ఉ. అప్పుడు రాముఁడిట్టులను నందఱిఁగాంచి కుమారులార మా
యప్పను బావనుంబిలిచి యప్పెనుపండువునాఁడు బాళముం

బప్పలుకుప్ప తెప్పలుగ బంతిని వారలతో భుజింతుఁ బై
గప్పఁగఁగట్టనిత్తునెకసంబున వారికి సన్నవుట్టముల్. 118

మ. అనినంబక్కుననవ్వ బాలకులు చోద్యంబయ్యె రామయ్యనీ
వనువాక్యంబులు నూరుతేనిపొలి మేరన్నట్లు సద్బ్రహ్మచా
రివినీకెందఱుబిడ్డలన్న గతి నోరీ నీకుతోఁబుట్టువే
విన మేకై వడిబావగల్గెఁజెపుమా విందామునిక్కంబుగాన్. 119

ఉ. అందఱితోడవంతుకొరకక్కను బావను దెత్తునంటివీ
రిందఱునమ్మియుంటిరిపు డెక్కడనుండిట వచ్చినారుమీ
చందముమున్నె ఱుంగరు మృషావచనంబులు వింతవారికిం
పొందెడుఁగాక నూకువినయోగ్యము గాదటనైన దెల్పుమా. 120

సీ. మీయక్క యెవ్వరు మీబావపేరేమి, వారిదేవూరు దవ్వాసమీప
మా కలిగినవారో లేకదరిద్రులో, వారిచుట్టంబు లెవ్వారువారి
కెందరుసంతాన మేవృత్తిఁజరియింతు, రెన్నడుమీయింటి కేఁగుదెంచి
రెవ్వరు మీబావకిష్టులాతఁడు చది, వేపాటిచదివె నీవిపుడుమాకు

గీ. నెఱుఁగఁజెప్పుమటంచు నందఱునునవ్వ
లెసఁగగుమిగూడి డాయంగ నేఁగుదెంచి
మాటమీఁద నెమాటగా మఱియుమఱియు
నుడుగకత్తరితగమితన్నడుగుటయును. 121

చ. వెలఁవిలబారిబాలకుఁడు వీరడిరైమఱుమాట లేమియుం
బలుకకవారినెల్ల నెడఁ బాసికనుంగవ బాష్పబిందువుల్
దొలుకఁగనింటికేగుచు నెదుర్కొనితల్లిని గాంచిశోకమ
గ్గలముగ నేడ్చినంబెదరి గ్రక్కుననాత్మజుఁ గౌఁగిలింపుచున్. 122

గీ. వీవుజరచికనులవెడలునీరముతన
పైఁటకొంగుచేతఁ బాయఁదుడిచి
నాకుమారయన్న నాతండ్రినాకుట్టి
యేలయేడ్చెదయ్య యింకవెక్కి. 123

క. అడవినిమృగములఁగనుగొని, దడసితివో యయ్య లేక సహచరులటని
న్నాడచి తమ రేగుదెంచిరొ పసుపులతో నేలిన్నుఁ బంపితితండ్రీ

క. ఒడలెఱుఁగక మార్గంబున, చెడుగులు నిన్నెవ్వరేని చెనకిరొ వారిం
దడయక నే శిక్షించెద, గొడకాకల తెఱఁగు నాకుఁ గొంకక చెపుమా.

చ. అనిన కుమారుఁడిట్లనియె నమ్మనపాయులు నేనరణ్యమే
దినిగుమిగూడి చూడు నెడ దివ్వెలకక్కల శావగార్లర
మ్మనియెద మంచు నందర నసట్లన నేపలుకంగ లేనివా
రినెటులఁ దెత్తునంచు చెలరేఁగి వికావికనవ్విరత్తరిన్. 126

క. అనియతఁ డాడిన మాటలు
విని నెమ్మది చింత నొందిపీని నెటులరో
దనముడుపుదునని యపుఁడొక
యనువు విచారించి పలికె నాత్మజుతోడన్. 127

గీ. అన్న! పేలరితనమున నడవివడుగు
లాడుమాటలకీవింత యడలె దేల
తెలియకారిడి యైనసందియము దీర
వారలడిగిన క్రమమెల్ల నేరుపఱతు. 128

సీ. మీయక్క భ్రమరాంబ మీ బావమల్లన్న
వారలనునికి శ్రీపర్వతమున
నతిదూరమిచటి కష్టైశ్వర్యసంపత్తి
గలవారు బంధువర్గంబులు హిమవ
దాదులు సుతులు గణాధిపప్రముఖులు
సకలలోకాఢ్యమై జరుగువృత్తి
లేమిచే పిలుచుట లేదెన్నడిటు వారి
శ్రీదుఁడు మీ బావ చెలిమికాఁడు

గీ. ప్రజ్ఞ వివరింప నేల సర్వజ్ఞమూర్తి, యరయ నాయల్లునంత వేరైన చుట్ట
మేది నిను గేలిచేసిన హీనవిప్ర, బాలకులకన్న సంతోషభరితుఁడగుచు.

ఉ. బాలకుఁ డిట్లు వల్కు పసిడి పండువుడాయఁగ వచ్చె తల్లినీ
వేలతనూజ దాని హృదయేశ్వరు బిల్వఁగ బంపవిట్టులం
బోలు నెకెందటం బిలువఁ బోవమి యేకడు తప్పవంపున్
లీలను నేను వారి దరలించుక వచ్చెద సత్వరంబుగాన్. 130

గీ. వసుమతినియల్లుఁ దోడ్కొనివచ్చినట్టి
పండుగకుభాస్పదంబయి పరగునెందు
నట్లుసేయకయున్న హీయనుచునగరె
పలుచగాఁజూచి మనసాటిబంధుకోటి. 131

చ. అనవుఁడు తల్లి యిట్లనియె నన్నకుమారక నిన్నుగాంచినీ
జనకుఁడుచన్నపిమ్మట విచారముచేసిరతంబు దోచకె
వ్వనినటబంపలేదతఁడు వచ్చుటలేదుతొలంగి నిన్నుఁబా
మ్మనియెటుసైతు స్త్రీలుచనునట్టివిగావు గదావరాపనుల్. 132

సీ. అదిగాక మీబావకతులితసంపదల్
గలవటయిుటకేల కదలివచ్చు
నొకవేళవచ్చెనా యింటిరాఁడతనితోఁ
పరివారమరుదెంచు బహుళమగుచు
నందఱ కేరీతివిందు సేయఁగఁగల
మిప్పాటగుడుచుట కింటలేదు
సాటికిచెవులు బెంపఁగవచ్చుగాని క
న్నులు బెంచగలరె భూపలయమందు

గీ. పూనిమున్నాటయరువదిపుట్లతండు
బలములు వానిదగువ్యంజనములుగూర్చి
పాక మొనరించిపెట్టిమీ బావచేత
మెప్పుగ నెగరికాలుండుమిగులదొల్లి. 133

గీ. కానభాగ్యవంతులైనవారలతోడ, నెట్లుసాటివత్తుమీవుపెద్ద
వాడవైగణించవచ్చినప్పుడువారి, దోడితెత్తుగానికూడదిపుడు. 134

వ. అనిపల్కిన జననిపల్కులు వెడవెడయాకొనితన్నుఁ గేలిసేయువిప్ర
కుమారులమాటలుమనంబున నాటుటయునెగతినైనభగినీభావుకుల
దోడితెచ్చిపండువు సేయుదుంగాకయనితలంచి యొకతీరున నద్దినం
బుగడపి మఱునాఁ డరుణోదయంబున లేచి యెవ్వరితోడంజెప్పక
మరులెత్తినకైవడి పురంబువెలువడి. 135

చ. కరిచమరీతరక్షువృకగండకభల్లుకపుండరీక కే

సరికిటిభూరిమాయుళశల్యవలీముఖకృష్ణసారకా
సరశరభాఖుభుగ్గవయశాక్వరరౌహిషరామబుళ్యశం
బరముఖసర్వదృష్టమృగబంధురకాననభూమిధీరుఁడై. 136

క. ఒక్కరుఁ డదరక బెదరక, యెక్కుడుపైనములుజనుచు నెంతటిదవ్వో
యిక్కడికి శ్రీనగంబని, యక్కడినక్కడిజనాళి నడుగుచుఁ జనియెన్.

మ. చని కాంచెన్ ధరణీసురాత్మజుఁడు భాస్వద్భక్తిశ్రీశైలమున్
ఘనపాపాటవికీలమున్వరదివౌకఃకామినీఖేలము
న్మునిగేయాఖిలతీర్థజాలమును సదా మోక్షోత్సుకైకాలమున్
జనితాభీష్టదకల్పసాలము మనోజారాతిమున్మాలమున్. 138

గీ. కాంచిసంతోషపులకితగాత్రుఁడగుచు
నమ్మహీధరశిఖరాగ్రమధిగమించి
యెచటనుండునో మాతావయిపుడె వెదకి
వెంటగొనిపోదుగాక మాయింటికనుచు. 139

సీ. రాజతశిఖరేశ్వరంబందువీక్షించి, హాటకేశ్వరుని గేహంబుగాంచి
గణపతిస్థానంబుగలయంగఁదిలకించి, పంచమఠంబులపజ్జవెదకి
కలితపాతాళగంగాప్రతీరముఁజూచి; కుండికానివహంబుదండనెమకి
కోటిలింగాకారకుంభినిగనుగొని, చంద్రగుప్తనగంబుచాయనరసి

గీ. రమ్యతరశంఖచక్రవరాహబిందు
నారసింహాసరస్వతీనామతీర్థ
రాజిఁబరికించికాంచనరత్నసాల
గోపురంబులుగు్రిమ్మరిపాపఁడంత. 140

వ. మఱియుఁ త్రిపురాంతకాలంపురీబాలబ్రహ్మేశ్వరసిద్ధమాహేశ్వర
వీరేశ్వర స్కంధసోమేశ్వరప్రసూనాచలసంగమేశ్వరంబులను చతు
ర్ద్వారోపద్వారమధ్యంబునఁ గలతీర్థంబుల పరామర్శించి ప్రాకారం
బు దరియం జొచ్చి యంతటఁ గలయం దిరిగి మల్లికార్జునుం డెచ్చట
నున్నవాఁడని కనుపడుజనంబుల నడిగి వారివలన నిక్కువంబు దెలిసి
తదీయాలయంబు చేరంబోయి యచ్చటలింగాకారంబు గాంచియ స్త
ద్భావుకాగారం బిది యనిచెప్పి రిచ్చట లేఁ డిదే మోసోయనిచింతించి

దూరపథశ్రమంబునొంది వాఁడుగావున నొక్కయెడఁగూరుచుండి
యద్దేవు నుద్దేశించి. 141

ఉ. నిండిన వేడ్కదివ్వెలకునిగ్గానిపోవఁగబుద్ధిపుట్టినే
నెండకువానకుందలక కెచ్చటనిల్వకతోడుగూడినా
దండవసించుబాలురకు దవ్వయితల్లినికన్నొమ్మెఱంగియా
కొండకువచ్చినల్దెసలు గ్రుమ్మరితిన్ నినుగాంచువాంఛచేన్. 142

ఉ. పొద్దునచద్దిబువ్వదిని పుస్తకముల్ వడకింటజాటుగా
మిద్దియమీఁదడాచికడిమిన్నడి కేగకయొక్కరుండనే
నిద్దెన కేగుదెంచితినిఁ కేమియునల్కకయప్పనీవున
న్మద్దొనరించిరండిపుడమోదముతోడుతమల్లికార్జునా. 143

ఉ. మానరివారుదివ్వెలయుమానకునల్లురనాఁడబిడ్డల
న్వాసిరియొసంగుదోకొనుచు వచ్చుచునుండిరిగాననీవును
ల్లాసముతోడరమ్మపదిలక్ లొనఁగుటనీవురాకన
న్గాసియొనర్పబోకుకనుగందనిచూడకు మల్లికార్జునా. 144

ఉ. తానువసించునట్టిపురిదండకుదూరపుచుట్టమైనరా
వారలఁదోడితెచ్చి కుడువంగనొనర్చిబహూకరింతురె
వ్వారలునట్లుగాదుప్రియబంధుఁడనింటికివచ్చినాఁడ
ననూ్కరిమిగాంచివల్కవిటుగూడునెశ్రీగిరిమల్లికార్జునా. 145

క. ఇన్నాళ్లనుండిపిలువక, నన్నిప్పుడుపిలువవచ్చినాఁడనినాపై
కన్నెఱ్ఱచేసినాఁడవో, కున్నలపైకినుకసేయ గూడునెబావా. 146

క. మాతల్లికూతునల్లుని, నే తెఱఁగునజూతుననుచు నెప్పుడు గడువాం
ఛాతత్పరమైయున్నది, ప్రీతియెటర్పంగతమ్ముప్రిదులకుబావా. 147

చ. ప్రియమెగణింతుగానినిరుపేదలటంచుదలంచబోకు
నీదయనుసమస్తవస్తువులు తక్కువగావుమదాలయంబునన్
రయమునరమ్మనీవటకు రాకకుతీరదటంటివేనిని
శ్చయముగనిన్ను నేవదలజాగుపనేమనిపెక్కుభంగులన్. 148

ఉ. భూసురవర్యనందనుఁడుబుద్ధికిదోఁచినయట్లువల్కది
గ్వాసుఁడుకానరామి కిది గాల్పడిదిక్కులుచూచి బావనా

వాసీమెరుంగడాయె దసవాసముజేరినజూడడాయె నేఁ
జేసిననేరమేమియని చింతిలియుంబఁదలంచి యిట్లనున్. 149

ఉ. తల్లిని నిన్ను బంధులముదంబునఁజూడగవచ్చుకోర్కినీ
యుల్లములోజనింపదె ప్రియుండెటులట్టుల నీవుచేయఁగాఁ
జెల్లునె యత్తవారిగృహసీమలసంపదలెన్ని గల్గినం
ఫుల్లసరోజలోచనలు పుట్టినయిండులకానఁజెందరే. 150

క. ఓయప్పనీవుబావయుఁ, బాయకనాతోడదివెలపండువకిటుర
మ్మాయనుచుఁ బెక్కుభంగుల, దారోడకపిలిచిపిలిచివారలుదనకున్.

క. పొడచూపకయుండినయ, బ్బుడుతఁడు నేనింటికెటులఁబోదగు వీరిం
దోడుకొనియేగక నాసరి, పడుచులు నను గేలిచేసి పకపకనగఁగాన్.

క. సరివారుతన్నుఁగనుగొని, పరిహాసముచేయువారిపలువురినడుమ
ధరబ్రదికియుండుకంటె, న్మరణంబేమేలటంచు మదినిశ్చలుఁడై. 153

చ. అలశిఖరాగ్రమెక్కితనయప్పనుబావనునెమ్మనంబులో
నిలిపి సహాయబంధు జననీగృహపట్టణవాంఛలేమియుం
దలఁపకనిల్చియొక్కబెడిదంపుసరింబరికించిచూచిని
శ్చలమతిదానిలోనురుగశంకరుడంబయునంతలోపలన్. 154

క. ఇరుగెడలనిలచిదండలు, కరములుఁబట్టుటయుదిరిగికమలాంకముఖీ
పురుషులనిరువురఁగనుగొని, పరమాశ్చర్యంబునొంది బాలకుడనియెన్.

ఉ. ఎక్కడనుండివచ్చితిరి యెవ్వరుమీరలునన్నుఁబట్ట మా
యక్కయుబావయేకగుణయాత్మదలంచినవారుకారు పెం
పెక్కినకూర్మిమీకుజనియింపఁబనేమి విందుండుప్రాణముల్
దక్కగొనంగనేనినిటు తప్పకనేననవ్వివానితోన్. 156

సీ. పరమాదరంబునగిరిజయిట్లనిపల్కె
మాముద్దుతమ్ముఁడమేమునీకు
పరులమానీయక్క భ్రమరాంబనేను మీ
బావయాతండిదె తావుమాకు
పృథివినీవు జనించుపిదప నిన్నెన్నడుఁ
జూడలేదటుగాన నేడుగులుకు

తెలియంగజాలమైతిమి సోమయాజిపు
త్రుండుభీమావతినుండివచ్చి
గీ. నాఁడు నేఁడన వినిచిన్నవాఁడు బ్రమసి
యొంటినెక్కడ దిరుగుచు నున్నవాఁడొ
యనుచునీకొఱ కందంద నరసికొనుచు
వచ్చి కనుగొంటి మిచ్చట వత్స నిన్ను. 157
చ. అన వినునంతలోన ప్రమదాంబుధిఁ దేలి కుమారుఁడంబవ
ద్వనజయుగంబుమీఁదఁ దనఫాలముసోఁకఁగ వ్రాలినవ్వఁచు
న్ననరున గ్రుచ్చియెత్తి ధరణీధరసంభవ నీదుబావకు
న్వినుతిరెయనర్పితంబియన నీలగళుం గని జాగ్రమ్రొక్కినన్. 158
ఉ. నవ్వుచుఁగౌఁగలించి కరుణారస ముప్పతిలంగఁగూకటిం
దువ్వుచు జెక్కుగీటుచు గుతూహల మొప్పఁగఁ బల్కకున్నమీ
యవ్వకు దెల్పివచ్చితివొ యూపెనెఱుంగఁగ నీకవచ్చితో
యెవ్వరుదోడులేక భయమేది యొకండవు రాకచెల్లునే. 159
ఉ. వచ్చితి మేలుచేసితివి వారె కనుంగొను మేనయల్లురా
వచ్చుచు నున్నవారు గణపాలకముఖ్యులు వారిదండల
న్వచ్చెడుమూకపారిషదవర్గము మత్ప్రియకోటి వీవు మ
మ్మిచ్చ దలిర్పఁజూచితిగదే మదిలోనికొఱంతతీరఁగాన్. 160
క. దుర్గమకంటకశర్కర, మార్గశ్రమదీరనిల్వుమామత్పుతసం
సర్గుఁడవై యిచ్చటసుఖ, వర్గంబులఁ జెందికొన్ని వాసరములనన్. 161
చ. చిఱుతఁడు వల్కు నిచ్చట వసింపగవచ్చితినయ్య మిమ్మునం
దఱమదివేడ్కపండువదినంబునకుం గొనిపోవవచ్చితిఁ
కుఱుచగనన్నుగన్కొనక కోమలి నీవు దనూజలాప్తులి
త్తఱిఁబయనంబుగండు ప్రమదంబున మామకరాజధానికిన్. 162
క. మాదాయాదులుబంధువు, లాదివ్వెలకాత్మసుతుల నల్లుండ్రనున
మ్మోదమునదోడితెత్తురు, కాదనకటుమీరురండు గ్రక్కుననవినన్.
క. ఎడలేదుదివెలనడుమనె, గడుచున్నీపురముఁజేరఁ గాలేమీయేఁ
డుడుగుమువచ్చెడుపండువ, కెడపకయట కేగుదెంతుమిందఱమనినన్.
ఛ. విని బెగడొంది బాలకుఁడు వీరలఁదోడ్కొని వత్తునంచు నేఁ

బనిగొనివచ్చి రామనినబంధువులెల్లను గేలిసేయఁగా
జనుటుచితంబెయుంచు హరిసాయకపాదము లందు వ్రాలిమి
మ్మునెటులనైన నఁదోడికొని పోవకమాన నటన్న నవ్వుచున్. 165

గీ. అట్టులైననీమహాద్వాంఛయూరక, చెఱుపనేలరమ్ము చిఱుతప్రమథ
సమితిమత్కుమారసముదయమేనును, వత్తుమని మొగరుణవరలనిచట.

చ. తనసుతులోగిటన్వదకి తల్లిదిగుల్గొని పల్లికూటమం
దునఁదిలకించి బాలకులతోఁజనియాడుచు నుండెనే మొఱాఁ
డనిచని వాడవాడల భయాకులయై కనుగొన్న వారినా
తనయుని గానరేయనుచుఁ దప్పక వేడుచు గానకార్తయై. 167

చ. కనుగవనశ్రుబిందువులు గ్రమ్మఁగఁబాదయుగంబు దొట్రిలం
దనువునఁజెమ్మటల్వొడమ దాలిమిదూలఁగ వ్రాలిలేచినా
ఘనధనరాశి పుత్రచనఁ గారణమేమని పిల్చిపిల్చిమా
ననిదనయింటికేగి మదినిండినదుఃఖముతోడ నెంతయున్. 168

వ. అన్నపానంబులు విసర్జించి దినదినం బొకయుగంబుగా గడుపుచు
నుండి యొక్కనాఁడు తనమనంబున గిరీశ్వరుం దలంచి. 169

ఉ. ఘోరదుపంగనే బలుకుబూటకమెల్లనిబద్ధిఁజేసి
యేధారనిబోయెనో సుతుఁడు తాఁదగనాఁకట నెంతసోలెనో
ఘోరవని న్మృగాళిఁగని కుల్లఁడు నెమ్మది నెంతజంకెనో
నేరకమోనపోతిఁ గరుణింపుము శ్రీగిరిమల్లికార్జునా. 170

చ. నినుతనబావఁగాఁదలఁచి నేస్తులతోఁగడుపంతగించినా
తనయుఁడమాసపండువకు దంపతుల న్మిము దోడిదెత్తునం
చనుకొనివచ్చెనేమొ కరుణాకర శ్రీగిరినాథ వాఁడెనీ
యనుగుమఱందివాసికి దయామతితోఁ బొడఁజూపవేవెసన్. 171

గీ. ప్రియునిఁబాసిచాలపేదరికంబున, దగిలి వీఁడెపెన్నిధానమనుచు
సంతసించియుంటినకలదుఃఖంబులు, మఱచినేఁడు వెతలమరుగవలసె.

ఉ. దీనశరణ్యనాదుకులదీపకుఁగ్రమ్మర గానుపించి నా
మానసశోకవేదనలు మానపవేయని కన్నుమోడ్చిలో
ధ్యానముసేయ దత్సుదతి కత్తరిస్వప్నమువోలె భ్రామరీ
మానినితోడఁ [illegible] 173

క. సాక్షాత్కరించి సతి నీ, విక్షేపముమాన్పఁగొలకు విచ్చేసితివె
దక్షమఖశిక్షకుఁడనీ, ఋక్షేశ్వరవదన భ్రామరీరమణనుమీ. 174
చ. పొలతుకనీవు పుత్రునకు పూర్వముచెప్పినరీతినప్ప బా
వలమనియేముగన్పడినవారము వానికి యేతదాకృతి
న్వలనుగవానితో నిటకు వత్తుము రేపె యటంచుఁబల్కఁగ
న్గలువలు విచ్చి వారి నట గానక విస్మయమందియాత్మలోన్. 175
ఉ. ఎంతకృతార్థనైతిఁ బరమేశ్వరదర్శన మబ్బె నేఁడు నా
చింతలు దీరె నింక శశిశేఖరుఁ డెప్పుఁడు వచ్చునంచుఁద
ద్భ్రాంతిన యుండె నచ్చట ధరాధరచాపుఁడు బాలుఁగాంచియ
త్యంతకుతూహలంబున కరంబు కరంబునఁ జేర్చిచెచ్చెరన్. 176
క. మీదగుపట్టణమునకిదె, పోదమనుచుఁబలికిప్రమథపుంగవసుతభా
ర్యాదులతో నప్పుడు కా, కోదరభూషణుఁడు సత్కృపోన్నతమతియై.
గీ. మాయనియ్యకొలిపిమదిలోనసంశయం,బొదవనీకవాసియూరుఁ జేర్చి
కన్న తెలిపిమీరలున్నతావిదెకదా,యన్నదిదియెనావుఁడభవుఁడలరి.
క. పదపదముందరనసిచే, వదలినవేగమున నేగి బాలకుఁడంబా
పదయుగమునకొరగినన, మ్మదవతియాశ్చర్యమోదమాననయగుచున్.
చ. కనుగొనిగ్రుచ్చియెత్తి కనుగందకనాకులదీపవచ్చితే
యనగుడిలోన చూడుమదె యప్పయుబావయు వచ్చిరంచుఁబ
ల్కనసుతుమాటకర్ణముల గీల్కొనునంతనె మేనువంగసే
గనుకలనిక్కమయ్యె గరకంఠునిఁజూచెదనంచుఁజెచ్చెరన్. 180
చ. ఎదురుగనేగి శంకరగిరీంద్రసుతాదులఁ గాంచిభక్తిపెం
పొదవఁగనాత్మమ్రొక్కి వినయోక్తులెలర్పఁగఁ దోడితెచ్చిత
త్పదములదృష్టిలబ్ధఘనసంపదలచ్చెరువందజేయన
మ్మదవతినైజభర్మ్యమణిమందిరమందొకచక్కిమక్కువన్. 181
సీ. అందమునఁ జిత్రాసనాసీనులుగఁ జేసి,యర్ఘ్యపాద్యములిచ్చి యంబికేశ్వ
రాదులకతిభక్తి నభ్యంజనమొనర్చి, నలుగులు నలిపించి జలకమార్చి
ధౌతవస్త్రంబులాదటగట్టఁగా నిచ్చి, రాజవదుపచారరాజిఁబూన్చి
పంచభక్ష్యంబులు బాయసాన్నాదికం,బులుషడ్రసోపేతముగనుభర్మ్యమౌ
గీ. పాత్రముల నించి యారగింపఁగ నొసఁగి

గంధకర్పూర తాంబూల కనకరత్న
భూషణాంబరముఖవస్తుపుంజ మొసఁగి
సంతసంబందుచుండు నాసమయమందు. 182

వ. తొల్లి కాననంబున రామునిం గెలిచేయు విప్రబాలకుల వ్వేళయతం డింటి కరుదెంచుట కర్ణాకర్ణగా విని నేడు పండువకు మీయక్కల బావలఁ దోడి తెచ్చితివేయని మందలింతమని యందఱు గుమిగూడి వారియింటికరుదెంచి కమనీయ కనకరత్నమయ సౌధతోరణవితర్దికాదుల నవలోకించి లోపల ననేకజనకలకలంబాకర్ణించి బహిర్ద్వారకవాటంబులు మూసియుంట నవ్వలికరుగునుపాయంబులేక తిరుగంజను దెంచి, తద్వృత్తాంతంబంతయు నిజపితృబంధుసఖాదులకెరింగించిన వారచ్చటికివచ్చి నిజంబుగాఁగని యిదియేమికతంబో కేవల దరిద్రుల కిట్టిభాగ్యంబబ్బెనని సందేహంబునొందుచుండు నవసరంబున త్రికాలవేది యగునొక్కయోగిపుంగవుం డారామయ్యబాలురతో పంతగించి భ్రమరాంబామల్లికార్జునులనప్పబావలనుతోడి తెచ్చి విందుపెట్టుటయు ప్రమథసుతాదులతో నప్పుడు వారి యింట నీశ్వరుండుండుటయుం జెప్పిన నత్యాశ్చర్యప్రమోదమానసులై యయ్యుమామాహేశ్వరులకు ధ్యానపూర్వకంబుగా నమస్కరించి నిజనివాసంబులకుం జనిరి తదనంతరంబ. 183

ఉ. అత్తరలాక్షి గాఢపులకాంకురసమ్మద బాష్పనేత్రయై
చిత్తజవైరిపాదసరసీజములం బ్రణమిల్లి యాత్మలో
జొత్తిలుభక్తిచే మృదుపచోగరిమం బమరంగ బల్కెలో
కోత్తరవామదేవశివయోగిహృదాలయమల్లికార్జునా. 184

చ. పురహర యెంతభక్తసులభుండవు బాలుఁడుగోరునంతనా
కరయఁగ నేడు నీవనుగుటల్లుడవై తివిలోకమాతభ్రా
మరివరపుత్రియుయ్యెఁదరమాయిఁకమత్సుకృతంబులెన్నఁగా
సురలకునైన నిట్లుపొడచూపుట చోద్యముగాదె శంకరా. 185

చ. అని వినుతింపుచున్న కమలాంకశిఖామణి యానతిందయా
వననిధి దేల్చి భక్తగణవర్యుఁడు మైథున రామనాముఁడు
జ్జనుతలీలని[illegible]

తనువులతోడ రండు సుఖదాయకమత్పదమందుఁ జేరఁగాన్. 186

క. జాగింకనేలపుష్పక, మాగతమై యున్న దెక్కడని వారి న్వే
వేగగొనిచనిమెతత్పురి, కాగమవేద్యుండు జగములచ్చెరు వందన్.

గీ. ప్రకటితంబగు మైథున రాముచరిత, మెలమిఁజదివినవినినవారలకుమల్లి
కార్జునస్వామికరుణాకటాక్షకలన, నైహికాముష్మికఫలంబులందగలు

గీ. అనుచు మైథునరామునియద్భుతంబు [గు.
చరిత చెప్పఁగ వినఁబడు సకలమనుజ
రాజి తిలకింప నీసిద్ధరాముఁ డిపుడు
మల్లికార్జున దేగంటి ముల్ల మలర. 189

వ. అని యతనిప్రభావంబు గొనియాడి ముద్దయ్యచేత ననుజ్ఞాతులై భక్తపుంగవులు నిజనివాసంబుల కరిగిరి గావున సిద్ధరామయ్య మహత్త్వం బిట్టిదని చెన్నబసవేశ్వరుండు చెప్పినఁ దత్సభాసదు లత్యంత సంతోషాబ్ధిఁ దేలుచుండి రయ్యవసరంబున రామయ్య నిజదేశికపాదపద్మంబులకు క్రిమ్మర జాగ్రమ్మొక్కి దేవా యిష్టలింగప్రభావం బానతీవలయునని వేడిన యచ్చటిశరణులయనుమతింగాంచి శిష్యునకు నాగమాంబాత్మజుం డిట్లని చెప్పందొడంగె. 190

## మడివాలు మాచయ్యకథ.

సీ. భూరమణీశిరోభూషణంబనఖ్యాతి
బరఁగు హొంప్పరిగె యన్పురవరంబు
నప్పురంబునఁ గళాధరజూటపదలగ్న
మానసుండతులసన్మార్గ వర్తి
యారూఢవీరభద్రావతారుండయో
నిజుఁడింద్రియవ్రజనిగ్రహుండు
భవిజనదూరుండు పండితనుతభక్తి
మహితుండు మడివాలుమాచిదేవుఁ

గీ. డతులలింగధారణావాప్తికై కోరి, కల్లినాథుఁ డనెడు ఘనునిఁ జేరి
భక్తితోడ మ్రొక్కి పరమాత్మ మద్గురు, స్వామిదీక్ష సేయవలయు నాకు,

గీ. అనిన నతనిభక్తికలరి దేశికవర్యుఁ, డట్ల సేతుఁ గాక యనిన మ్రొక్కి
స్వామిష్ఠాలమైన [illegible] సమ్మతించి

ఉ. ఒక్కొకలింగమూర్తి నిది యోగ్యమె నీకని చూప నీతఁడం
దొక్కొటిమైన దాలుచుట కొప్పకయుండిన వేసరిల్లి పెం
పెక్కఘురట్ట మొక్కటిమహీజను లక్కజమందఁ జూపియా
యక్కజమైనలింగము ప్రియంబగునే కొన నీకు నావుడున్. 193

క. క్రమ్మర మ్రొక్కుచు గురువర, యిమ్మహనీయమగు లింగమిష్టంబగునీ
విమ్మనినన వ్వివేదో, క్తమ్ముగ దల్లింగమవుడు ధరియించుటయున్.

చ. ప్రకటిత భక్తిఁ గైకొనియురమ్మున దాల్చి సమస్తభక్తరా
ణ్ణికరపదాంబుజాతములు నెన్నుదురంటఁగ మ్రొక్కి నిల్చికా
యక మొకఁడేనుగోరితిమహాత్ముల సన్నిధినెట్లనన్ గదా
ధికులమలీమసాంబరతతిన్ బరిశుద్ధినిఁ జెందఁ జేయఁగాన్. 195

క. అనిపల్కి భక్తసమ్మతి, తనగురుచేతనవుడు భస్మధారణమైమిం
చినవీరభక్తిఁ దత్పుర, మునఁగొన్ని దినంబు లుండిముదమున నంతన్.

మ. బసవాధీశ్వరుఁ జూచు వేడ్కమదిలోఁ బర్వంగనే తెంచి భ
క్తసమూహంబున కర్చలిచ్చుచు నమాత్యశ్రేష్ఠుఁడర్చించు ని
త్యసమారాధనఁ గాంచుచున్ శరణజాతం బెన్నఁగళ్యాణమం
దనమాస్త్రింబకసన్నిభుండతుల చర్యాస్ఫూర్తి వర్తింపుచున్. 197

ఉ. లేవకమున్న మేలుకని వేరొక రేవున కేగి భక్తవ
స్త్రావలిగుంజుచో నతనికా నెదరావిడి యంచునొక్కఁడం
దేవునినుంచి సూత్రమెడ త్రెవ్వకయుండ ధరించి పూర్ణస
ద్భావుఁడు తత్క్రియాంతమునఁ దాలుచుఁ బొమ్మనసీశు క్రమ్మరన్.

చ. అటుధరియించి యాయువసనావలు లన్నియు నేర్చి కూర్చి యొ
క్కట బలుమూట వీకమెయిఁ గట్టుకమూపున దాల్చి వచ్చుచో
కటకపువీథులందు భవికాండముముట్టినఁ ద్రుంతునంచును
త్కటముగ ఘంట వేయుచు నకంపనుఁడై మఠమేగియచ్చటన్.

గీ. లీలమడుగులు గట్టించు వేళజంగఁ
మంబులడిగిననిష్టాంబరంబు లిచ్చు
నెడపకావస్త్రములవారలడుగువారి
బట్టలర్పించు లింగ సంపద దలిర్ప. 200

సీ. అటులుండి యొకనాఁడు హరభక్తవస్త్రముల్

గొని తెచ్చుచో భవిమనుజుఁ డొక్క
డంటిన సురుగుమ్మరయ్యాంకసంబున కెగఁ
జిమ్మిన నవ్వార్త క్షితితలేశ్వ
రుఁడు విని కోపంబు వొడమ వాని వధింపు
డనిమావతులఁబంప నరిగిమత్త
కరి దీకొలుప దాని ఖండించి యానార
ణుల జంపభీతి బిజ్జలుఁడు బసవ

గీ. సచివుప్రేరేపణంబున శరణమడుగ
కరినిభవిమావతుల బ్రిదుకంగఁ జేసి
చాలదృష్టాంతములు దెల్పిసచివవర్యు
విమలమానసయుతుని గావించి యంత. 201

గీ. అనఘుఁ డొకనాఁడు తొల్లిటియట్ల నేగి
లింగ మెప్పటిపాదనుంచి లీలఁగాయ
కంబునేయుచునుండంగ గష్టకర్మ
చిత్తులొకకొండ అదిచూచి చెలఁగినగుచు. 202

చ. తిరుగటిరాయిప్రాణమగు దేవుఁడటంచు ధరించి మోవఁగా
బరువని వేఱెయుంచి సరిబత్తులు గాంచిరయేని యెగ్గు సే
తురనుచుఁ ద్రాడు గట్టెనిదిదుస్సిన నేమగు నొక్క చాకియి
ప్పరుసుననంచు హేళనపుఁ బల్కులువల్కెదురాత్ముల త్తరిన్. 203

చ. మరుగుగగుంజపుంజముల మాటున దారిస్వకార్యమీఘనుం
డెఱుఁగక యుండ సూత్రమున యేతరలై తెగగోయ నెత్తురు
ల్వరదలువారె నీశరణవల్లభుఁడప్పుడ చాకిబండపై
నొరిగిగతాసుఁడై శివనియోజితమానసుఁ డొటలీలచేన్. 204

ఉ. అట్లగుటందురాత్ములు భయాకులులై వెసఁ బారనప్పుడా
చుట్టుననాఁ మేపుపడు చుల్లని యద్భుతమందియిచ్చటం
బుట్టనివింతపుట్టెనని భోరున నేగి వృషేశుసన్నిధిం
గట్టలుగాఁగసల్పి యనుకంపజనింప వచించిరీతిగన్. 205

గీ. అయ్యమడివాలు మాచిదేవయ్యయివుడు
బట్టలుదుకుచునున్నచో బామొగామొ

తెవులో యేమాయనో మది తెలియదహాహా
యేమి సోకెనొ జీవంబు వెడలి పడియె. 206

చ. అని వినిపింప బిట్టులికి హా మడివాలమహాప్రతాపస
జ్జనుతభక్తిసంచరణసంగయ దేవభవత్పదార్చకు
న్ననువిడనాడ నీకుఁ దగునా కరకంఠుని జెందనంచులో
చనముల బాష్పముల్ దొరుగఁ జాలవగన్విలపించుచున్నడిన్. 207

ఉ. అచ్చటలేచిభక్తనివహంబులు దుఃఖము నొంది తోడఁ దా
జెచ్చెరనేగుదెంచి గతజీవితుఁడౌ మడివాలుఁగాంచి యీ
సచ్చరితాఢ్యుడిట్లు గతసంజ్ఞవహింపఁగ నేమిహేతువో
యిచ్చదలంపరాదనుచు నీవలనావలఁజూడనొక్కచోన్. 208

గీ. తెగినసూత్రంబు పొదలింగదేవువరద
వారురక్తప్రవాహంబు దేరిచూచి
యద్భుతం బంది యచటనున్నట్టిభక్త
వరులతో నిట్టులనియె నబ్బసవవిభుఁడు. 209

ఉ. జీవము లింగమందు తనుచేష్టలుభక్తసపర్యలందు సం
భావనచేసి యంశుకసమాజము భావనమాచరించుచో
* నూగిసనాత్మకరినోన్నతవక్షము దాకి నొచ్చునో
దేవురకంచుగుల్మవసతిఁ సవరించి దృఢాంతరంగుఁడై. 210

క. గాత్రమునకులింగమునకు, సూత్రముదగిలించియున్నచోఖలుఁడెవ్వం
డో ద్రెవ్వనడచెదచ్ఛిన, సూత్రంబటుగాననితఁడనువులకుఁబాసెన్.

క. దేహములింగము సూత్రం
బూహింపఁగ నొక్కటగుట యురిద్రెవ్వటయుఁ
దేహంబార క్తంబు ప్ర
వాహంబుగ వెడలె ద్రాటివలన భయదమై. 212

గీ. ఇట్టులుండవలదె యిష్టలింగానుసం, ధానమను చుమరలఁదద్గుణంబు
గలయఁబెనిచి పదనఖస్మరభక్తాంఘ్రి, జలముభూతిపైని చల్లునంత.

క. బిట్టుల్కనిదుర తెప్పిరి, నట్టులపడి లేచియెదుటిహారగణములలో
దొట్టినముదమునగనుగొని, చట్టనమాచయ్యసతులుసలువుచుదనలో.

క. దివమున [illegible] చెడి యి

బ్బవినొరుగు టేమి హేతువొ, శివశివయనితలఁ చివారిఁ జేరివచించెన్.

క. * మీరందఱిచ్చటికిరాఁ, గారణమెచ్చటికై నగమనోన్ముఖులై
కారుణ్యంబుననుఁగన, నీ సేవునకిపుడుపూని యే తెంచితిరో. 216

సీ. అనవుడు బసవేశుఁడాదియౌ సద్భక్తు, లేకవాక్యంబుగా నిట్టులనిరి
మాచయ్యఖిలులునీమహిమ కానకలింగ, సూత్రంబుగోసినధాత్రినీవు
ద్రెల్లుటవినివచ్చిదీరభక్తులఁ గృపఁ, గ్రమ్మరబ్రతుకు నిన్గంటిమనఘ
నీకునీవేసరిగాక లోకంబున, మాబోఁటిభక్తుల మహిమయెంత

గీ. యనుచుఁ బెక్కువిధులఁ గొనియాడియవనత
వదనుఁ డైనమాచవరుఁడు దారు
సకలసంభ్రమముల సదనంబులకు వచ్చి
యుక్తభక్తిరక్తినుండిరెలమి. 217

క. మడివాలుమాచి దేవుని, నడిచెన్నచరిత్రవినినఁ జదివినవారల్
జడజాతసంభవాదులు, బడయంగారానిముక్తిఁబడయుదు రెలమిన్.

వ. అదియునుంగాక. 219

## హాళికమారన్న కథ.

మ. అకలంకోజ్జ్వలలింగమార్చనరతుం డంహోవిదూరుండు శ
ర్వకథాసారనిమగ్నచిత్తుఁడచలేంద్రాతీతధైర్యుండు స
ర్వకళాపారగుఁ డాత్మలింగ గురుచర్యాయుక్తుఁ డార్యుండు హా
లికమారన్నయనంగభక్తహితసల్లీలాఢ్యుఁ డొప్పారు రహిన్. 220

శా. ఆనిష్ఠానిధిభక్తిమార్గరతిఁగళ్యాణంబునందుండి లిం
గానందంబుగ దండనాథకృషికధ్యక్షత్వముం బూనిస
స్యానీకంబుఫలింపఁజేయుచొకనాఁడంభోజబంధూదయం
బౌనవ్వేళఁబొలంబుఁజేరిచతురీశాన్వేషియై యుత్తరిన్. 221

గీ. నడిమిమంచమెక్కియొడిసేలరాల్గొని, చుట్టువ్రాలునట్టిపిట్టగముల
విసరివ్రేయుబాహువిన్యస్తలింగంబు, వస్త్రయుతముగాఁగవదలిపడియె.

క. శివలింగముధరదొరఁగిన, భవదూరుండతఁడుమున్నె ప్రాణంబులుత
ద్భవునందచేర్చెఁ గావున, పవిహతగిరివోలె మంచెపైఁబడెనంతన్.

చ. తనపతిరాకజాగయినతత్ప్రియదామణి చింతచే శివా
ర్చనస [illegible] వే

చనిపోలి మేర చేసినడు చక్కవసించినమంచపై గతా
సునిపతిగాంచియప్పుడె వసుంధరఁద్రెళ్లెవిహీనజీవమై. 224

వ. అంత. 225

ఉ. అచ్చటిచేనికాపరులయుం దొకఁడంతయు గాంచి చెచ్చెరన్
వచ్చివిలాసగోష్ఠిగణవర్యులతో గొలువిచ్చియున్నభా
స్వచ్ఛరితుంగృతజ్ఞు బసవప్రభుఁగాంచి నమస్కరించివా
క్రుచ్చఁగలేకకొంతవడిఁగొంకుచుఁ గొంకుచు నెట్టకేలకున్. 226

ఉ. ఇట్టులఁ బల్కె దేవబసవేశ్వర మారననేఁటిప్రొద్దునన్
బిట్టలదోల మంచెపయి నిల్చిన నిల్వున ద్రెళ్లి చచ్చిన
ప్పట్టునవానియా లటకువచ్చి కనుంగొనిధాత్రిఁగూలెనే
నిట్టిమహాద్భుతంబెచట నెన్నఁడుఁ జూడఁగలేదు నావుడున్. 227

చ. విని బసవేశ్వరుండు కడు విహ్వలతన్ సభనున్నభక్తులం
గనుగొని యెన్నఁడిట్టిగతికంటిమెవింటిమె యంచువారితోఁ
జనివడియున్న దంపతులచందముఁగాంచి మదింగలంగిలో
చనముల బాష్పముల్ దొరుగ సంగయదేవుని సంస్మరించుచున్.

క. తనతోడంజనుదెంచిన, ఘనభక్తులయాననములు గనిచీకలు తి
ట్టినబడుచాద్పునమృతిజెం,దినకతమేమొకొయటన్న దెలియకవారల్.

క. గామ డఁచలేదు పాపపుఁ
బామంబెను కాదుకారుపటురోగగుణం
బీమాట్కిఁ జంపెననియెడు
సాములఁ గని యపుడు మిండసంగయ యనియెన్. 2.0

క. ఈమహితలింగదేవులఁ, గామంబునెదుష్టపన్నగముమార్కొనునే
యామయముఁజెంద నేర్చునె,యేమియుఁగాదింకనొక్కటేర్పడవినుఁడీ.

సీ. అనఘుఁ డీతండుప్రాణావలిలింగంబు, నందుఁగూరిచి శివానందలీల
గాయకంబీరీతిఁగల్పించుకొనియుండె,నిప్పుడీతనిలింగ మెడలఁబోయి
దానితోఁ బ్రాణముల్ దలఁగెతత్సతితన,జీవంబుప్రియునందఁజేర్చివడియె
* నింతయునిజమని యేర్పడసంగమయ్య,పలికిన నచ్చటిభక్తుఁడొకఁడు

గీ. కదియనేతెంచి మారన్నకంఠమందు
లింగమూ రిసిగాన కబ్బుంగిభక్త

వరులతోఁ జెప్పి తానును వారు మంచె
చుట్టి వెదకిన నందొక్కచోట నంత. 232

గీ. ముడివదలువస్త్రమునలింగమూర్తిగాంచి
బసవదండేశముఖులు సమ్మదముదొలుక
దెచ్చి మారన్నగారిసందిటినిగట్ట
నంతలో నిద్రి తెప్పిరి నట్లలేచె. 233

క. తానెనతిలేచెలేచిగ, ణానీకముగాంచి యిరువురద్భుతమతులై
యీనెలవున కిందఱు నిట, రానేమని తలఁచిబసవరాజునకంతన్. 234

ఉ. మారన మ్రొక్కియిట్టులను మారొడగూరిమి చేనుజూడఁగా
మీరిట వచ్చుట న్మదికి మిక్కిలిసంతసమయ్యె సామి నా
నేరిచినట్లు గాచితి వనీమృగచోరపతంగబాధలం
జేరకనీకయన్నఁ బ్రహసించియమాత్యవరేణ్యుఁ డిట్లనున్. 235

చ. వరతరపుణ్యయిచ్చటికి వచ్చుటచేనరయంగఁగాదునీ
తరుణియునీవుబిట్టరువిధం బివుఁడే నని వచ్చిచూచి యీ
శ్వరగతజీవుఁ డీతఁడని సంగయు తెల్పిన జాతిపడ్డశం
కరునిభవచ్ఛరీరమునఁ గట్టసజీవుఁడవైతి వంతటన్. 236

గీ. ఇన్నిదినములు నీసత్త్వమెఱుఁగనైతి
శరణసంతతిలో నన్నెఁబరఁగితౌర
యనుచు వినుతించి యఖిలభక్తాలిఁగాంచి
బసవనామాత్యచంద్రుఁడు ప్రమద మెసఁగ. 237

మ. బలికెర్ణ శావురెమారయాఖ్యుని మహత్త్వమ్మాతఁ డిష్టంబుగర్
దొలఁగంజీవముతోనె పాసెమరలన్నాల్కల్ప జీవించె భూ
తలమందెచ్చుటఁ గల్గునేయిటులఁ దత్త్రస్వ్రతంసంబుని
శ్చలభక్తానుగచర్యలెక్కయిడ శక్యంబౌనెవాగ్జానికిన్. 238

సీ. అనవుడు మాదిరాజయ్య ఇట్లను బస
వాధిపలింగంబు నందుఁబ్రాణ
ములుచేర్చు టఖిలభక్తులకు నైజమెవీని
భామినీచర్య చెప్ప నగుఁ గాక
విగతజీవుం డైనమగనిగాంచినమాత్రి

నిద్రయో రోగమో రౌద్రవేయ
దంశమో యని మది దానించుకేనియు
సంశయింపక యను సమితివిభుని
గీ. యందు సంధించి వేమ్రుతిఁజెందె నహహా
యట్టిపరమపవిత్ర యింకెందుఁగలుగు
నన్నబసవన్నయారమారన్నబుద్ధి
నెన్ననీకన్న మహిమాఢ్యు లున్నవారె. 239
గీ. అనిన నమ్మాటమిండసంగయ్యగారు
విని బసవరాజుఁ గని యిట్టులనియె మాది
రాజువల్కిన పల్కులరాజధరప
శివశ్రితాధర్మ మిందు సందియము లేదు. 240
క. ఇమ్మార్గమిష్టలింగులు, క్రమ్మదురెటులన్న మారగణవర్యుండి
ష్టమ్మునకై ప్రాణమ్మరె,యిమ్మానిని యేలజచ్చె నిష్టముగలుగన్. 241
గీ. అనిన బసవయ్య విస్మయం బందిధర్మ
సూక్ష్మముల తెల్ప సంగసీసామ్మయయ్యొ
నాగురుస్వామి సంగయ్యవే గణింప
నిన్ను గొనియాడనే జాడనేర్పువాఁడ. 242
క. అని యాతని వినుతింపఁగ,విని మాచయభక్తవరుల వీక్షించుచునా
తన మేయాతని చరితం, బనిశముబసవేశుడెలుఁగడాయె నెమును తాన్.
గీ. నాపు డండొకశరణుండు దేవసంగ
మయ్య చరిత మదెట్టిది యానతీయ
వలయు ననవుడు తద్భక్తవరుని గాంచి
చిత్రముగ మాచిదేవయ్య చెప్పఁదొడఁగె. 244
ఉ. శ్రీశితుహినాద్రిజారమణసేవకపాదసమర్చనారతుం
డీతఁడు యావ్వనంబున మహిష్ఠమహేశ్వరభక్తినల్పుచుర్
భూతలమందుభక్తి గతి పోషణమొప్పఁగఁ బుట్టిలోకవి
ఖ్యాతి నెసంగునట్టిబసవాధిపుఁ గన్గొనువాంఛఁజెందినన్. 245
గీ. అనఘ కళ్యాణపురిఁజేర నరుగునంత
సంగమేశ్వరునందు నా సంగమేశు

రాక బసవేశ్వరుండు దర్శన మొనర్చి
యెదురుగాఁ జని యడుగుల కెఱఁగి భక్తి. 246

ఉ. ఇంటికి తోడి తెచ్చి మణిహేమమయాసనమందునుంచి ము
క్కంటిని బోలెఁ బూని సుమకార్ముకసంహరతుల్య నేఁడు నీ
వంటి మహాత్ముఁ డిచ్చటికి వచ్చుటచే శుభము ల్ఘటిల్లె నే
మంటి నటంచుఁ బల్కి విని మానసమందు ముదం బెలర్పఁగాన్. 247

గీ. ఖ్యాతి యోలేక భక్తిసమేతుఁ డోప
రీతిఁ జేయఁగ వలెనని వృషభమూర్తి
గాంచి దరహాసితాననకమలుఁ డగుచు
నందఱును విన మిండ సంగయ్య యనియె. 248

చ. బసవమహాప్రధాన శివభక్తినిధాన కళావధానసం
తసమున వారకుందరదనా సురతానుభవాప్తిఁ గోరె మా
ననమట నిష్టలింగభజనం బొనరింపుచు నున్న పొద్దులే
దెసకము మీఱ గేళినటియింపఁగ మాకటు గాన చెచ్చెరన్. 249

శా. నాలింగం బిపుడీవు చేకొని మహానందంబు మీఱంగ మ
ట్కాలం బర్చన లిచ్చి యేమరక వెంటం దప్పి సాదంబు త
త్కాలాతీతము గాక యుండ నతిసౌఖ్యం బొప్ప మాకన్న వే
పౌలోమీవరముఖ్యదేవనుత చిద్వ్యాప్యపారపారంగతా. 250

చ. అనిశము లింగమూర్తి తనువందు ధరించుట గాక వీడఁగా
జను నెయటంచు నీ మదిని సంశయ ముంచకు మేడనున్న నా
మనసు మదీశు నేమరదు మర్కట మెందు నటింపుచుండినన్
దనుగను వట్టివీడ నివిధంబున నాశ్రితలోకపాలకా. 251

గీ. గనుగొనఁగ నింద్రియములకు కారణంబు
మానసం బింద్రియము లెటు మలయు నేమి
మనసు లింగమునందుఁ జెందని సపర్య
యోటిభాండంబులో వారి యోజఁ గాదె. 252

చ. అన బసవండు మ్రొక్కి వినయంబున ధీనిధి మాయభీష్టమే
యనవున నుండు నల్లయగు నన్న గళస్థితలింగమూర్తి నీ
తనిగళమందు నుంచి ప్రమదంబున సంగయ యేగు నంతదా

దినమతఁడాజ్ఞయిచ్చినగతిఁ శివలింగముఁ బూజసేయుచున్. 253

గీ. తత్ప్రసాదంబు వెలకొమ్మఁ దగిలియున్న
భక్తపర్యనికరభక్తిఁ బంపుచుండె
నంత నొకనాఁడు శివరహస్యార్థగోష్ఠి
మహితగణవర్యులను భవమంటపమున. 254

క. వసియించినవారలతో, బసవఁడు గూర్చుండి వినెడుపట్టునమధ్యా
హ్నసమయమగుఁడాచరణిం, గసవర్యలొనర్ప లేచి గ్రక్కునఁజనియెన్.

చ. చనికడు వేడ్కఁదత్క్రమముసర్వముదీరిచి వేగవచ్చియా
ఘనులకుమ్రొక్కినిల్వగణకాండము గన్గొని నెమ్మనంబునం
గినుక వహింప నిట్టితరి నీవెటుపోయితి వన్న గొంకుచు
న్వినయము మీర నిట్లనియె వేదహయాపరమూర్తివారితోన్. 256

ఉ. సంగయదేవుఁడై వరఁగు సంగయదేవుని లింగమూర్తికిన్
సంగత పూజనావిధులొసంగఁగఁబోయితి నన్న నంబికా
సంగగణాళిహాసము లెసంగఁగ హావెలయాలిగూడు నా
సంగమనించువారికి ప్రసంగగనేర్చునె లింగలీనతల్. 257

గీ. హరుప్రమాదవశంబున నైన నరుఁడు
వాసెనేనియు ప్రాణముల్ వదలవలయు
ననుచుఁ శ్రుత్యాగమంబులవినుచు ప్రాణ
లింగముల వేఱుసేయుట లెస్స యగునె. 258

క. అనియాతని నిరసించుట, వినిబసవామాత్యవరుఁడు విహ్వలభావం
బున నేమియుననసేరక, మనమునఁనొచ్చుకొనె వారిమాటలకంతన్.

సీ. ఖరకరుండదరదిగ్గిరిఁజేరుతరిభక్తి
కధికతత్త్వప్రసంగంబువినుచు
నుండియమాత్యుండు మిండసంగయలింగ
పూజావసరమయ్యెఁబోవవలయు
మన్నెగుటకుఁకోపమునఁనొందుభక్తాజ్ఞ
మీరుటభక్తికిమెచ్చుచెంద
దనుచుఁగొంతవిచారమొనరించి యాయయ్య
దృఢభక్తి...

గీ. యనితలఁచియొక్కపరిచారునప్పుడుబిలిచి
పొసఁగదిప్పుఁడులింగంబు పూజసేయ
పంచభక్ష్యాన్నములు వేగ కొంచుపోయి
యిట్లుదెల్పకసంగయ్య కిచ్చిరమ్ము. 260

క. అనియుచటిభక్తవర్యులు, వినఁబల్కఁ నయతఁడునగుచు వేగమెదొరచె
ప్పినగతిసినర్పితాన్నము, గొసిచనిసంగయ్య యెదుటగొంకకనిలువన్.

చ. కనితలయూఁచియాతఁడు మొగంబటుత్రిప్పి యనర్పితాన్నముం
దినుమనిపంచెనే బసవధీమణియంచునచించితోన మే
దిసిగతజీవుఁడై పడమదిన్వెరగందుచు వేగ గ్రమ్మరం
జనిపరిచారుఁడాక్రమము సర్వముమాత్యునితోడఁ దెల్పినన్. 262

శా. ఆమాటల్విని మున్ను తద్ఘనునినిందాలాపముల్ పల్కు వా
రేమీయింతటిమాటపుట్టెననుచుర్ హృద్వ్యథులన్విస్మయో
ద్దామవ్రీడలుగ్రమ్మ శ్రీబసవరాడ్దండాధిపుంగాంచి భ
క్తామర్త్యాగమసంగమేశ్వరునిమాహాత్మ్యంబు నింతయ్యెడిన్. 263

క. కాలముదప్పఁగనియ్యక
నీలగళుప్రసాదమూను నియమముగాన
న్వ్రాలెదినకరుఁడు నియమం
బాలరయుగునోయటంచు నసువులఁబాసెన్. 264

చ. ఇంతమహాత్ముఁడౌట మునుపెన్నడెఱుంగమిఁజేసి యింద్రియ
భ్రాంతుఁడటంచు నింద్యముగఁబల్కితి మీకలుషంబువాయ దా
నంతయుబాయ దేమిగతియా నీకమాకనిమ్రొక్కఁగంగమా
కాంతుఁడుపల్కె తద్గణనికాయముతోవినయంబెలర్పఁగాన్. 265

చ. అలఘుకృపాత్ములార వినుఁడాతనిభావము తేటతెల్లగా
దెలిసియు నన్నువంచనకుఁదెచ్చుటకై యిటులంటిరైన ని
ప్పలుకుల కేమి యిప్పుడలభక్తునిలింగముఁబూన్చి కాలమ
గ్గలమరుగంగనీక కరకంతుప్రసాదముఁగొంచు భక్తిచేన్. 266

ఉ. అందఅమాత్యుఁడున్న వెలయాలిగృహంబున కేఁగి వేఁడినం
బొందినిప్రాణముల్నిలుచు భోగ్యతరంబుగఁదత్ప్రసాదమిం
పొందుగ... ఘుమునమ్మతిని ... చేసియా

చందమునన్న భక్తుఁడయి సంగయలింగముపూని చెచ్చెరన్. 267

గీ. తత్ప్రసాదంబుభర్మపాత్రమునఁగొంచు
భక్తసంఘంబు దానును బసవవర్యుఁ
డరిగి గతజీవుఁడైనసంగయ్యఁగాంచి
విస్మయానందములు మదివెలయుచుండ. 268

శా. ఔరా యెంత మహాత్ముఁ డీతఁ డని డాయంబోయి కేల్మోడ్చి దే
వా రక్షింపుము సంగమేశ్వరకృపావర్ధిష్ణుభావంబు చే
నేరంబుల్ సయిరింపుమంచు దను దా నిందించుకొంచు న్సుధా
ధారం బైనమహాప్రసాదము గణాధ్యక్షాజ్ఞచేనత్తఱిన్. 269

ఉ. ఆతనియంకమందునుచునంతనె దెప్పిరిలేచి భక్తరా
డ్జాతముగాంచియచ్చెరువుసంభ్రమమొప్పనమస్కరించి కా
లాతిగమంబుగాక మునుపొందుప్రసాదసుఖంబునొంది వా
క్చాతురిఁబల్కె దత్కుసుమసాయకసంహరభక్తరాజితోన్. 270

చ. అనఘుతరాత్ములార వెలయాలిగృహమ్మున కిట్లు మిమ్ముఁ బో
లినఘనులేగుదెంచు టిది లెస్సగు నేమనుఁబోటిదాస్యభా
జనులకుగాక యంచు నెకసక్కెములాడిన లజ్జనొంది భ
క్తనిచయమెల్ల నొక్కనుడిగాబలికెన్ గురు భక్తియుక్తమై. 271

ఉ. సంగదయాంతరంగ విలసద్గురుపాదపయోజభృంగ మా
తంగనిశాటనాహితమతక్రమవర్ధనచంగ సత్ప్రసా
దాంగసభానుషంగసముదాదృతిభంగసమస్తభక్తరా
ట్తుంగయశోవినిర్జితవిధుత్రిదశాగభుజంగపుంగవా. 272

క. త్రైకాలికవిజ్ఞప్తియు, ప్రాకటలింగానుయోగపద్ధతి గణని
ష్టాకలనయెంచిచూడఁగ,మీ కేతగుమిండసంగమృడుగుణసంగా. 273

ఉ. నీమహిమావళుల్ దెలియనేరక నోరుకొలందిఁబల్కు మా
తామసవాక్యముల్ సయిచి దావునఁజేర్చి కృపాబ్ధి దేల్చి వే
కామవికారదూరయని క్రమ్మనవేడ్కనుతింపఁదద్గణ
స్తోమముఁగాంచి భక్తిమదిదొల్లగసంగయవల్కె మెల్కువన్. 274

ఉ. పావనులార మీచరణ భక్తుని నన్నొక పెద్దఁజేసి మీ
రీవిధిఁబల్కఁగా దగునె యెందును భృత్యులుతప్ప ద్రొక్కినం

గోవిదు లైనవారలిదికూడనితోఁ గ్రివనిశిక్షచేసి త
ద్భావముభక్తికిం జొనిపి దాపుగదీయుటధర్మమేకదా. 275

వ. కావునభవదీయపాదసేవకుండనైననన్ను కరుణాకటాక్షవీక్షణంబు లంగాంచి కృతార్థుం జేయుండని నమస్కారపూర్వకంబుగా విభూతి తాంబూలంబు లొసంగి బసవేశ్వరునిభక్తినిష్ఠలకలరి యతనింబె క్కు భంగులంగొనియాడి యందరవీడ్కొల్పి తొల్లిటియట్ల ననుపమ విలాసంబుననుండె కావున మిండసంగయ్యమహిమంబిట్టిదని మాచి దేవుండు వినుపించుటయు యచ్చటనున్న శరణపుంగవులత్యంత సంతోషితస్వాంతులై యతనింబొగ్గొని యగ్గింపుచు మారన్నచే ననుజ్ఞాతులై బసవేశ్వరసహితంబుగా నిజనివాసంబులకరిగి యప్పటి యట్ల సుఖంబుండిరి. 276

క. హాలికమారనచరిత్రత్రి, కాలముపఠియించునట్టిఘనుఁడుదహనదృ
గ్ఫాలునికృపగనిగాలం, గాలునిరూపమునబొమ్మగట్టిధరిత్రిన్. 277

✤ కమలవ్వకథ. ✤

వ. అదియునుంగాక. 278

సీ. కడునొప్పునీపురిఁ గమలవ్వయనలింగ
సన్నిహితప్రాణ సదయహృదయ
భవిపరాఙ్ముఖభక్త పాదార్చనాసక్త
సదయనిర్మలశీల సరసవచన
వేశ్యాకులోద్భవ విజ్ఞాననిధిరూప
లావణ్యసీమయంచహోవిరామ
యనుచు వన్నియకెక్కనని శంబు బసవేశ్వ
రాదులతోఁ బ్రసాదామృతాబ్ధిఁ

గీ. దేలుచును తత్త్వగోష్ఠి ప్రార్థించిదినుచు
త్రివిధలింగార్చనాసక్తిఁ దేజరిలుచు
సతతమంగవికారదూరత వెలయుచు
యుక్తవర్తనఁ జరియించుచుండె నంత. 279

గీ. ఆర్యనుత మైనయాయింతి చర్యలెల్ల
నరసికొండెద్దమంచయు యువలిమాధు

జేరి బిజ్జలభూపాలచిత్తగింపు
మనుచు నేకాంతమునఁ దెలియంగఁ బలికె. 280

మ. ఒకవేశ్యాంగనబత్తినెత్తుగొని యాయూరందులింగాంగియై
యిఁక మీఁదం దనకెవ్వ రీడనుచు దండేశాదిభక్తాలితో
నొకఁటైయున్నది తద్గణాధిపులు జాత్యానంబునావంతయెం
చక యుబ్బాలికతోడఁ బంక్తినిభుజించన్ సాగిరే కాలమున్. 281

గీ. జాతినీతులెన్న జాలరించుకయెట్టి
జాతులైన లింగసహితులేని
కలయరోయరవనిఁ గడునిందకోడరు
తామె ఘనులమనుచు దలఁతు రెపుడు. 282

చ. అని తెలుప న్విభుండు కుపితాత్మకుఁడై బసవేశుఁ బిల్వనం
పినఁ జని యాత్మయోగ్యమణిపీఠివసించినఁ గాంచి బిజ్జలుం
డనె గనులెఱ్ఱఁజేసి సచివాగ్రణి తావకభక్తిలోకముల్
ఘనముగనిండె మిమ్మననఁగాఁ బనిలేదిఁక మాటిమాటికిన్. 283

చ. కులము జలంబులం గలిపి కూడిన సద్యశమెల్లదూరమై
తొలఁగఁగ లజ్జఁబోవిడిచి తోరపునిందలకాలయంబవై
నలుగురునవ్వ నొక్కవెలనాఁతికిలింగముగట్టి దానితోఁ
గలిసి భుజించి మీకు సరిగా బహుమానము సేయఁ బాడియే. 284

సీ. ఎడపక యావుపా లెంతఁబోసిన నైన
విడుచునే సర్పంబు విసమొకింత
వుల్ల తేనియ యెంతవోసి నూరిన వేప
నారకు తియ్యదనంబు గలదె
తేటనీరున నెన్ని తెఱఁగుల నుదికిన
నెలుఁగుచర్మమునకు దెలుపు గలఁదె
లోతుజలంబులలోపల నానిన
పలుగురాతికి మెత్తఁ బడుట గలఁదె

గీ. యరయ లింగదేహి యైనంత వెలనాతి
పూతభావ మెల్లు పొందనేర్చు
తెలిసియుండి యిట్లు మిమ్మ...నే

యనిన బసవఁ డాగ్రహంబునొంది. 285

చ. ధరణితలేంద్ర యిట్టు లన ధర్మమె శైవమతప్రవర్తనం
బరయక వార్ధిఁజొచ్చునదులన్నియు వేరయియుంటగల్గునే
గురుకరజాతులౌనరుల గోత్రకులంబుల నెంచగూడునే
హరమతముత్తమంబు సమయంబులకన్నిటి కం చెఱుంగవే. 286

గీ. శూలిభక్తిలేని సోమయాజియుహీన
జనుఁడుగాని చూడ ఘనుఁడుగాడు
శూలిభక్తిగల్గు మాలవాఁడైనను
శూలిసముఁడుగాని మాలగాఁడు. 287

చ. హరపదభక్తియుక్తకమలవ్వపరిభాన మెఱుంగ లేక యి
ప్పురుసున దూష్యభావమునఁ బల్కఁగఁగూడునె తన్మహత్త్వమీ
వరయఁగఁ గోరితేని వెసనారయు మెవ్విధి నైననన్నయా
ధరణిపుఁ డట్లకాక యనితామసమించుకమాని యత్తరిన్. 288

చ. బసవనిఁబోవఁగాబనిచి పార్థివవల్లభుఁ డొక్కయుక్తిమా
నసమున నెంచి తస్కరజనంబులఁ బిల్వఁగఁబంచి పల్కె దు
ర్వ్యసనముమీర మీరు కమళవ్వగృహంబున కేగి తచ్ఛిఫుర్
వెసగొని తెండు పొం డనుచువీడియముల్ దయచేసి క్రమ్మఱిన్.

గీ. ఎప్పగిది నైనభ్రమయించి యింతి లింగ
మూర్తిఁ గొనితెండు మీ కతిముద మొనర్తు
ననుచు వారు లొనరించి యవనభర్త
యాజ్ఞఁ గైకొని తస్కరు లరిగి రంత. 290

క. హరభక్తులమాహాత్మ్యం, బరయక దుష్కృత మొనర్చె నవనిపుఁ డకటా
దురితాత్ముఁ జూడఁగాఁ డని, యరిగిన గతినినుఁడు పశ్చిమాద్రిని జేరెన్.

క. శైవమతద్వేషం డగు, భూవల్లభు ఘోరకలుషపుంజము బ్రహ్మాం
డావళినిండినగతిధ్వాం, తావృతమై తనరె దశదిశాంతరమంతన్. 293

వ. ఆసమయంబున.

ఉ. కత్తియు నీలిచీరెయును కంకటిరజ్జువునారసంబుముల్
గత్తియువాటురాలిసుము గొంకియు నక్షత లొల్కబూదియుం
గ [illegible]

గుత్తపుటట్ట నంబువులు కుక్కలకట్టునుపిండిబల్పమున్. 294

క. మొదలగుసాధనములుగొని,మదిగొంకకగాఢతరతమంబునచోరుల్
గుదిగొనికమళవ్వమణీ, సదనముఁజేరంగ నరిగిసైగలనంతన్. 295

ఉ. కన్నముద్రవ్వి క్రోవిసిడి గ్రైకొనివచ్చినతెక్కువువ్వ్వలన్ ,
మున్నుగదీపమార్పి యొకమ్రుచ్చుపదంబులు మున్నుసాచి యా
కన్నముచొచ్చియొయ్యఁదదగారములోపలికేగి తెల్విగాఁ
గన్నుల సర్వవస్తువుల గన్పడుకాటుకఁబూనియుత్తరిన్. 296

గీ. కనకమయసూత్రపేటికాకలితలింగ
మూర్తి విద్రుమఖట్వాంగమున దగిల్చి
యోగనిద్రాసమాసక్తి నొడలుమఱచి
పవ్వళించిన యా కమళవ్వఁగాంచి. 297

సీ. దరికేగినిల్చియా తెరవలింగముగొన
    జేతులాడకకొంతసేపు నిలిచి
నరపతియాజ్ఞనొనర్పక యాతని
    నప్పుడు జ్యోతిర్మయంపులింగ
మూర్తియున్నట్టితత్కార్తస్వరపుపేటిఁ
    గొని తాను జతవారుగూడిపోయి
పృథివీశుచేతిలో నిడి తారు దెచ్చిన
    గతియెల్లఁ దెలుప నద్భుతము నొంది

గీ. దొంగలనువీడుకొలిపియాలింగమూర్తి
జతనముగ డాచియంత బిజ్జలుఁడుదీన
నేమిపుట్టునొ యని భీతిహృదయుఁ డగుచుఁ
గడపె నారాత్రి నిద్దుర గానలేక. 298

వ. అంత. 299

క. హారపూజాకుసుమంబుల, కరిగెడుభక్తులకుకాలమనుభృత్యుఁడుదాఁ
గరమునఁబట్టినదీపిక, కరణినపుడు వేగుచుక్క గానఁగ నయ్యెన్. 300

క. కమళవ్వభక్తిగతిలో, కములఁబ్రకాశంబునొందుక్రమమున నాశా
సముదయమున నెల్లెడలం, గ్రమమున స్వచ్ఛతతనర్చె రాజితలీలన్.

గీ. ఆత్మసఖు[illegible]భిదానరా జకట యెంత

చేసె నని కోపమున మోము జేవురింప
వచ్చెనో యన లోహితవర్ణయుక్తుఁ
డగుచు నుదయించె నినుఁడు పూర్వాద్రియందు. 302
ఉ. అంతకమున్న బిజ్జలుఁ డహర్ముఖకృత్యము లెల్ల దీర్చి య
భ్యంతరసీమ వెల్వడి నిజాప్తులతో సభ జేరఁబోవఁగా
నంతటిలోనఁ జారుఁ డొకఁ డమ్మెడ కల్లన నేగుదెంచి భూ
కాంతుని గాంచి పల్కె గటకంబునబుట్టిన వార్తనమ్రుఁడై. 303
చ. అవనితయొక్క వేశ్య కమళవ్వ యనం గలదిప్పురంబునన్
శివపదభక్తియుక్తయులచేఁడియ లింగము దొంగబంట్లు త
ద్భవనముఁ గన్న మేసి దురితంబున కోడక కొంచుఁబోవతో
* నేవెడజీవముల్ సుదతి నిన్నటిరేయి మహత్త్వమేర్పడన్. 304
ఉ. ఇంత మహాత్మురాలి కిటు లెగ్గొనరించిన కర్మి యెవ్వఁడో
యంతకుఁ జూచువేగ మనియంతట నంతటఁ బ్రోలిలో జనం
బంతయు నాడుచుండె నిది యద్భుతకార్య మటంచుఁ దెల్పినన్
స్వాంతము చంచలింప జనవల్లభుఁ డేమియుదోఁచ కత్తరిన్. 305
చ. ఘనుఁ డగుమంత్రివర్యు నొక కంచుకుచేఁ బిలిపించి పల్కెనో
యనఁగ మహాత్మ్యమైన కమళవ్వదిటం బరయంగఁ గోరినే
నని యతి చోరులం బనిచి యాసతిలింగము దెమ్మటన్న వా
రు నటుల సేయ బిట్టవుడె గ్రుంకె లతాంగియిఁ కేమి సేయుదున్. 306
గీ. కుడిచి కూర్చుండి యిపుడిట్టి బెడద దెచ్చు
కొంటి స్త్రీహత్య యనుజనకోటివలన
నిందయును రాజ్యదూరత నొందవలసె
నింతవచ్చుట మున్నె నే నెఱుఁగనైతి. [గంధి
గీ. ఇంతకాలంబుగా పాడితిపుడు నన్ను, పాపమొందక యుండ నప్పద్మ
జీవసంగతి జేసి రక్షింపవయ్య, యని నృపుతోఁ డబసవేశుఁడని యెనిట్లు
ఉ. అక్కట యిట్లు సేయఁ దగునయ్య సమర్థతరప్రయోజనం
బక్కమళవ్వ నిర్మలమహత్త్వముల న్నెఱుఁగంగఁ జెప్పినం
దెక్కడిచాడిమాటలె మదిం బదిలంబుగ నమ్మమిత్తిచేఁ
జిక్కితి వేమి సేయఁదగుఁ జెందిన దుర్దశ మాన్పవచ్చునే. 309

గీ. చోళరాయుండు వేఁగివసుంధరావి
భుండు నుదయేశుఁ డాదియౌ భూమి
కొండ యీశ్వరభక్తుల గొడునచేసి
తారచెడుట యెఱుంగవే ధరణినాథ. 310

క. నీవెఱుఁగఁగమీజైనులు, శైవుఁకపకారులగుచు నమసిరికాదే
కావునసెంత దిగులొ్కన, కాదలఁచిన కార్యమెల్ల గాకతోలఁగునే.

చ. అనవుడు బిజ్జలుండు బసవాధిపు నే నినునమ్మియుంటపా
వనునిగఁ జేసికల్మషముఁ బాపియశంబొనఁగూర్చి సద్గతిం
గనుపడ సేయువాఁడవని కాదె దయానిధి యట్లుగానసీ
యనవునమందబుద్ధి నగునట్టినసు్బుధమాన్యుఁ జేయవే. 312

సీ. అనుచుదీనతదోఁపనాడినబసవండు, మోమునజిఱునవ్వు మొలకలెత్త
నాలింగమూర్తిఁ దెమ్మనికేల నిడికొని, భక్తులుదానును పార్థివుండు
కమళవ్వగారిగేహమునకుఁ జనిగత,జీవయైపడియున్న చెలియఁగాంచి
యచ్చెరువందిపూర్వాచార్యుచేభక్త,పుంగవాజ్ఞఁదదీయలింగమూర్తి

గీ. నపుడు ధరియింపఁగాఁ జేయు నంతలోన
నిద్ర తెప్పిరి నటులేచి నిఖిలభక్త
సమితి గని మ్రొక్కి నిలచిన సచివుఁడువిడ
పాదపద్మములకు మ్రొక్కిఁ బ్రస్తుతించె. 313

క. బిజ్జలుఁడంతటసాధ్వస, లజ్జాధరభక్తిమార్గలంపటుఁ డగుచున్
దజ్జలదాలకపదముల, పజ్జం ధరజాగిమ్రొక్క బడివినుతించెన్. 314

క. కమళవ్వనీదువిలస, త్కమలాంకకలాపభక్తి గతియిజ్జగతిన్
కమలాధవ కమలోద్భవ, కమలాధిపముఖుల కైనఁగానఁగ వశమే.

క. నేను జ్ఞానమునన్కఁడ, నైనీకెగ్గించినాఁడ నటుగావున నా
హీనగుణంబులు నీమది,నూనకుమని వేఁడుకొనెన్నృపోత్తముఁడంతన్.

క. హృత్కమలకర్ణికాస్థిత, సత్కాంతకళావతంసచరణాంబుజయా
తత్కాంతకరుణగని సం,పత్కమనీయాత్మగృహముపటుగతిజెందెన్.

క. తద్భక్తతతియు బసవఁడు, హృద్భరితానందు లగుచు నేగిరినిజభా
వ్యద్భవనములకుసతిలో, కాద్భుతసద్భక్తితోంటి యటు వసించెన్.

### టంగుటూరి మాచయ్యగారికథ.

వ. అదియునుంగాక. 319

గీ. మరియుటంగుటూరిమాచయ్యనా నొక, భక్తపుంగవుండుపాదదాహి
రాజరాజరాజరాజేష్టసత్సుధా, రాజదమలకీర్తిరాజితుండు. 320

శా. అద్వంద్వాంబురుహాద్వివచ్ఛకలభూషార్చాసమాసక్తుఁడు
ద్యద్వాణీవముఖాదితేయనికురుంబాలభ్యముక్త్యంగనా
హృద్వాంఛాపరిపూర్తికృద్గణకటాక్షేక్షావృతాంగుండుకృ
ష్ణద్వైపాయనముఖ్యయోగనుతనిష్ఠాశాలి యొప్పుం భువిన్. 321

క. ఆలింగభక్తవర్యుం, డాలియు సుతయుగము దాను నగచాపగుణా
ర్చాలిన్నిర్వంచకస్థితి, జాలఁగనొనరింపుచునురసాస్థలి వెలసెన్. 322

వ. అంత నొక్కనాఁడు. 323

చ. చిఱుతకుమారుఁ డాటతమిచేఁ దనయీడగువారిఁగూడి మే
నెఱుఁగకయాడుచుండఁగ మహీస్థలిలింగము జారిపడ్డయ
త్తరిఁ గని బాలుఁ డొక్కఁ డది రా బదిలంబుగడాచివానిముం
దర కరుదెంచి నీగళమునన్ శివుఁడేడి యటంచుఁ బల్కినన్. 324

చ. కరమున రొమ్ముపుణ్కి శివుఁ గానకతోనె గతాసుఁడై ధరం
దొఱఁగిన గాంచి భీతిలుచు దోడికుమారకులెల్ల నొండొరుల్
పరు లెవరైనమీఁదఁబడి పట్టుట కొట్టుట గాన మూరకే
మరణముఁ జెందె నీతఁడు ప్రమాదము దెచ్చెను మాకకంతకున్.

మ. తలిదండ్రుల్విని యీడనున్న మనపై తప్పించి భూమీశుతో
దెలియంజెప్పక పోరుచెప్పినవుడే తెప్పించి చూపంగఁ గొ
ఱ్ఱులవేయించక పోవఁడిందఱని కేక్రోవంచు నాడంగవా
రలతో లింగము డాచువాఁడు వెరపూరంబల్కె నప్పట్టునన్. 326

మ. వినుఁడీబాలకులార యాటతమిచే వీఁడుండుచో లింగము
ర్విని జారంగని యేనుడాచితెలుప స్వీతాసుఁడై కూలెఁగా
వునతల్లింగము గ్రమ్మరం దనువునం బొందింప బ్రాణంబువ
చ్చునొ యం చందఱు చోద్యమంద నవుఁ డీశున్వ్యానిసంధించినన్.

ఉ. తోడనెమేనఁబ్రాణములు తొల్లిటియట్లన చేరఁగాంచితో
గూడివసించుబాలకులు కో యనియార్చుచు నెంతవింతరా

చూడుడటంచు నిందరినిఁ జుట్టినగండము దప్పెనంచుఁ జె
ల్లాడుచు నాతనింగదిసి యక్కునఁజేర్చు చు నుండున త్తరిన్. 328

గీ. అతనియగ్రజుఁ డరుదెంచి యచటివారి
వలన దద్వృత్త మరసి శైవప్రవర్త
నంబెఱుంగునే వీఁడు లింగంబుజారు
నంతనేప్రాణములువిడఁ డాయెఁగాన. 329

చ. శరణులువిన్న నీగతికి సైతురె యంచుఁ గ్రుద్ధాత్ముఁడై నిజా
వరజునిచాలగా బదరి పాపదమంచు జనంగఁబోవు న
ప్పురుసునఁగాంచి బాలకులు బాపురె యీగతి వల్కువీనిపెం
పరయుదమంచు నొక్కమొగి నందఱుపైఁబడి వానిలింగమున్. 330

క. బలిమినదెంచినఁ బ్రాణము, దలఁగును వెఱగందిమగుడఁదల్లింగము నై
నిలువుట యుఁదోన్ బ్రదికిన, జెం రేగికుమారకులుకుచేష్టితులగుచున్.

గీ. పెక్కువరుస లింగంబుల బెరగదీయు
చునురయంబునఁగ్రమ్మర దనువునందు
నొందఁజేయుచుఁ బ్రాణవియోగయోగ
కలన కద్భుతమందుచుఁ గాంచి యంత. 332

క. చిఱుతలము మీమహత్వం, బెఱుఁగక యిటు చేసినార మీపనిదయచే
మఱువదగు స్వామియనున, త్తరిఁదద్గురుఁడై నమాచధన్యుఁడువచ్చెన్.

ఉ. వచ్చికుమారులంగల శివాధవభక్తిపదంబెఱుంగఁగా
వచ్చెశివుండు దేహమెడబాయుటగల్గునె భక్తకోటికీ
యొచ్చెము సల్పవచ్చునె యయో యని చింతయొనర్చుచున్న
భాస్వచ్చరితాఢ్యుఁగన్గొని హసన్ముఖులై గుమిగూడిబాలకున్. 334

గీ. అంగమందుఁబాయ దఁటపీనిలింగంబు
చోద్యమిప్పుడిదియు చూతమనుచు
దొంటిపగిదిగదిసె దూసినఁదల్లింగ
మెడబెనంగియుంటి వదలకున్న. 335

చ. కనుఁగొనిబాలురిట్టిగతి గంటిమె వింటిమె యెందునైన నీ
యనఘులు శంకరాంశజు లటంచు నుతించుచు మ్రొక్కుచున్న నెం
తనగరవాసభక్తతతి తన్మహిమన్నిని వారిఁజూచు వే

డ్కనరుగఁగాంచి యాత్మజయుగంబునుదాను నమస్కరింపుచున్.

క. ఉన్నెడమాచయగనుఁగొని, యన్నాగకలాపభక్తులద్భుతమతులై
యన్నగలవారిలోఁబడి, సన్నమహామహులువీరె జగతినయారే. 337

గీ. చెడనిభక్తియుక్తిగొడగూచి తిరునాళ్ల
ప్రోవయరియమయును పావకాత్ము
గర్భవాసులైరి గాని యీగతిలింగ
మంగమందు విడమి యవనిగలదె. 338

క. అనివినుతించిననందొక, యనఘుండిట్లనియె తొల్లి యనిమిషుఁడనఁగ
ల్గునతనిచరితముదెల్పెద,వినుమని తెలుపంగదొడఁగెవిస్పష్టముగాన్.

— అనిముషునికథ —

సీ. అతివేడ్కచిన్నవయసునాఁడుశ్రీగిరి, కేఁగుచోనాతఁడొక్కడవ్వలింగ
మవనిపైఁబడితన కగపడకున్నంత, నచ్చోటనిలిచి దేహంబుదొరగ
గమకించినెడదయాకలితాత్ముఁడైనంది, కేశ్వరుఁడేతెంచియిటులజీవ
మెడసేయఁగారణం బేమినానన్ముఁడై, యిట్లనునాలింగ మిచటగాన

గీ. రాకయుండెఁగాన ప్రాణంబువీఁడనే, ననఁగఁజేయవలసె ననిననంది
నగవుతోడననియెఁ దెగువచేసీగతి, దారుణంబు సేఁత ధరణిగలదె.

ఉ. ఊరకజీవముల్విడువ నొప్పునె యెవ్వరిచేతజిక్కెనో
యూరయుమెచ్చటంబడెనో యంతట నంతటఁజూడు పాత్రితరా
ర్యారమణార్చనం బెచటనయ్యెనో యచ్చటగాంచఁబంపుమా
దారినిమర్మ సేయుమను తప్పకలింగముగాన నయ్యెడిన్. 341

వ. అనిన తద్భక్తవరుం డిట్లను నయ్యేరేపకడ నొక్కసరోవరతీరంబున ప్రాతఃకాలశివార్చనం బొనరించి పయనంబు దరలి యొందుచోట నిలువక వచ్చివచ్చి యిచ్చటమదీయాంగంబున నీశ్వరుండు లేమిగంటి గావున యిచ్చటమల్లింగంబు దొరకవలయుఁ గాక యచ్చోటువదలి వేఱెయొక్క చక్కవెదుకంబోవ నిది నానియమంబునియమవర్తనులైనవారలనీశ్వరుండు కరుణించి కృతార్థులం గావించు నదిమెల్లనిన వినుండు. 342

— పగల్తాండారి కథ. —

క. అండజనాయకవాహన, కాండాలయితాత్త హృదయకమలజుఁడఘవే

దండహారివసుమతిపగ,ల్తాండారియనంగ నొక్కధన్యుఁడు వెలయున్.

గీ. విశ్వసన్నుతుఁడతఁ డగస్త్యేశ్వరునకు
ప్రతిదినంబును శతఘటపరిమళోద
కంబు లభిషేక మొనరించి కాని కుడువ
ననుచు వ్రత మూని యట్లు సేయంగ నంత. 344

సీ. విశ్వదిగంతరావృతిరజఃపటలంబు, దవవహుతాశనదగ్ధతరుచయంబు
ద్వాదశాత్మకరాభితప్తావనితలంబు, వారిసరోన్మషివనమృగంబు
ఛాయాప్రదేశవాంఛాసక్తపథికంబు, పానీయవారికాబంధురంబు
శైత్యగంధవహార్థసంచరద్భుజగంబు, సలిలన్మరీచికాసముదయంబు

గీ. నిర్జలతటాకవాపికానిర్ఝరంబు, జనభయంకరపశ్చిమస్పర్శనంబు
శాల్మలీతూలకీర్ణనిర్జరపథంబు,నగుచుగనఁగొనవయ్యెగ్రీష్మాగమంబు. 346

వ. ఆసమయంబున.

చ. తనపురినీరు లేమి వసుధారథుమజ్జన మంతరించునో
యనిపరిచారవర్గముల నన్యపురంబుల కన్పివారిదేఁ
బనిచిదినంబు నేమమెడబాయకనల్పుచునుండి నొక్కనాఁ
డనఘుఁడుతొంటియట్ల గిరిజాధిపమజ్జన మాచరింపఁగాన్. 347

క. చేదప్పినూఁజవఘటము, మేదినిఁబడిభిన్నమగుడు మృగధరభక్తుం
డీదివసవ్రతసాంగము, గాదయ్యెనిఁ కేమిసేతు గౌరీరమణా. 348

క. చేరువనీరముపుట్టదు, దూరముబంపుటకు నెడముదోఁపదిపుడునే
నేరీతివ్రతముగడుపఁగ, నేరుతునని మూర్ఛచే మునింగినయంతన్.

చ. సరసిజవైరిజూటుఁ డొకజంగమరూపము దాల్చివచ్చియా
శరణవరేణ్యుకట్టెదుట స్వర్ణఘటంబు జలాభియుక్తముం
దిరముగనిల్పినీవ్రతము దీర్పుముసాంగముగాఁగ నంచుఁదె
ల్పిరయముమీరనేగుటయు లేచిదిశల్ పరికించి మెచ్చుటన్. 350

చ. ఘటమునుజంగమంబుఁ బొడగానకచింతిలి యాత్మనక్కటా
యిటుకలగంటిఁగాక నిజమేనికనుంగవ కబ్బకుండునే
యెటులధరింతు నానియమమేగతి సాంగముఁ జెందునంచును
త్కటపరితాపవేదనలు గ్రమ్మఁగఁగన్నులు మూసితావెసన్. 351

ఉ. తొల్లిటిపైఁడికుండ నిజతుండమునందునఁ గాంచిశూలినా

యుల్లము(జూడగోరి జలయుక్కలశంబు మదీయగర్భమం
దల్లననిల్పె మేలిక భయంపడనేలకుఠారధారనే
నెల్లరుజూడగర్భగతహేమఘటంబు పెగల్తుని త్తరిన్. 352

క. అనివాడి సురియచేకొని
తనయుదరము చించదలఁప తత్క్షణమునహ్రా
ద్వనజమున దయదలిర్పఁగ
మనసిజహరుఁడిటుల వలదుమానుమటంచున్. 353

గీ. కట్టెదుటనిల్చి యాతనికరమువట్టి
మేలుగణపర్యసీ చర్య మెచ్చువచ్చె
రమ్ముకైలాసమునకు శీఘ్రమ్ముగాఁగ
ననిన శివునకుమ్రొక్కి యి ట్లని నుతించె. 354

పంచచామరము. అంబుజాక్షసాయకాయజాండభాండనాయకా
శంబరారిమారణా నిషాదవేషధారణా
కంబుపర్ణవిగ్రహా వికారికాలనిగ్రహా
శంబరాంకభూషణా నిశాచరాళిశోషణా. 355

గీ. అనుచుసన్నుతించియార్యమనోనాథ,పూనువ్రతముసాంగమైనపిదప
రాకయొప్పఁగారు లేకున్ననిచ్చట,వదలివచ్చుటుచితవర్తనంబె. 356

వ. అనిన శర్వుం డి ట్లనియె. 357

గీ. అంజనఖనిత్రధూపదీపాదికములు
ధరణిసేవధిదొరుకు నంతకునుకాదె
తద్ధనంబబ్బుపిదప సాధనచయంబు
లెన్ని యేనియు బనిగొనునేతలంప. 358

ఉ. కానమదీయదర్శనము గల్గెడునంతకు కాదె నీవిటుల్
పూనియొనర్చునట్టివ్రతపుంజము భక్తసమూహిలోన బెం
పూనితి వింకసంశయమునొందకు నీనియమంబు నిండె నీ
నూనవిమానమెక్కు పదశోభనరావ్యధరంబు జేరఁగాన్. 359

సీ. అనఁబగల్తాండారి యనియెఁ గ్రమ్మఱమ్రొక్కి
స్వామి మీరనుమాట యేమదిష్ట
ముగుఁగాని వ్రతలోపముగుటకు సమ్మతిం

పదుమదియావెత్తిఁ బాపవలయు
నావుడు కరుణించి యావారికుంభ మా
తనిచేతికొసఁగ మోదంబునొంది
హరమజ్జనమొనర్చి యయ్యయిలింగాల
యములతో ననునీపురమునఁ జేర్పు
గీ. మనిన నాతఁడు కోరినయటులనిజని
వాసమునఁ జేర్చె నపు డద్రివాసుఁ డట్టు
లగుట పట్టిననియమంబు దిగువ దగునె
యని మఱియు నిట్టులనియె నయ్యనిమిషుండు. 360
మ. అతిభక్తిం దనయెత్తు గుగ్గులము నిత్యంబిత్తు ధర్మాపహా
ర్పితముం జేయఁగఁ గాళకూళమదిదుర్వృత్తాత్ములై యొక్కనాఁ
డతనింగానఁగ నీక డాచ నిజదేహం బగ్గిలో గుగ్గులా
యితమై యొప్ప నొనర్చి హీనతనరుం డీశాను నొప్పింపఁడే. 361
చ. జడధిశయాన బాణునకు సంతతమున్వొయి దీపము ల్వెలుం
గిడుచు పదార్థమెల్లనదె హేతువుగా వ్యయ మొంద ధీరుఁడై
జడముడివిచ్చి దీపములచందమున న్వెలిగించి తోడనే
కడములనంబిశంకరుని కాయముఁ జెందఁడె బొందితోడుతన్. 362
గీ. ఎండవెన్నెల తనుపంటనీని వ్రతము
బూనిగుహానుండి రవివసువుంజ మాత్మ
గాత్రమునఁ జొన్ప నాతనిఁ గనిశపించి
యాశుదయగనె తొల్లిను సేశ్వరుండు. 363
గీ. చందనముమూఁడు సందెలశర్వమూర్తి
కిచ్చువ్రతమూని నిజధనమెల్ల సమయ
చెయ్యిగంధముగా దీసి శివుని కరుణ
వలనయణుమూర్తి కైలాసవాసిగాఁడె. 364
గీ. మఱియు నడిభర్త గుగ్గులమూచి దేవుఁ
డాధి యగుభక్తపర్యులు పొంగనియమ
కలనచేఁ గాదె శివుకృపగాంచిరట్టు
లగుట వ్రతమరయఁగ నిట నగునె యనఘ. 365

వ. అనిన నందికేశ్వరుండనిమిషనిష్ఠాగరిష్ఠత్వంబున కచ్చెరువందుచు దరహసితాననుండై యిదెకొమ్మనితల్లింగంబతనిచేతికొసంగి లింగాంగైక్యమార్గంబుపదేశించి నేటంగోలె నీమూర్తినీ దేహంబుననంటు వదలకుండునని యనుగ్రహించి దండప్రణామయుతుండగునతనిహిత వాక్యంబులగౌరవించి ప్రమథాధ్యక్షుండు నిచేచ్ఛంజనియె నాటంగోలె నయ్యనిమిషుండు నిజకరతలన్యస్తలింగలీనదీక్షాతత్పరత్వంబున నిరంతరంబు దన్నుమఱచి చిదానందాబ్ధినోలలాడుచుండెనని తొల్లిటిభక్తవర్యుల చర్యలవిందుము నేడిమ్మహాత్ములఁగన్నులం గంటిమని సన్నుతించు నవసరంబున నమ్మాచిదేవుభార్యయే తెంచి యచ్చటి భక్తులకుమ్రొక్కి నిజపతిసుతులంగనుంగొని గూఢతరయగు మన భక్తినేటికి రచ్చకెక్కె నింకమర్త్యంబు చాలు రండురండు పోదమని కుమారులనిరువుర జంకలనిడికొని ప్రాణేశ్వరు మూఁపుపై నెక్కించుకొని సకలజనంబులు ఘేయనిజయవెట్ట వైహాయసగమనంబునఁ గైలాస కుధరంబునకరిగె. నంత నచ్చటిభక్తులు నత్యాశ్చర్యంబు నొంది తమలోన. 366

సీ. విలసితచతురంగబలసమేతుండయి, చేరమహోర్వ్వీడు జేరనరిగె
సకలతంత్రముదానుశమనారివసతిచెం, తకుమారపాలగూర్జరుడుచనియె
తొమ్మిదిపురములతోఁగూడ శివపురి, డాయంగనేగెహాలాయుధుండు
గురునకై దొమ్మరకులమెల్ల గొనితార, పృథ్వీధరముఁజేరెబిల్లమాఖ్యుఁ
గీ. డనుచువిందుమాదొ్యక్తులయందుదొల్లి, కంటిమిత్తరిగన్నులకరువుదీర
దేహములతోడఁ గైలాసదేశమునకు, ధారుణీజనులందందవీరలేసగ,
గీ. పలికినట్లనడఁచు భక్తులువీరకాక, నవనిలోననెవ్వరైనగలరె
యనిననొక్కజంగమయ్యయిట్లనిపల్కె, వినరెతొంటిభక్తవితతిలోన.

ఘటాలయ్యకథ.

శా. కామక్రోధమదాదిశత్రుబలవద్గర్వాపహుం డింద్రియ
స్తోమోద్దామవికారదూరుఁడు వినిర్ధూతాఖిలాఘుండు దీ
నామర్త్యక్షితిజంబు భక్తగణపాదాంభోజనిత్యార్చన
స్థేమాత్ముండు దనర్చు నివ్వసుమతీసీమన్ ఘటాలయ్యనాన్. 369

ఉ. ఆయన[illegible]ప్రమ

ప్రాయకళాభిరామ సితపంకజపత్రవిశాలనేత్ర స్వ
ర్ణాయకరత్న వేణి యుడురాజనిభానన భద్రకుంభికుం
భాయతసత్పయోధర మృగాధిపమధ్య తనర్చునెంతయున్. 370

సీ. ఆయింతిపతిమెచ్చఁ బాయకనిత్యంబు, కేవలభక్తి గల్గినదివోలె
నుచితోపచారంబులొనరజేయుచుమన్న, థాయత్తమానసమైవిటాలి
గూడిచరింప నక్కోవిదుఁ డెఱిఁగియు, లెక్కసేయకలింగలీలధరణి
దిరుగుచుభక్తమందిరములకేగిత, దంగణరజము పొసంగనూడ్చి

గీ. తెచ్చియొకభాండ మొనరించి గృహిణినూత్న
లబ్ధభక్తుబకొసఁగి తల్లబ్ధి జంగ
మార్చలొనరింపుచుదురంతరాజవంజ
వభగ్రిమాతీతమార్గుఁడై వరలుచుండె. 371

వ. అంత నొక్కనాఁడు. 372

చ. శిరణులు కొంద రాఘనునిసద్మముఁజేఱఁగ నేఁగి వానిచేఁ
జిరతరపూజనావిధులు చేకొని మున్న తదంగనాగుణం
బరయుటచే స్వమానసములందు నసహ్యతదోపఁగినక్కమై
హరగుణు లెల్ల ని ట్లనిరి యాతనితోడుత నేకవాక్యులై. 373

గీ. జ్ఞానవైరాగ్యవిమ్మలక్ష్మాతలమున
వన్నెకెక్కిన యోభక్తవర్య నీదు
తరుణికొఱగాని త్రిమ్మట దిరుగఁజొచ్చె
చక్కఁగా దీర్చు మనుటయు జాఁగిమ్రొక్కి. 374

క. తనకాంతఁబిలచి యీభక్తనికాయము నీవుచక్కఁగా దిరుగఁగలే
వనిమె నటు గాన వీరల, కనుగవక ట్టెదుటమెచ్చఁ గ్రమ్మరు మనినన్.

గీ. అనిన బతిమాట జవదాఁట కజ్జలాట
లాక్షిమడమలు భువిమోపి యపుడు కుంభ
కారచక్రంబు దిరిగెడు తీరుదోఁప
తిరుగఁ గని భక్తు లిటులబల్కిరిహసించి. 376

గీ. మేలు మే ల్బుగ్గనీ చర్య మెచ్చువచ్చె
దిరుగుటలునాఁగ నిటుగాదు తెలియవినుము
కాంతనడవడి చక్కన గాదటన్న

నతివపైఁ గోపగించి యిట్లనియె నతఁడు. 377
క. నీనడకచక్కఁగాదట, యీనాగకలాపభక్తులెల్లను మెచ్చన్
బూనినడుమనినయగ్గజ, యానవిలాసముగహంస యటులనడచినన్.
క. కనితద్భక్తనికాయము, వినుము ఘటాలయ్యయెంత వెఱ్ఱివి మేమా
డినమాట తెలియనేరవు, ఘనకచ నేఁతలుపొసంగుగాని వనుటయున్.
క. కొఱఁగాని నేఁతలదియో, తెఱవయనుచు నాకు నెపుడు తెలియదు నేనె
త్తెఱఁగున జెప్పినసట్టుల, నరనేయక నేయునిట్టు లాడందగునే. 380
చ. అనుడితఁ డింత తెల్పఁ దెలియండని యందొకభక్తపుంగవుం
డనియె రహస్యవృత్తి సదయాత్మక నీప్రియ కామచారయై
తనకులశీలవర్తనలు తప్పిచనంగ డుమిండగీలతో
నెనసిచరించు నీ కిటుల నేటికి యూరక చూచుచుండఁగన్. 381
వ. అనిన దరహసితాననుం డై ఘటాలయ్య యిట్లనియె. 352
చ. హరగణవర్య మీరిటుల నాడుటధర్మమె యన్యనిందచే
దురితమువచ్చునంచు మదిదోఁపదె పామరవృత్తిఁ జెందినన్
గిరీశుఁడు వానిఁ జేకొనునె కేవలభక్తి పదానువర్తులౌ
శరణులుమెత్తురే యెఱుఁగఁజాలక మాయల చిక్కువారలన్. 383
చ. ధరణిపరాత్మనాయకుల తర్జనకుంజనకోటినిందకున్
బరమున గాలుచేఁబడెడు బాధలకున్ భయమందికొందరా
స్మరకువికారవర్తనలు మానివసింతురు కొందఱిచ్ఛమై
బరగుదు రంగనామణులు వారలఁ బేర్కొన నేలమాటికిన్. 384
క. ఒకయేటినీరు వాడరు, సకలమహీజనములొక్కసరణినడువరే
ప్రకటముగ బెక్కునానవు, లొకరొక్కరిసామ్యటంట యోగ్యంబగునే.
గీ. సకలఫలములలోబీజసమితియట్ల, మునిగియుండిరిసంసారముననుగొంద
రాజవంశమునంగొంద ఱంటియంట, రరయభల్లాతకీబీజ మట్లధరణి.
వ. కావున నెవ్వరెవ్వరిప్రకృతివిశేషంబు లెట్లెట్ల వారలు చెరియింతురు
తద్గుణంబులు లెక్కింపంబనియేమి సమస్తధర్మాభిజ్ఞుల రగు మిము
బోటిమహాత్ము లన్యగుణదోషనిరూపణం బొనర్చుట కర్తవ్యకా
ర్యంబయ్యెనొకఁడు చనుత్రోవ వేఱొకఁడు చనునే సకలజనంబులకు
భక్తియొక్క[illegible] తద్భక్తి [illegible]త్తులు కొందఱు స్వశరీరంబు

లతో కైలాసంబునొందెదరు మఱికొందఱు తనుత్యాగులై చనిరి మెదరు కొందఱాత్మలింగవిలీనత్వంబునొందెద రివియెల్ల నాశాస్పదంబులైన మార్గంబుల యనిన తద్భక్తవరు లొండొరుల యాననంబు లాలోకింపుచు నితం డాత్మప్రియానుసక్తుండై మనల నొడంబఱుప నిట్లాడుటయో లేక యితనిమార్గం బిట్టిదియో యదియునుంగాక యీశ్వరుగలయు తెఱంగులుకొన్ని యుగ్గడించి యివియెల్ల నాశాస్పదంబులనియె నిమ్మార్గంబులుఁదప్ప నితం డెప్పగిది నంబికాధీశు గలయునో నెఱుఁగవలయునని ఘటాలయ్యనుద్దేశించి యందఱు నేకకంఠంబుగా నిట్లనిరి. 387

ఉ. లోకములోన భక్తులు త్రిలోచనుఁగూడెడునట్టిమార్గముల్
చేకొనకాడి తీవెటులఁ జెందెదవో పరమేశుఁ దెల్పుమా
మాకిపుడన్న తద్గణసమాజవచశ్శ్రవణానుమోదుఁడై
యాకరుణాకరుండు వినయంబున నిట్లని పల్కెఁ బ్రమొక్కుచున్. 388

చ. అనఘతరాత్ములార జగదంతరవర్తన లెల్లనెమ్మదిం
గనుగొనఁజాలుజ్ఞానగుణగణ్యులు నామది మీరెఱుంగరే
ఘనదయ లోకసన్నుతుని గా యొనరించుట గాక నాపయి
గినియుట గా దయారె ధరణిన్ననరిట్టుల నుండఁ జెల్లదే. 389

వ. అయిన మీరిట్లాన తిచ్చినవు డే నూరకుండుట జన దస్మద్వర్తనంబు దెల్పెద వినుఁడని యిట్లనియె. 390

క. కాయంబిది దగ్ధపట, న్యాయంబుగఁ జంద్రధరునియందున గూర్తు
న్వాయినిపల్కుటతద్గతి, నేయుటయొకొక్కనాఁడుచెల్లునెతలఁపన్.

క. అని యంతఁబోక తద్భ, క్తనికాయంబునకు మ్రొక్కి కడువడిపద్మాసనమున నాసీనుండై, ధనదాప్తుం గలయఁదలఁచి తత్క్షణమాత్రిన్.

సీ. తనరునాధారపద్మము మెట్టిదిగనాడి, కనుదృష్టియిష్టలింగమునఁగూర్చి
తలవంపుతమ్ము లూర్ధ్వముఖంబులుగఁజేసి, వెసజీవవల్లిక వేరువెఱికి
తరిదళానిలబంధతతులూడగాదన్ని, తగుపంచభూతసద్మములుమూసి
విలసితాంతర్జ్యోతి వెలిగించితనులెల్ల, గలయలోగాల్చిచిత్కళవెలిఁగిచి

గీ. బ్రహ్మరంధ్రంబు భేదింప ప్రణవనాద
మెల్లదిక్కుల్లఁ గడు బిక్కటిల సకల

జనులు చూడ్కులు మిఱుమిట్లుగొనఁగఁ జేసి
తత్క్షణంబున శ్రీపరంధాముఁ గలయ. 393

ఉ. ధారుణి దిర్దిరం దిరిగెఁ దారలు డుల్లె నభంబు వ్రీలెది
గ్వారము గ్రుంగె సప్తకులపర్వతముల్ చలనంబునొందె చం
ద్రారుణకాంతులింకె సకలాదిపవర్గము దొంకె నాదిభూ
దారము బొబ్బరించె బెడిదంబగు తత్ప్రణవారవంబునన్. 394

వ. తదనంతరంబు. 395

క. కురిసెఁ బువ్వులసోనలు, మొరసెఁ సురదుందుభులతిముదమున రంభా
దిరమణులాడిరి చల్లని, మరుదంకురపంక్తివీచె మాంగళ్యముగాన్.

ఉ. అట్టిమహాద్భుతంబు గని యచ్చటిశాంభవులెల్ల లేచి మే
మిట్టివిచిత్ర మివ్వసుధ నెన్నఁడు జూడఁగ లేదటంచు లో
దొట్టిన మోదసంపద నుతుల్ప్రచరింప నితండు రూఢిగా
గట్టులు వేలు వేయిటులగాని యెడ న్వడి నిట్లు సేయునే. 397

ఉ. ఎంతమహాత్ముఁ డెంతఘనుఁ డెంత తపోధనచక్రవర్తి వీఁ
డెంతకృతార్థుఁ డెంతగుణి యెంతసమస్తసమానవర్తనుం
డెంతవిరక్తుఁ డంచు వచియింపుచు డగ్గరితద్గణాధిపుల్
స్వాంతములన్ బ్రమోద మొదవంగనుచున్న తఱిన్ రయంబునన్. 398

ఉ. అందొకభక్తుఁ డీతని క్రియాపరిపూర్తి యొనర్తుమంచు బా
లేందుకిరీటభావుఁడయి హెచ్చిన యాతనిఫాలపట్టికం
బొందుగ భూతిపుండ్రమిడఁ బోవఁ దదంగము భస్మమైన యా
చందము సర్వశర్వగణసంతతిఁ గన్గొని యద్భుతాత్ములై. 399

గీ. ఒండొరులమీఱి యేమియు నుండనీక
యవ్విభూతినిజాంగములందు నలఁది
కొని మహాముక్తిచేకొంటిమనుచుఁ జనిరి
సంతసమునందుచును నిజసదనములకు. 400

క. కావున పలికినఁగ శివ, దేవు ఘటాలయ్య గలసె ధృతి నిత్తరి మ
ర్త్యావళి యద్భుత మొందను, మావల్లభుఁ డంగుటారి మాచయ కలసెన్.

వ. అని తెల్పిన జంగమపర్యవాక్యమ్ములకు ప్రమోదమానసచేతస్కు
లై సమస్తసభికజనులు యథేచ్ఛం జనిరి. 402

గీ. ధీరుఁ డైనట్టి శ్రీటంగుటూరిమాచ
యాఖ్యచరితంబు చదివిన నర్థివినిన
నాయురారోగ్యపుత్రపౌత్రాభివృద్ధిఁ
జెంది తుద మోక్షసామ్రాజ్య మొందు నరుఁడు. 403

వ. అని తెల్పి సిద్ధరామునితో చెన్నబసవేశ్వరుండు మఱియు నిట్లని
చెప్పందొడంగె. 404

క. శంబరభవజాతశశి, కంబుగ్రీవాధిపాదిఖచరార్చితపా
దాంబుజళ్ళవకనదాత్మం, డంబికచౌడయ్యయనమహామహుఁడొప్పన్.

— అంబికచౌడయ్యకథ. —

సీ. అతఁడుభక్తానీకమానసభక్తిఁ బ్రాయకసూపకారకాయకముపూని
నలువుచుఁదల్లబ్ధిజంగమార్చనములొ, నర్పుచునిరుపమానందలీల
నిష్టలింగార్చలనేప్రౌఢుఁ జేయుచు, నిష్టలింగులమైత్రియేదలఁపుచు
నిష్టలింగాధిక్యమిలఁబ్రతిష్ఠింపుచు,నిష్టపూజావిధు లెఱుఁగునట్టి

గీ. నరుల నెమ్మది మెచ్చక తిరుగుచుండు
నంత నొకనాఁడుగుమిగూడి కంతుదళన
భక్తు లొకకొంద ఱొకయెడ భాను లెప్ప
గోష్ఠి మై సమ్మదంబునఁ గూరుచుండి. 406

చ. ఘనతరవేదవేద్యత్రిజగజ్జనసేవ్యసమస్తదేవతా
వినుత మహత్త్వపాపపదవీహరణాద్భుతశీలమానసం
జననధరిత్రిఘోరభవసాగరతారణి యోగవిద్యఁ బో
లనొకఁడుగల్గునే యమృతలక్ష్మి నిగ్గైకొనుమార్గ మేరికిన్. 407

గీ. హృత్కమలకర్ణికామధ్యసీమనిల్పి
మానసార్చన లొనరించు మానవులకు
కరతలామలకము మోక్షసరణియనుచు
నొండొరులతోఁ బ్రసంగించుచుండు వేళ. 408

ఉ. అక్కడికేగిచౌడయగణావళిఁగన్గొని మ్రొక్కి నిల్చి యా
ముచ్చటలాలకించి యిది మొక్కలమిష్టసమర్చనాధ్వమి
ట్లాచ్చముచేసి యోగవిధియోగ్య మటంచు వచింతురయ్య యో
మెచ్చునె కాలకంధరుఁడు మేలిమిచెందునె యెవ్విధంబునన్. 409

క. ధారాధరంబులోపలి, నీరముమదినమ్మకుండనీరెడలించే
వీరడిగతినన్యపథము, గోరికగస్థలశివార్చగూడునెవిడువన్. 410

సీ. కరమునజ్యోతిరాకారలింగముగల్ల, నణుమాత్రకళగన నలకయేల
ఖ్యాతపురాతనగీతారవముగల్ల, దళరవశ్రుతిచింతదవులనేల
నక్షయంబైనపంచాక్షరియుండంగ, షట్చక్రచింతనశ్రమ మదేల
సారమాత్రవిధప్రసాదామృతముగల్ల, నమృతకుంభేక్షణాయాసమేల
గీ. కలితసద్భక్తి యునియెడు కన్యకలుగ
పాపకన్నియ మేల్కొల్పు బాధయేల
సులభమ్ముగ ముక్తిగాంచెడుచొప్పుగలుగ
చాల వెతనొందనేటికి శరణతతికి. 411

క. అనియిటులనతడువల్కెన,వినియందొకశరణుడనియె వెలుపలిపూజల్
తనువలయ నెన్నిచేసిన, ఘనమానసపూజఁబోలఁగలవే యెందున్.
గీ. మహితచిద్బ్రహ్మమునఁదనమానసంబు
వియ్యమగుదాఁక జను నిష్టలింగపూజ
సలుప నారూఢుఁడైనచో సాధనముల
వలనఁ బనియేమిగలుగుభూతలమునందు. 413

క. వేదాంతవేద్యమార్గము, గాదనఁగా నీకుతగునె కలితాత్మజ్ఞా
నాదరులగుబుధవర్యులు, మోదంబునఁదొల్లినిత్యముక్తింగనరే.

—ఆత్మదేవునికథ.—

ఉ. ధారుణినాత్మదేవుఁడన ధన్యుఁడొకండు త్రికాలమంబికా
ధారునిమానసార్చన ముదం బొనరింపుచుఁ గొంతకాల మీ
తీరునఁబుచ్చి సానులు నుతింపఁగ దా నొకనాఁడుకూలికై
దూరము వోయితోడిప్రజతో వరిగోయుచునుండునత్తరిన్. 415
చ. జలజసఖుండు మింటినడుచక్కకిరాఁగనిభర్గపూజనల్
సలుపఁగవేళయయ్యెనని సయ్యన నచ్చట గూరుచుండిలక్
గలుపలోకంతమూసి వెలి గన్గొనబోఁక తదేకనిష్ఠుఁడై
యలరినతోడికూలిజను లాతనిచందము గాంచి నవ్వుచున్. 416
ఉ. కూలికివచ్చియీయాడ వరి గోయుచు గూరుకుచెందవచ్చెనే
మాలుగుబోఁతుఁవీని కనుమానము లే దిఁకచేసిపెదచే

తోలుడి యీదినంబు మనతోసరిగాఁ బడిముట్టవోదు వే
యేల వినుండు వీని పనికెవ్వరుఁ బిల్వకు నేటనుండినన్. 417
ఉ. కూటికిలేకయీఁకటనొ కూలియొనర్చిగడించు కాసులే
చాటున నైనడాఁచి కనజాలకయో కుడువంగఁగట్టవే
కాటిదివీనితోడ కలహం బొనరించెనొ రాత్రి యిప్పుడీ
ప్పాటొనరింపుచుం గునుకుపాటునుజెందెడు నిద్రచాలమిన్. 418
వ. అని కేరుచు. 419
క. కనుమూసె దేమిలేరా, యని వారలలోన నొకఁ డాతనిప్రక్కం
దనవ్రేలఁబొడువబిట్టుగఁ, దనువల్కఁగ లేచివానిదార్కొనియలుకన్.
క. ఓరీమూఢ దురాత్మక, గౌరీశునకర్పితంబు గాఁ జేయునెడన్
దోరఁబగుదధిబాండం, బేరాపడద్రోచితంచు హెచ్చినకినుకన్. 421
క. చేతికొడవంటగొంకక, భూతలమునవానిశిరమువుడ నేయఁగనే
భీతిగొని తోడిపనివాం, డ్రాతఁడేఁబరులెత్తినృపునకంతయుఁదెలుపన్.
మ. వినికోపంబున నమ్మహాత్మునిపుడే పిల్పించి యోరా మను
ష్యునినిష్కారణమేలచంపితివినీచుం డైననీరీతి ని
ష్పునిగావించునె నిన్నుగొఱ్ఱునబడం బాల్పెట్టినం గిన్కవో
వునెయున్నట్లు నిజంబుపల్కుమనిన న్నృభర్తతోనిల్లనున్. 423
క. పుడమిదొరనిర్నిమిత్తం, బొడవఁగనేవెట్టినయ్య యాకర్ముఁడు నా
యెడనడచిననడువడియే, ర్పడదెల్పెదవినుమటంచుబలికెనభయుఁడై.
క. జీవేశార్పితదధిఘట, మీవంచకుఁడొరఁగఁద్రోచియ నేఁజంపితినే
నీవిధముదెలియఁగూరక, నావలనందప్పులెన్న న్యాయమె యధిపా.
వ. అని యమ్మహాత్మునినేరంబు దెల్పిన వారలదిక్కుమొగంబై నృప
వరుండు. 426
క. ఊరకఁ జంపె నితం డని, మీరంటిరి చంద్రధరసమీపదధిఘటం
బారయకతోలఁగఁద్రోయఁగఁ, గారణమేమనుచు వారిగద్దించుటయున్.
గీ. ఈతఁ డనెడుమాట లెల్లబూటకములు
కూలిసేయుచుండి కునుకుఁజెందె
నింతె కాని పూజలేమియు లేమట
గానలేదు దమకెయీన యనిన. 428

చ. విని నృపవర్యుఁడాగడును వేకరథాత్రిపు దాపులింగమో
మునుమిడికోయునట్టి వరిమోపులుపూజయొనర్పఁగోరి తె
చ్చిన కుసుమాదివస్తువులొ చెంగటిదాహపునీలముంతక
మ్మనిదధిభాండమో తెలుపుమావిన వేడుకయయ్యెని త్తరిన్. 429

ఉ. నావుడు నమ్మహాత్ముఁడనునాహృదయాంతరవాసియా మహా
దేవునిమానసార్చన గతిం భజియించితిఁగాని బాహ్యపూ
జావిధిగాదు హేళనము సల్పఁగఁగూడదటన్న నవ్వుచు
న్భూవరుఁడారపొంకముగ బొంకితి విట్టుల నేరరెవ్వరున్. 430

గీ. కోలభాతిభూమిఁ గొలిచి కొండిదెనడు
మనెడుమాటవోలె నహహా నీదు
పలుకు మార్గమెంచబొ్రిధుఁడ విమ్మాట
వలన నీకు నింద దలఁగఁబోదు. 431

చ. అనినఁ భూపతిదిక్కుగాంచి జనవర్యా నీదుచిత్తంబులో
ననుమానంబఱఁజూడునాహృదయమధ్యస్థాద్రిజాతేశ్వరా
ర్చనలంచుఁ గొడవంటనాతని నువతుం బప్పుడేచీల్చి యొ
య్యన హస్తంబుల రెండుపాయలుగఁ జేయందోఁచె నాలోపలన్.

శా. శ్రీరమ్యం బగురత్నపీఠముపయిం జెల్వొందు జ్యోతిర్మయా
కారం బౌ శివలింగ మాశివునకై కావించు పూజావళుల్
భూరిభ్రాజితభారనాంతరమునఁ బొల్పారునై వేద్యముల్
సారంబౌదధిభాండమా పెరుఁగు పెల్చంబిందుతీర త్తరిన్. 433

మ. కనుపట్టఁ సభవారలు న్వసుమతీకాంతుఁడు వీక్షించి హృ
ద్వనజాతంబులభీతసమ్మదముచిత్రంబుఁ ద్రవాభక్తిభా
వనలొక్కుమ్మడిఁదోఁప కేలమిశిరోభాగంబులందాల్చి ని
ల్చి 'నమో నీలగళాయ తే' యనుచు హాళిన్మ్రొక్కి రిట్లందఱున్.

ఉ. మొ్రొక్కి మహీతలేశుఁడు ప్రమోదము జెండితి నిమ్మహాత్ము పెం
పెక్కిన మానసంబెఱుఁగ కీతతిఁ బేర్లరిమాటలాడితిం
కెక్కడి సత్య మేటిబ్రదుకెక్కడి సత్పథమేటి కీర్తినా 435
కక్కట శాపభంజన శివా మరి యాత్మల దెల్లబోయితేనో

గీ. కొడవ లనెడుకుంచెకోలచే వటుఁగిక
వాటమిపుడు తెఱచివామదేవ
గర్భగేహమందు గానంగఁ జేసితి
వౌర యెంతఘనుఁడ వాత్మదేవ. 436

చ. అని వినుతించుచున్నసమయంబున నద్భుతమొప్ప నంతలో
మునుపటిరీతివటుఁమటుమాసుక పోయెధరావరుండు వే
డినదనచేమృతుం డయినయర్భకుఁ గమ్మఱజీవయుక్తుఁగా
నొనరిచియాత్మదేవుఁడు మహోన్నతుఁడై చనియెన్నిజెచ్చలన్.

వ. అదియునుంగాక. 438

క. తొలియట్లులహృదయంబున, మఱిహరుబూజించిముక్తిమార్గముగనెబూ
సలనయనారటుగావున, నిలమానసపూజసాటియేదియు నగునే. 439

చ. అనవుడు మానసార్చనమహత్త్వముయెక్కుడటంచుఁబల్మరున్
వినుతియొనర్చిపల్కెదరు విశ్వమునన్నత తేష్టలింగపూ
జనలొనరించువారిఘనసత్త్వమువర్ణనసేయశక్యమే
వనజభవాద్రిభిమ్ముఖసుపర్వులకైననటన్నమగుళ్లై. 440

ఉ. గర్భముచించిశూలిఁబొడగానఁగజేసిగతానుఁడైనయా
యర్భకుఁ గమ్మఱంబ్రదుకు నట్లొనరించి బుధుల్నుతింపఁగా
న్వర్భజగాలయావనులసారయశోవిభవంబునిల్పెనా
విర్భవదగ్రుఁడైయతఁడు వేఱొకడిట్టులసేయనేర్చునే. 441

క. నావుడు చౌడయనవ్వుచు, కోవిదవరులారగర్భగోళముపలెగా
దీవిద్యావృతఘనభూ, మావస్త్రముచించిమింటహరుఁజూపింతున్.

గీ. అనుచుమొలనున్నదర్వి చేసంబరంబుఁ
జిమ్మునంతనెకోటిరాజీవమిత్ర
తేజమునఁదోఁచెఁదత్సభాస్థలిసమస్త
జనులకన్నులు మిరిమిట్లుగొనఁగనపుఁడు. 443

శా. కైలాసంబును దానిమీఁదకనకాగారంబునందొప్పర
త్నాలీధోన్నతపీఠమూపయినముద్యజ్జ్యోతిరాకారుఁడౌ
శాలాజ్ఞాహితవాళి యాశివుఁడరి న్యాభసిల్లుసీతాద్రిరా
డ్బాలారత్నము తత్సభంబ్రమథఖండంబాది తేయావళుల్. 444

వ. మఱియును. 445

ఉ. మానస్తోత్రవచోవిలాసములు రంభానాట్యసంరంభముల్
నానాగాయకగానముల్ పటహవీణా వేణుభేరీముఖ
ధ్వానంబు ల్వరవందిమాగధుల కైవారంబులుం నేత్రహ
స్తానూనార్భటులుం సమస్తజనహృద్యంబై దిశల్నిండఁగాన్. 446

శా. మింటందోచినఁ దత్సభాజనులు పేర్మింగాంచి వేలేచి కే
ల్జంట ల్ఫాలములందు నిల్పి నతిపాలా దేవచూడామణీ
కంటిం గంగ తరింపఁజేయుగతి మాకుం గోర్కులీనోపి యీ
వెంటం గన్పడితీవు మా సుకృతముర్విం జెప్పఁగా శక్యమే. 447

క. అని సన్నుతించుసమయంబున చౌడాచార్యవిభుఁడు పూర్వపురీశున్
ఘనమాయాంబరమాచ్ఛాదన మొనరించుటయు రజతధరణీధరమున్. 448

వ. అందున్నయశేషవిశేషంబులు నక్షణంబ. 449

చ. కొలువుననున్నవారల కగోచరమై చన చౌడరాయ ప
జ్జలజయుగప్రదేశమున జాగిలి వందనమాచరించి వా
రలు వినుతించి రిట్లనుచు రాజకళాధరభక్తపర్యనీ
వలనమ దాత్మసంజనితవాంఛలు నేఁడు ఫలించె మించఁగన్. 450

గీ. హృదయములను తావకేష్టలింగార్చన
మహిమ లెఱుఁగ లేక మందమతుల
మైన మమ్ము శివుని యాకృతిఁ జూపించి
మనిచితీవు కరుణ పెనఁగొనంగ. 451

వ. అని యతనిఁ గొనియాడి తద్భక్తులందఱు తమతమ నివాసంబులకరిగి రమ్మహాత్ముండు తొంటిచందంబున యథేచ్ఛ విహరింపుచుండెం గావున నిష్టలింగపదార్థం బిట్టిదని యానతిచ్చి చెన్నబసవేశ్వరుని యడుగులకెరగి సిద్ధరామయ్యుండు దేవా భవదీయకరుణాకటాక్షవీక్షణమ్ము వలన గృతార్థుండనైతినని పెక్కుభంగులఁ గొనియాడి యద్దేశికసార్వభౌమానుజ్ఞాతుండై నిజపురంబునకరిగి నిరంతరేష్టలింగార్చనం బొనరింపుచు నిర్వంచకంబుగా జంగమారాధనం బొనరింపుచు సుఖంబున విహరింపుచుండె. 452

క. ఈసిద్ధరాముచరితము భాసురముగ జనులు వినిన బఠియించిన భూం

ధ్వానునిక్రృప ఘోరాఘుని, దానంబొనరించిముక్తిరమఁ గాంతురొగిన్.

వ. అని యిట్లానతిచ్చి రేణుకునితో లోపాముద్రవరుండు తదనంతరవృత్తాంతం బెట్లయ్యె నని యడిగిన. 454

మ. ఘనకీర్తిద్యుతినిర్జితాహిపమరుత్కాండాంబుభూభూజభూ
జననేతోత్పలరాజరాజవరపూజాయుక్పదాంభోజభో
జనరాధీశసమానకావ్యరచనాసంతోషితాత్యంతపా
వనశాస్త్రజ్ఞసమాజమాజనకభాస్వత్తూణభక్తావనా. 455

క. సత్యజితహరిశ్చంద్రా, సత్యాలలనేశసదృశసాత్త్వికగుణనా
సత్యజయంతాకారా, సత్యాత్మేశ్వరతనూజసమశౌర్యనిధీ. 456

ఉత్సాహ. పుండరీకవైరిఖండభూషభక్తపోషణా
కాండసంచయప్రపూరితాచ్ఛకీర్తిభూషణా
మండలేశమంత్రివర్యమానితోరుభాషణా
ఖండనస్థలాఖిలారిపంక్తిచిత్తభీషణా. 457

గద్య. ఇది శ్రీమచ్చెన్నమల్లికార్జునకరుణాకటాక్షలబ్ధకవితామాధురీధురీణ కౌశికగోత్రపవిత్రసుకవిజనస్తుత్య పాపయామాత్యప్రణీతంబైనచెన్నబసవపురాణం బనుమహాప్రబంధంబునందుఁ దృతీయాశ్వాసము.

---



శ్రీ రస్తు.

# చతుర్థాశ్వాసము.

## కూకదమారయ్య కథ.



లోలదృగ్వరాగ్రభ
వైలబిలనభార్కచంద్రహరిహరివాణీ
లోలజసమాఖ్యవాగ్జిత
శేలీహనముఖ్య యమృతలింగసమాఖ్యా. 1

వ. అవధరింపుము కుంభసంభవునకు రేణుకుండు తరువాత కథ యిట్లని చెప్పందొడంగె. 2

క. ఒకనాఁడు చెన్నబసవుం, డకలంకగణాలితోడ నాస్థానమునన్
సుకరేష్టగోష్ఠినలుపుచు, బ్రకటితగతినున్న యవసరంబున నెలమిన్. 3

మ. సుదతీరత్నముఁ దాను చెన్నబళవేశుంజూడఁగాఁ గోరి కూ
కదమారాఖ్యగణాధినాథుఁ డరుదే కొల్వున్న భక్తాలితో
నెదురై మ్రొక్కుచుఁ దోడితెచ్చి సభలో హేమాసనార్ఘ్యాదిదీ
వ్యదనూనార్చన కృత్యముల్ సలిపి నాగాంబాత్మజుం డత్తరిన్. 4

శా. స్వామీ యెచ్చటనుండి వచ్చితిరొకో సంపత్ప్రభంజెందె మ
ద్ధామంబిప్పుడు తావకాంఘ్రిజలజాతద్వంద్వసంస్పృష్టి చే
నామోదంబు వహించె నీనిఖిలభక్తానీకచిత్తంబు లా
హా మాభాగ్యవిశేష మింతయని శక్యంబౌనె వాక్రుచ్చఁగన్. 5

క. అనిసన్నుతించుచెన్న, య్యనుఁ గన్గొని మాదిరాజుహర్షముతో ని
ట్లనిమెవినుమీమహాత్ముని, యనఘచరిత్రంబు దెలుపుదంతయు వరుసన్.

గీ. ఆత్మశృంగారకలనచే నలకనలకఁ, జేసి శ్రీనాగులూరు ప్రసిద్ధిగాంచ
నప్పురంబునకధిపతియైయితండు, పెంపుమీరఁగ భూమిపాలించుచుండి.

క. అష్టోత్తరశతభార్యా
హృష్టుండై తన్నుభక్తులేమడిగిన సం
తుష్టిగ నొసఁగెడు నియమము
కష్టతరంబనక నితఁడుఁ గైకొనియుండెన్. 8

వ. ఇట్లుండి. 9

చ. ఎడనెడజంగమోత్కరము లెంతయు వేఁడిన నూటయేడ్వురం
బడతులనివ్వఁ జిక్కె నొకభామిని దానిని గూడ నిచ్చునో
పుడమిమగండటంచు హితపుంజము రాజునెఱుంగనీక నె
ల్లెడ ధర భూమిభర్త కిఁక యింతులులే రనిపించె నంతటన్. 10

క. నారదుఁడు గానశాస్త్రవి
శారదుఁడు సమస్తవిబుధజాలశిఖాభృ
న్నీరదుఁడు హారుచిత
పారదుఁ డొకనాఁడు శర్వభజనోత్సుకుఁడై. 11

శా. కైలాసంబునకేగి పారిషదవాక్కాంతాచ్యుతాదిత్యది
క్పాలాంభోజహితామృతాంశుఖగరాడ్గంధర్వవిద్యాధర
వ్యాళాధీశ్వరసిద్ధసాధ్యనిగమవ్రాతంబులన్గొల్వఁగా
బ్రాలేయాచలకన్యకాసహితుఁడై భాసిల్లు సర్వేశ్వరున్. 12

ఉ. చూచి నమస్కరించి శ్రుతిసూక్తుల సన్నుతిసేయ వానితో
బూచులరేఁడు పల్కె మునిపుంగవ లోకములో నిచర్య లె
ట్లేచనుచున్న వే భువన మారసివచ్చితి విప్పుడన్నదో
మేచకకంఠ యొక్కగతి మేదినిగాంచితి చిత్తగింపవే. 13

ఉ. రాజితనాగలూరినగరంబున కూకద మారయాఖ్య గో
త్రాజనపాలుఁ డాత్మవనితాతిలకంబుల నూటయేడ్వురన్
వ్యాజము లేక భక్తనివహంబుల కిచ్చెనుఁ జిక్కె నొక్కయం
భోజదళాక్షి వేఁడుగణపుంజము రాకనొ రాజు కూర్మినో. 14

క. అని యిట్లు దెలిపి కలహా
శనముని యొకకొంతవడికి చంద్రార్ధకిరీ
టుని వీడుకొని నిజేచ్ఛం
జనియెం దదనంతరమున సర్వంసహప్తెన్. 15

సీ. కలకంఠములు నోరుకాయక పడిగుయ్య
పమ్మినయిలమీఁది తెమ్మదియ్య
పరిమళసుమఫలభరముచే తరులొప్పఁ
దేటుదాటులఁ (మోఁత దెసలఁగప్ప
కుసుమాయుధుఁడు పుష్పకోదండము ధరింప
వలిగాడ్పుపుప్పొడి వసుధ నింప
శారికాశుకహంససంచారములు మీర
పూదేనెసోనలు పొంగిజార
గీ. జాతిగడుగుంద పాంథులు భీతినొంద
జీర్ణపర్ణాళిరాల లేఁజిగురు గ్రాల
మంచు తెరవీడ శృంగారమహిమతోడ
జగతిఁదగె కాంతవాసంతసమయమంత. 16
వ. అట్టిమధుమాసదివసంబులయం దొక్కనాఁడు. 17
క. ఆరాజు భక్తిఁజూడఁగఁ, గోరిమహావృద్ధభక్తకుంజరతనుఁడై
శ్రీరమ్యంబగుతత్పురిఁ, జేరఁగ నేతెంచి రాజశేఖరుఁడంతన్. 18
సీ. చని యప్పురముఁజొచ్చి తనముది మేర్పడ
గోలచే బిగఁబూనితూలికొనుచు
గోడనీడలఁజేరి కూర్చుండఁ గోరుచు
నకట మహాదేవ యని పలుకుచు
బారెడు చనివెను బడలికచేవంగి
మోకాళ్లపైగేలు మోఁపికొనుచు
పిరిదెస నెవ్వరైనఁ బిలిచిరోయనినిల్చి
బయలాలకించి విశ్రాంతి గొనుచు
గీ. చుట్టుకొనినవ్వు చిఱుతలఁ దిట్టుకొనుచు
నెండ కడ్డముగాఁ దాళవృంత మిడుచు
పనికిమాలినజీవితమునకు విసిగి
నృపునిసభచేర నరిగితన్నికటముసను. 19
చ. దలముగ వేఁడియూర్పులెగ దట్టఁగఁ జెమ్మట లూరభూమిపై
నలసతగూరుచున్న శిరణా [illegible]

గ్గిలిభయ మంది లేచి చని కేవలభక్తి నమస్కరించి యా
యలఘుఁడుచాల డస్సె గద హా యని నెమ్మది నార్తి నొందుచున్.

సీ. ఆతపహరణార్థమప్పుడప్పటువితా,నము లేయుబంచివెంట నెసుమాంబు
వులు పైనఁజిలికి కప్పురము వీసులనూది, మేలి చందన మెద మేగితాళ
వృంతంబు చేఁబూని విసరిజంబీర నా,గరమిశ్రతక్రంబు హరసమర్ప
ణము చేసి యింతింత నాలుకద్రవమూర, బట్టిన కొంతసేపటికి సేద

గీ. దేరిచరమూర్తి కన్నులు దెఱచి వినయ
భరితుఁ డగురాజుఁ గనుగొని భళిర పార్థి
వేంద్ర నీభక్తి వన్నియ కెక్కె మమ్ము
బోలుబడుగులఁ బ్రోవంగఁబుట్టితౌర. 21

గీ. బాపు రేయారవిమలసద్భక్తిపూర
నిన్నుఁబోలంగఁగలరె యేనృపతులైన
సకలజగములునిండె బావకసమాఖ్య
యనిన క్రమ్మఱమ్రొక్కియయ్యవనివిభుఁడు. 22

చ. చపలుఁడ దుష్టవర్తనుఁడ శౌర్యగతాత్ముఁడ దుర్మదాంధుఁడన్
కుపితుఁడ లోభదూషితుఁడ క్రూరుఁడ దంభుఁడ భక్తిహీనుఁడన్
వ్యపగతసత్యవాక్యుఁడ దయారహితాత్ముఁడ నైననన్ను నీ
విపుడిటు సన్నుతింపనగునే శరణాగ్రణి యున్ననవ్వుచున్. 23

ఉ. కూకదమార యాత్మనుతిగూడదు భక్తులకన్న నీతిచే
నీకరణిన్వచించితిపుడింతియె కాని భవత్సమానుఁడే
లోకమునందు నెంచిన గలుంగఁగనేర్చునె దీనలోకర
క్షాకరనిన్నుఁగాంచితి హృదబ్జము సంతసమందె నెంతయున్. 24

ఉ. మారవిరోధి భక్తులకు మాటునబాచక నగ్నిసాక్షిగా
గోరివరించు భామినుల గొంకకకొమ్మని యిచ్చువారలీ
ధారుణి లేరు నీవోక నుదప్పన హాయిటులుండఁ జెల్లదే
సారవివేక ధైర్యగుణసాహసముల్ శివభక్తకోటికిన్. 25

ఉ. ఇంతులనిచ్చు మారఁడని యే మునుచాలఁగ విన్నవాఁడనై
సంతసమంది వృద్ధదశ సంభవమైనది గాన యిట్టిచో
చెంతలసేవ సేయుటకు చేడియయొక్కతె యొప్పనంచునే

నెంతయుగోరివచ్చి తిటయింతులు లేరనివింటి నీకెఱకన్. 26

క. వినియును భక్తిగుణాఢ్యుఁడ
నని నినుఁగను వాంఛనిచటి కరుదెంచితి నా
కనుదమ్ములలరె నేనిఁక
వనివినిమెద నన్నజడసి పార్థివుఁడనియెన్. 27

గీ. అనఘజంగమవర్యమదాలయమున
కరుగుదెంచి శివార్చన మాచరింప
కెటులఁబోవచ్చు నీవేళనిందు నిలువుఁ
డన్నిపనులు విచారింత మవల ననిన. 28

క. భార్యారహితుఁడుసేయున, పర్యానివహంబు గొనఁగవలదన ధరలో
నార్యులుపలుకఁగవినియును,మర్యాదయెపూజగొనఁగమాకిటనీచేన్.

వ. అనిన భూవరుం డిట్లనియె. 30

క. స్వామీయున్నది యింకొక
కామినిమీదాసి కరుణఁగాంచి సపర్యా
స్తోమము గైకొని మామక
ధామము పూతంబు సేయ ధన్యుఁడనగుదుర్. 31

క. నావుడుమునుభక్తాలికి, నీవెలఁదులనిచ్చియుండ నెలఁతుక గలదం
చీవనిన నెట్లునమ్ముదు, భూవరమిథ్యోక్తులాడ బొసగునెయనినన్.

ఉ. శరణవరేణ్య నాపలుకు సత్యముగా దొకయింతిమాత్ర మే
యొరులడుగఁగ రాకునికి యున్నది కామినిలేనియట్టియా
పురుషుఁడుచేయునట్టి చరపూజయనర్హ మటంచు చిత్తమం
దరయఁగ రమ్ముమామకగృహాంతరసీమకు వేగనావుడన్. 33

ఉ. పక్కననవ్వి యాకపటభక్తవరుండును నీదుభక్తిపెం
పెక్క జగంబు మెచ్చఁ జరియించితి వింతియెకానిలోపలం
జిక్కినయాసపెంపు విడిచేయఁగజాలవు లోభవృత్తినీ
కెక్కడసంభవించె పరమేశ్వరుడీగతి కిచ్చమెచ్చునే. 34

గీ. అసి మిలోనిదొకటి యమ్మెడుదొక్కటి,యనినచందమయ్యెనవనినాథ
భార్యదాచియింక పడతులులేరని, చాటఁబనిచితౌర జగతియందు.

క. గురియిడి... దుననె, దరిఁజేరఁగ వ్రేలఁ డంతలెక్కావ మైనం

గొఱితయొకా దేయించుక,తరగిననియమంబు మోక్షదంబగు నెన్నపా.

క. భామినిమునున్నాటఱునది, నోములునొకరంకువలననూనంబగునో
ప్రామాన్వయదీపకనీ, భామికమిఁకఁదెలిసె వేయుఁబలుకఁగనేలా.

వ. అనిన మానవేంద్రుం డయ్యా తొయ్యలిం డాచియుంచితినని పెక్కు
భంగులానతిచ్చి రీవాక్యంబులస్మద్బుద్ధిసంపాదనహేతుకంబులు
గాని నన్నునిరాకరించుటగాదు, భవత్సన్నిధానంబున నాగుణదో
షంబు లున్నట్లువిన్నవించెద మన్ననచేనవధరింపవలయునాకుఁ గల
లలనాజనంబులందఱు మహేశ్వరాధీను లై నకతంబున నియ్యంతి
యుండు తెలుంగక లోకంబునజనంబులు రాజునకీకభార్యలు లేరని
కొనిరింతిరయొకాని గణాధీశ్వరులరుదెంచిచంచలాక్షి నర్థించుటయు
నేనునాయెడలేదని యనిచివుచ్చుటయు లే దిప్పుడుమీరేగుదెంచి
కాంక్షించితిరి గావున సమర్పించెద దానింగైకొని నన్ను కృతా
ర్థునింజేయుమనిన నక్కుహనాజంగముం డిట్లనియె. 38

సీ. అనువైనసతులెల్ల నయ్యలపాలుగా
కొరమాలి చిక్కనకుటిలమతియొ
మాటనూతెలుఁగదో నోటిగయ్యాళియో
యాచారహీనయో యలసురాలో
పనివంజయో యింటిబానిసబిడ్డయో
వెట్టిచైదములదో చిట్టగొట్టొ
తెవులు గొట్టెయొ వైసుదీరినమేనిదో
యొజమాలినదియో బీజుగొట్టొ

గీ. యెవ్వరకు నక్కఱకురాని యిగురుఁబోడి
బోరమల్లన్నపాలన్న పోల్కి మాకొ
సంగఁ దలఁచితివా చాలుచాలు నీప్ర
సంగమటులుండనిమ్మరసాతలేశ. 39

ఉ. నావుడు స్వామి యీయనగుణంబులలో నొకటైన లేదు త
జ్జీవనదాభవేణియెడ శ్రీకరసర్వగుణాభిరామ దీ
నావనశీల జంగమపదాంబుజభక్తివినిశ్చలాత్మ దే
వావలికైన బానిఁ గొనియాడఁదరంబె యటండ్రులోకముల్. 40

క. జంగముఁ డిట్లనువర్తకుఁ, డంగడినమ్మంగఁజిక్కి నదియి ద్దేవో
రంగై నవస్తువన్న, ట్లంగనబల్ మంచిదనుట కక్కజుమయ్యెన్. 41
క. నెలఁతుకయిలగలచెలువుల, తలసొమ్మనమమ్మవలలఁదగులింపకుమీ
పలుకులువలదలి వేణుల, కులమెక్క డభక్తిమె చటకుపలయనాథా.
వ. అనిన రాజు యి ట్లనియె. 43
ఉ. ఏలనిరాకరించెద రహీనగుణాకర మైనబాలికా
మాళిని వేడునట్టిచరమాన్యున కాత్మశరీరకృత్తికిఁ
వాలుననొల్చితీసి చెలువంబుగఁజెప్పులుమల్చియిత్తునో
కాలగళస్వరూపసముఖంబున నేటికి రాయ బారముల్. 44
చ. అటుగొనిపోయి యొక్కమణిహర్మ్యతలంబున హీరరత్నసం
ఘటితసువర్ణపీఠమునఁ గాయజసంహరుమూర్తినుంచి హృ
త్పుటగతసమ్మదంబు వెలిబొంగఁగనాత్మసతీలలామ ని
చ్చటికొకచేడెచేతను వెసం బిలిపించెను నక్షణంబునన్. 45
ఉ. అందెలుమ్రోయ లేఁతనగ వచ్చువెన్నెలగాయమోముడాల్
చందురునింద నేయబిగిచన్గవయదుగ్రిలతోడగాయమై
కుందనపింపురోయ జడకూకటిచీఁకటిచాయ మూయయా
చందనగంధివచ్చె విభుచక్కికిసిబ్బితియామతింపఁగాన్. 46
క. చనుదెంచి విభుసభావము, కనుసన్నందెలిసిశరణకంఠీరవస
ద్వనజాతములకువందన, మొనరించిభయభక్తులమరయుగ్మలిపలికెన్.
ఉ. ఓమహితప్రభావగుణ యోకరుణాజలరాశి యోగురు
స్వామి యజాది దేవతులునన్నుతినేయఁగ లేనియట్టి మీ
కోమలపాదపద్మము లకుంఠితభక్తినుతింపఁగా దరం
బేమముఁబోలువారికనిభీతమృగాయతనేత్రక్రమ్మఅన్. 48
గీ. చీకువెలుఁగుబొక్కి చెలుకునఁగలరుచి
మూకశబ్దవివరములు గ్రహింప
లేనిపగిదిదాపకీనపదాంభోజ
భక్తి దెలియ నాకు శక్తికలదె. 49
చ. నినుఁబొడగంటిహృత్ప్రమదనీరధి దేలఁగఁగంటిక్రమ్మరఁ
జననముఁవీడఁగంటి సరసంబుగము క్కి తోవఁగంటి పా

వనతరజంగమావలికృపాపరిపూర్ణతఁగంటిఁదొల్లి చే
సినసుకృతంబు లీయెడల చేకురఁగంటిని మంటి నెంతయున్. 50

వ. అనిన జంగమవర్యుం డి ట్లనియె. 51

ఉ. పోయెడివాని నన్ను నటపోవఁగనీకభవద్వరుండుదా
తీయనిమాటలొప్ప ననుఁదెచ్చెమదంబుజపాణి వేడినం
గాయజవైరిభక్తునకు కాయము చర్మము నొల్చి సంభవుల్
* * * * * * * 52

చ. జనవరుఁడాత్మమోహవివశత్వమునందునభార్యనింతిగా
ఘనతరఁజేసి గాక మునుగంటిమె వింటిమె యిట్టిధైర్య వ
ర్తనలనటంచునెంచియును తథ్యముగాంచదలంచివచ్చితిఁ
వనరుహపాణి నీవినయవైఖరిఁజూడఁగఁ జాలుదంతకున్. 53

వ. అనిన నవ్వధూవతంసం బి ట్లనియె. 54

సీ. వాదించిగురువింటవైచునారిదె కాక, కలుగునే యమ్మునకలఘుశక్తి
నూటిగానాడించుసూత్రధారిదె కాక, జంత్రంబునకునాట్యశక్తిగలదె
త్రిప్పుకులాలుని దేకాక దారుచక్రమునకుఁగలుగునే భ్రమణశక్తి
గిరిదరిఁబల్కి పల్కించువారిదె కాక, గుహలకుగల్గునే కూయశక్తి

గీ. యటులఁదావక కరుణనాయందునిలచి
త్రిప్పినట్టివిధంబునఁ దిరుగుదానఁ
గాన సద్భక్తినడుచుమార్గంబెఱుంగ
పరమశరణాగ్రిగణ్యాయో గురువరేణ్య. 55

వ. అని మఱియును. 56

చ. కటకటయిట్టివేసవిని కాల్నడకంటకశర్కరావృతో
త్కటపథదూరభూమిదిరుగంబనియెంతటి దేమివచ్చెమి
కటముగఁగానుపించెనరకాళ్ళనుపొక్కులుపాదరక్ష లే
మిటికిఁదొడంగరైతిరనిమీనవిలోచనపల్కెఁబల్కనన్. 57

చ. అలికులనీలవేణిభపినంటనినేనుముమాకుభూమిలో
పలిపశుజాలమెల్లభవివర్గముకానతదీయకృత్తిచే
మలచినయట్టినంబువులుమెట్టుదుమే సరణిక్రమంబుమొ
కలముగనెంతదోఁచిననుకాయనుఖంబునకంతమున్నదే. 58

ఉ. చిక్కనవారి కేవగలఁ జెందుదు నింతియె కాని మున్ను మా
కెక్కడ నెవ్వరున్ వగ వరెన్న దు నీవిపుడార్తినొందిమా
పొక్కులు గాంచి పొక్కెదవు భూతదయారస వేమి చెప్పనో
చక్కెర బొమ్మ నీపలుకు చందము డెందముకుందు బాపెడున్. 59

గీ. పలికితివి చాల చల్లని భాషణములు
వింటిమిప్పుడు చెవులకు విందులయ్యె
పలికినట్ల నయుండునో భావశుద్ధి
కలన వేఱయియుండునో తెలియదయ్యె. 60

వ. అనిన నయ్యతివ యిట్లనియె. 61

సీ. నిర్వంచకస్థితిశర్వభక్తాళికి, తనుమనోధనములు దాఁచఁబోఁక
యొసఁగుచు సద్భక్తి నుండెడు వారికి, శీతలకరమాళి చిక్కఁగాఁక
తక్కులు విద్దెలు దంభంబు పామర, త్వము కామకపటవర్తనములొదవు
వారిచేఁజిక్కక వాఙ్మనఃకాయక, ర్మములు వేఱుగఁ జేసి యమృతపదము

గీ. బాయజాలుదు నయ్య యిప్పట్టునందు
తెలిసియుండియు నాడంగవలసి యిట్టు
లాడితిరి నామది పరీక్షఁ జూడవలయు
ననితలంచినఁ జూడుఁడో యకలుషాత్మ. 62

చ. అనవుడ తండు పల్కవని తాఘనకూపము గాంచి యెంతలో
తన దగుదానిలోఁ బడిగి యుందలిమన్నొక ముద్దశైనఁ దే
జనఁ డను మాడ్కి బాత్తికవచస్సము దాయముఁ జూపవచ్చుఁ గా
నినదువశక్యమే యనిన నీరజలోచన ధీరచిత్తయై. 63

క. తనపతిఁ గని యీ ఘనపవ, ద్వనజాతములకు మదీయతమ చర్మము గో
బ్బున నొల్పి మల్పి సంబువు, లొనరించి మ్మనిన సమ్మదోన్నతమతియై. 64

క. సాహసము మీఱ సతిపై, మోహంబించుకయు లేక ముఖమున ధైర్యో
త్సాహము లుదోపఖడ్గము, బాహువున మర్పు శరణవల్లభుఁ డనియెన్.

ఉ. మందున కాకు దెమ్మనిన మాని మొకుల్ దెగఁ జూచినట్లు గో
రందగఁ జీరు దానికి కరంబున గొడ్డలి గొన్న యట్లు నీ
వందితికత్తి సంబువునకై నతిఁ జంపఁ దలంచినాఁడవో
యెందున దుర్మ[illegible]న్నవిధంబు గప్పడెన్. 66

గీ. ఇంతద్రోహుల మైతిమే యింతిఁజంప
బంపఁ బెండ్లికుమారుఁడు వరదపోవ
గారికళ్యాణములు పాడుకరణి యయ్యె
మేము సుఖ మంద దలఁచుట మేదినీశా. 67

చ. జనవరమాకుసంబువులొసంగెడు వాఁడవయేని యీగతిన్
ఘనముగ రద్దిగానియక కామినిఁ జేరఁగనీక మమ్ములం
గనుఁగొనలీక చాటునకుఁ గైకొనిపోయి తదంగకృత్తి మె
ల్లన వదలించి మల్చి యకలంకమతిం గొని తెమ్ము పూనెదన్. 68

మ. అనినన్ భూపతి మ్రొక్కి దేవ భవదీయాభీష్ట మెల్లైన నే
నొనరం జేయుదు యామమాత్ర మిట మీ రుండుండు పూసెజ్జపై
నని యట్లాతనినుంచి కాంతయును దా నభ్యంతరావాసము
య్యనఁ జేరంజని హస్తకల్పితకృపాణాగ్రంబునన్నేర్పునన్. 69

క. అక్కాంతవీవు చర్మము, గ్రక్కున యా జంగమయ్యకాల్లాదికి దా
నొక్కింతదిగిచి సంబువు, లక్కజముగ గూర్చిపైడి హరివారణమున్.

క. జతనముగనుంచిభస్మస, హితతాంబూలంబుగొనుచు నెంతయు భక్తిం
గుతలపతిమాళినిడియది, యతిరయమున దెచ్చియుంచె నాతని యెదుటన్.

మ. ఉనిచినఁగాంచి యో నృపకులోత్తమ మా కనుమానమయ్యె నీ
పనిజనుఁ డైనసింతనడి బన్నఁగ నేర్చునె మున్ను నీగృహం
బున నివియున్న వేమొ మసిబూసివి నేరెఁడుకాయలన్న భూ
జనములు మెత్తురే కొనుము సంబువు లేలికపోయి పచ్చెదన్. 72

ఉ. నావుడు భీతినొంది నరనాథుఁడు వల్కె మహాత్మ నేఁడు నీ
సేవకు రాలిచర్మమున చేసితినింతియె కాని మున్ను మా
తావున మీకొసంగుటకుఁ దాఁచినవాఁడను గాను సర్వభూ
తావలిసాక్షి నమ్ము విడనాడకు నన్ను ననాథుఁడ గ్రుడై. 73

చ. పుడమిమగండ నీనుడువు పొందయినన్ నిజకాంత చర్మమే
కడదెగఁగోసినావా యది కన్గొనెదం దరుణీలలామయు
న్నెడకిటురమ్ము పోదమని యెంతయు సత్వరవృత్తిఁ బల్కి నం
దడయక యయ్యె దోడికొని తా జని మూర్ఛమునుంగు కామినిన్. 74

సీ. అతనికిజూపిరెూయంగనచరమూర్తి, యరుదెంచినాడు లెమ్మనినయంత
కనువిచ్చి తెప్పిరి కరములు మోకాళ్ళ, పైనూనితనుభరమూనివెన్ను
వెనుకకువిరిచియా ఘనునిగటాక్షవీ, క్షణమునమునుపటికరణిచర్మ
మలరసొంపెక్కు దేహముగల్గిలేచియా, త్కాంగ్రఘులకెఱగినయతివగాంచి
గీ. పార్థివునితోడననియెనీపద్మగంధి, మేనుగోసినజాడయేమియునుగాన
రాకయున్నదినీమాటమాకుదెలసె, నెన్నివిధములనీనైజమేలమాను.
క. కోకిలతోసరియగునే, కాకమువజ్రంబుసాటిగనునేపటికం
బాకరణిభక్తవర్యా, నీకముతోనీవుపోలనేర్తువె యధిపా. 76
చ. పొలతులమిన్న సర్వగుణపూర్ణయటంచనురక్తినొంది నీ
జలజదళాక్షినయ్యల కొసంగకడాచినవాఁడవిప్పుడె
ట్టులఁదదనూనచర్మము కటుక్కనగోసెదవింతమాత్రమేమం
దెలియనివాఁడగాఁదలఁచి తేననుచాలు మహీశనాథుడుర్. 77
ఉ. నాతినిడాచినాఁడవని నాయెడనేరము వున్నబోఁకుడీ
యాతరి నీవుచూడ రచియించెదఁ జర్మముగోసిసంబువుల్
భూతపతిస్వరూపయుని బోటినిడగ్గరికృత్తియొల్వఁగా
జేతనిశాతహేతి నతిశీఘ్రముగాఁ గొనినంతలోపలన్. 78
వ. ఆజంగమరూపంబు విడనాడి మహాదేవుండు. 79
సీ. ఒకకేల మొనవాలుసికపట్టివినుజాలు
మొలతోలు నెమ్మేన తెలుపుడాలు
చేతకంకటితుండు చెంపజాబిలిచెండు
గెడలజేజేపిండు జడలదిండు
గుదిగొన్న మెడకప్పునుదుట వేలెడునిప్పు
కనికరంబునునొప్పుకనులమెప్పు
చెలువైనసామేన నలరెడుగనుచాన
పలుకుతేనియసోన నలువులీన
గీ. వెండికొండఁబోలు వెలగిత్తపైనెక్కి, బాసవాలుగములు బలసికొలువ
నాకసంబుపుడమి నలమినవెలుఁగున, గాన నయ్యె బేసికంటిసేల్పు
గీ. ఇట్లుప్రత్యక్షమైనసర్వేశ్వరునకు, పుడమిసాష్టాంగమెరగియాభూమిభర్త
పొలతులమ్మునుంగేలుమోడ్చి [illegible] భక్తియుక్తినిట్లనినుతించె.

ద్విపదగర్భసీసము.—
శ్రీపార్వతీలోల శ్రీజనపాలపా, పాబ్ధివాతూల భక్తానుకూల
పన్నగాధిపహార పాండుశరీరస, న్నుతసురవారజననవిదూర
నందీశకంఖాణనాట్యధురీణవం, దారుసంత్రాణవననిధితూణ
భర్మాద్రికోదండ పాలితాజాండని, ర్మలగుణకాండ నిర్వాపదండ
గీ. యతినాయక మిత్రహవ్యాసినేత్ర, శిక్షితాసురగోత్ర చిన్మోక్షసత్ర
మేళసంభవ భంగవృథ్వీశతాంగ, పాశమోచన చెంగపద్మేశసంగ.
వ. అని యిట్లు సన్నుతించు భూవల్లభుం గనుంగొని దయారసభరితాంతరంగుం డై యాలతాకుంతాంతకుం డిట్లనియె. 83
ఉ. రాజకులావతంస యపురా దృఢచిత్తుఁడ వీవె యెన్నఁగా
నీజగమందు నీకు సరియెవ్వరు నీరమణీలలామ యా
నీజలజాక్షి ధైర్యగతి యేమనిచెప్పఁగ వచ్చు మాహృదం
భోజము విప్పనం దనరె భూనుతతావక భక్తికెంతయుఁన్. 84
గీ. ఐన నొకమాటదెలిపెద నవనినాథ
కామభోగానుభవములఁ గాంతనీవు
పేర్మిఁగొన్నాళ్లువర్తించి పిదపనాగ
మాంబికాసుతుఁడుండు కళ్యాణమునకు. 85
మ. చనియాశైవధురీణుఁగాంచిసకలాశాసంతతాయాతభ
క్తనికాయాభవతత్త్వగోష్ఠిమది నుత్సాహంబుతో నెప్పుడు
న్వినుచుందద్విమలప్రసాదమచట న్వేమారు సంతృప్తిగాఁ
గొనుచుంగొండొకకాలముండితుదిన న్గూడంగరమ్మావెనన్. 86
శా. ఆరీతిన్గిరిజాధినాథుఁడు సదృశ్యాకారుఁ డై సంతటన్
నారీరత్నముతోడ సద్భుతమనోనాళీకుఁ డై స్వామిసా
కారుం డై పొడచూపి మోక్షమెడ గాఁగంగొంతకాలంబుసం
సారభ్రాంతిదగిల్చెఁగా యనిజుగుప్సంజెందె రాజత్తరిన్. 87
చ. నిజగురుమూర్తి కేవలవిసీలగళాపరమూర్తిచక్రపం
కజభవముఖ్యనిర్జరనికాయనుతామలకీర్తిసేవక
వ్రజహృదయానువర్తిఘనభక్తసముచ్చయచక్రవర్తిశి
ష్యజనమనః ప్రదానవిలసద్గుణపూర్తివిలాసమొప్పఁగన్. 88

మ. చనుదేరం బొడగాంచి భక్తినెదురై సర్వంసహానాథుఁడం
గనయుం దాను నమస్కరించి కడువేడ్కంబ్రేమఁ దోడ్తెచ్చియా
య్యనరతోన్నతపీఠిపైనునిచి యర్ఘ్యాదిప్రపూజావిధుల్
దనరంజేయుచు స్వాగతం బరసి చిత్తం బూనఁగా నిట్లనున్. 89
ఉ. దేవ మహానుభావ భవదీయమహామహిమం బదెట్టిదో
భావజవైరివృద్ధతర భక్తవరాకృతి దాల్చివచ్చిమ
ద్భావపరీక్షచేసి పరివారముతో దనరూపుచూపి సౌ
ఖ్యావహహర్యావనంబు ద్విపదంతకఖడ్గము నిచ్చె మెచ్చుగాన్. 90
గీ. ఎచ్చినిజపథసంప్రాప్తి కెడముపెట్టి
చనిమె గురుసార్వభౌమయీ చంద్రవదన
ధైర్యవిస్ఫూర్తివలన నహార్యచాప
దర్శనం బయ్యె నేఁడు నాతపమునిండె. 91
క. అనవుడుగురుఁడనునదిరొుక,ఘనమాభక్తులకుశివుఁడుగనుపడుటరుదా
మునుకుమ్మరగుండయ్యకు,తనరూపముచూపివయనుదయసేయఁడోకో.
క. మానినిధైర్యముపెద్దగఁ, బూనివచించెదవు తొంటిపొలఁతులలోసీ
చానసరియగునెభక్తిని, ధానంబునకనినజడిసి ధరణీశ్వుఁడనియెన్. 93
క. ఎఱుఁగకయిటుగొనియాడితి, తెఱవనునాతప్పుసైఁచి దేహమ్మునుబెం
పరముగఁ దరుణులుభక్తిం, జరపినవిధమానతిమ్ము సంశయమెడలన్.
వ. అనిన నద్దేశికశ్రేష్ఠుం డిట్లనియె. 95
ఉ. శంబరవైరివైరిపదసారసభక్తగణార్చనక్రమా
లంబనితాంతకల్మషకలాపమహోన్నతభూతధాత్రిభృ
చ్ఛుంబసమస్తలోకనుత సత్యవచోనికురంబవీరసం
గాంబ యనంగ నొక్కసతి యంచితవృత్తిఁ దనర్చు నెంతయున్. 96
ఉ. ఆతరుణీలలామపతి యంబరకేశునిఁ జెందు బిమ్మర్త్య
పాతకదూరుసద్గురుకృపాకలనంబున భక్తిచిత్తమై
ఖ్యాతి జనింపఁగాకదురుకాయకమూనితదీయలబ్ధిచే
బ్రీతిగ సేవురయ్యలకుఁ బెట్టు నిరంతర మిష్టతాన్నముల్. 97

— వీరసంగాంబకథ. —

చ. ఇది వ్రతమూని సల్పుతరలేక [illegible]

మదనవిరోధిమామగువ మందిరసీమకు జంగమాకృతిఀ
గదిసినఁ గాంచి మ్రొక్కి కుతుకంబునఁ బూజలొనర్చి పద్రసా
స్పదమగుభోజనం బిడినసంతస మొప్ప భుజించియంతటన్. 98

చ. పడతిరొనిత్యమైదుగురుభక్తులకన్న మొసంగికానివే
కుడువవునీగృహంబునను గుమ్ములుగాదెలు లేవునీకడం
గొడుకులు లేరు తెచ్చియిడకూలియొనర్చినసీదుపొట్టకే
గడుచుటదుర్లభంబు దినకాయకమెట్టిదొమాకుదెల్పుమా. 99

వ. అనిన యానతి యిట్లనియె. 100

క. కలిమికి కారణంబు బలుగాదెలుగుమ్ములుగావునీదున
జ్జలరుహాభక్తిగానియిదిచాలఁగగల్గినకల్మిలేనిచో
బలితపులేనిచూడక్షణభంగురమైచను మేటిభాగ్యముం
దలుతురెదొడ్డగాజగతిఁ బావకభక్తులుమానసంబునన్. 101

వ. అని మఱియును. 102

చ. అనుపమమైనమద్గురుని యానతి భక్తిగణార్చనార్థమై
ఘనతరభక్తినీకదురు కాయకమొక్కటిపూనిదానిచే
ననుదినమస్మదీయ నియమాచరణంబొనఁ గూడఁజేతునో
యనఘతరాత్మయంచువినయంబున బల్కిననాతిఁ డిట్లనున్. 103

క. కాయకముదలఁపగొంచెము, పాయకనీనేయుచున్నభక్తార్చలకా
దాయముచాలదుదినగతి, యేయనవునజరుగుననిననింతియతనితోన్.

చ. ఉరుతరపుణ్యమీరెఱిఁగియుండియు పల్కుటచోద్యమయ్యెము
న్నరణులుకొద్దికాయకమునన్నపహాజంగమపూజనల్పరే
ధరణినటన్ననప్పగిదితప్పకఁజేసినవారలెవ్వరో
తరుణివచింపుమాయనినతచ్ఛరణాగ్రణి కాపె యిట్లనున్. 105

— చక్కిమాచయ్య కథ. —

శా. మున్నొక్కండుపయోజగర్భబలభిన్నుఖ్యామరానీకను
త్యోన్నత్యాశ్రయపాదచంద్రధరగేహత్స్వాంతపద్మండువి
చ్ఛిన్నాఘుండుసమస్తలోకజనతాసేవ్యుండునొ" చక్కిమా
దన్నాఖ్యుండుగలండుజంగమపదార్చాసక్తుఁ డిద్ధారుణిన్. 106

ఉ. అతఁడు భక్తినిత్యముగణాలయసీమలకేగి తత్సతీ

జాతముదంపరోళ్లకడ జారినబియ్యముచేరఁడేరిసం
ప్రీతిదలిర్పఁదెచ్చితన ప్రేయసికిచ్చిన యాపెవానిపై
భూతివిదల్చియొక్కబలువుట్టికలోనిడి యాక్షణంబునన్. 107
క. గురుకృపచేనక్షయమై, పరగినబియ్యంబు వండి భవభక్తనము
త్కరమునకు నన్న మొసఁగుచు, వరతరకళ్యాణపురిని భాసిలునంతన్.
చ. బసవఁడుతత్క్రియం బెఱిఁగిభక్తులనందఱిఁబిల్వఁబంచిమీ
బసలకువచ్చియొక్కశివభక్తుఁడు లూఖలమున్నభూస్థలి
న్ముసలవికీర్ణధాన్యకణముల్గొనిపోవుచుండు రాకము
న్నెసకలమందిరస్థలులు సింపుడుదంపెడుచోట బియ్యముల్. 109
ఉ. ఆపెను పేదభక్తునకునందఱు ముంగలభంగిసీగతిం
బ్రాపొనరింప మేలనుచుఁబల్కినవారలుసమ్మతించిత
ద్రూపితమట్ల సేయ భవదూరుఁడుమారఁడు తొంటిశీతనా
రేపకడంబిరానఁజని శ్రీదళుకొత్తదంగణంబులన్. 110
క. మెండుగనుండిన సన్నపు, తండులములుగాంచి బసవదండాధీశా
ఖండకృపామతి నేఁడిటు, పండువుగాదొరికెననుచు భావంబలరన్.
గీ. అచటనున్నఁజూచియాతండులంబులు, మోయుకొలఁదిపెద్దమూటగట్టి
మోచితెచ్చియింటిముంగిటనిలచిని, జాంబుజాక్షిఁబిలువనతిరయమున.
చ. ఎదురుగవచ్చి బోటిహృదయేశ్వరుమూపున మూటగాంచిలో
నొదవినభూతి మైననియె యోగుణభూషణ నిత్యచర్య చే
సదలితి వేలచూచి గణవర్గమునవ్వరె బియ్యమట్లనే
డొదులుగ నబ్బెనంచుఁ గొనుటొప్పునెతప్పనిదోచ దాయెనే. 113
క. జీవముశీలము రెండును, కావటిలో కుండలట్లుగావున ధరపై
జీవముగలుగక శీలము, బోవిడుతురె యింతయానబొందుటమేలే.
వ. అనిన నతం డిట్లనియె. 115
ఉ. కామినినిత్యమై పరఁగుకాయకలబ్ధియె కానివారినే
నేమియు వేఁడి తెచ్చుటొకయింతయులేదు శివుండెఱుంగునా
నేమమురోళ్లచుట్టుకడునిండుగ నుండగ శాలితండుల
స్తోమముదండనాథు కృపదొర్లుటగాయని జంగమార్చకై. 116

క. కొనితెచ్చినాఁడనన్నపు, వనితామణివలికె వారిపనతులలోన

స్మను పెన్నడిట్లుచిలికెనె, యునికొనఁగావలదెబియ్యమధికముగనినన్.

చ. చిఱుతలుదంపరోళ్లకడచిందెనె చూడిది యేమివింతయి
త్తెఱఁగున నొల్కఁబోసిరిగ దేయని తల్లులబిల్చివారితో
నెఱుఁగఁగఁజెప్పఁగావలదె యేటికి తెచ్చితి విట్టిసేతకుఁ
గఱమెఱ వేల్పు తాకరుణఁ గాంచునొ కాంచఁడొ నీవమెంచుమా.

మ. అనవుడు నేమియుంబలుక కాతఁడు క్రమ్మర వేగనేగి తా
మునుగొని తెచ్చుచోటులనమూఁలముగానవిచల్లి తొంటిలా
గునఁ దనచారెడేరికొని గొబ్బునఁ దేనవిగాంచి మెచ్చి చే
కొని సతివండి భక్తవరకోటికిఁ బెట్టె మనోహరాన్నముల్. 119

వ. అంత. 120

క. చారునివలనంబసవఁడు, మారనిసతివల్కునట్టిమాటలువిని నే
నేరనిపనిచేసితినే, డీగతి మైవారిమహిమ మెఱుఁగకయకటా. 121

చ. అనిమదిలోనఁ జెంచి రయమారగణావలితోడ మారయా
ఖ్యునిగృహసీమకేగివినయోన్నతి మారనిఁగాంచి మ్రొక్కినం
తనతఁడుభీతిమై సతియుఁ దానును జాగిలిమ్రొక్కిపేనవే
ల్పనతులొనర్ప భక్తిసముపేతుఁడు శ్రీబసవేశుఁ డిట్లనన్. 122

చ. అనుపమమైనమీవ్రతమహత్త్వ మెఱుంగక సేదలంచుచే
సినయపరాధ మొక్కటి వచించెద భక్తులయిండ్లరోళ్లదా
వునమునుపంటికంబెఁ బరిపూర్తిగ బియ్యము లబ్బునట్లుగా
నొనరిచినాఁడ మీకరుణకొయ్యనఁ బాత్రునిఁ జేసి కావరే. 123

చ. అనియిటువల్కుచున్న బసవాధిపువాక్యము లాలకించి మా
రనిసతివిన్నవించె ప్రభురాయదయామతిమీరుమమ్ము సాఁ
కనెనరు పుట్టిచేసితిరిగాని తలంపఁగ నట్లు మేము చే
కొనుటకుఁ జాలువారమెయకుంతితమన్నియమంబు దక్కఁగాన్.

గీ. సద్గతిప్రదాత మద్గురుఁడిచ్చిన, నియమవృత్తి దప్పనేఁడుచాల
దొరికెనంచుకొనిన ధూర్జటిమెచ్చునే, పరగకేగిరాళీఁ బట్టజనునె.

క. మీరెఱుఁగనిదేమున్నది, సారదయాహృదయ దేవసంగనబసవే
శారాధననిరతుండై, వారనుపఁగ బసవడాత్మవాసముఁ జెందెన్.

క. ఎప్పటియట్టుల మారఁడు, గప్పురగంధియును దానుగాయకవృత్తిం

దప్పకజంగమపూజన, లొప్పఁగఁ గావించుచుండెనోడయలు మెచ్చన్.

వ. అదిగావున గాయకంబు లధికంబు లని స్వల్పంబని యెన్నంబనిలేదు సద్గురుకటాక్షంబున గొంచెంబైన నధికంబవుననిన దరహాసితవదనుం డై యతండవ్వా నీగురుఁడిచ్చిన కదురు గనుంగొనవేడుక య్యెడునది యెట్టిదియొ చూతము తెమ్మనుటయు నట్లు కాకయని యానంగ మాంబ సత్వరంబునం జని రాట్నంబున ధారమాధారంబుగా నున్న కదురు దివియునంతలోనె పెళుక్కున నడిమికి తునకలై యుండినం గని గుండియ ఝల్లురన బెండుపడి మూర్ఛ మునింగి కొంతసేపటికి తెలిసి తత్ఖండంబులు హస్తతలంబున నిడికొని శోకవ్యాకులితచిత్త యై బాష్పజలంబు లురుల నిట్లని విలపించె. 128

గీ. ఎదురులేనిభక్తి చిదురువగానీక
యదరు బెదరు మదిని గుదురనీక
ముదురకరుణ నన్ను చదురుగాఁ బెనిచెడు
గదుర మద్వ్రతంబు గాచు కుదుర. 129

ఉ. హా సుగుణాఢ్య దేశికవరాంచితహస్తపయోజదత్తయా
హా సతతాంబికాపరపదార్చనబృందసమర్చనాకరా
హా సుతమిత్రబాంధవధరాధిపదాత్మజనోపమేయయా
హా సురభూజకల్పపృథ యైతివి యేనిఁక నేమిసేయుదున్. 130

క. అని వగల మిగులఁ బొగిలెడు, వనితామణిగాంచి కపటభక్తుం డసునో
వినుతార్ఘ్యశీలా నీ, ఘనమోహభ్రాంతి నేఁడు గానఁగనయ్యెన్.

చ. మునుకొని పెక్కుగానినుపముక్కకు వెక్కుచు నేడ్చువారి యెం
దున గన మిట్టి భ్రాంతికము త్రోవయె భక్తికి నాసమాలి చే
సినగణపూజ బాలశశిశేఖరుఁ డెంతయు మెచ్చుఁగాక యీ
యనవున నాజవంజవమహార్ణవమగ్నతఁ జెందవచ్చునే. 132

గీ. కదురుమీఁద మోఁతకాంతు నీకుండిన
తెరవ రెండు మూఁడు దెచ్చి యిత్తు
వగవ కుండు మనిన వనిత యాతని కాంచి
యెలుగుమంద మొంద నిట్టు లనియె. 133



చ. శరణవరేణ్య సాప్రియోఁడు శర్వపథంబునఁ జెందు పిమ్మట

కరుణదలిర్పమద్గురుఁ డఖండితజంగమవర్యపూజనో
త్కరము లొనర్ప మీకదురు కాయకలబ్ధి నటంచు నిచ్చె నా
కరుదుగఁ దీనిభక్తి నది యాదిగతత్క్రియ మెప్పుజర్పితిన్. 134
గీ. ఇపుడు నాజీవ మగునది యిట్టులయ్యె
నయ్య నావ్రత మీడేర నానతిండు
గురుపథంబునఁజెందెద గొదువపడక
యనిన కరహాసవదనుఁడై యతఁడు పలికె. 135
ఉ. కాయముపీడదే కదురు కాడకు గా మది నానవీడఁగాఁ
జేయవు బాగురే యినుపసీలకు సాధము గాల్పఁ గూడునే
మాయలఁ బెల్లియంత పెనుమక్కువగల్గిన వెండిపైఁడులం
జేయఁగ బంచి యిచ్చెదను చేకొను మీకదు రట్లు గానిచోన్.
క. యావజ్జీవోపాధికి, నేవెర వొనరింతు కొమ్ము నెలతకదురుకై
చావకు మని తనజోలిం, దేవి పసిఁడిజాతిరొుకటి దిగిచి రయమునన్.
క. ముందరవైచినసతియది,యందకనామదిగ్రహింపకయ్యయొమాయం
జెందంజేయుఁగఁదగదే, కందర్పారాతిమూర్తి కరుణింపు మిఁకన్.
గీ. ఇంక నిమ్మాటకు బలికితి వేని దేవ
నీకు నీయాన సెలవిమ్ము నీలగళుని
గూడ నరిగెద నను మది గొంకులేక
తతశివార్చనవేదికాస్థలమునందు. 139
క. భావం బలరఁగ రొుకగుహ,గావింపఁగఁ బంచికదురుఖండంబులతో
నావివరము జొరబోవఁగ, భావజహరుఁడింత మెచ్చి ప్రమథులతోడన్.
క. ప్రత్యక్షంబై నిలిచిన, నత్యంతకుతూహలమున నయ్యంగనన [గన్.
న్నత్యభినుతు లొనరించిన, కాత్యాయని విభుఁడు కరుణగడలుకొనం
గీ. కామినీమణికైకొని కమలసంభ
వామరాధిపనుతిపాత్ర మైనరౌప్య
ధారుణీధరరాజంబుఁ జేరిప్రమథ
కాండలీలావినోదుఁ డై యుండె నంత. 142
వ. అదియునుం గాక. 143
క. అజనిరథనిబలశరద, ప్రజగిరిరురుసింహాసమధురాసురవదపో

రుజశూద్రకరిరథాళ్వభ, టజనాలయు మొప్పఁబురిపుడమిజంబురనన్.
వ. అప్పురంబునందు. 145

### రౌద్రసత్తక్కకథ.

ఉ. చొక్కపుసూనృతోక్తపురసూదనపాదపయోజభక్తి పెం
పెక్కుగుణానుశక్తి గిరిశేఖరనామవిరక్తిసేవక
పాళికతినాఘసంచయవిపాటనశక్తి వహించి రౌద్రస
త్తక్క ధరాతలంబున మహామహిమాయతి నొప్పు నెంతయున్.
ఉ. పంచశిలీముఖారిపదభక్తుల కెప్పుడు తద్గుణాఢ్య ని
ర్వంచకవృత్తిపూజలనురాగముతో నొనరించుచుంజగం
బెంచక నన్యదైవముల నెప్పుడు బల్కక మ్రోల నెవ్వరం
కించి వచించిన న్వినిన కేవలనిష్ఠ జరించుచుండఁగన్. 147
క. తరుణిదృఢభక్తిధైర్యము, లరయఁగ ధర కెల్ల దెలుపహరుఁడొకచరుఁడై
యరుదెంచితద్గృహాంగణ, పరిసరమునఁనిల్చి ఘంటవాయించె వెసన్.
క. భిక్షాం దేహి యనఁగవిని, యాక్షణమునదర్వి వేఁడియన్న ముగొనియా
ప్రక్షాళితకల్మషచని, భిక్షుకునకు పట్టు మనుచు బెట్టం బోవన్. 149
క. మెతుకొకటిక్రిందజాఱిన, యతఁడక్కటికంబునొందిహరిహరియనదా
నితఁడేటి జంగమనిసతి, యతికుపితమనస్క యగుచు నడచెందర్విన్.
చ. అడచిన భీతినొంది యతఁ డక్షులనీరము నించి తూలుచుం
బుడిమిని వ్రాలి కోలఁ బిగఁబూని హరీ యని లేవఁబోవ నీ
నుడువిఁక మానుమంచుమది నూల్కొను నాగ్రహవృత్తిఁ గ్రమ్మరం
బెడతలవ్రేయ సొమ్మసిలి పెక్కుగదుఃఖము పిక్కటిల్లఁగాన్. 151
చ. తగిలిన దిక్కుజేనడిమి తామసిరక్కసి దోసకారి న
న్నగవడ నీక మ్రింగుక్షణ మైనసిలం దగదీడ నన్నుఁ గా
వగ నీక నెవ్వరో గరుడవాహన యంచుఁ జనంగఁ వెంబడిం
దెగఁబరువెత్తి చేకొలఁది తెడ్డున వెన్నదరంట మోదినన్. 152
చ. పెనుదెసఁజూడఁబోక తలవీడఁగటిచ్ఛదమూడఁగంట మే
దినిఁ బడవ్రేయ మోముకళదియ్యనియూర్పులు మీర బొంతజా
ర నధరమొండ బెట్టుగనురమ్మున చెమ్మట నిండ నొక్కప
ర్వునఁ జనె తత్పురీశరణపుంగవకోటి వసించుచక్కికిన్. 153

చ. చని గణకోటిఁ గాంచి మదిసాధ్వస మందఁగ నిల్చి వారితో
ననియె మహాత్ములార యొకయంగన యిప్పురి దుర్మదాంధవ
ర్తన బలుసత్తజంగమవిదారణశీల యటంచు మున్ను నే
వినవిక తంబున న్మది వివేకవిహీనత భిక్షకేగితిన్. 154

గీ. ఏగి దేహియన్న నింతిచిట్టడచూచు, తెడ్డుతోడకూడు దెచ్చిపెట్టి
దానితోనవీవు తాటయెత్తఁగ మోదె, నన్నలారమిన్న కనుచుఁజూపి.

గీ. దిక్కులేనివాఁడు తిరిపెమెత్తెడువాఁడు, వీఁడటంచుజార విడువఁబోక
పాడినెఱపవలయు భక్తాభిమానులై, కావరయ్య నన్ను కరుణతోడ.

క. పాడివిచారించియెము, న్నోఁడధరానాథుఁడాత్మసూనునియనువుల్
దూడకయిదోలఁగ జేయఁడె, వేడుకవినుఁడాక్రమంబువివరింతుఁదగన్.

—— చోడరాజుకథ. ——

చ. వసుమతిసింగరానగరవల్లభుఁడై చనుచోడఁడన్యభూ
పసమితినొంచుచున్ హితులఁబాలనసేయుచు వీరశైవగో
ష్ఠిసలుపుచున్ శివాధవుని సేవయొనర్చుచు సత్యసంధుఁడై
దెసలయశంబునిల్పి జగతీతల మేలుచునుండునంతటన్. 158

ఉత్సాహము. అరసాధినాథసూనుఁ డంత నొక్కనాఁడురు
త్సారమైతనర్చుస్యందనాధిరాజ మెక్కిన
ద్భేరికాహళారవాళిపెంపుసొంపు నింపద
త్పౌరవీథి నేగుచుండ దైవయోగ మొందుటన్. 159

చ. గురుగృహధేనుతర్ణకము గొబ్బుననడ్డమువచ్చిభీతిచే
నరుగఁగ లేక తద్రథసమాయతచక్రవిఘట్టనంబున
న్మరణము నొందఁగాంచి నృపనందనుఁడెంతయుఁ జింతనొంది హా
హరహరయంచు నేగె నగరాంతికపుష్పవనీధరిత్రికిన్. 160

సీ. అంతట తద్ధేను వటవీస్థలంబున
పోపు మేయుచుఁ బాలు చేపువచ్చి
వత్సంబుఁ దలఁచియంబారవం బిచ్చుచు
రయమునఁ జనుదెంచి రథ్యఁజొచ్చి
పడియున్న పృథుకంబుఁ బొడగాంచి మోముమో
మునదువ్వుచును చను మొనలుమూతి

పై నంటఁ జేయుచు మేను నాఁకుచుఁ జుట్టు
దిరుగుచు గన్నీరుఁ దెచ్చుకొనుచు
గీ. శోకనీఁగలువిసరుచు దుమ్మునొరఁ, గఱచి యెత్తుచు నిలచి నల్గడలు గనుచు
బండ్లు కాళ్లు విదల్చుచు బంచితంబు, నోయ్యనొయ్యన విడుచుచు నున్న [రనుచు.
ఉ. పట్టగ రాని దుఃఖమున పజ్జజనంబులు విస్మయాత్ములై
చుట్టును రాఁగ నేగి మొరసుద్దివినన్ నృప తోరణంబునం
గట్టిన గంటకొమ్మున సుఖంగ నఁజిమ్మిన నాలకించి యా
బెట్టగు నాదమేమనుచుఁ బృథ్వివరుం డరుదెంచి యచ్చటన్, 162
చ. కన్నులఁ నీరుజార ముసుగ్రమ్మిన నోరను చొంగలూరవా
ల్జన్నులఁ బాలు గార మొగసాల రవం బొనరించు నైచికి
న్విన్నదనంబు దోఁప పృథివీపతి డగ్గరి చూచి యేటికో
సన్నయె నర్చికూయిడుట శంకరయంచు విచారమగ్నుఁడై. 163
క. ఉన్నెడ ను నాత్మతనయుఁడు, చెన్నుగ రథమెక్కి పురివిశిఖ నేగఁగ నా
పన్న మటు గురుని వత్సం, బున్న తరథ చక్రనిహతి నొందుట తనతోన్.
చ. పురజను లెల్లఁ జెప్ప విని పుత్రుని శత్రుసరీతిఁ జూచిన
త్వరమునఁ జంపఁగావలయు తర్ణకసూదను నంచు పౌరపా
మరగురుబంధుమిత్రబుధమంత్రిసమాజము గాంచి ధైర్యవి
స్ఫురణ దలిర్పఁ బల్కె నృపపుంగవుఁ డత్తరి మధ్యవర్తియై. 165
క. తన యేలు భూమిలోపలి, జనములు గావించు పాపసంచయ మెల్లం
దనుఁ జెందు నన గతనయుం, డొనరించిన పాపఫలము లొందక చనునే.
క. కొంచెము గా దిది యెంచఁగ, పంచమహాపాతకముల పాటిదఖలునే
వంచనచే సుతమోహం, బుంచిన నిందాఘఫలము లొందక చనునే.
క. నా మదిఁ దోఁచిన చందం, బీమెయి మీకెటులఁ దోఁచు నేర్పడఁ జెపుఁడో
యో మహితులార యనవుం, డా మాటల కేమి దోఁచ కందఱు నొకటై.
ఉ. సన్నుతకీర్తిసంభరిత సర్వదిగంతర సత్యసంధ్యలో
కోన్నత ధర్మశాస్త్ర విధులొప్పఁగ మీరె వచించినారు మే
మెన్నడి దేమి గల్గు పరమేశ్వరుఁ డీగతిఁ దెచ్చె నింక మీ
కన్నది కానుపంచు తమ్ముగ్రమ్మిన దుఃఖము నాఁగి పల్కిరన్. 169
క, వినినృపుఁ డది యేవారల ... మావత్సముపై

తన తనయునిఁ జెఱ(వేయుం, డని తలవరిజనులతోడ నాజ్ఞాపించెన్.

వ. యిట్లాజ్ఞ యొసంగిన. 171

ఉ. అంతకమున్నె వచ్చి భవనాంతరమందువసించి యయ్యయో
యెంతటికర్మినైతి పరమేశ్వరద్రోహము సంభవించె యీ
చింతదొలంగుమార్గ మిఁక చెందదు వేఱొకరీతి నాత్మదే
హాంతముదప్పనంచు వివశాకృతినున్న నృపాలనందనున్. 172

చ. కనితలవర్లు(మొక్కులిడి కన్నుల నీరొలుకంగ దేవ మీ
జనకుఁడు సాహసించి నినుఁజంపు మటంచు ననుజ్ఞ యిచ్చె న
ప్పని మెయి వచ్చినార మని పల్కిన సంతసమంది యారనా
తనువు కృతార్థతం దనరె తప్పె మహాఘము లోకనిందయున్. 173

చ. జనకుఁడనుజ్ఞ యిచ్చుగతి సల్పుఁడు మీరలు సత్వరంబ యా
ఘనుఁడు జలాభిషేచనము గైకొని చల్వలు గట్టిపల్చగా
దనవున భూతిపూసి యఱుతన్నదు రాకసరంబు లేసి హృ
ద్వనజమునందు దేశికపదంబులు నిల్పి విలాసధుర్యుఁడై. 174

క. ఇలువెడలి ఖడ్గకరులగు, తలవరులును తాను నేగుతనుజన్మని ని
శ్చల ధైర్యకలన విని భూ, తలనాథుఁడు మెచ్చి చూచు తలవున నంతన్.

చ. వరకవిబంధుమిత్రనృపవర్గము మున్నదదత్సభాగృహాం
తరజనులెల్ల దోనడువఁ దగ్గకమీఁగ్గిన చక్కి కేగి ని
బ్బరముగ మున్నె నచ్చి యట భాసిలు పుత్రునిగాంచు నంత న
వ్వరగుణశాలితండ్రికనివారితభక్తిని (మొక్కినిల్చినన్. 176

వ. అయ్యెడఁ బౌరజనంబు లత్తెఱంగంతయుం గనుంగొని యత్యంతదుః
ఖాక్రాంతులై యొండొరులతో నక్కటకటా యీభూపాలుం డను
పమానశౌర్యధైర్యగాంభీర్యచాతుర్యసత్యౌదార్యసౌందర్యసౌ
కుమార్యాదివిశేషంబులు గొనియాడం దగుప్రోడలదూడకై తెగం
జూడఁ దలంచెనే యనువారును కట్టడితనంబున కోడక కడుపునఁ
బుట్టినపట్టి నిట్టుచేసె నింక నీపట్టణంబున నెవ్వారి నెట్టు సేయుఁ
డనువారును మోహంబులలో పుత్రమోహం బధికం బని యూహిం
చక సాహసంబున నితని దేహంబు దునుమంబంచె నాహా యనువా
రును నొక్కండె సుతు డిఁక పెక్కు లేరని యిక్కుమారుని దక్కించు

కోలేక మీఁదదుఃఖంబునం జిక్కనసువారును సంగడివీథి తురంగం బులు శతాంగంబు నీడ్చికొనుపోవ మ్రుంగిలికివచ్చి మగుడిపోవం గా శ్లాడక యావత్సం బడంగెం గాక యిక్కుమారపుంగవుండు చేజేత ఘాతియొనర్చెనే యనువారును నిత్యలోకస్తుత్యసత్యసంధుండు గావున నీభూవరుండు నావారు లాఁతివా రనుచూట దక్కి యిట్లుగా వించి నిందాహత్య లెడఁబాపికొనికీ ర్తిమంతుం డయ్యె నింతవాఁడేలో కంబునసైన గలఁడేయనువారును ధర్మంబుదప్పక నిర్మలాంతఃకరణుం డై పుత్రునిశత్రునిగా విచారించినదైవం బాడుకొనవలదే యను వారును ప్రాణంబుమీఁదవచ్చిన నాత్మప్రాణపరాయణుండై తొలం గిపోవక జనకాజ్ఞోల్లంఘనంబు సేయుకయొప్పె యీతం డెంత సుపు త్రుం డనువారును మాకుంజూడనిట్టిసాహసుల కిత్తరిసీశ్వరుండు ప్రత్యక్షుంబై శాశ్వతైశ్వర్యంబు లొసంగి దయసేయకపోఁడని తోఁచు చున్నదనువారును నై గుంపులుగూడి చూచుచున్న సమయంబున.

చ. శరణులకెల్ల మ్రొక్కి యతిసాహసమూర్తి నలంకరింపభూ
వరతనయుండు మేటితలవర్లను గన్గొని జాగుమానిమ
ద్గురుఁ డెటులానతిచ్చె నటు గొబ్బున సేయుఁ డటన్నవారు
భీకరగతినాతనిందునుమ ఖడ్గమెుర న్వెడలించి వ్రేయఁగాన్. 178

గీ. వాలు పువుమాలయై ధరావరునిపట్టి
యఱుతదవిలినతలవరులధికవిస్మ
యాత్ములైయేమి దోఁచకయాగిరప్పుఁ
డొకని మెుగమెుకఁడీక్షింపు చున్నయంత. 179

చ. నిరుపముఁడై నగోపతిఘణిల్లనిరావ మెుసర్ప మేదినీ
వరునకుఁదత్కుమారునకు భక్తసమూహికి గాఢసమ్మదో
త్కరముదలిర్ప బారిషదతండవిలాసము ప్రీతిగూర్పస
త్వరగతివచ్చినిల్చె వసుధాధరచాపుఁడుమానమేతుఁడై. 180

చ. నిలిచినఁగాంచియాధరణినేతవినూతనకౌతుకంబునన్
జలిమలరేనియల్లునకు జాగిలివందన మాచరించిని
శ్చల నిరుపాయ నిర్గుణ నిశాకరశేఖర నీలకంఠ ని
ర్దళితపలాశి నిత్యశుభదాయక నీరధితూణ నిర్మలా. 181

చ. అనివినుతించు రాజుగని యబ్జధరుండును నీదుసాహసం
బునకు భవత్తనూజునియపూర్వపుభక్తికి మెచ్చవచ్చెనే
డనితరలభ్యమోక్షపదమందఁగ రండనివానితద్గురుం
దనయుని ధేనువత్సముల దారనగేంద్రముఁ జేర్చెగావునన్. 182

ఉ. నామొరయాలకించి కరుణామతిచోళనృపాలురీతిన
* మృముడుతంద్రులార వినియూరకయుండకురయ్యయన్ననా
సాములుచెప్పిరావెలఁది శాంతిదయారసభక్తులిట్టివం
చేముగణింపజాలము మహేశ్వరుఁడైన శివుండుదక్కఁగాన్. 183

ఉ. ఇత్తరినన్ను మోదెననియావు వచించితిగాని యాపెదు
శ్చిత్తయటంచు నెవ్వరునుజెప్పఁగ మున్వినలేదుగానని
యుత్తలపాటుఁ జూచినమృదోక్తుల నంగనరాదు గానయ
య్యుత్తమశీలఁ బిల్వవలయు న్మరియిచ్చటకెల్ల నారయన్. 184

చ. అనవినిభిక్షుకుండనియె నక్కటయిక్కడి కేలబిల్వఁగాఁ
బనిచెదరాపె పేరుదలఁప న్మదితల్లడిలంగఁ జొచ్చెమీ
మనమున గ్రమ్మరంగనను మోదఁగఁ జూచెదు వేడ్కఁ పుట్టినం
దనవునకాసఁ జెందవిహితంబని తోచినఁ బిల్వనంపరే. 185

క. నావుడు భిక్షకయూరక, నీవేటికిబెదరెదిట్లు నిలుమిచ్చటనిక్
గావఁగమాభారంబని, పావనుతోసారెనమ్మపలుకుచువారల్. 186

చ. అనుపమభక్తిశీలయగునంగన నీడకుఁ బిల్వబంపఁగా
జనదుతెదాలయంబునకు జాగుననందఱమేగి యిమ్మహా
త్మునివచనంబులెల్ల నిజమోమృషయో పరికించివత్తమం
చనఘుతరాత్ము లేగిరవుడయ్యను దోడ్కొనియాపె యింటికిన్. 187

మ. చని యమ్మానిని పూజలంది యనిరోసాధ్వీవతంసంబనీ
ఘనసద్భక్తికి నీయుదారతకునీకారుణ్యసంశీలవ
ర్తనకుంబాడియె భిక్షకుండయిన యేతద్భక్తుని న్నోదనీ
వినయంబెల్లను గానుపించె శరణుల్వెన్నక్ భళీయందురే. 188

వ. అనిన నయ్యంగన యిట్లనియె. 189

ఉ. ఒప్పుననన్ను మీరెఱిఁగియుండియు నిట్లువచింపనెందువా
తప్పులు పల్కవారలకు దండముదప్పనె నాదుగ్రమోలనే

చొప్పనఁబల్కెనో యడిగిచూచెఁడు మున్నిటనీతఁడన్న వా
రప్పుడుభిక్షుఁగాంచి యనిరందఱు మోములగిన్క దోఁపఁగాన్.

గీ. అడఁచెనిర్నిమిత్తమంగనయనిసభా, మధ్యమందుకల్ల మాటలాడ
దగునెమించ నాదుతప్పునీమెఱఁగల్గి, యెంతకైన దగుదువెన్న ననిన.

క. నారాయణనారాయణ, నేరంబేమియును లేదు నెలఁతుకనాపై
యూరకనాడెననంగా, నేరమనిమహోగ్రహంబు నిగుడఁగనడచెన్.

చ. అడఁచిన శ్రీహరీయనుచు నయ్యలదిక్కుఁగనంగ నంతలో
నుడువకుమన్న శబ్దమనినూల్కొని క్రమ్మ ననంత యాతఁడ
ప్పడతుకరమ్మోలనిల్చెఁ జరభావముమాని వృషేంద్రవాహుఁడై
జడలుకపాలమాలికలు జంద్రకిరీటము శూల మొప్పఁగాన్. 193

గీ. ఇట్లుసన్నిధిచేసి సర్వేశ్వరుండు
మెలఁతనీభక్తికెంతయుమెచ్చివచ్చె
రమ్మనుచుఁ బుష్పమయవిమానమ్మునందు
నునిచికొని పోయెఁ గైలాసమునకునంత. 194

ఉ. అచ్చటనున్న భక్తవరులందఱు నందఱువిస్మితాత్ములై
యెచ్చటనైనఁ జూచితిమె యిట్టిమహత్త్వము కాంతదర్విచే
చిచ్చులకంటి దేవరనుచేకొలఁదిం బ్రహరించి లోకముల్
మెచ్చఁగఁజెందెఁ దత్కృపనుమేశ శుభాకర తారశైలమున్. 195

క. అనిపలుకుచున్నవారల, గనుగొనియొకభక్తుఁడనియెగమలాంధకరుం
దనువలయు మోదికననొక, యనఘుఁడుతత్పదముతొల్లియదియెట్టిద [సన్.

మ. అసమానోత్తరశైవతత్త్వనిధి నిష్ఠాచారుఁడీశానభ
క్తిసముత్సాహుఁడు నిత్యభక్తగణతత్తీర్థప్రసాదోపభో
గిసమస్తేంద్రియనిగ్రహుండు విలసత్కీర్తి ప్రభావుండుర
క్కసిబ్రహ్మయ్య యనంగభక్తవరుఁ డొక్కం డొప్పునిద్ధారుణిన్.

రక్కసిబ్రహ్మయకథ.

సీ. అతనిమహత్త్వ మత్యద్భుతం బెట్లన్న, నింటికి చరమూర్తులేగుదేర
నైదుదినములుంచియనుపుచారుం డెద, మనిన నెన్నండింటికఱుగనీను
నమ్మతించి రేనిసరసాన్నపానముల్, గొనుచునుండుండనియనుచుగొంత
గాలంబుచనెనని జాలయుపేత్తులై, పోవంగఁదలఁచిన బోవనీక

సీ. బలిమిఁ జెరఁబట్టి యప్పటి పగిది వారి, పూజ సల్పుచునుండు ముప్పూటలిట్టు
లతఁడు వ్రతము మాని చరియింపవని జనమ్ములందఱా విధ మారసి యచటన
గీ. సంతతము వీరి యింటికి చనిన యంబి [చట.
కామనోహర భక్తలోకంబులోన
నయ్యలోకకొంద తే మొకో యాగ్రహంబు
వెడలి క్రమ్మరి పోవ రేపిధము దలఁప. 199
గీ. బొమ్మరక్కసి యొక్కటి భూతలమున
శరణతతి క్రమింగ భక్తవేష మని పేరు
తీరుగావించుకొను వారిఁ దినుచునుండఁ
బోలు గాకున్న నిట్టి యద్భుతము గలదె. 200
క. అనిసంశయించు ధరణీ, జనములయనుమాన మెల్లనడలించుటకై
మనసిజసంహారుఁ డపుడ, త్యనుపమసంతోషపూరితాత్ముండగుచున్.
సీ. చలిపోరు వాసికపై మెరయంగట్టి, భసితత్రిపుండ్రంబు నొసలఁ బెట్టి
పృథుసూత్రగతలింగపేటి ప్రక్కకుఁ ద్రిప్పి, చెంగుజారహారంగుచేల గప్పి
నీలిచల్లాడంబు మేలికాసె బిగించి, వాలుము మ్మొనవాలు కేలనుంచి
సన్నపురుదు రాకసరములు మెడఁబూని, గండపెండెర మొక కాలనాని
గీ. వంకిమొలఁ జెక్కి దంతపు పావ లెక్కి
తమ్ములము వేసి మేనగంధంబుఁ బూసి
వితతయావన సౌందర్యవిభ్రమంబు
లలరనొక చరమూర్తియై యద్భుతముగ. 202
గీ. రక్కసి బ్రహ్మనరమందిరమున కప్పు
డరుగు దేకాంచి యతఁడు సాష్టాంగ మెఱఁగి
కలిత రాజవదుపచారకలనఁ బూన్చి
వినయమున నున్న బ్రహ్మయ్యఁ గని యతండు. 203
మ. భళిరా రక్కసి బ్రహ్మ యివ్వసుమతీభాగస్థభక్తావళిం
గలయం జూచితి గాని నీదుపలసత్కారుణ్యగాంభీర్య ని
శ్చలభక్తార్చనశీలదానగుణముల్ చర్చింపలే దెందు నే
డెలమిం జెందె మదీయమానసము నిన్నీక్షింప శైవోత్తమా! 204
ఉ. ఎప్పుడు నిన్నుఁ గూడి చరియింపఁగ వేడుకపుట్టె మాకు నీ

విప్పనికియ్యకొమ్మనిన నెంతయు సంతస మంది దేవ నే
నొప్పితినట్లు మీరిచటనుండుఁడు పల్కినమాటక్రమ్మరం
దప్పినఁ బోవనీయ నని దాని కొడంబడి నిశ్చయార్థమై. 205

గీ. తానతండిచ్చుభూతిహస్తమునఁ బట్టి
యతనినుదుటధరించి నీవనినయట్ల
నిలుతుమనిపల్కి మఱియొక్కనిమిషమునకు
మాకుఁపనియున్నదిఁక పోదుమాయటన్న. 206

చ. గడుసుతనంబొ కోడిగమొ కల్మియొ చూడఁగనీస్వభావమో
గడెగడెకొక్కమాట పలుకందగవే మును నీకు నీవ యి
క్కడ వసియింప భూతిఁగొని క్రమ్మరఁబోయెద నన్న నిన్ను నే
విడుతునె యేల నీభ్రమలు విశ్వము మెచ్చునె బాస దప్పినన్. 207

గీ. ఇటకురానేది పోనేది యింతవింత
గలుగునే లగ్నమపుడె నాగబలిఁయునెడు
సామితనిబద్ధియయ్యె నీజాడఁజూడ
ననిన దరహాసవదనుఁడై యతఁడుపల్కె. 208

ఉ. మాగుణముల్ దలంపఁ బహుమార్గములెన్నఁగనేల నీకు నే
చ్ఛాగతుఁడైనజంగముఁడు స్థావరమై యొకచోటనిల్చునే
సాగిచనంగనీకఁ జెరసాలను నన్నిడఁజూచినాఁడ లో
నాగముఁబుట్టలో నిముడునా యిదె పోయెద నడ్డగింపుమా. 209

చ. అనవు డతండు పల్కె శరణాగ్రణి మీగలెఱుంగనట్టిశా
స్త్రనిగమచోదితంబు లగుధర్మము లెందున నైనఁ గల్గునే
మునుపొనరించునానియమము న్విడి యిచ్చటనుండి నేఁడు నా
తనువునఁబ్రాణముల్గలుగ తర్లగనిత్తునె నిన్ను నావుడున్. 210

ఉ. ధారుణి వేదచోదితఫలంబుల భక్తసపర్యసల్పవా
రారయువారియిష్టమట్టులాగియొనర్చిరి గాని నీక్రియం
గారియఁ బెట్టిబూన్చుటలు గానము బాలిక నీసపర్యయే
తీరునసీడనుండుటకు తీరదుపోయెద నన్న నుగ్రుఁడై. 211

క. పలజిక్కి తెక్కలార్చిన, పులుదెగసిచనంగఁగలదె పొమ్మెటుబోవం
గలవోయని బెట్టిదముగఁ బలికిన [illegible] యదాకృతినై.

ఉ. బెబ్బులినాఁగు నేచెవులబిల్లిలఁబత్రిక వ్రాసిమున్నునీ
యబ్బకు నీకు నేమయిన నిచ్చితి నే చననీకపట్ట నీ
బొబ్బల కేమి పేరు సరిపో నటియించితి కాక తొల్లినీ
రబ్బినఁబోలెజంగములయందరితో నను సాటిచేసితే. 213

ఉ. వచ్చినభక్తకోటి దలవాకిలివెళ్లఁగనీకపట్టి నీ
యిచ్చగ బందినుంచు ఫలమెల్లఁగనంబడఁజేతు నన్ను నీ
విచ్చట నడ్డగించ కిఁక నేటికిచూ చెదు రమ్ము పట్టుమం
చచ్చటబాసిసాఁగనతఁ డడ్డమురానదలించి తెచ్చెదన్. 214

క. మొలసురియదినియఁబోవఁగ
తొలఁగక బ్రహ్మాద్యు యతనిఁద్రోచియటకుపో
గలవో పొమ్మని డగ్గరి
కలయంబడి పట్టిమోది కలకలనగుచున్. 215

ఉ. పట్టినపట్టువీడసన పౌరుషమా యిఁక నెట్లుపట్టెదో
పట్టుము నీవటంచతఁడు వైలగుడు న్మదినేమిదోచక
వ్వట్టునఁజింత నొంది వ్రతపద్ధతిమానుము వచ్చెనిఁక న
న్నెట్టులమెచ్చుశంకరు డిహీయనిభక్తులు నవ్వుకుందురే. 216

క. శీలముదొరగినపిమ్మట, నేలా కాయంబుదీని నెడ సేయుట యే
మేలనిహృదయాబ్జంబున, కాలాంతకునిల్పు గండగత్తెఱ గొనఁగాన్.

ఉ. అంతటిలోన నీశుఁడు దయామతి సన్నిధిచేసి బ్రహ్మ నీ
యంతటి శీలవంతుఁడిఁక నారయుగల్గునె పల్లవించె ము
త్స్వాంతము నేఁడు నీదయిన వాంఛిత మిచ్చెద నన్న నాతఁడ
త్యంతకుతూహలంబున తదంఘ్రిలకుం బ్రణమిల్లి వేడుకన్. 218

చతుర్విధకందము.—

గౌరీశవరఘృణారస, పూరా కామారి శేషభూషణసోమా
వారాశి సుజనసోమా, ధారా హేమాద్రిచాప తారకరామా. 219

వ. అని ఇట్లు సన్నుతించి దేవా భవదీయదర్శనంబుకంటె వాంఛితం
బొం డెద్దియైన నొక్కటి వేడెద మదీయనికేతనస్థానేకభక్తసహి
తంబుగా నన్ను భవత్సదనంబుఁ జేర్పవలయునని విన్నవించిన నట్ల
కాకయని శంకరుం డందఱఁబుష్పకారూఢులంగావించి నిజధామం

బునకుంగొంపోయె నట్లుగావున నిప్పడతియు నారక్కసి బ్రహ్మ య్యవిధంబున నీశ్వరునకు దిరుగంబడి తత్పదంబు గాంచెనని చెప్పిన నచ్చటిభక్తవరులందఱు నత్యాశ్చర్యంబు నొంది, కొందఱసత్తక్కం బెక్కువిధంబులంగొనియాడి నిజనివాసంబులకుం జని రదియునుం గాక. 220

-- శాంతసత్తక్కకథ. --

గీ. సంతతాత్మీయభక్తిని శాంతకుసుమ
మంతమాయాపహరణవిశ్రాంతశర్వ
చింతనామృతపూరితస్వాంతయగుచు
శాంతసత్తక్క వెలయును సంతతంబు. 221

సీ. ఆయింతియొక్కనాఁడాత్మవల్లభునకుఁ,దలయంటినలుగిడిజలకమార్చు
వేళదోసెఁడునీరు వెలిఁజల్ల నాతఁడు, గని యిదియేమినిష్కారణంబ
నీరుఁజల్లితివన నెలఁతుకవినియును, వినవట్లయుండిన విభుఁడుగినిసి
నామాటనీచెవినాటదో గర్వమో,యన నెమ్మొగమ్మునవల్లనల్ల

గీ. చిఱునగవుతొంగలింపనోజీవితేశ
మీమదికిఁదోచియుండియు నాముఖమున
వినఁగవేడుకయైనతద్విధము తాన
మాడుపిమ్మటఁ దెలిపెద ననిన నతఁడు. 222

చ. అటులగునంచు వేజలకమాడి మడుంగులుగట్టి భూమిపె
న్నిటలముఖాంగదేశములనిల్పి శివాత్మమణుల్ ధరించిధూ
ర్జటభజనాంతమందునఁ బ్రసాదముభక్తులతోడఁగూడి యా
దటభుజియించిలేచి ప్రమదం బెసఁగంగసుఖోపవిష్టుఁడై. 223

మ. తనభార్యామణి దగ్గరం బిలిచి కాంతా నీఁగిక్రై నీరుచ
ల్లినవృత్తాంతము దెల్పుమా యనిన వల్లేయంచు గేల్మోడ్చియి
ట్లనుమతోన్దరిశర్వనాత్మవశుఁ జేయన్ యోగసత్తక్కనా
వనితామాళిమహోటవిందపము దుర్వారంబుగాఁ జేయఁగాన్. 224

గీ. తత్తపోగ్ని వెడలి ధరణిగ్రమ్ముచు నిటు
రాఁగఁగాంచిడాసి రాకయుండ
జలముఁజల్లి దాని మలఁగఁజేసితి నన

నింతితోడనాథుఁ డిట్టులనియె. 225

ఉ. ఎక్కడిచెల్లెలేటిశిశుమెక్కడికానన మేటిమంటలే
దిక్కునఁబుట్టెఁగాంచి తెటు తేకువనార్చితి వెట్టివింతయుం
బుక్కిటఁబట్టినావొ ననబోఁడిరొ బొంకులుచాలునన్నఁ బెం
పెక్కినభక్తిశోసనియె నిందునిభానన తాల్మిమీరఁగన్. 226

గీ. ఎచటనోనున్న దాని నీవిటులఁగాంచి
తనఁగ నేటికి భూతలమందు నెందు
తెలియదూర శ్రవణదూరదృష్టులీశ్వ
రార్చకులకబ్బుటరుదె యట్లనిన వినుము. 227

క. శ్రీదసఖపాదభక్తుఁడు, వేదాగమకథితసియమవిశ్రుతుఁడఘవి
చ్ఛేదుఁడు కల్యాణమున, న్మేదర కేతాఖ్యుఁడొక్కమేదరియొప్పన్.

కేతయ్యకథ

ఉ. ఆతఁడు సంతతంబు గగనాంతరసీమల కేగి వేణుసం
పాత మొనర్చి తెచ్చి నిజపత్నియుఁదానుసుజీరివావిచేఁ
జేతికోలందిజల్లెడలుసిబ్బులు చేటలు చూచువారికిం
బ్రీతిజనింపనల్లి పురవీథులనమ్మి తదీయలబ్ధిచేన్. 229

చ. శరణవరేణ్యపూజనలు సల్పుచు దానొకనాఁడు వేకువం
బురహరుపూన్చి కత్తిఁగొని భూరికరుగంటకకోవిదారకే
సరపిచుమంద చూతఘనసారకపిత్థశిరీషశింశుపా
గరుముఖభూజరాజిగలకాననసీమల కేగియుచ్చటన్. 230

చ. అరిమురివంశగుల్మముల నారసియందొక గట్టిబొంగులే
నరుకుచునుండఁగాఁ బ్రమథనాథుఁడు కేతన నెమ్మనంబుదా
నెఱుఁగసువర్ణబీజతతియేర్పడదానిఘటింపఁగాందితో
తెరపిసిపుప్పివుట్టనిది తెంచిన నేమనిరోసియవ్వలన్. 231

క. మఱియొక్కకట్టుకమ్మర, నఱికిననారీతినేకనంబడఁగానే
నెఱుఁగకవచ్చితినిటకని, తెరచోటికిబోయియొక్కపృథుగుల్మమునన్.

చ. చొరబడిమొక్కగట్టిపెనుసోకగనుంగొనివాఁడికత్తిచే
ధరఁబడదానినేయు యసిదంబుకరంబునజారియుర్ల చేఁ
బరఁగినకుంజమధ్యమునభవ్యతవంబొనరించు తాపసిం

భరముగ దాకియొక్కబరిప్రయ్యాగఁజేసిననంతలోపలన్. 233
గీ. హరనమశ్శివాయయనుచు నాతఁడుగూల, కేతఁడదరియతని కేలఁబట్టి
తెచ్చి బైటనుంచి తెగినచందమ్ముఁ బరీ, క్షించిశోకతప్తచిత్తుఁడగుచు.
ఉ. అక్కట యెంతపాపమున కాస్పదమైతి ప్రభాతవేళనే
నిక్కడికేలవచ్చితి మునీశ్వరుఁ డీపొదనుంటగానకే
యొక్కనమైలకృత్యమున మోసముఁజెందితి నెట్లుబాయునీ
మిక్కటమైన హత్యఘన మేచకకంధరయంచు నుండఁగన్. 235
ఉ. అచ్చట కేతనార్యసతి యత్తరి భక్తగణార్చనాలయం
బిచ్చనలంకరింపఁగ మునీశ్వరునార్తరవంబువీనులం
జొచ్చెస్వదేశికప్రవరశుద్ధరవంబెనుపొందుజ్ఞప్తిచే
నెచ్చటిపల్కులైన దన కేర్పడఁదెల్లమియానుసుండుటన్. 236
చ. అటువిని మానిచచ్చుటయు నాతనికై సతిదుఃఖమొందుటల్
పటుమతిగాంచి మందిరకవాటము తాళమువైచి చెచ్చెరం
జటులభుజంగపక్షిమృగశైలముల న్వెరపింతలేక య
క్కటివికి నీలకుంతలయకుంఠితధైర్యము వెంటదోడుగాన్. 237
చ. విపినముఁజొచ్చి యొక్కయెడవిచ్చునజీవితుఁడైన మానికై
విపులవిషాదవేదనల వ్రేగెడునాథునిగాంచిమ్రొక్కినర్
వ్యపగతదుఃఖనై యతఁ డహా యిట కేగతివచ్చి తొంటినీ
విపుడిటరాఁబనేమి మదికెంతయు నద్భుతమయ్యె మానినీ. 238
ఉ. కానుగచెట్లవంటిపలుగాకులు నిన్నొరులెవ్వ రేనియే
మైననుమించనాడిరొగణార్చనకాలముదప్పునంచునో
కానక నేయు నాదయినకర్మముదెల్పిరొ యెవ్వరైనయో
మానినినీదురాక కనుమానముఁజెందెదు మాకుఁదెల్పుమా. 239
చ. అనవుడు కేలుమోడ్చి వినయంబున నిట్లనుమించ మీరలి
ప్పనతిలమందు శోకమున పందురుచుండఁగనిన్నుఁబాసినే
ననుచిత మింటనుంటనని యారయవచ్చితిఁగాని యొండులే
దనినలతాంగి నావయినయాపద నీకెటుదోచెదెల్పుమా. 240
ఉ. నావుడుమీయనుగ్రహము నాయెడగల్గుట మానియాల్గుచో
వావిరిఁబల్కఁగా విని యుఁ వచ్చితి నెమ్మదిగాంచి యిట్లహా

దైవముతప్పఁజూచెనని తాలిమివీడఁగఁబుచ్చి యేమియు
న్భావమునందుఁదోఁచక విపన్నతవచ్చితి నిన్నుఁజూడఁగాన్. 251

వ. అని పల్కిన నిజప్రేయసిదూరశ్రవణజ్ఞానంబుల కత్యాశ్చర్యంబు నొంది సద్గురుకటాక్షపాత్రం బగువిప్రయోషానన బుద్ధివలనమెలంగుట యిహపరసాధనం బని తలంచి యాపెతో నిట్లనియె. 252

చ. కమలదళాక్షి యీయెడలఁగానక నే నొనరించుహత్యయే
క్రమములఁబాయు దైవత ధరాధిపచాపుఁడు మెచ్చునట్లులో
కముసరిదీరు నెప్పగిది గ్రక్కున నొక్కయుపాయమెంచి స
న్విమలునిఁజేయుమీ యనిన నీలపయోధర వేణి యిట్లనున్. 253

గీ. ఇలప్రమాదవశంబున నైనయుహత్య
లైన దేహాంతముఖవిధులందుఁ బాయు
ననుచు నార్యులచేనీవు వినుచునుండి
నన్నడుగనేలయనినఁ గేతన్న యనియె. 254

మ. మునిసంస్తుత్య తపోధనుండగుమహాత్ముంజంపి వేలొక్కతీ
రునదత్పాపనివృత్తిఁ జేసికొన నారూఢంబుగాబుద్ధినూ
ల్కొనదిప్పట్టున నియ్యతిప్రవరుతోఁగూడ న్మదీయాసువుల్
చనఁగాఁజేసెద నెంతగాలమునకుం జాకుండ జీవింతునే. 255

గీ. అనినసతిదృఢనిశ్చయం బాత్మ నెఱిఁగి
సతియతనికన్న మున్నుగాఁ జనఁగవలయు
ననుచు మునిదున్ంచు కత్తిచేఁగొని గళంబు
ద్రుంచికొనఁబోవ నంతలో నంచితముగ. 256

సీ. ఉంచినాఁడేదేవుఁడుర్వీధ రేశ్వరాత్మజనర్ధదేహంబు నందు నెలమి
మించినాడే వేల్పుపంచభూతాదివ్య,చంద్రాత్మమూర్తియైజగములందు
త్రుంచినాఁడేస్వామితో యజాననవర,పరిబలదైతేయపురత్రయంబు
కాంచినాడే దైవమంచితసాద రేఖణమున నాత్మభక్తవరిజంబు

గీ. నించినాఁడేమహాత్ముండు కాంచనోద
రాండ భాండంబులెల్ల గర్భాంతరమున
నట్టిపరమేశ్వరుండు కళ్యాణమూర్తి
యమరమునివేషం కిగొలువ ప్రత్యక్షమయ్యె. 257

క. అరీతినెదుటనిలిచిన, గౌరీశ్వరుమోదమలరఁ గన్గొని కేతం
డారూఢభక్తితత్పద,సారసములకెఱఁగి యిటులసన్నుతి జేసెన్. 258
సీ. ప్రాలేయశైలేంద్రబాలికాధీశాయ,మదనాంతకాయనమశ్శివాయ
శారదనీరదచారుదేహాయ శ,మనహరణాయ నమశ్శివాయ
ద్వాదశాత్మాగ్నిసుధాధామనేత్రాయ,మలవిదూరాయనమశ్శివాయ
గంగాతరంగసంగత జటాభాగాయ,భస్మోళితాంగాయనమశ్శివాయ
గీ. యంబుజాతాసనత్రిదివాది నాథ
ముఖ్యదైతేయవిద్వత్సమూహమకుట
ఘటితకాంచననవరత్నకాంతిపూర
మహితపాదాయ తుభ్యంనమశ్శివాయ. 259
వ. అనియిట్లు సన్నుతించు కేతనార్యుంగనుంగొని మందస్మితాననుండ
గుచు, సర్వేశ్వరుండు భక్తవర మీదృఢభక్తిజ్ఞానంబులకు మెచ్చు
వచ్చె రండని వారినిరువుర పుష్పకారూఢులం గావించి తత్తపస్విం
బునర్జీవితుఁగావించి, యాతనితో వారలనిజధామంబునకుఁ గొని
పోయెం గావున దూరశ్రవణంబునంగలయంగన మహిమంబిట్టి
దింకదూరదృష్టిపదంబు దెల్పెదనని కాంతసత్తక్క నిజనాథునితోని
ట్లనియె. 260

## —॥ నారదబ్రహ్మయ్యకథ. ॥—

సీ. కలఁడొకభక్తుండు కళ్యాణపురమున, నారదబ్రహ్మసమాహ్వయుండు
నలజయంత వసంతనలకూబరాకారుఁ, డతులితశైవరహస్యవేది
సంగీతసాహిత్య సరసకళామూర్తి, సత్యవ్రతుఁడుగణార్చనవినోది
యాతనికాయకంబద్భుతం బెట్లన్న, తనసాయగంబుగన్గొనిసజార
గీ. కామినీతిలకులు రతిఁగలయఁగోరి
పిలిచినసువర్ణటంకమే నెలఁత యొసఁగు
దానితోఁగూడి యస్ఖలితప్రభావ
మునసెవాంఛిత మీడేర్చు మోదమంది. 261
క. ఈసరణిదెచ్చుద్రవ్యము, వానుకియజ్ఞోపవీతభక్తార్చలకై
కాసైననుమరునాటికి, మూసియిడకవ్యయమొనర్చు మోదంబలరన్. 262
వ. అట్లుండి యొక్కనాఁడు

సీ. బొట్టుకస్తురిసీటు పట్టుబల్వాలెవాటు
దొట్టి గంధవుగాటి దొంగలింప
గోరమీసముతీరు నోరవీడవుశారు
నోరుచూపులసౌరు నొరవుదనర
సికతాయతలకాంతి యొకకేలఁబూబంతి
నికటఁనగ(శాంతి సీటుమెఱయ
నగవువెన్నెలజాలు మొగరాలపిడివాలు
సొగసుసొమ్ములడాలు సొలవువెలయ [నుచు
గీ. నేలఁబాడుచు నందందనీలలిడుచు, నంగమెగదిగఁజూచియుప్పొంగికొ
నిందుబింబాస్య లచ్చెరువందికనఁగ, రాజవీథిని నేగె నారసికవరుఁడు.
ఉ. అత్తరినొక్కభర్మ మణిహర్మ్యతలంబునగ్రీడసల్పుచుం
బిత్తరియోర్తు బల్లనికు(ప్రేయసి సౌరణగండ్లవెంట త
చ్చిత్తజసన్నిభుంగనివిచేష్టితయై తమకంబుపర్వము
న్నొత్తిన చెప్పవాల్పక తదేకమతిందలపోసెనాత్మలోన్. 265
ఉ. ఈనవమోహనాంగుఁ డివు డిచ్చటి కెచ్చటనుండివచ్చెనో
సూనశరాసనాబ్జబలసూదనజాతిరసంతయుతృరా
ట్సూనులగేరు నీఘనునిసోయగముంగని దేవతాపురీ
మానినులైన చిత్తములమాటికి నువ్విళులూరరేతగన్. 266
సీ. చికిలిపుల్దిండిరాలకు నుప్పుసికకప్పు
తొగరేనినగనొప్పు మొగముచొప్పు
తియ్యవిల్కానిగదియ నొంపునెదనింపు
జడమెకంబదలింపు నడుముసొంపు
చిందమందముగోరు జీరకంఠముతీరు
తొవలసుమీరుకందోయిసౌరు
యేనికకేల్పసనెలయించు దొడనంచు
తలిరులనొంచు పాదములమించు
గీ. నౌరయీామనోహరాకారరేఖయీా, కాయసౌకుమార్యమీాయొయ్యార
మెందునైనగలదెయితనితోరతికేళి, నెనయుసుదతిభాగ్యమెన్నదరమె.
చ. ఎదుట గన్గొనందడవ యీారసికాగ్రణియందుఁజిక్కి నా

మదియిఁక నెట్టులోర్తు నను మన్ననసాతఁడు గాంచునెట్లు లోఁ
బొదలిన మోహతాపశిఖిపొంగిక నేగతి నారునక్కటా
చెదరనిచింతలంజివుక జేసెగదా విధియేమిసేయుదున్. 268

ఉ. గ్రక్కున నేగియాసొగసుకానికి నావెత లెల్లదెల్పి యీ
చక్కికిదోడితెచ్చి మది సంతసమందఁగఁ గూర్పువారు నా
కిక్కడ నెవ్వరిప్పగిది యిత్తుశరాసనసాయకవ్యథం
జిక్కక యుండుదాననని చేడియచింతమునింగియుండఁగన్. 269

ఉ. ఆతరుణీలలామ సఖియుత్తరినచ్చటి కేగుదెంచి మో
హాతికృశాంగియైన జలజాననఁగన్గొని డాయనేగి యో
భీతకురంగనేత్ర యిటు బెగ్గిలి నెమ్మది లోననింత యే
లాతపియింప నీదగుతలంపెరిగింపుము దాఁచకంతయున్. 270

క. చెప్పిన నెప్పనియేనియు, నిప్పుడుసమకూర్తుచెలిమి కెయ్యెడలను నే
దప్ప మరెవ్వరునమ్మిన, కప్పురగంధులిఁకనీకు కమలదళాక్షీ. 271

చ. అనవుడు దత్సతీతిలక మాత్మముదంబున నొందసిగ్గు పెం
పున దనవాంఛితంబు వెలిఁబుచ్చఁగలేక యొకింతసేపు న
మ్రనవముఖాబ్జయై యితర మానినులచ్చట లేకయుండుటల్
గనుఁగొని యెట్టకేలకు మొగంబొకయించుక యెత్తి యుత్తరిన్. 272

ఉ. నెచ్చెలిఁ జూచిపల్కె దరుణీవినవమ్మ మనోహరాకృతిం
బచ్చనివింటిజోదు గెలువంగల యొక్కవయోవిలాస గు
న్నిచ్చగ రాజవీథి జరియింపఁగ గాంచితి నంతనుండి లో
గచ్చుగనంగఁజొచ్చె దమకంబిఁక నేగతిఁ దాళియుండుదున్. 273

ఉ. ఎక్కడఁబోవ నైపదిఁక యేమియుఁదోఁచక మోహవార్ధిలోఁ
జిక్కిన దానికిట్టితరిఁ జేడియనీవొక తెప్పకై వడిన్
గ్రక్కున గానుపించితివి గావున నాతనిదోడితెచ్చి నా
మక్కువదీర్పుమంచు బతిమాలిన యాసఖి నవ్వి యిట్లనున్. 274

ఉ. ఈతరినీకుగానిగుణ మెట్టిదినెమ్మది సంభవించెఁ బ్ర
ఖ్యాతిగ బొట్టుగట్టువిభుకంటె విటాకృతిఁ జూడగంటికిన్
బ్రీతిపహించెనే మనసునిల్పఁగలేకపరానుకూలవై
పాతకమేలచేసెదవు బంధుజనంబులు విన్న మెత్తురే. 275

ఉ. ఉత్తమమైనవంశమున నుద్భవమందితి వింతదాఁకస
ద్వృత్తియనంగనొప్పితివి యేకతనిత్తరి నన్యపూరుషా
యుత్తమనోంబుజాత వగుటర్హమె నీసరికామినీమణుల్
పొత్తుదహింతురే సుగతిఁబొందఁగనేర్తువె వారిజాననా. 276
ఉ. అత్తగయాళి మామకపటాత్ముఁడు చెంత సపత్నినీపయిం
గుత్తుకబంటిబావప్రతికూలుఁడు నాథుఁడు కోపధారి ని
న్నత్తినతోడికోడలు మహాశని యేమిటనెంచిచూచినం
కత్తులబోనుకాపురము కామినినీతలఁపొప్ప దియ్యెడన్. 277
మ. అనినం జిత్తములోన భీతిలి వయస్యా నీవు నాతోడఁ జె
ప్పినసాంసారికధర్మమంతయునిజంబే కాని నాదేహమా
తనితోఁగూడకనిల్వ దెట్టులయినం దాక్షిణ్యభావంబునం
జనితోఁ డ్తెమ్మిట వానిసత్వరగతిం జాతుర్యమేపాఁగఁగన్. 278
క. వ్యామోహముదీరినతుది, నేమైనను లెస్సయింక నేమియుననకో
కామినిననుబ్రదికింపుము, కాముడుమననీడటంచుకరములుమోడ్చన్.
చ. చెలిగనియింతయేలవగఁ జెందుదులోకముపాడియెంచియే
దెలిపితిఁగాని నీకిటుల దెప్పరమాటకు నేసహింతునే
వెలఁదియనుజ్ఞయిమ్ముచని వేగమతోడ్కొని వానినిప్పుడు
స్థలపెదనన్నమోదమునఁ గౌఁగిటఁజేర్చి లతాంగియత్తరిన్. 280
గీ. వీథిమెలఁగుచున్న విటశిఖామణిఁబ్రవేలి, సన్నజాలకమున సతికిఁజూపి
వానిదెచ్చినాదువనటదీర్పుము వేగ, పడతియనుచుబంపెబంపుటయును.
సీ. ఆయుళికచరత్నహార్మ్యావతీర్ణమై, పురవీథికేగతిఁ బోదుననుచు
ద్వారబంధంబున దిడ్డివాకిటనిలిచి, దైవయోగంబున నవ్విలాసి
యుచటికిరాఁగనియాడఁబోయినతీర్థ, మెదురైనగతియితఁడేగుదెంచె
యిచ్చటకనిచేర నేగిరహస్యసం, గతిఁదదంభోజాక్షి క్రమముదెలుప
గీ. వినియతండాదిబూనినతనవ్రతంబు, దెలిపినసురత్నటంకమే దెచ్చియిత్తు
సంశయింపకరమ్మనిజనములెవ్వ, లెఱుగగారానియొక దారినెలమిమీర.
చ. కొని చని చంద్రకాంతమణికుడ్యసవర్ణకవాటమేఘవా
హనమణికుట్టిమప్రకటితాంబుజరాగనిబద్ధవేదికా
ఘనతరమాక్తిక సబక కాంతివితాననిలింపకామినీ

జననముసాలభంజికలసంగతినొప్పఁడు మేడలోపలన్. 283

చ. శిల్పికళాద్యనిర్మితవిచిత్రతరాస్తరణోపరిప్రభా
నల్పసుగంధబంధురలతాంతము భాసురరత్నకాంచనో
త్కల్పితకాయమానరుచికాంతము నై తగుహంసతూలికా
తల్పమునందు నాతని ముదంబుననుంచి లతాంగియంతటన్. 284

ఉ. నచ్చినకూర్మి పెంపెసఁగ నాయికయున్నెడకేగి లేమ నే
డెచ్చితి తద్వ్రితంబువగిదిం ధనమొప్పి విలాసినావ్రుదుం
బొచ్చెములేనికూర్మిగలపోటిపినీవయటంచుఁ దత్సతి
న్మెచ్చి సరోరుహానన యమేయముదాప్తి నొసంగి యత్తరిన్. 285

చ. నడుముచలింపవేణి జఘనంబుపయిన్నటియింపఁగావిసా
వడరుచిజాళువాజిలుగువన్నియచీరవయింజనింపసాం
పడరినరత్నహారనివహంబు గుచంబుల జౌకళింప న
ప్పడతుకవచ్చెఁ బ్రాణసఖపంపున నారదబ్రహ్మపాలికిన్. 286

క. చనుదెంచిచెలియు చెప్పిన,యనువునబదియారుమాడలాతనియెదుటం
గనకవుపాత్రంబున నుం,చినఁ గైకొని హర్షభరిత చిత్తుండగుచున్.

చ. తరుణికరంబువట్టి సుమతల్పముమీఁదికి చేరఁదీయుచు
న్సరసిజనేత్ర వాకిలిదెసంగనుభావమెఱింగి లేచి స
త్వరమున తన్మణీగృహకవాటము గొళ్లెము వెట్టిమల్లిక
సురుచిరమందహాసమున సుందరిమోమరవాంచి నిల్చినన్. 288

ఉ. కామినిదాసినిండు బిగకౌఁగిటఁబట్టి లతాంతశయ్యపై
ప్రేమదలిర్పఁజేర్చి తమిపెంపునఁ గామునిభంగిఁ దద్విట
గ్రామణికేళి దేలునెడఁ గ్రక్కునదానిసపత్నియొక్కభా
మామణిదెల్పఁ దత్క్రమము మాటుగఁదావిని క్రోధచిత్తయై. 289

చ. ప్రమదమెలర్ప తద్గృహకవాటము డగ్గరచూచి బైటగొ
ళ్లెముదవిలించి యాత్మలవలేశముగొంకక ప్రాణభర్తకీ
క్రమమెఱిఁగించిచూపిశుదుఁగాకనితొల్లిటి క్రోధవృత్తి పెం
పమురగఁగావువెట్టినల నారదబ్రహ్మయ దేవి యంతటన్. 290

చ. తనపతిరాకజాగయున దత్క్రమమంతయు జ్ఞానదృష్టి చేఁ
గనుఁగొని చింతలేక మిహిరాకరమాలి కృపాకటాక్ష మీ

యనువుననుండె శాంభవగణార్చనమానుటగూడ దెట్టు లా
ఘనవ్రతమార్గ మేనిపుడు గైకొని యీదినచర్య దీర్చెదన్. 291
వ. అనివిచారించి. 292
చ. కులుకుటొయారి గబ్బిచనుగుబ్బలపై నరజాదుపైఁటచె
న్నలరెడు జారుకొప్పుగలనాకులు డాపలికేలలీలగా
వలపలికేల మొల్లవిరిబంతివిటాళివశీకరైకదృ
గ్వలనముగల్గినిల్చె దలవాఁకిలిచెంత విటీవిధంబునన్. 293
ఉ. ఆగతినిల్చినంబురజనావళి తత్సతిఁగాంచి యిమ్మహా
భాగయిదేమొకో యితరపద్ధతినేఁడు వహించియుండెఁ దా
నేగతినుండుఁగాక మనకేమిటికీమె గుణంబులెంచ రా
ప్యాగనివాసుఁడే యెఱుఁగునంచుఁ బదానతులొచు నేగఁగాన్. 294
మ. జలజాతాయతనేత్ర భావమరయంజంద్రార్ధకోటీరుఁడ
య్యెడభాస్వద్విటవేషియై యొరవుగా నేతెంచి యొయ్యార మే
ర్పడఁగానిల్చిన దానిగాంచి దరిఁజేరంబోయి యోకాంత యె
క్కడనేగన్గొనలేదు నీవిలసదాకారాభిలీలాగతుల్. 295
చ. అలికులవేణి నిన్ననినయప్పటినుండి మదీయచిత్తమ
గ్గలముగ నిన్నుఁజెందెనదిగావున నిత్తరి నీకు తగ్గరో
వెలయిఁడలేను గాని కలవిత్తముదాఁచక యిత్తుగొమ్ము మా
డలుపదియాఱటన్న మగుడంబలికెౕ నతిసమ్మతాత్మయై. 296
చ. అనఘతరాత్మ నేఁగోనుపదార్థమదంతియకాని యెక్కుఁడా
ధనమునకాసనేయ ప్రమదంబున లోపలికేగుదెంచి చెం
దినభవదీయవాంఛితము దీర్చికొనం దగు సత్వరంబుగా
ననిన దరస్మితాంచితముఖాంకురుహంబున నాఁతిఁ డిట్లనున్. 297
ఉ. ఒక్కెడ మాకుచాలపనియున్నది మే మటపోయి క్రమ్మరం
గ్రక్కున వత్తుమీముదువు గైకొనుమంచు నొనంగఁబోవ మీ
యక్కఱదీర్పుపిమ్మట పదార్థముఁజేకొనఁజెల్లుఁగాక మున్
దక్కెనటంచుఁ బుచ్చికొనధర్మమె యంచు లతాంగివల్కెనన్. 298
ఉ. ఇచ్చిన ముల్లెగైకొనుట కేటికి గొంకెదవిప్పుఁడైన న
న్నచ్చుగనేల పట్టి తుదనైన నొనంగెదువాఁడనేను యే

వెచ్చము క్రిందనైన నివివీడునవిస్మటదెమ్మటన్న నే
నిచ్చునదేమిగాన కొనుమిందునిధానయున్న నిట్లనున్. 299
ఉ. మాయలమాట లేమిటికి మన్నియమంబు వినుండు దెల్పెదం
బాయక యీగతిం దివసనాథుఁడుగ్రుంకిన దాఁకయుండిత
త్కాయకలబ్ధిరాత్రి గణకాండసమర్చ లొనర్చుహారము
త్యాయతనిష్ఠభానుఁడపరాంబుధిఁజేరుచు నుండెఁగాపునన్. 300
గీ. సమ్మతించి తేని యిమ్మల్లెమొసఁగుసీ
కోర్కె యిపుడె తీర్చి కొనఁగవలయు
కాని యెడలధనము గైకొనమాటల
ప్రొద్దుగడపవ్రతము పోవుననిన. 301
ఉ. కామినియట్టెపోయి తిరుగం జనుదెంతు నటన్నమాత్రనీ
నేమముపోవునే తెలియ నేరని దానవుగాన నింతికిం
గాముకుఁడర్ధమిచ్చి తనకార్యముఁదీరిచి కోకపోవఁడిం
కేమిటికింతచేర్చుకొను మిచ్చెదద్రవ్యము వేగవచ్చెదన్. 302
చ. అని బహుభంగుల న్జలరుహాక్షికి నమ్మికపుట్టబల్క యె
య్యననొడపాటొనర్చి పదియాఱువరాల్ సతిచేతికిచ్చి యా
ఘనుఁడటఁబాసిపోయె గలకంఠి యొకింతచుకనేపుచూచియా
తనిపునరాగతక్రమము దప్పిననంతవిచార చిత్తయై. 303
చ. కటకట మోసపోతిదినకాయక మేగతిఁదీర్తుబద్మినీ
విటుఁ డపరాద్రిఁజేరె యలవేడుక కాఁడిట రాకయుండె న
క్కుటిలునిమాట దబ్బరనికోకధనంబవుడేల కొంటినే
డెటువలెఁదొంటికై వడి గణేశ్వరపూజలు చెల్లుదైవమా. 304
ఉ. కాయకలబ్ధికై యతిగి కాంతుఁడుబందిని జిక్కెఁ దత్క్రిమం
బీయెడ నేవహించి దినకృత్యము దీర్తునటంచుఁబూనిన
*మాయవిటుండు ననుమాటల నేభ్రమయించిపోయి రా
డాయె ధనవ్యయంబు కొఱయానెతదీప్సితసిద్ధిగాకమున్. 305
ఉ. ఇంతటికేమి మన్నియమమిద్దివసంబున గానియట్లు గా
స్వాంతము నందుఁదోఁచె నిఁక వంచనయేటికి చింతదక్కదే
హాంత [illegible] నసంతలా

గంతువిరోధి[మోలఁ బొడకట్టెనహో వలదంచుఁ జెచ్చెఱన్. 306
గీ. అటులసన్నిధి నేయఁ దదంబుజాక్షి
విస్మయానందములు మదివెల్లిగొనఁగ
[మొక్కినిల్చిన శర్వుఁడో ముదిత యడుగు
మిత్తునరమనిపల్కినవెలమిమీరి. 307
క. గిరిజేశ మీరొసంగిన, వరముగొనన్నా కుఁదగునె వల్లభుఁడొకవో
వెలవరియుండఁగ నాతని, కరుణంబిలుపించియిందుకామితఫలముల్.
గీ. అనినదరహాసవదనుఁడై యద్రిసంభ
వాధినాయకుఁ డట్లయా ననుచు ననఘు
భావుఁడై నట్టియాదర [బహ్మనాత్మ
ముదముననఁదలంచె నంతకమున్నయచట. 309
సీ. అలధనికునిపిన్నయాలునపత్నికా, పరభవవీక్షణ వాంఛదవిలి
రమణుండు రాజకార్యపుతమి నంతగిపు,రమునకు నరగునరాకయున్న
నెప్పుడువచ్చుదల్పెప్పుడుతీసిచూ,పుదునంచు కోరిక నెదురుచూచు
చుండెనాలో[బ్రహ్మఁడొక్కింత సేపుండి, మగుడరానేరకమాననమున
గీ. [వతముజరుపుటకై వచ్చిబందిపడితి
[పొద్దు[గుంకుచు నున్నదిపోవరాదు
నేఁడుగణపూజసాగ దెన్నిటగణింప
ననుపరిత్యాగనర్హమా ననుచునుండి. 310
క. తనువించుకపరవశమై, కనుదెఱచినయంతలోన కలకంఠుకృపం
దనమందిరమున నిల్చిన, గనితత్కుముదాక్షి మోదకమలధి దేలెన్.
ఉ. అత్తరినాఘనుండు హృదయంబున విస్మయ మావహిల్లయ
త్తైత్తి గణేశ సర్వదిగధీశవృషేశమునీశ యుక్తుఁడౌ
చిత్తజవైరిగాంచి కలఁజెందితినో యదిగాకనిక్కమో
యిత్తెఱఁగౌట కేమికత మియ్యెడనంచుఁ దలంచుచుండఁగన్. 312
ఉ. బాలశశాంక శేఖరుఁడు భక్తవరా యిటురమ్ము నీదుజా
బాలరుహాక్షి నీవచట బందినిజిక్కభవద్వ్రతంబుదా
నాలరిగాఁగనీక వెలయాలివిధంబు వహించె సోయగం
బాలలితామలాంగినమహాయనిమానసమందు మెచ్చఁగన్. 313

చ. అటుల వహించి ద్వారముల కంతట నింతట సంచరించి ని
క్కటకజనంబు లెల్ల నెడగాజనన్నొల్లక పల్లవుండనై
యిటకరుదెంచి బల్మి ముడుపిచ్చెద వచ్చెదనంచు నేగె నం
తటమఱికొంత సేపు గని తన్విశరీరము వీడఁజూడఁగాన్. 314

గీ. అంతలో నేము ప్రత్యక్షమై వరంబు
వేఁడుమనవుడు నిన్నురప్పించిరియొసఁగు
మనియెఁ గావున నిటకు రాఁబనిచినాఁడ
నడుగు వాంఛితమనిన బ్రహ్మయ్యదెలసి. 315

క. ప్రమదమనోపహారుండగు, ప్రమథేశ్వరుదివ్యపాదపద్మంబులకుం
బ్రమదారత్నము తానును,ప్రమదంబున మ్రొక్కి యిటుల బ్రస్తుతిచేసెన్.

సీ. దరసమ దేహామందరధరాధరగేహా,పన్నగభూషయాపన్నపోష
కాండధితూణ ప్రకాండశైశవబాణ, రాజకిరీటఘోరాజఘోట
సురనుతపాత్రబాసురతమోహననేత్ర, నతమునిజాలదీనతతిపాల
కరధృతశూలశ్రీకరపార్వతీలోల, నవకృత్తివాసదానవనిరాస

గీ. వనజమృదుపాదసేవకావనవినోద
కల్పవిధిదీక్షయాశ్రితకల్పవృక్ష
వరభయదవేష ఘనదయాపరమసీవ
కాలముఖశాస్త్రశాతకంకాళహస్త. 317

చ. అనియిటుసన్నుతించి ప్రమథాధిపతావకమూర్తి దర్శనం
బొనరుటకంటె వేరెమఱియున్నదె వాంఛితమైన వేడద
న్ననురతిగూడినట్టిలలనావళితోడుతనన్ను నీపదం
బునదయఁజేర్చ వేయనిన భోగివిభీషణుఁ డాదరంబునన్. 318

గీ. అట్లయాగాక యనుచు బ్రహ్మయ్యనతని
కామినీమణినాతనిఁ గలసినట్టి
మందయానలఁ బుష్పవిమానపంక్తి
గూర్చిగొనిపోయెఁ గైలాసకుధరమునకు. 319

వ. అంతతద్దనికాంగనయు బ్రహ్మయ్యసాంగత్యవిశేషంబున తేజో
మయుస్వరూపమై కైలాసంబున కేగుచు నాస్థానంబున నున్న నిజ
నాథునకు తనమోక్షపదప్రాప్తివిధంబెఱింగించి యతండు చూడ

నంతర్ధానంబు నొందిన నచ్చెరువంది వేగంబ యభ్యంతరమందిరం బునకుం జనినయాతనిపిన్నయాలెదురువచ్చి నవతినేరంబెంచుచు నత నింగొనిచని యదెచూడుమని తెలుపుగొళ్లెంబుదీయ తద్గృహంబు శూన్యంబైయున్న యాసుదతి లజ్జనొందియుండె నతండొక్కింత సేవు చింతాక్రాంతుఁడై నిజసతీలలామభాగ్యంబగ్గించుచు దనవారిక త్తెఱంగు నెఱింగింపుచు నంజలినూనియెప్పటియట్ల వర్తిల్లె గావున దూరదృష్టిగలసతీవతంసంబు మాహాత్మ్యఁబట్టిదని నిజనాథునితోఁ గ్రమ్మర దద్వృత్తాంతంబుసత్వరంబుగాఁ జెప్పందలంచి శాంతసత్త క్క యిట్లనియె. 320

ఉ. అత్తరినచ్చటం గలగణాధిపులెల్లను విస్మయాత్ములై
యిత్తెఱఁ గెందునుంగలదె యింతియుభర్తయు నేకచిత్తులై
బత్తియొనర్చి రంచు బహుభంగుల సన్నుతిసేయు నందులో
నుత్తముఁడొక్కరుండనియె సూక్తిసుధారస ముప్పతిల్లఁగన్. 321

సీ. శ్రీకాళహస్తిపురిస్థలి నైనరుం,డననొక్కభక్తుఁడంగనయుఁదాను
నయ్యలేమడిగిన నడుగిడకిచ్చుచు, నుండంగవారల యుల్లమలర
కట్టుబట్టయుతప్ప గడులేమిఁబుట్టించి, శర్వుఁడుభక్తుఁడై చలినివచ్చి
బట్టవేఁడినవాని పడతికట్టినదియ్య, కొనఁగనేగిన నొంటికోకతనకు
గీ. చాలదంచేఁగెనోయని నైనరాఖ్యుఁ
డాత్మవస్త్రమొసంగఁ బోనంతలోన
నచటపరిత్యక్తుమై తన్మహాత్ముఁడెలమి
వారిఁగొనిపోయె నాత్మనివాసమునకు. 322

ఘ్రాణదబ్రహ్మయ్యకథ.

వ. మఱియును. 323

గీ. ఘ్రాణదబ్రహ్మయాఖ్యుఁడుగలఁడొకండు
జంగమారాధనవినోదిసత్యవాది
యఖిలవేదాంతవేదినిత్యాను మోది
యమృతసంపాదిపరిజనితాస్యవాది. 324

ఉ. బాణవిరోధిబాణ పదభక్తుఁడతండు మహిష్ఠభక్తిక
ళ్యాణమునన్యసించి యనయంబును గాలము గోలజాలెయుం

పాణితలంబు నందిడి ప్రభాతమునందుగభీరవాహినీ
వేణుల నేగి యందు మదివేడుక మీాములబట్టివానిలోన్. 325

గీ. తొలుతదగులు చేప తుహినాంశుధరునకు
నవలదగులుమీానమద్రినుతకు
మఱియుఁదగులునట్టిమత్స్యంబు గురునికై
తలగవిడచి పిదపఁదగులువాని. 326

ఉ. బుంగనమర్చి తెచ్చి మదిపొంగగ వేగమ తత్క్రియార్హమా
నంగడివీథిలోన నవియన్నియునమ్మి తదీయలబ్ధిచే
జంగమకోటి కర్చనలుసల్పుచు నుండెను నొక్కనాఁడు హృ
త్సంగతహర్షమై యతనితామరసాయతనేత్రి నమ్రతన్. 327

చ. వరునకుమ్రొక్కి యిట్లనియె వల్లభ శ్రీబసవప్రధానుమం
దిరమున నేఁడు నాఁడనక తృప్తి గలఁడయుదొంబదారు వే
ల్వరణులు పద్రసాన్నము మెసంగుసురాగణకోటి నొక్కనాఁ
డరయగమద్గృహంబున శివార్చన సేయ నదేమిదెల్పుమా. 328

ఉ. పొందుగవారిఁబిల్చుటకు బుద్ధిజనింపదొ శక్తిచాలదో
యెందుల కేగకుండ బసవేశ్వరునందఱ నడ్డగించెనో
యిందుల కేలరారు మదికెంతియుఁగోరికపుట్టె నిప్పుడా
నందముగా తదీయభజనంబొనరింపఁగ నన్నబ్రీతుఁడై. 329

మ. బాలా నీకిటువంటివాంఛితము లోఁబాటిల్లెమేలయ్యె నే
నేలీలంజని మ్రొక్కి వేఁడికొని నీయిష్టంబుచేకూరత
త్ఫాలాక్షాంఘ్రిసరోజభక్తితిలకవ్రాతంబు దోడ్తెచ్చెనేఁ
జేలింగార్చన నల్పఁజేయుదుజుమీా డెందంబునందింపఁగన్. 330

క. అనిపలికియతిరయమ్మునఁ, బనివినియాశరణవరుఁడు బసవేశనికే
తనమునకొయ్యనఁజనియట, ననుభవమంటపమునందునద్భుతలీలన్.

సీ. ఘనపురాతనభక్తగణకాద్యులగువారు
శీలమార్గవిమర్శ సేయువారు
కర్మఫలత్యాగధర్మమెన్నెడువారు
నపవర్గమిట్టిది యనెడువారు
శైవాగమ[illegible]

వేదాంతసూక్తుల వెల్లయువారు
మంత్రమంత్రార్థముల్మహిమఁ జెప్పెడువారు
త్రివిధార్చనోన్నతిఁ దెలుపువారు
గీ. నగుచు నొడ్డోలగంబున్న యబ్జమౌళి
భక్తతతిఁ జేరి సాష్టాంగవందనంబు
సలిపి వీడ్యంబు భూతితత్సన్నిధాన
మందునిడి భక్తిదొలుక బ్రహ్మయ్య యనియె. 332
చ. సదమలచిత్తులార తమసన్నిధి నేనొకవిన్నపంబు చే
సెద దయ చిత్తమందునిచి సేవకుసింట శివార్చనంబు మే
ల్గదురనొనర్పఁగా వలయుఁ గన్నడ సేయక మీరలన్న నె
మ్మదివెఱగంది వారనిరి మంద దరస్మితవక్త్రపద్ములై. 333
ఉ. ఎన్నడు నిన్నెఱుంగము నిఁకెక్కడ నెయ్యది పేరు లింగసం
పన్నుఁడనం బ్రసిద్ధిగను బండరికేగెదుఁ గాక భూమిపై
నెన్నఁగ వేఱొకండు గలడే మము నందఱిఁ బిల్చి పెట్టనీ
వన్నసదుక్తికిట్టులన నాయితుగాదన నాతఁ డిట్లనున్. 334
గీ. ఘనగుణాఢ్యులార ఘూర్ణదబ్రహ్మయ్య
నాఁగ మిప్పురంబునన వసింతు
మీకృపాసమృద్ధి నేనొఱంతయుగల్గ
దరుగుదెండు సంశయంబుమాని. 335
చ. అనవిని సమ్మతించి శరణావళిభూతి గ్రహింపఁ బొందియ
య్యనఘుఁడు వేగ నేగి ప్రియకాంతయుఁ దప్పక చెప్పి తోంటిలం
గునఁ దనకాయకంబుకొఱకుం జని చాల్గలుంగ మీరలఁ గై
కొని చనిరొక్క వీథి వెలకుందగ నమ్ముచు నున్న యత్తరిన్. 336
క. ఒకభక్తుఁడు గని చనిగణ, నికరమునకు తద్విధంబు నిజముగఁ దెలుపక
నిక్కమొ మృష యో యని వే, ఱొకనిననుపనేగియాతఁడుల్లం బెరియన్.
చ. కనుగొని వేగవచ్చి గణకాండముగన్గొని స్వాములార నే
బనివిని గాంచి వచ్చితలవాఁడొకయంగడి హేయమెంచక
మ్మనమున నొక్కమీనమిడి మూగినయాగలఁ జేతి రెమ్మబో
జనువుచు దీనినొండు వెలకమ్ముచు నమ్ముచు నున్నవాఁడనన్. 338

మ. వినివాఁడందఱు మోసపుచ్చెనిఁక నే వెంటంజనన్వచ్చునే
మనివైసారిణవాసవాన్వితకుటీరాన్నంబు నేనెట్లు గై
కొనవచ్చున్ ససిదప్పెనీదినము కక్కూర్తింబడం జెల్లది
ప్పనికై యూతఁడురా వెసంగదిమినంపం జెల్లునంచా ఘనుల్. 339
క. ఒక్కమతినున్న బ్రహ్మం, డక్కడమీలమ్మి తెచ్చునర్థముచేఁ బెం
పెక్కుమతిబాకయత్నం, బక్కజముగఁ జేయఁ బనిచెనక్షయలీలన్.
వ. తదనంతరం బాయతండు. 341
చ. అరిగిగణాళిఁ గాంచి శరణార్థి శివార్చన వేళయయ్యె స
త్వరముగ రండు మీరలిటతద్గుణపుంజములోన ధూర్త లా
శరణులు కొంద ఱౌర యొకసక్కెములాడఁగ వచ్చి నాఁడపో
విరసులగాఁగ నెంచితివె వీరలనందఱ నీమనంబునన్. 342
చ. అనఘసుగంధబంధురములై చెలువొందెడు షడ్రసాన్నముల్
బసవనియింట నిత్యమునపారముగా భుజియింపుచుండు నీ
కుసుమశరారిభక్తులను గూరిచిపెట్టఁదలంచి నాఁడపో
మసలిడిమత్స్యమాంసమనుమానము లేక భవద్గృహంబునన్. 343
ఉ. ఇచ్చటనుండఁగూడదిఁక నేగుమునీవనసాములార మీ
యిచ్చకొలందిచేకుఱెడు హీనపువస్తువులేలయన్నన
న్మచ్చికగాంచిరమ్మనెడు మాత్రనెపైఁబడి మొత్తితోలఁచిన
న్మ్రచ్చమునింగవచ్చి తనముద్దియకంతయుఁ జెప్పెఁ జెప్పినన్. 344
చ. తనమదిలోనకొంతవడి తామరసేక్షణ చింతనొంది యే
జనివినయంబునన్ శరణసంతతికిం బ్రణమిల్లి వేగదో
డ్కొనియిటువత్తునంచు గణకూటముఁ జేరఁగ నేగి మ్రొక్కి యో
యనఘతరాత్ములార పదరయ్య శివార్చన వేళమించెడిన్. 345
మ. అనినన్ మీగృహసీమభోజనము సేయన్ సమ్మతింజెందరీ
యనఘాత్ముల్ చనుమింకనిప్పలుకు మా రాడంగ నూహించితే
ని నిజాధీశునకాపరాభవము తన్వీనిన్నుఁ జెందుంజుమీ
యనఖన్నాననయై వెసంజని యెనాత్మావాసముం దేరఁగన్. 346
మ. చని పాణీశ్వరుతోడ తద్గతి సవిస్తారంబుగాఁ దెల్పి యో
యనఘాత్మా శరణాళికె సలుపు నీయత్నంబ యోవ్యర్థమై

చనునట్లుండెనిఁ కేమియాళ్వరకటాక్షంబెట్లుగానున్నదో
యనియాతండును దానునెంతయును చింతాక్రాంతులై రచ్చటన్.

గీ. అంతవృత్తాంతమును ఫణిహారివలన
వినియమాత్రాగ్నిగణ్యుండు విస్మితాంత
రంగుఁడై వేగగణనికరంబుదరియ
నరిగిసాష్టాంగమెరగి యిట్లనియె యిపుడు. 348

సీ. ఘనులారయూర కేఘాణిదబ్రహ్మయ్య, గారిగారియఁబెట్టఁగార్యమేమి
హింసాపరుండనియెంచితి రేని జో,మ్మయ్యాదిభక్తులఖ్యాతివినరె
యతినీచకాయకంబనిగణించితి రేని, యిదిభర్తకాయకంబదియెకాదె
కులమెముఖ్యంబనితలఁచితి రేని క,క్కయ్యమున్నగుళరణాళిగనరె

గీ. కర్దమమునతమ్మి కాష్ఠంబులోనగ్ని
వలలమందుపాలు శిలలపసిడి
గలిగివెలుగునట్లు ఘనులెట్టులుండిరి
కొఱఁతగనమిమీర లెఱుఁగరయ్య. 349

మ. జడధివారిపరీతభూతలమునన్ సాక్షాన్మృగవ్యాధరు
ద్రుఁడుగాఁడేఘనుఁడామహాత్ముఁడననిందోపింపఁగాఁబాడియే
మృడుభక్తావళిభూతియందిడుటబల్మేలందురే కావునన్
గడువేడ్కంజనియారగింపవలయుం గాకన్నవారందఱున్. 350

ఉ. దిగ్గనలేచియాబసవధీమణికీసమదిఁదోచుమార్గమే
మొగ్గగుగానపోదమని ముందఱచారునిఁ బంపవారలం
డగ్గరఁజేరియాతఁడెడపట్ల ధరజాగిలిమ్రొక్కఁగాంచివే
యగ్గలమైనప్రేమదొలుకాడఁగలేవఁగనెత్తియిద్దఱున్. 351

క. ఓయయ్యయేమివచ్చితి, వీయెడకనియడుగనాతఁడిదెబసవనితో
మీయాలయమునమాధవ, సాయకభక్తాళిగుడుప జనుదెంచెననన్.

చ. అమృతముపీనులంజిలుకునట్లుగదద్వచనానుభూతిమో
దముమదిఁబొంగిపర్వవిని తండ్రిదయాపరమూర్తిశోకవా
ర్ధిమునిఁగియున్నమాకడకు తెప్పవిధంబునవచ్చినాఁడవిం
కమరుతుమయ్యయుమ్మదుపకారమటంచనుతించుచుండఁగన్. 353

చ. గొడుగులునాలవట్టములుగుం జెలుఁజామర తాళవృంతముల్

పడగలుశోభిలంగ పదపాయుఁడ హాయోనికంచుసువర్ణజం
బెడనెడనెచ్చరింప బసవేశపురస్సరులై ముదంబునం
బుడమిచలింపవచ్చెగణపుంజముతద్గృహసీమకత్తరిన్. 354
సీ. ఎదురేగిముదమునముదితయుదానుసాష్టాంగంబుచేసిపాద్యాదులిచ్చి
తోడ్తెచ్చినిర్మథితోయఃసజ్జనములు, గావించిమడుఁగులుగట్టనిచ్చి
వరుసదీర్చినరంగవల్లులవెంబడి, బంతులుసాగించిపత్రపుష్ప [సంత
గంధాక్షతాదిలింగసమర్చనద్రవ్య, ములుగూర్చితత్క్రియల్ జరుపు
గీ. భానురాచ్ఛిద్రకదలికాపత్రభాజ
నములుమెల్లనప్రక్షాళనంబొనర్చి
తానెకొనివచ్చి వారికందఱికివైచి
స్వర్ణరచితపుభక్ష్యకముల్ సరసనునిచె. 355
క. అంతటతద్గజగామిని, సంతోషమెలర్పభక్తసంఘంబునకుం
స్వాంతములువల్లవింపఁగ, వింతగవడ్డింపఁదొడరె విభునాజ్ఞమెయిన్.
చ. కలమపువంటకంబిగురుగాయలు గూరలుగందిపప్పుద
ప్పళములుచారురావయిడు పచ్చడులామ్రిరసంబు దేనెయ
ప్పళములుబొల్లుమూలములుఁ బాయసముల్ ఫులఖండమూరుగా
యలువరుగుల్ ఫలంబులొడియంబులుగమ్మనినెయ్యివెన్నయున్.
గీ. గారెలరిసెలు బొబ్బట్లుగరిజెకాయ
లట్లుబూరెలుజంతికెచుట్లుమణుగు
బూలువెన్నప్పములు జటుబూరెలిడ్డె
నలుమనోహరములువంటచలిమిడియును. 358
గీ. పరఁగనమృతంబుతో సరిపాలు పాలు
పేర్మిమంచుననిరసించు పెరుఁగు పెరుఁగు
చాలవెన్నెలరుచివెదచల్లు చల్ల
మేటిరుచిజాలములలోని తేటతేట. 359
క. ఎవ్వారికెవ్విధియిష్టం, బవ్విధివడ్డింపశివుని కర్పించిరుచుల్ 360
నివ్వటిల భక్తులందఱు, నవ్వుచునారోగిఁణంబొనర్చిరితమిచేన్.
గీ. అంతగర్పూరతాంబూలమర్పణంబు
చేసి ... డనంద తాసీనుఁడైన

యవసరంబున నెదుట బ్రహ్మయ్య కేలు
మొగిచి నిలిచినబసవండు ముదమెలర్ప. 361

చ. అతనిప్రభావమెల్ల శరణావళికింగనుపింపఁబూని యో
యతులగుణాఢ్య నీవహరహంబొనరించెడు వేటయెట్టిదో
కుతుకముతోఁగనుంగొనఁగ కోరిరిభక్తులుగాన సిరియా
ప్పిత మొనఁగూర్పుమా యనిన వేగమ బ్రహ్మయ సంతసంబునన్. 362

మ. సకలాశ్చర్యవరభక్తకోటికడుమెచ్చంజెంతతన్మజ్జనో
దకకుండాంతికమందునిల్పికరయుగ్దండంబునం జుట్టుజా
రెకబంధారకమందునిల్పితివసర్ణ లేఖాళిబ్రహ్మాచ్యుతేం
ద్రకకుప్పాలకరుద్రగోపగిరిజాతాశర్వమూర్తుల్వడిన్. 363

క. అమ్మెననొక్కకపరి గా,లమ్మునరాశశణులది చెలంగుచుచనిచి
త్తమ్ములగడువిస్మయమో,దమ్ములు బెనఁగొనఁగ లేచిధరణిరథునకున్.

క. సాష్టాంగమెరగి శంకర, దుష్టగజాసురవిదూరతోయోద్భవనే
త్రేష్టఫణినాయకాంగద, యష్టాపదశైలచాపహరిత్రిపురారీ. 365

చ. అనివినుతించుచున్న సమయంబున ధూర్జటిబ్రహ్మచర్యుఁడ
వ్వనరుహనేత్రగాంచి చెలువంబగుతావకభక్తికాత్మమె
చ్చొనరపదండుపోదమని యుజ్జ్వలపుష్పవిమానమెక్కఁగా
బనిచినిజాలయంబులకు వారలఁదోడ్కొనిపోయె నత్తరిన్. 366

చ. బసవఁడుమున్నుగాఁగలుగుభక్తులుహాయిటు లెన్నఁడెవ్వర
వ్వసుమతిగానలేదితఁడు పట్టినకాయకమెంతయివ్వడీ
యసదృశజంగమార్చన మహామహిమంబది యెంత బాపురే
ప్రసవశరారిమెచ్చుగను భక్తుఁడితండెముదిందలంచఁగాన్. 367

క. అనియిటు తద్దంపతులును, గొనియాడుచుభోజనమునకున్మెచ్చుచుభ
క్తనికాయమునైజనికే, తనములకుంజనియె మంత్రితనయులు చేరన్.

వ. అనిచెప్పి యాజంగమవర్యుండింతియెదుటనున్న వారలెల్ల నేక మన
స్కులై యావత్సమయంబుననైనను భక్తివదలక నీశ్వరుకరుణవడ
సినశరణులురు గలరు తత్క్రమం బెట్టిదనిన వినుండని ఇట్లనియె.

ఉ. శంకరపాదభక్తుఁ డఘశాసనుఁడాంతరవైరివర్గనా
శంకరుఁడార్యసన్నుతుఁడు శాశ్వతకీర్తియుతుండు ఖండితా

హంకరణుండుపావకగుణాఢ్యుఁడు మారట శంభుమూర్తిని
శ్శంకసమాహ్వయుండు గణసత్తముఁడొప్పు ధరాతలంబునన్. 370

-:- మారటశంభుమూర్తియను నిశ్శంకునికథ. -:-

ఉ. అతఁడుగురూపదేశమున హాలికుఁడౌచు తదీయలబ్ధి చే
నతతముజంగమార్చనము సల్పుచునుండఁగ నొక్కనాఁడు త
న్మతిఁబరికింపశర్వుఁడు కుమారుఁడు నాతఁడు చేయుచున్నఁగా
ధృతిగతినొక్కఘోరవిషకృష్ణభుజంగముఁ బంపెనంపినన్. 371

శా. తత్కుంభీనసమాత్మ దంతగరళోద్యత్పావకజ్వాలికా
ఫూత్కారంబులువర్వనాతనిసుతుల్ బాల్వారమూర్చిల్లన్నచో
హృత్కంపంబున బొందడత్తులజలం బేతేరసీవిష్వఁ డా
పత్కాలంబరుదెంచె నంచు వడిఁజెప్పంజేరి కించిద్వ్యథన్. 372

క. జననీజనకులఁదలఁపఁడు, వనితానుణిసదువడాప్తవర్గముఁబిలువం
డనుమానపడఁడుమాంత్రిక,జనముంబేర్కొనఁడుకాలుజాడింపఁడొగిన్.

క. చెడుపురువని నెమ్మదిలో, దడవఁడునిజకాయకంబు దప్పఁడుపెదవుల్
దడపఁడుదైవముదూరఁడు,బుడుతనిధైర్యముగణింపఁబోలునెజగతిన్.

క. అటులుండఁగొంతవడిక, కుటిలోరగవిషము రోమకూపంబులమి
క్కుటమైపర్వుచుదలకె,కుటయుంగతజీవుఁడగుచుఁగూలెన్నేలన్.

క. అకరణిఁబడినసుతుఁగని, యొక్కింతయువగవకాతఁ డూరకవానిం
గ్రక్కునసీడిచితనదగు, దుక్కిపనుల్ సేయుచున్న ధూర్జటియంతన్.

గీ. అప్పటప్పటికప్పరికరిగిభిక్ష, గొనుచుదమునందరినిమున్నుగురుతెఱుం
గు, శరణుకై వడినొక్క వేషంబుదాల్చి, యలసితనచేనిచెంగటనిలచి [యున్న.

గీ. జంగమాకృతిగాంచి నిశ్శంకుఁడేరు
నిలిపివందనమొనరింప నిటలమందు
భూతిధరియించియోపుణ్యపురుషయింత
వంటకముపెట్టుమాఁకొన్నవారమనిన. 378

చ. గరళగళాభయొక్క ఘటికాద్వయమీాడ నిలుండు తెత్తురో
గిరములుమీాకు యోగ్యముగఁ గీల్కొనునాఁకట నంతదాఁకనో
ర్వరయితికేనిమామకనివాసముఁజేరి భుజింపుఁడేనన
త్వరమునవత్తునాని యటువచ్చెననచ్చట గాయకంబునన్. 379

చ. ఇదియనుమీవిధించుపని యే యటుగావున పాండువేగమ
ల్లదె తెరువన్నమల్లి శరణాగ్రణిపోవఁగ చెంతగాలఁబెఁ
గుదిగొను కాలసర్పమునఁ గూలినయర్భకు గాంచిబిట్టు గా
నదరిపడంకుచుందిరిగి యత్తులు మూయుచు భీతుకైవడిన్. 380

క. తనపైఁబడనిశ్శంకుఁడు, వెనుచేతులఁజఱచి యింతవెఱవఁగ నోహో
యననాతఁడిట్టులను మీా, తనయుండట్లనికికనలె తలకవు మదిలోన్.

సీ. పాపనివధియించెఁ బాఁపవుపురువని, దానిఁజంపవదేమి దలఁచినావు
పరులయాపదకైనబరితపింతురుబుధు,ల్గొడుకునికడమీదువుడమిగలదె
యింతనిర్మోహిని యెందుఁజూడఁగలేదు, నీయంతకఠినుని నిన్నెకాని
పుత్రలాభంబెంత పుణ్యవంతునకబ్బు,గతిఁజేర్ప నేరిక సుతుఁడుకాఁడె

గీ. యనిన నిశ్శంకుఁడనియె ఋణానుబంధ
మునను సమకూడుమరుసతి కెనయముఖ్యు
లవనినదిదీరఁబోవుదు రంతమంత్ర
మునకు వగఁజెందనేటికో యనఘమూర్తి. 382

గీ. పాండుసుతుఁడర్జునుండంత పరితపించి
మరల దేనోపెనే యభిమన్యుఁదొల్లి
యెచటితలిదండ్రు లయ్యెరో యెచటిసుతులు
చిక్కనేమాయనీపద సేవకుండు. 383

సీ. అనినమృషాజంగమార్యుండుగినిసినీ, విపరీతవైరాగ్య మిపుడుమాని
భక్తులకెఱిగింపుఁ బతికింతురీతని, నెట్లన్ననొక్కమహీతలేశుఁ
బెలిదేవివేమయ్య ప్రీతిచేఁబ్రదికించె, మునుపిల్లనైనారుమనిచెవెలస
నటుగాన వేగ భక్తాళికీగతిఁదెల్పు, పద నీకు నేజతవత్తుఁగాని

గీ. యనిన నిశ్శంకుఁడనియె నోయయ్యసకల
మెఱిఁగియుండియుమీారిటు లేలపల్క
జిక్కమాదన్నయాళ్వారుఁ జెందువిధము
దెలిపెనాభక్తులకు వాని తీఁగఁబోణి. 384

క. కావుననవిత్యతనువుల, కేవగఁజెందంగఁజెల్లునే యన మది త
ద్దేవుండచ్చెరువందుచు, నావలికరుగంగ వానియన్నయును మునన్.

క. కనుపించినవానికిత, మ్మునిగతివినుపింపనవ్వు మోమున యనెనో

యనఘాత్మమీరలెఱుఁగని, ఘనతరసద్భక్తిపథము గలదేజగతిన్.

శా. సాయంకాలమునందు పక్షులు ధరాజాతంబునందన్నియుం
దోయంబై వసియించి వేగవిడియం డుంబోవ కొండొంటితో
బాయంజాలకనిల్చునే యటులనో భవ్యాత్మ యీసోదర
న్యాయంబిట్టిద వానికై వగవఁగా నర్హంబె సాకీర్తజిన్. 387

చ. అనవుడునీవపోజగతి నందఱికంటెవిరాగి వెన్నము
న్ని నకులుఁడైనరామధరణీశుఁడు తమ్మునిపాటుఁగాంచి లో
గనివగనౌషధావళులఁ గ్రమ్మఱజీవమునిల్పి కొంటితో
చనిపనిచేసెనో యెఱుకచాలదొ యాతని కివ్విధంబునన్. 388

గీ. భక్తివిజ్ఞానములుగల్గు ఫలముభ్రాతృ
మోహమెడబాయుటయె చాలుగూహకంబు
లెన్నిజన్మములకుఁ గల్గుసిట్టితమ్ము
డక్కటా యెంతకఠినుఁడవయ్య నీవు. 389

వ. అనిన నతం డి ట్లనియె. 390

గీ. చనిన దేశికవరకరస్థలిజనకుఁడు
జంగమముదాదిసద్భక్తి సాగమూర్తి
సోదరుఁడపత్యమగుశీల మొనరుముక్తి
తరుణియటుగాక వేఱబాంధవులుగలరె. 391

క. అనవుడునాటనిమదిమె, త్తనగానకయవలఁజనుచు దర్వీకరద [న్.
ష్టునివడిగాంచియుతద్గతి, వినుపించిననిటులఁ బల్కె వెలఁదియతనితో

గీ. సంతకొకచోటఁగూడినజనులువచ్చు,పనులుదీరినతుదవిడిచనరెమగుడ
వగచిరేయొకరొక్కరువారలట్ల, కాదెయీబంధకంబనిగడచిచనఁగ.

ఉ. అచ్చెరువందిశూలిచను చవ్వలనాతనిభార్యగాంచి యా
ముచ్చటలెల్లఁదెల్ప విని మోహమున దీనత లేకపల్కెనో
సచ్చరితాగ్రగణ్యజనసంతతిధారుణియందుఁ బుట్టుటల్
చచ్చుటలబ్బురంబె సువిచారులుమెచ్చనిమాటలేటికిన్. 394

చ. అతులనదీప్రవాహమున నాడదియాడది రెండుకాష్ఠముల్
జతవడికొంతదవ్వరిగి లంకకటాలు నడ్డమైనయా
జతవిడి యొక్కటేగునటుసాగరమొక్కటి నిల్చుగావున

న్వత కుడువంగనేల ననువీడె నతం డని నెమ్మనంబునన్. 395

క. నావుడుఁగుహానాళరణుం, డావెలఁదుకతోడ ననియె నబలాధరనీ
భావంబువంటికతినవు,భావం బెఱ్యేడలఁగానఁ బడదెటులన్నన్. 396

క. పెనిమిటికర్ధాంగం బగు, పనజేక్షణ యనెడునుడిలవంబునునీయం
దునఁగానమర్ధదేహం, గనినుంజెందంగనెట్లు గాంచంగలవో. 397

మ. పతిదైవంబు గురుండు ప్రాణమనుచుం భావంబులో నిల్పి యం
చితభక్తిం జరియించి యాతఁడు మృతింజెందఁగఁ గేహార్ధమా
తృతనూజస్మపితృప్రియాప్రముఖులం దేభ్రాంతియుఁ లేక యా
ర్జితబుద్ధిఁ సహాయానకాసతులు నర్చింపంగ నజ్ఞానులే. 398

చ. అన విని యాలతాంగి వినయంబున నిట్లను దేవనాథుతో
ననుగమనంబు చేడియల కర్హమె కాని తలంప వీరశై
వనికరమార్గమందదిధ్రువంబుగఁజెల్లదు మీరెఱుంగరే
యనుపమ వేదశాస్త్రనివహంబులఁ దెల్పెడురీతులన్నియున్. 399

క. కావున తనలింగంబే, దైవంబు గురుండు తల్లి దండ్రియుఁ బతియుం
జీవంబు గతియు మఱియును, భావింపఁగ వేఱెకలదె భక్తాధీనా. 400

చ. అనవుడు నేమియుంబలుక కవ్వలనేగి తదీయమాతతో
తనయునివార్తఁదెల్ప వనితామణి నెమ్మదిఁ గొంకులేక యి
ట్లనెను సమస్తయోనిజవరాగతనీచఘటాలిభిన్నమై
చనుటయెకాక నిల్చునె రసాస్థలినోబుధవర్య తెల్పుమా. 401

క. తనయుండనతల్లియనఁ, ఘననాట్యవుఁబొమ్మలింతె కాకసతములో
ధనదాప్తుమాయజివురం, టినఁబడుదురుజనులుకడువడి నిపత్తిగతిన్.

క. అనియుమ్మృషాశరణుఁడవో, వనితాతిలకంబ సర్వ వసుధాస్థలినే
గనుగొంటిగాన నీతో, నెనయుదు కఠినాత్మఁ జూడ నెచ్చటనైనన్.

గీ. తల్లిఁబోలినదైవంబుదయితసాటిఁ
బంధువాత్మజమోహంబువంటి మోహ
మవని లేదని యనఁగ నీవట్టితనయుఁ
డట్టులై యున్నకన్నుల నైనఁగనవు. 404

ఉ. ఆమయదేహి వెట్టి వికలాంగకుఁ డైననుతల్లినూనుపై
ప్రేమవిడంగఁజాలదు ధరిత్రిపయిం గణియింప రోగి గాఁ

డేమిటవెట్టిగాఁడు రుచిరేతరగాత్రుఁడుగాఁడు నీసుత
గాత్రిమణి యిట్టివాఁడదటుగాఁబడజాలెటులేదునీమదిన్. 405
ఉ. ఇంతటకేమినీతనయు నిట్టిపదంబును జెందఁజేసెనా
కంతుమదాపహారి కలకాలము నేమరఁబోక నెమ్మదిం
భ్రాంతివహించి యాత్మపదపద్మము నమ్మనఁజువ్వె యింతపె
న్వంతఘటించెచెవ్వె త్తిడినె నాసతి యాశివుఁగొల్చుభాగ్యముల్. 406
చ. అన విని యాలతాంగి శరణాగ్రణి నన్నిటులేనిభ్రాంతిజా
న్విన ఫలమేమి యీశ్వరుని నింద యొనర్పఁగనేల దేహముల్
వనరుహబుద్బుదంబు లటువంటివినిత్యములంచు వెజ్జులై
చనుదురె తావకీనపదసారసభక్తులు ధారుణీస్థలిన్. 407
క. చల్లనగంధవహాశన, మొల్లకఫణిమన్నుదినఁగ నోవునెమీవ
త్పల్లవదాస్యంబేమటి, యొల్లెడభక్తుండుమోహమెదలోనిడునే. 408
చ. అన విని చెచ్చెరన్మరలి యచ్చటశూలధరుండు వారిదా
సిని గని తత్క్రియంబెఱుఁగఁజేసిన నిట్లనుఁదండ్రియమ్మజా
పిన జనయిత్రిపె న్విసముఁబెట్టిన నీశుఁడుచంపజూచినం
జనదనమాన్పనెవ్వరికి శక్యము దుర్భ్రమలేల నావుడున్. 409
సీ. అటుబాసిపడియున్నయక్కుమారునిదెస
కేతెంచిసర్పంబునెడచివైచి
చెవిదండమంత్రించి చేమెయి నిమిరిభ
స్మముఁజల్లిలెమ్మనుమాత్ర నతఁడు
కనుతెప్పలెత్తి నిబ్బననీల్గియూరుపు
లావిర్భవింపఁగా నావులించి
పరమేశ్వరా యని వల్కుచు లేచి చెం
గటనిల్చి యున్నత న్గాంచిమ్రొక్క
గీ. నాఁత డోరికుమార నిన్నహివధింప
నించుకేనియు గనికర ముంచపోఁక
నూర కున్నారు మీవార లౌర యంత
కఠినులో యిట్టిజనులను గాన మెచట. 410
క. మందనరు మంత్ర మనరే, చందము గలజనవమాత్ర జాయాగ్రజులం

డెందమున విశ్వసించుట, యసందంబనిమాకుఁదోఁచ దదియట్లన్నన్.

గీ. చీమసైతము తన్మింటచిట్టువోఁడచి
దంశమొనరించునప్పుడు దానిపాటి
కినుకయును లేదునీయెడఁ గనికరంబు
లేక చరియించువారిపై లేశమనిన. 412

సీ. స్వామినాపై వారుజాలినొందరటంచు,వచియింపమీవంటివారికగునె
యుర్విపై బొరలుటలుత్తమాంగోదర,తాడనములుబొబ్బలేడుపులును
మేనెఱుంగకయుక్కి కానిసాపెనలుండు, గనితలపోఁతలు తనువిరక్తి
యివిమొదలగుచేష్టలవనిసాంసారిక,భ్రాంతులెయౌఁ గాకభవదుదార

గీ. పత్పరోరుహచింతనాపరులకెందు
గలుగ నేర్చునెయాప్తవర్గంబులెల్ల
సర్వసాధనములుగల్గి సర్వనిహతి
కాపరీక్షిన్మహారాజు నాగిఁగొనిరె. 413

క. అనవిని వారలయందఱి, ఘననిశ్చలశీలభక్తి కలనకుమదినె
క్కొనుసమ్మదమునమునిగణ,వనజోదరవక్త్రముఖసుపర్వులుగొలువన్.

ఉ. శంకరుఁడక్షయుండవుడు సన్నిధిచేసినగాంచియంతని
శ్శంకుఁడుదుక్కినిల్పి యతిసత్వరుఁడై చనుదెంచి యీశప
త్పంకరుహద్వయంబు తనఫాలముసోఁకనమస్కరించిన
ర్వంకపగాంగభంగరవవైఖరిసన్నుతిచేసెనేగతిన్. 415

సీ. శ్రీవికచోత్పలాక్షీమనోహరబాణ, బాణవందితపాదపంకజాత
జాతరూపధరాధరాతతకోదండ, దండధరోద్దర్పదళనదక్ష
దక్షకృతోరువితాననాశీకర, కరతలన్యస్తభాసురకురంగ
రంగదుత్తుంగతరంగగంగాధర, ధరజామనస్సరస్థాయిహంస

గీ. హంసకైరవమిత్ర హవ్యాశనాక్ష, యక్షజిన్మునివినుత మహాప్రభావ
భావసంభవదుర్మదభావహరణ,రణనిహతసింధురాట్సుతప్రముఖదైత్య.

వ. అని సన్నుతించుచున్న నిశ్శంకుని శంకరుండు నిజకరుణాకటాక్ష
వీక్షణామృతధారాపరిషిక్తాంగుంజేసి భక్తపరాతాపకీనచర్యావిశే
షంబులకు మెచ్చువచ్చె భవదీప్సితం బొసంగెద వేఁడుమనినన తండు
పునఃపునఃప్రణామంబు లొనరించి దేవా భవద్దర్శనంబుకంటె

వాంఛితం బొండెద్దియని నిరుపమానందంబుననున్న నతని తత్పు
త్రిసున్నసాపరిచారికాసమేతునింగా గ్గైలాసంబునకుం గొనిపోయె
నని చెప్పిన తత్సభాసదులైన భక్తులాశరణపుంగవుంగాంచి మీ
రానతిచ్చినమహాత్ములచరితంబులు వినుటం జేసి కృతార్థులమైతిమని
యతనిం గొనియాడి యందఱు నిజనివాసంబుల కరిగి రట్లుగావునఁ
బ్రాణేశ్వరా భక్తప్రభావంబిట్టిదని వర్ణనసేయ బ్రహ్మాదులకశక్యం
బే నెంతదాననని శాంతసత్తక్క పలికిన తన్మనోహరుం డాశ్చర్యంబు
నొంది యిట్లనియె భవత్సోదరీతపోనివాసంబెచ్చట నస్మహాభాగం
గనుంగొనవేడుకపుట్టెనని తత్సతీవతంసంబు భవదభిప్రాయం బెట్ల
ట్లరమ్మని యతనిం దోడ్కొని. 417

ఉ. శైలములుత్తరించి ఘనసాలవనంబులుమించి వాహినీ
జాలములెల్ల దాఁటి మృగసర్పవిహాయసయామినీచరా
భీలవిహారదేశమయి పెంపగుశైలదరింగజానుహ్రా
న్మాళిపదావలగ్న నిజమానసయై వచియించుసోదరిన్. 418

గీ. పతికిఁజూపిననతఁడు విభ్రాంతుఁడగుచు
నింతతపమొనరించెడు నింతికేల
హరుఁడుప్రత్యక్షమైనిల్వఁడబలయనిన
వినయమున శాంతసత్తక్క యనియెనిటుల. 419

మ. గురువర్యుండొకలింగమిచ్చి యిదినీకున్వేల్పుతత్పూజనా
చరణంబేసకలంబునుమ్మనిన నాచార్యాజ్ఞలంఘించి నుం
దరియోగంబెఘనంబటంచు నెపుడుం దన్నిష్ఠచేనుండిగా
నరసాస్యందనుఁడాదరంబున బ్రసన్నంబాట లేదీపెకున్. 420

వ. అనిన నతండాచార్యాజ్ఞ మీఱినకతంబునఁగాదె యెంతయోగంబైన
ను పనిగొనదయ్యె నీక దీనిం గృతార్థంజేయవలయునని తలంచిన 421
నిజపత్నిం గనుంగొని యిట్లనియె.

ఉ. సజ్జనులెంతయుంబరవిషాదముగాంచినసహించరన్నచో
నిజ్జలజాక్షినీకుగణియింపఁగ సోదరియేగతి న్మహా
సజ్జలరాసిమున్గతగవాకనియుం దరిఁజేర్పకుంట యో 422
షిజ్జన ... వతంస ... జేసి ... కృతార్థ ... జేయవే.

గీ. అనిన ముదమందిపతికి జోహారుసల్పి, కలితపద్మాసనస్థుఁడై కరతలమున
లింగమూర్తిని నిల్పి సల్లీలదృష్టి, నొండుభావమెఱుంగక యుండునంత.
గీ. హస్తమున జ్యోతిరాకారుఁడైనలింగ
మూర్తి యవయవసహితుఁడై ముదితమెదుట
సన్నిధియొనర్పఁగాంచి తత్సాధ్వివినయ
భరితయై మ్రొక్కి యిట్టులఁ బ్రస్తుతించె. 424
ఉత్సాహము. తారహార హీరతుల్య ధాళధళ్యవిగ్రహా
శూరమారమారశౌరిసూదనావిషాదనా
సారధీరవారవంద్య సర్వమంగళాధిపా
భారభూరధార మేళ బాణబాణపోషణా. 425
చ. అనివినుతింపశంభుఁడు దయామతి వేఁడుము వాంఛితంబు నా
ఘనకచ మాకు మువ్వురకుఁ గల్గఁగఁ జేయుము నీపదంబనన్
అనవుడునట్లుగాకయని యప్పుడుదివ్యవిమానపంక్తిచేఁ
గొనిచనెరౌప్యశైలమునకున్ సురలద్భుతమందిచూడఁగాన్. 426
వ. కావున పావనసతీవతంసమాహాత్మ్యం బిట్టిదని నిజచ్ఛాత్రుండైనయీ
కూకదమారనితోఁ దెల్ప నితండు విస్మయలజ్జాన్వితుండై పునఃపునః
ప్రణామంబు లొనరించి వధూసహితంబుగా కరకమలంబులు మొగిచి
నిలిచినఁ గరుణార్ద్రదృష్టిం గనుంగొని చెన్నబసవేశ్వరుసన్నిధికిఁ
బొమ్మనియనుజ్ఞ యిచ్చి నిజేచ్ఛంజనియెంగావున వీరలమాహాత్మ్యంబి
ట్టిదనిన మాదిరాజయ్యదెల్పినసభాసదులలో చెన్నబసవేశ్వరుండ
త్యంతప్రమోదంబు నొంది యతని నిరంతరరాజవదుపచారంబులఁ
బూజింపుచుండె. 427
క. కూకదమారనిచరితము, ప్రకటసద్భక్తివినినఁ బఠియించినద
ర్వ్యకరభూషణుకృపన, స్తోకశుభావళులు బరఁగుదురునరులెపుడున్.
వ. అని చెప్పిన నగస్త్యుండు తరువాతవృత్తాంతంబేమని యడిగిన. 429
శా. షట్కాలాబ్జధరార్చనా నియమభాస్వచ్చిత్త సంజాతగో
రాట్కాంసారికుబేరపుత్రిసుకుమారశ్రీసమాన్వితగో
రాట్కాంతీరవశారదాబ్జశశభృద్రాజద్యశఃఖ్యాతవి
ద్విట్కాండాద్భుతబాహుశౌర్యజితకుంతీవ్యోమగంగాసుతా. 430

క. శరజాతజన్మమృదుపద, శరజాతవిలగ్నహృదయ సడ్డింభకశ్రీ
శరణసమాగత దేశిక, శరణసపర్యావిధాన సంతుష్టమతీ. 431

మాలినీ. సరసగుణనివాసా శంభుపూజావిలాసా
నిరుపమశుభమూర్తీ నిర్మలాచారవర్తీ
దురితతిమిరసూరాతోషితాప్తార్యవారా
పరహృదయవిభేదీ బంధులోకప్రమోదీ. 432

గద్యము. ఇతి శ్రీమచ్చెన్నమల్లికార్జునకరుణాకటాక్షలబ్ధకవితామాధురీ ధురీణ కాశికగోత్రపవిత్ర సుకవిజనస్తుత్యపాపయామాత్య ప్రణీతం బైనచెన్నబసవపురాణం బనుమహాప్రబంధంబునందు చతుర్థాశ్వాసము.





శ్రీరస్తు.

# పంచమాశ్వాసము.

---

## మల్లబ్రహ్మయ్య కథ.



విబుధావనకృత్యా
కేవలతరనియమముదితగిరివరభృత్యా
పావనజనతాస్తుత్యా
జావర్ధితనిత్యసత్య యమృతామాత్యా. 1

వ. అవధరింపుము కుంభసంభవునకు రేణుకుం డవ్వలికథ యిట్లని చెప్పం దొడంగె.

గీ. అంతనొకనాఁడు మల్లబ్రహ్మయ్యనాఁగ, భక్తులిరువురు శ్రీచెన్నబసవ[మంత్రి
పజ్జవింతగదివిటీలు బట్టువిధము, దెలసిదుర్మంత్రియొకఁడుబిజ్జలునిఁజేరి.

చ. నరవరవింటె వేబసవనాథుని యల్లునినన్నిధానమం
దిరువురుపూరుషోత్తము లహీనబలాఢ్యులు దివ్విటీలవా
రరుదుగనున్నవారలు మహాద్భుతమయ్యెడు వారిచర్యగో
చరమొనరింపనెట్లనిన సర్వముదెల్పెదచిత్తగింపుమా. 4

గీ. వారుచేబట్టిదివిటీలు వహ్నిఁగూర్ప
కయిరువుల్కొనుతైలసంగతముగాక
యేవెలుఁగు తేజ మెడలక నెప్పుడచటఁ
గానఁబడుసంతదవ్వు సౌగంధ్యమొసఁగు. 5

చ. అనవిని రాజు చెన్నబసవాధిపునప్పుడె పిల్వఁబంచియో
యనఘ భవత్సమీపగతులై తగుదివ్వెలవారినిద్దఱిం
ననుగొలువంగఁబంపుమనిన బరమేశ్వరుఁడెంత దెచ్చెనా
ఘనులుదురాగతుంగొలువ దానెటుపంపుదు నేమిసేయుదున్. 6

ఉ. పంపఁగరాదువారినట పంపకయుండిన మామమీఁద నే
తెంపువహించునో యితఁడు దెప్పరమయ్యెనటంచు చింతత

స్నంపనొకింత సేపు తన మోమరవాలిచియుండి యట్టులం
బంపఁగఁదీరదవ్వలఁగనంబడు దీనికితన్మహత్వముల్. 7

చ. అనిమదినిశ్చయించి ఫణిహారిముఖంబున వారిఁబిల్వఁగాఁ
బనిచిమహీతలేశ్వరుని భావముదెల్పఁగఁబూని జంకిన
మ్రనిజముఖాంబుజాతుఁడయి మానము దాలిచి తన్మనోగతం
బనఘులుగాంచి మన్మితనికప్పన సేయుము కొంక నేటికిన్. 8

క. నావుడు వారలయనుమతి,భూవరునకుఁగానుపించి పోయెదననిస్వీయా
వాసముచింతాకుల, భావమునం జెందె చెన్నబసవండంతన్. 9

క. బండారుబసవధీమణి, మండలపతినడిచినట్టిమార్గము విని యా
తిండింతకొత్తుగానెనిఁక, నొండేగతిసంభవించునో యనియుండెన్.

చ. మనుజవరుండుదుర్మతిని మల్లయ్యబ్రహ్మయగారి నిద్దఱిన్
దనయెడదివ్విటీలిడఁగతత్క్షణమాసమయంబునందురాఁ
బనిచిన తేటగాతమప్రభావముఁజూపుదు మంచునేగియ
య్యనఘులువాసికట్టిదుట నందఱుఁజూడఁగ నిల్చిచెచ్చెఱన్. 11

గీ. వయిడిపిడిదివ్విటీలు చేఁబట్టిరవులు
కొలువునంతటిలోన నక్కోటిదివ్వి
టీలుగూడినమాడ్కి కడిందివంట
లాత్మతనుతాప మొసరింప నవనివిభుఁడు. 12

ఉ. తాళఁగలేకతాల్మిచెడి తల్లడమందుచు లేచి నేలపై
వ్రాలుచుఁ బొర్లుచున్ విహితవర్గముఁ జీరుచుఁ బెద్దదిండుపై
సోలుచు నల్గడల్ బెగడిచూచుచు క్రమ్మఱ కన్నుమూయుచున్
కేలెదఁజేర్చుచున్ జలువక్రేవల కేగుచు నీరుఁద్రావుచున్. 13

క. వాయెత్తియరచుచుండఁగ, నాయెడబసవేశుఁడనియె నవనీశ్వర నీ!
కాయపరితాప వేదన, బాయువిధంబొకటిదోఁచె పరికింపంగన్. 14

చ. అదియెటులన్న మాధవశరావరమూర్తులుశాంభవేంద్రరాం
బుదపవనుల్ మహాత్ములని బుద్ధిఁదలంపక దుష్టబోధనీ
మదిఁగసిదివ్విటీలిడఁగమల్లయబ్రహ్మయగారి నిత్తరి
న్మదమునఁబంచు హేతువునమంటలు నీకుదయించెమించుగన్. 15

క. కావుననప్పుని [illegible] మాస్వసకు నారోగ్యముగన్

నావృదుపతిదోఁచనిపుడి, చేవిసరేక పొమ్మటంచుఁజెప్పిన మాడ్కిన్.

సీ. ఆసైగగని తెలియక భూవరునకుకో,పముపచ్చెననుచు బెత్తములవారు వారలఁగడసియవ్వల కేగుమని బెట్టు,గదిమిన చిరునవ్వుగదురనిండ్ల దరి కేగిరిచ్చటధరణీశుతాపంబు, మంత్రించినట్టులమానుటయును బసవనిగనియతండసమాతతుల్యనీ, కతన నేటికిబ్రతికితినటంచు

గీ. వేయువిధముల కొనియాడి వీడుకొల్పి
చచ్చి పుట్టినయట్టుల సంతసిలుచు
కొలువుచాలించినగరిలోపలికి నరిగె
రాజుమంత్రియు నిజమందిరమున కరిగె. 17

సీ. అమరునాఁడు రసాధిపవర్యుండు, నేరము లేకయే నిర్నిమిత్త మల్లయ్యమధుపయ్యయనుభక్తవర్యుల,పిలిపించికన్నులబెరుకజేయ వినిబసవఁడుకోపవివశుఁడై బిజ్జలుం,డక్కటాచెడచూచెననుచువారి రప్పించి యతులనెప్పటి యట్లన, బడసిభక్తాళికప్పట్టణమున

గీ.నింకనుండుటతప్పునేఁడిట్టులయ్యె,నిన్ననట్టులయ్యెనితనయున్నకడకు వేగజగదేకమంత్రిరాపించియతని,కెల్లభక్తులువినుచుండనిట్టులనియె.

మల్లమధుపయ్యకథ.

సీ. జగదీశ నీవుమునుజంగ మేతరకృత్య, మొనరించి వారలకినుకకోర్వఁ జాలకవేగశచ్చరణంబునొందిన,నిచటశివద్రోహ మింకగొంత కాలంబునకుఁబుట్టగలదుతద్ద్రోహిఁగీ,టణచుమపుడుదీనికనియెతగిన యట్టిప్రాయశ్చిత్తమనిరిగావున నిపు,డవనీశుఁడిట్టి ద్రోహంబొనర్చె

గీ. అట్టులగుటజంగమాజ్ఞదప్పకనేఁడ, ఖలునివానిఁబట్టి బిలుకుమార్చి సకలభక్తవితతినన్నుతింపఁగనుము, కార్మకొపహారికరుణగనుము.

క. అని తెలిపి యతనిఁబోపం, బనిచియుమాత్యేశ్వరుండు భగినీ తనుజ న్మునికెఱుగజేసియాతని,యనుమతిపురివెడలనడిచిమాతృణమాత్రన్.

సీ. మడివాలుమాచయ్యమసణయ్యమాదిరా,జయ్యయేకాంతరామయ్య మిండ,సంగయ్యవనిపురశంకరదేవయ్య,యుచ్చయ్యమధుపయ్యయని మిమయ్య, కలికేతబ్రహ్మయ్యకక్కయ్య తెలుఁగుజో,మ్మయ్యబల్లేశు మల్లయ్యవీర,బ్రహ్మయ్యకన్నడబ్రహ్మయ్యకిన్నర,బ్రహ్మయ్య పేరివుల బ్బతియ్య

గీ. ఆత్మదేవయ్య సురియచోడయ్య భాస్క-
రయ్య కొట్టరు బాచిదేవయ్య హిల్ల
వాళబ్రహ్మయ్య ముసిడిచౌడయ్య నాగు
మయ్య పదమరుసయ్య శూలాయుధయ్య. 21

చ. మొదలగుభక్తరాజికడు మోదముతోఁ జను దేరయచ్చటన్
గదిలి సమస్తశైవశుభకారణ కప్పడి సంగమేశ్వరం
బదెయిదెయంచు నేగి బసవాధిపుఁ డచ్చట దేశికాగభి
త్సదనముఁ జెంది యాతని ప్రసన్నునిఁ జేయ గణాళి చూడఁగన్. 22

చ. గురుఁడు దరంబు విచ్చి కడు గ్రుచ్చియు కౌఁగిట చేర్చు చాట్పున
న్వరగుణధుర్యుఁడైన బసవప్రభు లోపలఁ జేసుకొంచు వే
నరిగె గృహంబు లోపలికి యంతట మ్రోసెను పర్వదుందుభుల్
గురిసెల తాంతవృష్టి సుమకోమలఁబలాడిరి మింటజాటలై. 23

గీ. అంతయును గాంచి యచటి భక్తాళి యాత్మ
భరితచింతల శ్రీచెన్నబసవవిభుని
గాంచి మీ మామ యిటులయ్యెఁ గాన యింక
భారకుండవు నీవె మాపాలికనిన. 24

క. నేనెంతవాఁడ మీరలు, పూనినడుపుమనిన యెట్లు పోయెదనని లో
నూనిన భక్తిం దచ్చర, ణానతుఁడై యపుడె వారి యందఱితోడన్. 25

గీ. అచటఁ బాసి వచ్చి యతిరమ్యమగు నొక్క-
వనముఁ జేరి బసవవర్యు చర్య
లుగ్గడించుకొనుచు నుండి రచ్చట బస
వండు వెడల దడవపట్టణమున. 26

సీ. ధరణివణంకె మాతంగమదములింకె
తారలు రాలె సౌధములు గూలె
వనతతులెండె సర్పములు తోఁకలు మండె
వరదులు గూసె దిక్పాళి మాసె
రవియుగ్మ ముదయించె రాజంతకుని గాంచె
పిడుగులు వడి యురాగుడులు పడియె
సస్యముల్ మాడె శిర్షముల కాకములాడె

కండలుగురిసె చీఁకటులుఁబెరసె

గీ. కవణముల్ పుచ్చెపృత్యువుగానవచ్చె
యగ్గిచల్లారె యిండ్లదయ్యములుచేరె
ధూళిమినుగప్పె వడిసుడిగాలిరొప్పె
పగిజలకళయుల్లదప్పెనప్పట్టునందు. 27

వ. మఱియు నీదృశ్యంబులగు ననేకదుర్నిమిత్తంబులు పుట్టిన. 28

చ. అలుజనియింకుకీడుగని యందఱుభీతిలి చింతనొందిరం
తటజగదేవమంత్రితిఁణదాశివపూజయొనర్చి వేగని
క్కటకపతింవధింపఁ జనగావలెనంచు నిజాలయంబుఁజే
రుటగనితల్లి తత్క్రియము రూఢిగము న్వినియుండుర్గళృపన్. 29

మ. శరణద్రోహమువిన్నయంతటనె యాచండాలు మర్దింపకీ
రరుదేరంజనునేగణాజ్ఞగొని నీవాలస్యముంజేతు రే
హారుఁడిబ్బంగిని మెచ్చునే పిరికిపంద్రా చెందెబల్నిందయే
కరణిం బాయునటంచుఁ బెక్కుగతులం గర్జించి తర్జించినన్. 30

చ. శిరమరపంచి తప్పితము చెందెగదాయనిలజ్జనొందిన
త్వరమునన్నీకుఁబూన్చి తనతల్లియొసంగినభంగి వేగమో
గిరముభుజించుచుండఁగ నకిల్బిషచిత్తులు మల్లబ్రహ్మగా
రిరువురువచ్చికూడి భుజియించిరి యాతనితోడ వేడుకన్. 31

ఉ. ఆగతి నారగించి పరమాద్భుతవీరరసాతిరేక సం!
యోగమనస్కులై మువురునుర్వినిగూల్పఁగనిశ్చయించి ర
క్తాగరుచందనాంబరసుమాదులుదాల్చి యమాత్యమాతకుం
జాగిలియాపెదీవనలొసంగినఁగైకొని లేచిచెచ్చెఱన్. 32

చ. కరములుమండలాగ్రములు గ్రాలఁగ గేహమునిర్గమించి భూ
వరుసభ చేరఁగా నరిగి వాంశికవైణికనర్తకాదిబం
ధురతరలీల లెంచుచు కుతూహలివై కరదీపికాసము
త్కరరుచిపర్వమానికపుగద్దియపైఁగొలువున్న బిజ్జలున్. 33

చ. తటుకునఁగాంచి కన్గవలదారుణవహ్నికణంబు లొల్కను
ద్భటతరసింహనాదముల తారలు మేరలు మీరిధారుణిం
తొటతొటరాల పర్వుడులుఁదొక్కుచు నందఱిమీఁదయొక్కటఁ

బటపటపండ్లుగీటుచు సభాజనముల్ వెఱఁగందిచూడఁగాన్. 34

మ. ప్రళయాభీలకపాలిపాలికల తద్రాజాధముఁ జేరిని
శ్చలులై యేసిరి ముప్వురొక్కమొగిచంచచ్ఛాతఖడ్గంబులం
బలవత్సింహకిశోరమర్దితమహానాగంబు చందంబుగా
నిలపై గూలెనతండు బెగ్గిలిజనంబెల్లన్వడిం బారఁగన్. 35

వ. ఇట్లు బిజ్జలుం బరిమార్చి ముప్వురు రాజమందిరంబు వెడలినప్పుడు జగదే
వుండు మల్లయ్యబ్రహ్మయ్యగారల తత్సమయసముచితాలాపంబుల
వీడ్కొలిపి నిజసదనంబులకుంజని నమస్కారపూర్వకంబుగా నంతవృ
త్తాంతంబు తల్లికెఱింగించి తదనుగ్రహంబువడసి రాజసేవాపరాధం
బొనరించుట విన్నయంతనే వానింజంపక జాగుచేసినతప్పునకాత్మ
తనుత్యాగంబే ప్రాయశ్చిత్తంబని గండకత్తెఱ గళంబున దవిలించు
కొనునంతటలోన సర్వేశ్వరుం డగుపార్వతీశ్వరుండు ప్రత్యక్షంబై
యతని తన్మాతృపుత్రమిత్రకళత్రాదులను స్వశరీరంబుతో కైలాసం
బునకుఁ గొనిపోయె. మల్లయ్యబ్రహ్మయ్య లప్పుడే కళ్యాణపురంబు
వెడలి చెన్నబసవేశ్వరనివాసం బరయుచుం జని యతనింగాంచి
గణప్రకారంబంతయుం దెల్పి వారు నచ్చటనే యుండి రంత నిచ్చట
సూర్యోదయంబగుటయు పట్టణంబున. 36

చ. ధరణిపుచావు తెల్లముగ దత్ప్రియబాంధవులెల్ల గాంచిహృ
ద్భరితవిషాదవేదనల తల్లడమందుచు వానికగ్నిసం
స్కారమొనర్చి యింతబలుగా తపసుల్ బసవుండొనర్చెగా 37
కొదులకుశక్యమే మనల కొప్పదు వీనినుపేక్ష సేయఁగన్.

గీ. ఇంతపనికొప్పకొను బసవేశ్వరునిత
దాప్తులను వానియల్లునినవనివిభుని
తోటివారిగఁ జేయుటెసూటియనుచు 38
నందఱాలోచనలొనర్చిరంతమీఁద. 39

వ. కొన్నిదినంబులు చన్న పిదప.

చ. అరిబలభంగగంగ చతురంగబలంబులతోడ నాచమూ
వరులనుబంచితన్నృపతిబంధువులాప్తులు భేరికాహళా
దిరవములొక్కపెట్ట దివిదిట్టుకొనన్ సమరానుకూలభా

స్వైరతరవేషులై పురమవార్యబలోద్ధతి నిర్గమింపఁగన్. 40

సీ. స్యందనధ్వజపటాంచలజాతవాతముల్, తోయదపంక్తులదూలఁజేయ
పటుతరసింధురపదఘట్టనంబుల, ధరమోయు శేషాహిశిరమువంచ
తురగరింఖోద్ధూతధరణీపరాగంబు, సారసబాంధవసరణిగప్ప
భటసింహనిస్వనార్భటులుమదావహ, దిగ్గజంబులనిల మొగ్గఁజేయ
గీ. నడచెన త్తరిబలవితానంబు బాణ, మండలాగ్రపరశ్వధభిండివాల
పట్టిసకుఠారముద్గరప్రాసముఖ్య, సాధనప్రభలాభీలసమితి వెలుఁగ. 41

వ. మఱియు నవ్వాహినివాహినియుంబోలె బహుళలహరీవిరాజమానం బై పుష్పితోద్యానంబునుంబోలె మదభ్రమరసారంగవిలసితంబై ధరాధరగహ్వరంబునుంబోలె నుద్భటసింహనాదంబై వైకుంఠంబునుంబోలె చక్రిసంచారస్థానంబై సత్యలోకంబునుంబోలె లోకేశ్వర భాషావిశేషోత్సాహసహితంబై కైలాసంబునుంబోలె నభంగ ధర్మవాహంబై భాగవతంబునుంబోలె సింహబలారికర్ణశల్యాట్టహాసంబై భారతంబునుంబోలె ననమాత్రనిరుద్ధంబై రామాయణంబునుంబోలె విశ్వామిత్రవితానవాసనంబై యాకాశంబునుంబోలె రాజహంసవిలాసభాసురంబై ప్రావృట్కాలంబునుంబోలె శరధారాప్రకృష్టంబై ఘోరకాంతారంబునుంబోలె ఖడ్గాచ్ఛభల్లపుండరీకాధిష్ఠితంబై పెంపుమిగిలినడతెంచుసమయంబున నవ్వనంబున నున్న శరణపుంగవు లక్కోలాహలంబాలించి సమున్నతవృత్తారోహులై తమమీఁద దాడిపెట్టవచ్చిరని సముద్దీపితకోపాటోపంబున.

సీ. గట్టుతున్కలు సేయుఁజెట్టద దేవయ్య, మదకరివిదళించుమాచవిభుఁడు
గిరిజేశుబల్కించుకిన్నరబ్రహ్మయ్య, భవునిప్రేవులబూన్చుప్రబ్బతయ్య
విశ్వబాధులనోంచు వేమనారాధ్యుండు, నాల్కలీశునకిచ్చునాగవరుడు
గిలకపుత్తడిరాల్చుకల కేతబ్రహ్మయ్య, మహిచిరంజీవియామాదిరాజు
గీ. వీరుమొదలుగాఁగలుగు నేణ్బూరువీరు
నవబలవ్రత స్థితులును నవసహస్ర
మఱియు నొకలక్షతొంబదియాఱు వేల
చరులువంద్రెండు వేల్మిండజంగమములు. 43

క. మఱియునసంఖ్యాతములగు, శశికంఠపదాబ్జభక్తగణసింహంబుల్

దరిలేనిశౌర్యకలనం, బిరుదవిదియకళతుస్సైన్యభీకరతనులై. 44

చ. నడుములుగట్టుచుంబెలుచనవ్వుచుఁబండులుగీటుచుంబాహు
ల్మ్రదుచుచుమండలాగ్రణయముల్ జళిపించుచుగూఢవర్మముల్
దొడుగుచుగోరమీసములుదువ్వుచుబాహువులప్పళించుచుఁగ్ర
గడువడిమిన్నుఁదాఁకుచునకంపితవృత్తిచెలంగియార్వఁగన్. 45

గీ. అట్టికోలాహలంబప్పుడరసిచెన్న
బసవఁ డగుదెంచి తద్భక్తపత్సరోజ
ములకు సాష్టాంగమెఱఁగి కేల్మోడ్చినిలచి
వినుతిపూర్వకముగ నిట్లువిన్నవించె. 46

మ. తగునేమీరలుకోపగించ ఘనశాంతంబారడింబుచ్చియీ
పగిదింశైవమహత్త్వముల్మదిఁ దలంపంబోకవర్తించుదు
ష్టగుణుల్తామెనశింతురెట్లనిన భస్మస్వర్గగేహారప
స్నగహారుస్మడియింపఁ బొల్పడితనంతందానకీర్తొందఁడే. 47

గీ. అరిమదేభములకుసింహామహితకాన
సమునకగ్నియమిత్రమేఘములకలన
నభమురిపుశైలములకు వజ్రంబుమీఁదు
జ్ఞానభక్తివైరాగ్యనిష్ఠలుదలంప. 48

క. అటుగానమీరలిత్తరి, కుటిలాత్ములమీఁదఁజనఁగఁగూడదు నిలుపుం
డిటుకర్మ వారికిసిఁకమీ,దటనగుఫలమునిన నమ్మ్రదంబునశరణుల్. 49

ఉ. వైరులమీఁదఁబోక నిలునంబడునంతటిలోన దుష్టచే
ష్టారిబలంబులోన నిబిడాంధతమంబువిధిప్రయుక్తమై
ధారుణిమిన్నుమోసె పెడిదంబుగనట్టినవాన తెచ్చుమూ
వారమువిస్మయంబును విసర్జతవోఁవఁగ నత్తరిఁ వెనన్. 50

మ. ప్రళయాంభోధరనిస్వనంబుపగిదిం బ్రహ్మాండభాండంబుభీ
తిలనొక్కుమ్మడినార్చి తెమ్మురులుమర్దింపంగ నేతెంచు ద
ట్టులదోపందమునామెరయుంబోయలఁ బట్టంజేయటంచుఁగ్రభయా
కులులైపైఁబడిరుగ్రఖడ్గశరశక్తుల్ ఘూనిభీమాకృతిన్. 51

వ. ఇట్లు. 52

చ. భటనికరంబు [illegible]

చ్ఛటలనడంచుచున్మోరయుస్యందనవర్గముజక్కసేయుచుర్
చటులధనుఃప్రకాండహతి సల్పుచు వర్మచయంబుఃజించుచుం
బటుధనశాతపత్రములపంక్తులు భూమిఁదొరంగఁజేయుచుర్. 53

వ. మఱియును. 54

సీ. మణికేతనోద్దండఘృణికొంతదవ్వేగి
యవిబడచనలేక నడలురథులు
ప్రచురముక్తాచ్ఛత్రరుచికొంతవడినేగి
యవిగూలతడఁబడి నొవ్వులుకరులు
పటువజ్రనఖరప్రభలకొంతయొడమేగి
యదిజారనిలఁబడునట్టిహరులు
జళిపించుఖడ్గప్రభలుకొంతఁదడవేగి
యవిపోవనలుదిక్కులరయుభటులు

గీ. నగుచునగ్గాఢతమమునఁతకంత
కగ్గలం బైనవీరరసాతిరేక
కలననందఱుయదువులకరణిపోరు
సలిపిసమసిరినిర్విశేషంబుగాఁగ. 55

క. అంతటనగ్గాఢతమం,బంతయువిరియంగజైనులందఱుహతులై [చర్.
యెంతయు వేడుకఁగనుగొని, యంతకహరుభక్తవితతియార్చిరిపెలు

ఉ. అత్తఱిఁద్రొక్కిచెన్నబసవార్యుఁడు వారలతోడ నోశర
ణ్యోత్తములార మీరలు మహోన్నతు లేమనిచెప్పవచ్చు మై
మత్తిలి మిమ్మెఱుంగక సమస్తరిపుప్రకరంబువచ్చి ను
వ్వొత్తుగఁగూలె పాపమతులెయ్యెడలం జయమందనేర్తురే. 57

గీ. శరధిచేయాతనీదుటజ్వాలదరణ్య
పావకజ్వాలకరమునఁబట్టుకొనుట
తూగిపాఱెడునదికేలనాఁగికొనుట
గాఁడెమిముజైనులణపఁగఁగడఁగుటెల్ల. 58

చ. అనిఇటునన్నుతించి మదహర్షముతోడుత వారు దాను నా
దినమటువుచ్చి రేపకడ తేజమెలర్పఁగనందువాసికాం
చననవరత్నసంఘటితపాదవిరాజితమైతనర్చువే

ర్చినహూళికాఖ్యపట్టణముచేరఁగఁదద్ధరణీపుఁడ త్తరిన్. 59

క. చారులముఖమునవినిఘున, భేరీముఖరవములదర ప్రియబంధుచమూ
వారముతో నెదురుగఁజని, దూరంబునభక్త సంతతులఁగాంచి వెసన్.

చ. కరిదిగిపాదచారియయి గ్రక్కునఁజేరఁగ నేగినన్నొసల్
ధరవయిసోఁకఁజాగఁబడి తద్గణకోటికిమ్రొక్కనంతలో
వరగుణుఁడైనచెన్నబసవప్రభువర్యుఁడువచ్చి యాతనిం
గరములఁగ్రుచ్చి వేగబిగికౌఁగిటఁజేరిచి సమ్మదంబునన్. 61

ఉ. చెప్పఁగవిందునిన్ను నృపశేఖరభక్తవరేణ్యుఁడంచునే
నిప్పుడుగంటి మోదమువహించె మదీయహృదిం జలింపఁగా
ముప్పిరిగొన్నభక్తి కరముల్ముకుళించి యతండువల్కె ని
ట్లొప్పునెనన్ను మీరొకగణోన్నతుఁడంచు గణింపధీమణీ. 62

చ. అనివచియించి క్రమ్మఱ మహావినయంబునఁబల్కె వీరభ
ద్రనృపతిరోమహాత్మ శరదంబునకుంభజగారిశింబరాం
కునకుచకోరగమధ్యమునకున్వలిజక్కవగాచి యుండులా
గునభవదంఘ్రిదర్శనముఁ గోరివసించితి నింతగాలమున్. 63

క. దీనుఁడుపెన్నిధిగనుగతి, నేనినుఁజూడంగగంటి నేటికినాదా
నేనఘపటలమువిరిసెను, భాసురగతిఁజెందితిం గృతార్థుఁడనైతిన్. 64

చ. శ్రితజనపోష మద్భవనసీమకు మీరరుదేమదీయవాం
ఛితమొనగూడునట్లు దయసేయుఁడటంచును నాగణేశసం
తతినొడఁబాటొనర్చి ప్రమదంబున నాత్మపురాధివాసుల
ద్భుతమతులై కనుంగొనఁగఁ దోడ్కొనిపోయి మణీగృహంబునన్.

గీ. వారినందఱినునిచి యపారభక్తి
సేవలొనరించి వేడ్కభుజింపఁజేసి
పిదప నొక్కమనోహరసదనమందు
శివకథాగోష్ఠినున్నట్టియవసరమున. 66

క. చెన్నబసవేశుఁగనుఁగొని, సన్నుతగుణధుర్యుఁడగు రసాతలపతి కే
లున్నుదురుగదియఁజేరిచి, విన్నపమొనరించెనిట్లు వినయమెలర్పన్.

చ. ధరణిపునీతఁజేయ గిరిధన్విసుతాంశముదాల్చి నాగమో
దరముసద్వాదశాబ్దములు తావొనరించి రసాతలేశకుం

జరుసభ మాతృకర్ణమున సంభవమైఖలజైనబౌద్ధసం
హరణ మొనర్చి శైవసమయంబచటం బ్రబలంగఁ జేయవే. 68
చ. నినుఁగొనియాడవాగ్ధవఫణిప్రవరాదులకైన శక్తిలే
దనమముబోటికెట్టులగు నాశ్రితజంగమకల్పవృక్షసం
జనితదయాకటాక్షహత శైవవిపక్షవిశుద్ధభావస
జ్జనపరిరక్షయంచుఁ దనుసన్నుతిసేయుచునున్న భూవిభున్. 69
గీ. ఎలమిగని చెన్నబళవేశుఁ డిట్టులనియె
నధికముగస్తోత్రమున కర్హులయినయిమ్మ
హాత్ములనుతింప దగుఁగాకసగునె వీరి
దాసుఁడగునన్నుఁగొనియాడధరణినాథ. 70
సీ. కమలబాంధవునితోఁ గదలుమెఱ్ఱుడుపుర్వు
దేవతాకుజముతోఁ దెల్లదుమ్మ
చామీకరాద్రితోఁ జొటబెర్గినదిబ్బ
సింహడింభకముతోఁ జెవులపిల్లి
వాహినీనాథుతోఁ వరిమళ్లకాలువ
వ్యాళనాయకునితోఁ వానికట్టె
వైనతేయఖగంబుతోఁ నూరబిచ్చుక
రాజరత్నంబుతోఁ గాజుపూస
గీ. సాటిరానట్టిపగిది నీశరణకోటి
తోటి సరిరానినన్ను సంస్తుతులు సేయ
నగునె వీరిమాహాత్మ్య మెట్లనిన వినుము
పార్థివేశ్వరయనుచుఁ జెప్పంగఁ దొడఁగె. 71
క. భావభవోద్భవసంహర
పావనతరపాదపద్మభజనామోద
ప్రావృతమతియా బెట్టిద
దేవరసయమహిమ మొదలదెల్పెద వినుమా. 72
సీ. ఒకనాఁడుబిజ్జలుండోడ్డోలగంబుండి, బసవయ్యఁగనుఁగొనిపలికెనిటుల
మాభక్తులనుపమమహిమాఢ్యులనిమెప్పు, చెప్పుడుబలుకుమరీపువట్టి
బూటకంబులువినఁబోలదు నీమాటలందఱికంటె వారధికులెట్టు

లెక్కడెక్కడవారలేమేమిచేసి వి,ఖ్యాతిఁబొందిరి త్రిజగంబుమెచ్చ
గీ. నరయనాల్గుయుగంబుల బరఁగుమాన
వాధిపులనడువడులు విన్నట్టులయిన
నిట్టుపల్కవు తద్విధమెట్టిదనిన
సావధానతవినుమమాత్యాగ్రగణ్య. [రాముఁ
సీ. మహిపులముయ్యేడుమాఱులువధియించి, ధరకశ్యపునకిచ్చెపరశు
డబ్ధిబంధించిదశాస్యునిఖండించి, ప్రబలెశ్రీదశరథరామవిభుఁడు
కలికంతుమెప్పించికాలకేయాదుల,నొక్కడుబరిమార్చెనింద్రతనయు
డరులజెండాడిదేహంబునహరిగద్దె,నుండఁడేవికిమార్కండుమొన్న
గీ. నరయవీరలుగాక మహాపవిత్రావ
గరిమఁదగురాజులిప్పుడుగలరుధరణి
నిట్లుమీవారునడిచిరేయెన్నఁడైన
ననియుపాలంభనము దోఁచనాడుటయును. 74
చ. వినిబసవేశ్వరుండు పృథివీవరయెన్నటనుండి నీమదిం
జననమునొందెనింతటివిచారముమహాత్మవిధాను సత్క్రియా
ఘనతరదుఃఖనిస్స్వకులఘస్మరుసుస్థిరభోగభాగ్యులన్
వినుతిరయొనర్చితీవు గణవీరమహత్త్వమెఱుంగ కిట్టులన్. 75
వ. అనిపల్కి జంగమపవిత్రభావం బొక్కటిదెల్పెద వినుమని దండనా
యకుండు. 76
సీ. ఆశారరేఖచే నాదరబ్రహ్మయ్య, ప్రథితకళాస్ఫూర్తి పండితయ్య
గురుభక్తిబిల్లమ ధరణీతలేశ్వరుం,డురుగానవిద్యచేనొడయనంబి
భూరిశౌర్యంబునేచేరమభూభర్త,యంగలింగజ్ఞత ననిమిషుండు
పటుతరసత్త్వసంపద యిర్యదాండారి,కలిమికి బళ్లాణగహ్వరీశుఁ
గీ. డిమ్మహాభక్తుఁడని జనులెల్లఁదన్ను
బ్రస్తుతింపంగ నెగడెధరాతలమున
భవ్యజంగమసందోహపాదపద్మ
చంచరీకుండు శ్రీవీరసంగమయ్య. 77

వీరసంగమయ్యకథ.

చ. అతనివ[illegible]

సుతునకుఁ బెండ్లిచేయఁదగు చోటరయంగ వలెనంచు తత్పురో
హితగురుయుక్తుఁడై వెడలి హేమమణీమయగోపురాంతరాం
చితపటచిత్రసుప్రకటసింహభయాకులవాసవైభమై. 78

క. తనరిన ఓంకారపురం
బున కేగి తదిందిరావిభూషణమై యొ
ప్పినతన మేనమరఁదిగృహ
మున కరిగినవాఁడుగడుప్రమోదముతోడన్. 79

చ. కనుగొని కౌఁగిలించుకొని గద్దియలంతగు వారితోడనా
తనివసియింపఁజేసి యుచితంబగుపూజ లొనర్చి సేమముల్
వినికుడువంగఁ బెట్టి యటుపిమ్మటనిష్టవినోదలీలలన్
దనియుచుమీఁదురాక సుఖదంబగుమాకని పల్కఁ బల్కినన్. 80

వ. తద్గురుభక్తాఖ్యుండు. 81

క. నీపల్కినపల్కులునిజ, మాపగిదినిశుభము చెందునననవ్వాలయఁగా
దావగనేటికివచ్చిన, మీపనివెత్రిఁగింపు భావమేలముచాలున్. 82

గీ. అనినమాపీరసంగయ్య కనఘుసీదు
పట్టియగుచంద్రిణీదేవివరిణయంబు
నలుపనూహించి మీతోడఁ దెలుప వచ్చి
నారమనవుడు నాతఁడానంద మొంది. 83

క. మీరుస్వతంత్రులుమీమది, గోరినపనియడ్డగించు కొనువారటనె
వ్వారచ్చటికిచ్చటికిం, భారకులై మమ్ము నడుగఁ బనియేమిటికిన్. 84

చ. అనివచియింప తత్సభికులందఱు సంతసమంది బాపురే
వననిధిమేఖలావలయవాసిజనంబులయందుబంధుభా
వనదిలకింప వీరినరివారలగాంచితిమేయటంచు పె
క్కనుతులొనర్చి రత్తఱిసకుంఠితకౌతుకమావహిల్లఁగన్. 85

క. మున్నొగ్గై నేసియుంచిన, కన్నియరప్పించి తండ్రికాంచనమణిపీ
ఠిన్నిలిపినదీవెనలిడి, యెన్నికలగ్నంబునిశ్చయించితి విప్రుల్. 86

క. అంతటతత్కన్యామణి, నంతిపురంబునకు పనిచియాగృహపతిదా
సంతోషంబుననంబర, సంతతిగట్టంగనిచ్చి సమ్మతినసువన్. 87

ఉ. వారుముదంబునందిరిగివచ్చి సుహృజ్జనకోటితో సవి

స్తారముగాఁగ తక్క్రియముసర్వము దెల్పి వివాహయోగ్యసం
భారములెల్ల గూర్చుచును బంధులకుం శుభలేఖలంపుచుం
దోరపువేడ్కనుండిరి ఘనుండగుసంగయకుత్సవంబునన్. 88

వ. అంతనచ్చటనోంకారపురాధినాథుం డగుభాస్కరావనిపాలుం డొక్కనాఁడు బాహ్యాళివెడలు సమయంబున నత్యంతరూపవిలాస భాసురయగుచంద్రిణీదేవిం గనుంగొని తత్సౌందర్యంబున కచ్చెరువంది మారవికారపూరితమానసుండై తనలోన. 89

చ. సురగరుడోరగప్రముఖసుందరులం బ్రకటింపనింటిని
ద్ధరణిననేకకోమలలతానిభగాత్రులఁగంటిఁగాని యీ
సరసిజనేత్రివంటి నెరజవ్వనిఁ జూచియెఱుంగ దీనినే
పరిణయమైనగాక సుమబాణుని బారికి నోర్వశక్యమే. 90

గీ. శైవలాండజ విద్రుమశంఖగిరిశ, రంగస్థితినాగపులినకూర్మకచలోచ
నాధరగళస్తనవళిరోమాళిజఘన, చరణయీయింతిసౌందర్యజలధిగాదె.

సీ. యువిదలమిన్న భ్రూయుగ్మంబుగానదా, పోడిమిచెఱకువిల్బూననేల
పడఁతుకసరివేణి పరికింపనానికి, పొప్పుతుమ్మెదనారి పూననేల
నెలనాగవాల్చూపు లెలుఁగడాధరనారు, పువ్వుబాణంబులు పూననేల
కలగంటిజంఘలవెలియుఁ దానాదగంటి, నానవక్రాంకంబు పూననేల

గీ. తలపనకలజగద్వస్తుతారతమ్య, వేదియగుమాధవుఁడు సృజించి మొత్త
తప్పువనియునరింతకిందర్పుఁడిట్టి, పేలగాకున్న శివునిచే నేలమడియు.

సీ. కనకాంగినరిచేసిఁ గనుఁగొన్నయంతనే, విరిపై ననాలజ్జవిడియఁ జొచ్చె
విద్రుమాధరిమోముఁ వీక్షించినంతనే, తలవనాధైర్యంబు దారగఁ జొచ్చె
కామినినేత్రముల్ గాంచినయంతనే, యెంచనామది చంచలించఁ జొచ్చె
సుందరిజఘనంబుఁ జూచినయంతనె, యుప్పొంగ నానాబుద్ధి యుడుగఁ జొచ్చె

గీ. నలినచిత్రాంగముల పాటినసయువచ్చి, పోలజాలని వాఁడైన కనీలమేఘ 93
శర్వరీనాథచంచలాసైకతముల, సరణినేనింక నేఁడనై మనువాఁడ.

గీ. ఒక్కసన్నిధిపాల ద్విపేంద్రయాన
త్రివళిచతురాస్యపంచమశ్రీనినాద
షట్పదాలకయగుదీనిన ష్టపదము 94
లేను ప్రక్కసంగెలుగుట యున్నఁడొక్క...

సీ. శరదిందుముఖియానగరిమ మత్తేభంబు, పీనపయోధరపిఱుఁదు పృథ్వి
రంభోరువీక్షణరాజి యుత్పలమాల, శాతోదరీనాసచంపకంబు
శష్కులికాంచితశ్రవణ మేనసుగంధి, తరుణిపాదయుగంబు సరసిజంబు
రమణిమాధుర్యస్వరము మత్తకోకిల, కార్ముకభ్రువు నీలకచ కుముంద
గీ. మబలకాంతివిద్యున్మాల యబ్జసదృశ
కంతిరోమాళి వరభుజంగప్రయాత
మార యీయింతి శుభలక్షణాంగయాట
నిఖిల సత్కవివరవర్ణనీయ్య గాదె. 95
చ. అనిమదిలోనఁ దన్నుఁగొనియాడుచుఁ బోవకనిల్చుభూపతిం
గనియిదియేమొకోయనుచుఁ గన్నియ తత్తరమందిలోనికిం
జనధరణీశ్వరుం డవలసాగిచనన్వలెనన్నయిచ్చలే
కనిజగృహంబుఁజేరి యెడగానియటుల్ బిలిపించిమంత్రులన్. 96
చ. తనతెఱఁగెల్ల చెప్పివని తామణి తనకొనగూడునట్లత
జ్జనకునిముందలించి యటజాగొనరింపకరండు పొండనం
బనివినివారలాతనికి పార్థివువాంఛ యెఱుంగఁ దెల్పిన
న్వనిమదిలో గలంగిగృహనేత యమాత్యులతోడనిట్లనున్. 97
గీ. అంత భూభర్త జామాతయగుటకంటె
మాకు వేఱొక సంతోషమహిమ గలదె
యైననొకవిన్నపంబును నవధరింపుఁ
డెటులకీమాట మించినదేమి సేతు. 98
గీ. ఎన్నదగువీరసంగయ్య కేలతాంగి
నిత్తుమని మున్నెవిబుధులయెడలనిశ్చ
యించినారము పలువది కేమి పలుక
ననినఁజనివారు నృపునితో నట్లతెలుప. 99
చ. కువలయభర్త వారిపలుకుల్ వినినంతనె కిన్కనెమ్మదిం
దవిలినఁగిదియాప్తవిబుధవ్రజమందఱఁ జేరఁబిల్చియా
ప్రవిమలగాత్రితండ్రి నొడబాటొనరించి మదీయభావసం
భవపరితాపవేదనలు బాపుడుపొండనినర్మ రయంబునన్. 100
ఉ. వారరుదెంచితచ్ఛ్రవణపలభుఁగన్నొని యోమహాత్మనీ

సారవివేకదానగుణసాహసకీర్తికళాపరిపూర్ణతన్
వారిధిమేఖలావలయవాసజనప్రచయంబునందునె
వ్వారికిలేదు నీమహిమవర్ణనసేయఁగమాకుశక్యమే. 101

మ. అనికొనియాడి రాజహృదయ స్పృహహర్షుఁ సచివాననంబులన్
వినిపరదేశవాసినలె వేషాకభంగిని నాడవచ్చునే
జనపతిపేదమానవులసాటిగ నెంచకుతత్కృపారసం
బెనసినమేరువాత్మణమహీనబలుండతఁడెన్నిభంగులన్. 102

ఉ. ఆడినమాటతప్పననునాగ్రహముంచకు కన్నెమున్నచో
చూడరవేడరేయొనరుశోభనవేళలతగ్గమొగ్గగా
జాడతెలుంగఁగావలదె సారసనేత్రమణీసమయంబులో
మేడలసంచరించుటకు మీమదికిఁ బ్రియమూనదయ్యెనే. 103

క. కావునమాయమాటలునీ, భావంబునఁబాయకొల్పి పార్థివునకు సౌ
ఖ్యావహముగనిక్కన్నియ, నీవలయునటన్న నాతఁడిట్లనిపలికెన్.

ఉ. పావనులారమీరనినపల్కులెసత్యముగాని యింకనా
భాషనువేఱొకర్కు లఘుపద్ధతికిం జొరవట్టులౌటధా
త్రీపరునిప్పుడెప్పగిదిఁ దెల్పఁగవచ్చునొ తెల్పితన్మనో
వ్యాపృతవాంఛబుచ్చి శమితాగ్రహుఁజేయుఁడు వేయునేటికిన్. 105

క. తొల్లిహరిశ్చంద్రమహీ, వల్లభతల్లజుఁడు సత్యవాక్యధరముపై
చెల్లింపఁబడినభాషలు, తెల్లమిగావిననెయపుడు ధీయుతులారా. 106

క. అటులగుటదీననగు ఫల, మెటులైననుఁ దెన్నమీర తెలుఁగనివద మే
నిటులనుచును దెల్పంగన, ఘటనాఘటనాఢ్యులార్యగణనుత చరితల్.

చ. అనివినివారలందఱు తదానతిఁగైకొని సత్యనిష్ఠయీ
యనవునమండఁ గావలదె యంచుమహాద్భుత మంది క్రమ్మఱం
జనితగువేళ భాస్కరరసాతలనాథునిగాంచితాము ను
న్ననివిని వారితోనసినపల్కులుసర్వము దెల్పక్రమ్మఱన్. 108

ఉ. రాజకులావతంస రిపురాజవితానతమిస్రహంసమీ
యోజనకాతఁడాత్మమదమొందుచు మున్నుగమాటమించుటన్
భాజనమయ్యె చింతలకు ప్రాజ్ఞులపద్ధతులిట్టివేకదా 109
యీజ[illegible]లుగ్రహింపని ధర్మము[illegible]లెడిన్.

క. మీరేలెడు రాజ్యంబున, సారమతిఁ సత్యనిష్ఠ నలుపుచునుండే
వారలుగలుగుటమీకే, తోరపుసత్కీర్తి కాదె దుష్టవిదూరా. 110

ఉ. కావలెనన్న నీ వెలఁదికంటెమనోజ్ఞవిలాసరూపరే
ఖావిమలాంగులై తనరు కన్నియలెందఱు లేరునీకుత
త్పావనశీలుమాట యద్రువంబుగఁజేయు ననుగ్రహింపు పృ
థ్వీవర నేడు మామనవిదప్పక సన్నధరస్మితాస్యుఁడై. 111

క. మంచిదిపొండనివారలఁ, బంచిధరాధరుఁడు పంచబాణవశుండై
యించుకనిలువగజాలక, పంచాననమధ్యయున్న భవనంబునకున్.

క. ఏకతమయేగ నాతని
రాకనుతలిదంద్రులరసి వ్రీచలితతనులై
వ్యాకులమునొందఁగనుగొని
యాకన్నియ ధైర్యమూది యపుడిట్లనియెన్. 113

ఉ. ఏమిటికింతభీతి ధరణీశ్వరుచేనగునట్టి దేమినా
స్వామియనుగ్రహంబున వెసంజని వానికిలోకులేక ను
ద్దీమహితోక్తుల న్మనను ద్రిప్పి బిఠాలునసాగఁబంపిమీ
కోమలపాదపద్మములకుఁ బ్రణమిల్లఁగ నేగుదెంచెదన్. 114

చ. అనియిటులూరడంబలికి యప్పుడు చంద్రిణి దేవిభూపతిఁ
గనుగొని చెల్లెలుంగనెడు కాంతమెయిఁ జనుదెంచినారొర
మ్మనిమణిపీఠమిచ్చిననిజాస్యమునన్కళదప్పనాతఁడో
య్యనవసియించియున్నకమలాయతలోచనపల్కెఁ గ్రమ్మరన్. 115

గీ. అన్న నాపైనిప్రేమచే నరుగుదెంచి
నారొ మేలయ్యెనాయంతవారుతోడ
బుట్టుటొటమదీయమహాపుణ్యమహిమ
గాదె యేభాగ్యములకైన కడమగలదె. 116

చ. అనవినియాతఁడిట్లనియె నంబురుహాయతనేత్రనీవయిఁ
ఘనతరవాంఛ నేనిపుడు గన్గొనవచ్చిననిట్టులాడఁగా
జను నెకఠోరవాక్యములునర్వములున్నెయెఱింగినన్నువం
చనయొనరింపఁజూచుటకు చాలఁగనద్భుతమయ్యెనెమ్మదిన్. 117

చ. వనధరవేణినాదయిన వైభవరూపవిలాసవైఖరు

ల్గనితముదారెవారిరుహగంధులు కొందఱునన్వరించిరా
యనువునఁగాదు సేవభవదాకృతికిఁ భ్రమఁజెంది వేడ్కఁగ
న్గొనరు దేరనామననునొవ్వఁగ నాఁడఁగనీకునాయమే. 118

చ. అలయికలేక నెంతపనియైనఁ దలంచినమాత్రసూర్చుకో
గలుగు బలంబునాయెడలఁ గల్గియు నీమదినొచ్చునంచుని
ట్టులనొకరుండపచ్చితి కడుంబ్రియమందఁగ గారవించినా
పలుకుగ్రహించినన్ను మరు బారినిద్రోయక నేలుకోమలీ. 119

చ. నిరుపమభోగభాగ్యములు నీవశమౌనటు సేయువాఁడనా
తరుణులనీవుఁబంచనటుతప్పక సేయనొనర్చువాఁడభా
సురతర తావకీనకృపఁజొప్పడురీతి మెలంగువాఁడన
న్వరిణయమైనుఖంపుమనినంజలజాననవానికిట్లనున్. 120

క. పరిణయమొందిననతులం, గరిమంబెండ్లాడువారుగలరెధర్మము
ద్గురులుననుమున్నెయొసఁగిరి, సరసాగ్రణియైనవీరసంగయకెలమిన్.

ఉ. రాజవుసర్వధర్మపరిరక్షణదక్షుఁడవిట్టులన్యనీ
రేజదళేక్షణాతతిపరింపఁగనెమ్మది వాంఛసేయుటే
యోజదశాస్య కీచకమహోగ్రబలాధికులిట్టికోరిక
న్తేజముద్భంగికీర్తి చెడినీఱయిపోవుటనీ వెఱుంగవే. 122

గీ. పరసతీసంగమంబునఁబరిఢవిల్లు
సౌఖ్యమిలననణుమాత్రమైబఱఁగుదాన
నొదవుపాపంబుభూమిధరోపమాన
మైనిలచునేటికిట్టితుచ్ఛానుభవము. 123

క. సరసాన్నపానములుమం,దిరమునగలిగియునుతిరియదివిరెడుగతిభా
సురకులకామినులుండఁగ, ధరణీశ్వరయన్యవాంఛదవులంజను నే. 124

వ. అనిన నతండచ్చోటిమాటలుగీటునం బుచ్చుచు క్రమ్మర నిట్లనియె.

సీ. శాలనీవీక్షణబాణముల్ నామీఁద,వ్రాలి దేహంబుదూరకయమున్న
తరుణినీమధ్యకేసరినామనోగుహ, నెసని ప్రాణంబులుగొనకమున్న
తరలాక్షి నీయానదంతినా మోలను,*యట్టాడి కాలరాయకయమున్న
పడతినీనూగారుపామునా యెదుటగ, న్పట్టిప్రాణముగ్రసింపకయమున్న

* 'మట్టాడి' యని పాఠాన్తరము.

గీ. ధరనహింసకుమిక్కిలిధర్మపథము
లేదనెడుమాటనీమదిఁబాదుకొల్పి
ప్రేమదొలుకాడనస్మరతాపపీడవీడ
నన్నుదయనేలుకోఁగ చేసన్ను తాంగి. 126

వ. అనిన తద్వధూవతంసం బిట్లనియె. 127

ఉ. నాలుకనంటినంత నెఘనంబుగ చేదగువేము మీఁదరొ
గ్గాలినడంచి దేహమునకంచితసౌఖ్యమొసంగు మెక్కుచో
మేలగుమాధురింబరఁగుమీఁదట ప్రాణమెడల్పునాభియా
పోలిక తెల్లమాపిదప పుణ్యముపాపము నేయువారికిన్. 128

వ. కావునఁ బ్రస్తుతసుఖంబునభిలషించి ఘోరదుఃఖంబు నొందకుమనిన తద్ధారుణీవల్లభుం డి ట్లనియె. 129

సీ. సుదతినీజంకెనచూపున బెదరించు, నతిగంధపొడిబూదిజల్లుమేన
తెరవనీకొనగోళ్ల చురుకులంటగ జేయు,తరళాక్షి నెఱి వేణిత్రాట మోదు
చతురాస్యనీబాహులతికలబంధించు, నరిగళరవమంత్రసరణినెరపు
కోమలివరకుచకుంభ ములగ్గాన్పింపు, చెలియధరామృతసింధువానఁగు

గీ. నాతినీ దేహవిద్యుతిజ్యోతిసిలుపు, పడతినీ నరగాలిచేఁ బారఁజిమ్ము
పంకజాననననుబట్టిబాధ బెట్టు, గడునుసలరాచభూతంబువిడుచుగాని.

క. వేఱెయొకసరణినామది, మీఱినతాపంబు చెడదు మీనేక్షణనం
దేఱికృపంగనుగొనుమిక, మాతాడకుమనినకుపితమానసయగుచున్.

క. నోటికివచ్చినగతియిటు, మాటికిదుర్భాషలాడమనుజేశ్వరనీ
కేటికిధర్మముచెడిమముఁ, బోటులకాసింపనీదుఁ బోడిమిచెడ దే. 132

చ. అనవుడుతోఁక ద్రొక్కినమహాహివిధంబున కోలఁ బెట్టుడా
కినపులిరీతి బిట్టదరి కిన్కమనంబుననుప్పతిల్లలో
చనములు నెఱ్ఱదోఁప పెలుచందనుగన్గొను రాజుగాంచిబ
ల్మినితనుబట్టునోయనుచుమీనవిలోచనజంకెనెమ్మదిన్. 133

క. దుర్మార్గుఁడుకామాంధుఁడు, ధర్మవిహీనుండువీడుతలఁచినతలఁపుల్
నిర్మూలముచేసికృపా, ధర్మాచలధన్వినన్నుభావింపఁడొకో. 134

చ. పులిబారిఁజిక్కుధేనువు, మెలగంగాలేనికరణిమీఁదెఱుఁగనియీ
పలుగాకిబారిఁజిక్కితి, తలఁగిచనంజాలనింకఁదరిమెయ్యదియో. 135

సీ. వీనినెట్టులయినవిడజిమ్మపోమెద, నంటినాయబలనున్యాయసహిత
ధర్మమార్గములఁబోధయొనర్చితలఁగెద, నంటినామున్న నేనాడినట్టి
పలుకులన్నియునునిష్ఫలములైచనురద్ది, చేసియెవ్వరికైనఁ జెప్పికొందు
నంటినామఱివీనికంటెనిక్కడ నెక్కుఁడగువాఁడు లేఁడు కోపాగ్నిశిఖల
గీ. మడియఁజేయుదు నంటినా పుడమి రేని
గూల్చుటమహానుపద్వనిగూల్చుకంటె
నెక్కుడగు పాపమనియందు రెల్లబుధులు
గానయెద్దియుపాయంబుగానబడదు. [దోఁ
క. అనిచింతనొందుసమయం, బుననొక్కయుపాయమురగభూషణకృపఁ
చినన బ్బాలారత్నము, జనపతికనుకూలమైనచందముదోఁపన్. 137
గీ. కాలయాపనంబుగావించిభూపతి, సాగనంపితండ్రిసంధిదప్ప
నింకనిలువుదాననేనంచుమదనిశ్ప, యించియతనితోడనిట్టులనియె.
ఉ. ఎన్నివిధంబులరవలవదేమిటికీతమకంబటన్న నా
విన్నపమొక్కటైననృపవీనులఁజొన్పవునీకుఁ గట్టిగా
నన్నుపరిగ్రహించెడిమనంబిఁకనింగినిమాన్పువారలీ
యున్నజనంబులోఁగలరెయుత్తమయుత్తమునెన్న నేటికిన్. 139
మ. ననుసంతోషమునొందఁజేయుటయెమిన్నా యంచునూహించి తే
నినరాధీశ్వరయేడునాఁడులెడమీాయంగావలెన్ నేటికిన్
చనఁగాభూనగధీశపూజనలువర్ నాయంబుమావంగడం
బున నేనట్లయొనర్పఁగావలయుముప్పూటల్ వివాహార్థమై. 140
ఉ. నావుడుసమ్మతించిజననాయకుఁడింటికిఁబోయెఁబోవత
త్పావనశీలయంతతలిదండ్రులకాగతిఁదెల్పవారుధా
త్రీవరుదుండగంబుసుదతీమణిపూనికయంతవ్రాసిన
ద్భావుఁడువీరసంగయకుఁ బంపినగాంచి యతండునెమ్మదిన్. 141
చ. హరహరయెంతపాపమునకాస్పదవృత్తి వహించెనేఁడుభా
స్కరధరణీతలేశ్వరుఁడు చంద్రిణినేకిరియువాంఛదీరనే
పరిణయమాడు నాకుటిలభావుని నేకిరియు దెప్పరింతునే
సరణిఘటించునోశరభసాళువమూర్తి యటంచునత్తరిన్. 142
వ. చింతాక్రాంతుండై యున్నతఱి ... జ్జన ... ముద్దికరుదెంచి

తన్ముఖంబున నావృత్తాంతంబువిని బలవద్విరోధంబు చెందుట భా
వ్యంబుగాదు గళ్యాణోత్సవంబు సమకూడదు రహస్యంబుగాఁజని
వివాహంబొనర్చుకొనివచ్చుటమేలని నిశ్చయించి యాస్థితిసంగయ్య
తోఁదెలిపి యతనినొడంబఱచి పెండ్లికొడుకుంగావించి యొకయుత్త
మాశ్వంబుపై నెక్కఁబనిచి యుచితపరివారంబుతోనేగి. 143

గీ. తారువేడుకవెడలియోంకారపురము
జేరఁబోవుచుఁదమవార్తవారికెఱుక
పఱుపదగువారిముందటఁబంపితోనె
నాఁటిరాత్రియె యేగిరన్నగరమునకు. 144

చ. సిరిదళుకొత్తనిప్పగదిఁ జేరనిగూఢతవియ్యపిల్లున
త్వరమునఁజొచ్చి యప్పుడె వివాహమొనర్పఁగఁజేసి తద్వధూ
వరులహయంబుపై నునిచిబంధులతోనరుదేర నప్పురం
బురవడితో సిర్గమించిమహోత్సుకతం విభవంబుమీఱఁగన్.

ఉ. భూరిగుణాఢ్యు నిప్పగిదిఁబోవుచునుండఁగ నంతలోపలం
చారుఁడొకండువచ్చి ధరజాగిలిమ్రొక్కి మహీశనీమర్దిఁ
గోరినచంద్రిణీమణిని గొంకకనొక్కఁడు పెండ్లియాడపెం
పౌరహినేగెఁ బాననరసాధిపవర్యుఁడుదగ్రకోపుఁడై. 146

మ. అవురా యింతకువచ్చె నానుదతిసూర్యన్గాల్చి నిగ్గాంతుమూ
డవనాఁడొండొక మాయఁబన్నినను వీడంజేసి లోలోపలం
ధవునింబిల్వఁగ బంచితోనకనియెం నమ్మంగరాదెయ్యెడం
జివురుంబోడుల బేలనైవిడిచితిం చేఁజిక్కఁ కాంతామణిన్. 147

మ. భువిపులినోటికండగొను పోలికవేడుక నేవరింపఁగో
రువనజనేత్రి నిన్నొరులకుం గనకుండ వివాహమైనభాం
ధవుఁడయి యేగెవానిపటుదర్పము గీటణగించియిప్పుడా
యువిదమరల్చి తెత్తునని యుగ్రిదవానలరేఖ మండుచున్. 148

శా. సేనానాథులఁబిల్వఁగాఁ బనిచి యక్షీణోద్ధతిస్మీరలా
హీనాత్మున్మడియించి దత్సుదతిఁదెండేగుండుమీవెంటనే
నేనువ్వచ్చెదనంచుపంప భటదంతిస్యందనాద్యాదిసే
నానీకాభియుతంబుగా కదలెరుద్యద్వాద్యదర్పంబులన్. 149

శా. ఆరీతిన్ జనివారలందఱు వివాహోయాతమర్త్యావళిం
దూరంబేగఁగనీకఁ జుట్టుకొను నిర్దోషాత్ముఁడా వీరసం
గారాధ్యుండు హయంబునిల్పి రిపుసేనాళి న్విలోకించి యిం
కేరీతిన్ జనవచ్చు శత్రువులనే నెబ్భంగినిర్జించెదన్. 150

చ. పటుతరదర్పమొప్ప పరిపంథులఁగూల్పఁగ శక్తిచాలదే
నటయిటతప్పరించి చన నాయితుగాదు లతాంగిఁ జేకొనం
గుటిలమహాధవుం డిటుల గొంకకనాపయిదాడివెట్ట హా
కటకట కాంతనిచ్చి చనుకంటెశరీరము వీడ మేలగున్. 151

ఉ. కాంత నెపంబువెట్టి నను కత్తుఁపాలుగఁజేయఁ బూనినేఁ
డింతకుదెచ్చినాఁడు హృదయేశ్వరుఁడాశరభావతారుఁడా
వంతయు నైనప్రాణమున కాసయొనర్ప సతీలలామకై
చింతయొనర్తునేనగలిసెన్ వెరవెద్దియొకో తలంపఁగన్. 152

వ. అని యొక్కింతసేపు విచారించి యంతలోననే తెలివొంది యారా
పాంచభూతికవికారంబున కెంతతలంపుపుట్టె సకలజగత్సంహారకార
ణం బైనత్రిపురారింగొలుచువారల కసాధ్యంబులుం గలవే యని
నిశ్చలచిత్తంబున నిమీలితనేత్రుఁడై యీశ్వరపదధ్యానంబు సేయు
నంతలోన. 153

శా. కాళీదుర్గలుపక్షముల్ రవిశశిగ్నానేత్రముల్ తీవ్రదం
భోళిప్రాయనఖంబు లష్టచరణంబుల్ వ్యాధిమృత్యూరు లు
త్తాలజ్యోతిశిరద్వయంబు తటిదుద్యజ్జిహ్వాలౌర్వానల
జ్వాలాభైరవకుక్షిపక్షములు దివ్యద్బాహుసాహస్రముల్. 154

చ. తనరఁగగానుపించిమది తల్లడమందకు వత్స శారభం
బనఁదగుమూర్తి నేనిటదయామతితావకవాంఛదీర్పఁగా
బనిగొనివచ్చినాఁడ నవపద్మదళాయతనేత్ర వేగఁ జే
కొని పరిపంథిసంతతులఁ గూల్పఁగజాలుదువంచుఁ బల్కుచున్. 155

గీ. పావకాస్త్రస్వరూపమై పరఁగుమండ
లాగ్ర మొకటిచ్చి యాయుజ్జ్వలాయుధంబు
శత్రువులమీఁదఁజళిపింప జ్వలనశిఖలు
దీనఁజనియించి తచ్చమూ[illegible] 156

చ. అనుచు తిరోహితుండయి యింతటదెప్పిరి యద్భుతంబుగా
తనకరమందువాఁడియుడిదంబు గనుంగొని మోదమంది సం
గన తనతల్లితండ్రులకు ఖడ్గముఁ జూపి ప్రసన్నుఁడై వచిం
చినశరభేశభాషితవిశేషము సర్వము తెల్పియంతటన్. 157

గీ. సంతసంబెసంగ సకలబంధువులకు, జడుపువాపియప్పుడు పుడమినడఁకఁ
గడలు వ్రీలలీల గర్జోపమానమౌ, సింహనాద మెలమి సేయుటయును.

వ. అమ్మహాధ్వని వినునంతనె పరిపంథివరూధినీసముచ్చయంబెల్ల
బెదరు గదురఁడిల్లవడి చూచుచున్న సమయంబున వారిపిఱుందనరు
గుదెంచుమానవపతిబానును భయకంపితతనుండై డాయనోడి త
త్ప్రాంతోన్నతశైలారోహణం బొనరించి కనుంగొనుచుండె నంతన
బ్బలంబులు నిజసేనానాయకప్రేరితంబులై ధైర్యంబు నవలంబించి
యసిముసలముద్గరప్రాసాదిసాధనంబులతో సమరాభిముఖులై యొ
క్కపెట్టుగవిసిన నవ్వీరసంగమేశ్వరుం డత్యంతభక్తితాత్పర్యంబున
శరభసాళువమూర్తిం దలంచి పావకాస్త్రస్వరూపంబైన నిస్త్రింశం
బొఱవెఱికి ప్రావృట్కాంచలోపమానంబుగా జళిపించిన తత్ఖడ్గంబు
వలన సంవర్తసమయతాండవధురీణత్రిపురహరఫాలాంబకోద్భూత
తేజోమాలికాభీలంబై యొక్కయనలం బావిర్భవించి తద్వీరు
లంజుట్టుముట్టి దహించి పంచత్వంబునొందించిన నందొక్క శరణ
పుంగవు ప్రాణంబుల బ్రహ్మరంధ్రంబుల వచ్చుకొని తేజోరూపంబున
దివంబునకేగు నవసరంబున తత్కళేబరం బాయోధనబహిఃప్రదేశం
బునఁబడిన వీరసంగయ గనుంగొని. 159

ఉ. అక్కట మోసపుచ్చె శరణాగ్రణిజీవము గొంటి నింత నా
కెక్కడి మోక్షమేడ యశమేటిదిభక్తి మదిష్టమూర్తినే
డెక్కడభక్తహింస ఘటియింపఁగఁబోలునువాఁడి ఖడ్గమే
నెక్కరణిం సహింతు తనకీపగయున్నెటనుండి యుండెనో. 160

చ. అనుచు విషాదమగ్నహృదయాంబుజుఁడై గణవర్యుఁడోడఁ దా
నును మృతిఁజెందఁగాఁదలఁచి నూల్కొను ధైర్యమునన్ గటారిచే
గొనియదనూనునంటనెనొకో యనితచ్చరణుండు లేచియో!

యనఘుయిటులచేసెదనిహ_స్తముపట్టి మరల్చెనంతటన్. 161
శా. శైలాగ్రింబుననున్న రాజవరుఁడాచందంబు వీక్షించి స
చ్ఛీలుండీతడు శర్వభ_క్తితతి వంచింపండు నేనిప్పుడా
లీలంబోయి మదీయపద్వినతుఁడై లేవంగఁబోనంతలో
గూలంజేయుదు మత్ప్రహారవిహతిం గొంచింపఁగా సంగయున్. 162
వ. అని తలంచి. 163
చ. గళహృదయాంశశీర్షతలకాయముల్ శశిహారనాయకో
జ్వలమణిశాటికామకుటచర్పలెడల్పియుగొప్పశ_క్తిచే
వెలయఁశివాత్మముల్ గిరిశి పేటిక గావిపటంబున్ జటా
వళిభసితంబు దాల్చిగణవర్యుని చందముఁదోఁపన_త్తరిన్. 464
క. చనుదెంచియెదుటనిలచిన, జననాయకుఁగాంచివీరసంగయ్యముదం
బునకేవలశరణాగ్రణి, యనియెదురుగనేగిమ్రొక్కినంతటిలోనన్.
క. కేలనున్నట్టిశితకర, వాలంబుననతనిశిరముమైవఁగనదిపూ
మాలికయైకంఠంబున, వ్రేలెధరావల్లభుండు వ్రీడంజెందన్. 166
క. ఆక్షణమునగిరిజేశ్వరు, డుక్షేంద్రమునెక్కినిర్జరోత్కరయుతుఁడై
సాక్షాత్కరింపసంగయ, యక్షీణముదంబుతోడనతనికినతుఁడై. 167
మాలినీ. శమనమదవిభంగా చంద్రఖండో_త్తమాంగా
కమలనిధినిషంగా కాళికాత్మాబ్జభృంగా
యమృతనిజనిభాంగా హ_స్తసంభ_క్తరంగా
దమినుతగుణసంగా దైవవేశ్యాభుజంగా. 168
గీ. అనుచువినుతించు నాతనిఁగనిశివుండు
వాంఛితంబెద్దివేడుమోవత్సయనిన
పెండ్లివారికిమాకునీపృథివిపతికి
తాపకీనపదంబిమ్ముధర్మవాహ. 169
వ. అనిన శర్వుం డిట్లనియె. 170
క. శ్రీవీరసంగసంతత, కోవిదనుతసుగుణసంగకువలయపతిదు
ర్భావుడువీనికిమోక్షం, బేవిధినివ్వంగవచ్చునెఱుఁగవె యనినన్.
శా. స్వామీయిట్టులనానతీయతగదీసర్వంసహాభ_ర్తచే
నేమీ...

దాపైఁదాలిచిమిమ్ముఁగన్గొనియె నీతండెన్నిచందంబులన్
సామాన్యుండని యెంచఁబోక దయమోక్షంబిచ్చిరక్షింపవే. 172

చ. అనినదరస్మితాంచితముఖాంబుజుఁడై పరమేశ్వరుండు త
జ్జనవరుఁబెండ్లివారలను సంగయనాతనియంగనామణిం
గొని చనె రౌప్యశైలమునకున్ సురలచ్చెరువంద నట్లుగా
వున శరణప్రభావముల పూర్వములాత్మగణింపభూవరా. 173

బెట్టిదదేవరసుకథ.

వ. అనిన బసవేశ్వరునితో బిజ్జలుం డిట్లనియె. 174

ఉ. తొల్లిటిపట్టిముచ్చటలు దొడ్డుగఁజెప్పిననెట్లునమ్ముదున్
కల్లయొ నిక్కమో యిపుడుగన్గొనవారలలోన నేరికిం
జెల్లపుతత్ప్రభావములు చెప్పినయట్టులనీగణాలిలో
తెల్లముచేయుమారొకని దివ్యమహత్త్వముచూడ నిత్తరిన్. 175

క. అనిఁబసవేశ్వరుఁడిట్లను, జననాయక యెవ్వరైనశరణావళిచే
కొనవ్రేలిగోరబోలరు, మునుపే మిపుడేమి తథ్యముగగనుమనుచున్.

క. కట్టెదుటనిల్వఁబడనీ, బెట్టిదదేవరసుగారి పృథువిక్రమ మా
పట్టణభక్తకుఁజూపఁగ, దొట్టినసంతోషమాత్మదొలుకఁగఁబలికెన్.

క. నృపుఁడన్నమాటవింటివె, యపరిమితమహాప్రభావయనుసంత నెతా
కుపితాంతరంగుఁడై కా, శ్యపిగగనంబంటబెరిగెనభతల్లడిలన్. 178

వ. ఇట్లు పెరిగి బసవేశ్వరు నుద్దేశించి. 179

సీ. సరసిజాతాబ్జసత్త్రగ్రహంబులు, బొరనూదునో యోపప్రిపన్నపోష
మలజాదిసురలఁ బొమ్మలరీతికరములఁ, బట్టియాడింతునో భాను తేజ
యేడుసముద్రంబులిలవసంతంబుగా, చల్లునాడుదునో ప్రసన్నహృదయ
యుర్వీధరంబులొండొంటితో దాకించి,నురుము సేతునుమామనో వసంత

గీ. యేమియానతియనిబసవేశ్వరాఖ్య,సంజ్ఞనొకగట్టుపెకలించిశయ్యకనిష్ఠి
కాంగుళిపునర్భవంబుచేనాకసమున, కెగరజిమ్మిననదిబంతివగిదినెగసె.

క. ఆరీతినెగయుఁగిరిఁగని
యేరిపయింబడునొయనుచు నెంతయుసభలో
వారెల్ల బెదరిగనుఁగొన
బోరుననదిపుడమిదొరిగిపొడిఁబొడియయ్యెన్. 181

ఉ. అత్తరిలేచిబిజ్జలధరాధిపుఁడంగముకంపమొంద న
త్యుత్తముఁడైన దేవరను నొయ్యనఁజేరి నమస్కరింపుచు
న్మత్తుఁడ క్రోధచిత్తుఁడ క్షమాగుణహీనుఁడ నైననాకు నీ
విత్తరికూర్మిచేనభయమీయుగ దే శరణాగతావనా. 182

సీ. భీరహితపురామరారివీరానీక, మారకుండగునాగహారిరూపు
ఘోరపరాక్రమతారకదైత్య సంహారుఁడైనట్టికుమారురూపు
పారమేశ్వరభక్తిదూరదక్షవినాశ, కారుఁడౌ వీరావతారురూపు
నీరేజభవశిరోదారణుండగుకాల, భైరవమూర్త్యాఖ్యశూరురూపుఁ

గీ. బోలునీరూపుశమియించిపూర్వసరణిఁ
దనరిజనలోచనానంద మొనరఁజేయు
మనినుతించినయప్పటిశిసువుదాల్చె
బసవముఖభక్తతతికిసంతసమెలర్ప. 183

క. పరగుణుఁడగుబెట్టిద దే, వరనుచరిత్రంబువినినఁబఠియించినయా
నరుఁడరితరిబారిగొనిసు, స్థిరతరశుభసంతతులనుజేకొనుధరణిన్. 184

క. కావునఘనుఁడీబెట్టిద, దేవరసయమహిమలిట్టితెఱఁగగు మఱియున్
భూవిదితంబుగచిత్రము, పావనగుణవీరభద్రపార్థివవినుమా. 185

క. కలిదుర్మాయారహితుఁడు, సలలితజంగమపదాబ్జజాతామిళితుం
డలఘుతరకీర్తియుతుఁడీ, గిలకదమారయ్యయితనికృతి మెఱిగింతున్.

గిలకదమారయ్యకథ.

సీ. తనువునభస్మలేపనమొప్పనొనరించి, గండపెండెరమొక్కకాలిడాల్చి
కరకచల్లాణంబుకాసెతో బిగియించి, పటికంపుపోగులేర్పడధరించి
గళమునపాలకాయలసంకునరులేసి, ఘనమైనమేనయోగములుదొడగి
ఫాలభాగమునందుబ్రాణలింగమునిల్పి, పసిమిమీరెడుశాల్వపైనిగప్పి

గీ. కన్నొనలకజ్జలముదిద్దికావిబొట్టు
ఫలకమునంబెట్టినాభిశిలమునఘుంట
యునిచిరొక కేలగిలకయునొక్క కేల
బొమ్మయునుబట్టికళ్యాణపురమునందు. 187

ఈ. వంచనమింతలేకగణవర్యగృహంబులకేగిగిల్కవా
యించుచుఁ గేళిబొమ్మనటియింపఁ న నేత్రసుఖాలి వారుమ

న్నించి యొసంగు కాంచనమణిప్రచయాంబరవస్తుజాలము
లొక్కొంచరుదెంచి భక్తవరకోటిసమర్చలొనర్చుచున్నెడన్. 188

గీ. ఆవిధముజనులంతటనాడుకొనఁగ
వినిగణాచారిసంగయ్యయనెడుభక్త
పుంగవుఁడుతీవ్రకోపవిస్ఫూర్తితోడ
మారయాఖ్యునిబిలిపించితూలిపలికె. 189

ఉ. మాయలబొమ్మ పట్టి పలుమారునటింపఁగఁజేసి దాన నా
దాయముగూర్చిశైవగణతండసమర్చలొనర్చుకున్న లే
దాయనె పేఱెయొక్కసనయంబగు కాయకమిట్లు సేతయే
నాయముమాననూనదగునాధరణీస్థలిభక్తకోటికిన్. 190

క. మేదినిశరణులులింగవి, నోదంబులునిరతమగువినోదానుభవం
బేదిక్కనొనరించిరి, నీదగుచరితంబుదలఁపనింద్యంబయ్యెన్. 191

గీ. కుండచరపురకుమ్మరగుండవిభుఁడు
చప్పటలువేసిచారమచక్రవర్తి
హరునినాడించిరాగతియవలఁబుచ్చి
మాయచేఁబట్టియాడింపనాయమగునె. 192

చ. అనవుడతండు మ్రొక్కివినయంబుననిట్లనుసంగమేశనీ
యనుమతియట్లుగాఁగనయంబుఁజరించెదఁబొమ్మయింకఁజే
కొననిపల్కిగేహమునకుంజనియెప్పటిరీతికాయకం
బున కయియొక్కమేటిగణపుంగవునింటికిఁబోయియచ్చటన్. 193

చ. అలరకరస్థలింగమవుడాత్మకరంబుననిల్పివింతగా
గిలగిలనాగగిల్కయొకకేలఁగదల్పఁగహస్తపద్మసం
కలితభవుండు షట్పదముకైవడిగంతులువేయఁజొచ్చెవి
చ్చలవిడిచూచువారుమదిసంతసమందఁగనంతలోపలన్. 194

ఉ. శైవగళోత్తమాంగకరసారసకక్షముఖాంగదేశయు
క్పావనలింగముల్ప్రథితకాంచనపీఠనియుక్తలింగముల్
స్థావరలింగముల్ గదలితాండవమాగతినాడఁజొచ్చినం
భావములందు నద్భుతముపర్వఁగభక్తవరేణ్యు లొండొరుల్. 195

గీ. మేటికలలోన వస్త్రంబుషూటలందు

కరతలంబుననున్న లింగములుగంతు
లేయఁగాఁ జొచ్చె యిదియేమి మాయ మొక్కొ-
యనుచు నందఱుబసవాలయమునకరిగి. 196

ఉ. ఆతనిగాంచితన్న టనమంతయు దెల్పస్వలింగమూర్తిము
న్నాతెఱఁగొటచిత్తముననద్భుతమందగఁ శంకరద్విజ
వ్రాతముపూర్వశైవనికరంబులుస్థావరపీఠలింగసం
ఘాతమునాట్యమల్లనెభయంబెదనొందఁగవచ్చిచెప్పినన్. 197

మ. పరిశీలింతమటంచునున్న యెడ నొప్పంబట్టణోదంతముల్
నిరతంబున్వినుపించుచారుఁడొకడోలిన్వచ్చి సేవించి యో
వరమంత్రీశ్వర యిప్పురాంతరమున న్వక్రువ్వఁగా రాని చి
త్రరసంబొక్కటిగాంచివచ్చితిని తథ్యంబెట్లనన్ దెల్పెదన్. 198

వ. గిల్కమాదరాఖ్యుం డొక్కభక్తసత్తముండు. 199

గీ. బొమ్మనాడించి తల్లబ్ధిపూటపూట
నయ్యలనుబూన్పసంగయ్యయనెడిభక్తు
డీసరణిగూడదనబొమ్మనెడమకేల
లింగమూర్తినాడించెభక్తాంగణముల. 200

గీ. మారఁడింతటిభక్తుఁడోమదనవైరి
తనకుదానాట్యమాడెనాతండుచెప్పి
నటులయిాచిత్రమెచ్చటనైనగంటి
మే యనినదండనాథుండుమెచ్చియపుడు. 201

క. వారందఱితోసంగయ, గారి శుభాగారమునకు గ్రక్కునఁజనిజో
హారుతరలింగనర్తన, కారణమున చోద్యమంద ఘనపదములకున్.

క. జోహారుసేయనాతం, డాహాయిదియేమివింత యధికులుమీరి
ట్లూహింతురెయనిక్రమ్మర, నాహరభక్తార్యవితతియడుగులకొరగెన్.

వ. తదనంతరంబ. 204

చ. బసవఁడు సంగమేశుఁగని పల్కెను గిల్కదమారశూరికి
వసదృశబోధసల్పమమునందరిని త్తఁటిలింగమూర్తిచే
పసచెడిమోదచేసితివి బాపురెయాతనిచర్యలెన్నఁగా
బినరుహగర్భశేషగిరిభిద్గురుముఖ్యులకైనశక్యమే. 205

ఉ. మాయనుబొమ్మచేసి గణమండలియిండ్లకుఁ గోఁతికై వడిన్
బాయక త్రిప్పి వారిపదపంకజములఁ గొలువంగఁ జేసె న
య్యాయతశౌర్యుఁ డిట్టిగతి యర్హముగాదని మాన్పఁ జెల్లునే
ధీయుత యింకనైన తొలితీరున వానిఁ జరింపఁ జేయువే. 206

చ. అనవుడు లజ్జనొంది బసవాధిపనేరముచేసి నాఁడ నీ
యనుపమమర్మమే నెఱుఁగనైతిన టంచువచించి వేగ మా
రని బిలువంగఁ బంచి గణరత్నము తావకదివ్యలింగమూ
ర్తిని నటియింపఁ జేయుకుము దేశికవర్యులయాజ్ఞ నీవనన్. 207

ఉ. ఓగురులార తొంటిగతి యోగ్యముగాదని యంటి రిప్పుడీ
లాగున గూడదంటిరి కళాధరభూషణభక్తపూజలే
లాగున నింకఁ జేయుదు తలంపఁగ కాలము మించఁ జొచ్చె నా
కేగతి యానతిచ్చెదరొ యిండని మారని గాంచి నవ్వుచున్. 208

క. సంగయతో బసవసచివ, పుంగవుఁడును నితని కొక్కబుద్ధి దెలుపుఁడీ
జంగమగురులింగార్చన, భంగముగా ఖండనని భయకంపితుఁడై. 209

శా. గిలకదమారతొంటిద గుకృత్యము జేకొని పొమ్మటన్న న
ప్పలుకుఁ దలంధరించి యటవారలకుం బ్రణమిల్లి యప్పట
ట్టులబొమ గొంచు వేజనెగడు నుమ్మదమందుచు నైజవృత్తికి
యలఘుఁడు వీరభద్రవసుధాధిపయన్న దరంబె యాతనిన్. 210

వ. తదనంతరంబ సకలశివలింగంబు లీనర్తనంబు మానుటయు బసవేశ్వ
రార్యుఖిలభక్తపుంగవు లీతని మాహాత్మ్యంబు గొనియాడుచు నిజని
వాసంబుల కరిగి రట్లు గావున. 211

క. అలఘుతరభక్తియుతుఁడగు, గిలకదమారన్నమహిమ కీర్తించిన ని
శ్చలమతి విని నన్మాయు, దొలఁగుఁ గసద్గురుకృపాయుతుఁడగు నరుఁడిలన్.

— ఈయురులింగపెద్దయ్యకథ. —

వ. అదియునుంగాక. 213

ఉ. యీ యూరులింగపెద్దివథ మేమని చెప్పఁగవచ్చు దేశికేం
ద్రాయుతసత్కృపాగతి శివాధిపమంత్రకళారహస్యబో
ధాయుతుఁడా ప్రశితావనవిధానవిచక్షణుఁ డిష్టలింగపూ

జాయనసత్ప్రవర్తిసుకృతాత్ముఁడు సూనృతవాక్యుఁడిమ్మహిన్. 214
ఉ. ఈతఁడు మోగులూరజరియింపుచుఁ దానొకనాఁడుపుష్కరో
ద్భూతమరందపానపటుతుందిలషట్పదమేచకప్రభా
కైతవకందదర్శనవికస్వరహృచ్ఛిఖిభాసితప్రభూ
జాతకుడుంగమాసరసిసైకతదేశమునందునొక్కచోన్. 215
గీ. కలితపద్మాసనస్థుఁడై కనులుమూసి
జపమొనర్చెడిజంగమసార్వభౌము
ధీరునురులింగమనియెడుదివ్యపురుషుఁ
గాంచియల్లంతనుండిజాగఁబడిమ్రొక్కి. 216
చ. నిలచినకొంతసేపటికి నీలగళాపరమూర్తియైన య
య్యనఘుఁడు మానవృత్తినిడి యక్షులువిప్పికనంగనంతలో
పలదిరుగంగమ్రొక్కివెలివాఁడమనుష్యుఁడపెద్దయాఖ్యుఁడర్క
ఖలుఁడనునన్నుశిష్యునిగ కైకొనివేగకృతార్థుఁజేయవే. 217
క. జననియుజనకుఁడుదాతయు, ఘనదైవముగురుఁడునీవగతియునునీ చే
యనినమ్మినిన్నుఁజేరితి, ననుఁగరుణాదృష్టిఁగనుము నతజనపాలా. 218
చ. అనవుడతండొనర్చువినయంబునకెంతయుబ్రీతిఁజాగి హీ
నునకెటులియ్యఁగాఁదగుమను ప్రభులింగమునన్నగొంకులోఁ
బెనఁగొనకొంతసేపతనిఁ బేర్కొనకూరకయుండి వానితో
నినుమునుపెన్నఁడేనెఱుఁగ నీగుణమెట్టిదొ యేడనుండువో. 219
వ. అనిన నతండిట్లనియె. 220
క. ఇప్పురినెప్పుడుయుండుదు, చెప్పంబనియేమి కరుణఁజేపట్టిన మీ
కప్పుడె నాగుణ మగపడు,నప్పాయనిజాగిమ్రొక్కి యతఁడిట్లనియెన్.
క. గురుశుశ్రూషయొనర్చుచు, చిరకాలంబునకుఁగాక చేకూరునె నీ
యురువాంఛయనినమితియే,ర్పఱచిననటె సేయువాఁడపావనచరితా.
గీ. అనినద్వాదశవర్షంబులధికభక్తి
భూతిరుద్రాక్షధారివై భూతనాథ
భక్తులెదురైనమ్రొక్కుచుపరిచరింపు
మనిననవుగాకయనిపోయియనుదినంబు. 223
క. ఉరులింగముబోధించిన, కరణిగుమ్మరుచువంటకట్టెయులోకమో

పరుమనవారలగేహా, పరణములోబయలనుండి వ్రైచుచునుండెన్. 224

ఉ. ఈగతి మూఁడునాలుగయి దేడులుబుచ్చియితండు వేడ్కచే
నాగురువర్యుభవ్యకరుణాగతిచేఫలియించునంచు వే
వేగ ప్రభాత వేళనిలువెల్వడినాటిదినంబునందున
ర్వాగమ వేదియాగురునియుంగనమందు చరించుచుండఁగన్. 225

ఉ. నిద్దురలేచియాఘనుఁడు నీలగళుంస్మరియించు వేళనా
పెద్దయుసంచరించుసడివీనులసోకిననావుదూడయో
యెద్దోయటంచుతాసియునియేష్టరముమ్మరుబల్కినాతఁడీ
ప్రొద్దుటికబ్బెనాకుఁ గురుబోధితమంత్రమటంచు నాత్మలోన్. 226

గీ. కంటిభాగ్యంబుభక్తినిగంటికీర్తి, గంటిపెన్నిధిగంటిమోక్షంబుగంటి
కంటిజ్ఞానంబునింకనేకడమలేక, నుంటిని త్తరినీగురుమహిమవలన.

చ. అనియిటులన్నుతించు సమయంబునతద్గురుఁడేగు దేరనా
తనికతిభక్తిమొ్రొక్కియమృతప్రవనమంత్రరహస్యమబ్బెమీ
ఘనకృపనంచుబల్కిన మొగంబున నివ్వెఱదోఁపవాళియం
చనిమునుతా నదల్చుమహితాక్షరము ల్మనువయ్యెవీనికిన్. 228

చ. పలుమరుబల్క మంత్రమయి పాటిలెనొర తదక్షరద్వయం
బిలసితదర్పుఁడౌ కతననీశ్వరుఁడే గతినంఘటించెనన్
చలమిని పేర్మి పెద్దయుకృతార్థుఁడనై తివి ప్రొమ్మటన్నజా
గిలిమొ్రొక్కియేగ నేరుచును బొంగుచు గంతులేయుచున్. 229

క. ఆరీతినరిగినద్గురు, భూరికృపన్మంత్రసిద్ధిఁ బొందినవాఁడై
ధారుణిజానన్ డెత్తున, ధీరుఁడుపెద్దయ్యమెఱసి తిరుగుచునుండెన్.

ఉ. అంతట తత్పురాధిపతి యాత్మముదంబున నొక్కభావిద్ర
వ్యాంతమటంచు నుప్పరులఁబిల్వఁగఁబంచి యనుజ్ఞయివ్వ వా
రెంతయు ద్రవ్యనంజిలము లేమియునూరక చట్టునడ్డదా
చింతిలిరాయిదొల్చు ఘనశిల్పికులం నియమింపవారలన్. 231

గీ. చేతనయినంతయాచట్టుచండిచండి, యుంచుకైనను భేదించలేక లేక
వినివిభూపతికాగతివిన్నవింప, మదిని వేటొండు దోఁచకమంత్రిఁ జూచి.

క. నీకేమిఁదోఁచునాసిల, యేకైవడిదెగుజలంబు లేగతినూర్ము
మాకేమిఁదెలియకున్నది యాకూపము పనికివచ్చు ననువుందెలుమా.

ఉ. నావు డతండు మ్రొక్కి నరనాయకయొక్కటఁ దోఁచె నామదిం
తావక పట్టణాంతరమున న్వసియించు మహాజనంబులీ
భావిజనించుచట్టుపయి పాదములుంచిర యేని దీనిలో
పావననీరమూరుయిది భావ్యమయేని యొనర్పుమీవనన్. 234
ఉ. పెద్దలవారిఁగన్గొని పురంబుననారసిసుప్రసిద్ధులౌ
పెద్దలనెల్లనిచ్చటికి పిల్వఁడు పొం డనవారలేగియా
శుద్ధియెఱుంగఁజెప్ప వినిచోటులనుండియె వారువచ్చిరా
గద్దియడిగ్గిమ్రొక్కి నరనాథుఁడునద్భుతవారయుక్తుఁడై. 235
ఉ. తవ్విషభావిడగ్గరిబుధప్రకరంబునకర్థి మ్రొక్కిమీ
*రివ్వలకూపమందు దిగి పాదపాంశువు
నివ్వటిలంగఁద్రొక్కుడవలీలఁగనీరము పుట్టునన్న వా
*రవ్విధినల్పినన్సలిలమంజనింపమి రాజుఖిన్నుఁడై. 236
క. ఉన్నయడచారుఁడొక్కరుఁ,డన్నరపతిగాంచి దేవయంత్యజుఁడొకరుం
డున్నాడుధరకుజానెడు, మిన్నలజరియించు పదము మెట్టఁడుభూమిన్.
గీ. తన్మహత్వమెన్నతరముగాదేరికి, గాన వానిచేత నానొయేమొ
వారిదీనిలోననూరజేయఁగనన్న, పిలువఁబనిచె నృపతిపెద్దయాఖ్యః
చ. పిలిచినవేగవచ్చి తనపెంపుగనంబడ భూమికెత్తుఁగా
నిలచినవానిగాంచి ధరణీపతియద్భుతమంది వీనిచే
సలిలము నూరుచట్టరుననంశయమంచు దలంచి నూతిలో
పలి సిల వీడచేసుటయు పాయముఁదోఁచిన నేయుమీవనన్. 239
గీ. ఆతఁడట్లు నేతునదియంతవనియని, గురునిపదములాత్మ కుదురుకొల్పి
వాసియనినసట్టునదలియాచట్టుబి, ట్టెగసిబయలుఁబడియెజగతివణఁక.
ఉ. వెంటనె తియ్యనీరు భ్రిభవించిన కన్గొని భూమిభర్తమి
న్నంటగఁబొంగిసంతసము నద్భుతము న్మదిబర్వనేడుము
*క్కంటియెకాక యన్యులనఁగాఁ జన దిప్పుడమదీప్సితంబనే
పంటఫలింపఁజేసెనన పాయముగానను మెంచివానితోన్. 241
క. అందందనూరకహారున, మద్దియునన్వచ్చు నిన్న హాగణగుణుకా 242
పెద్దలకుపెద్దవైతివి, పెద్దయ్యా నీకుసాటి పృథివింగలరే. 243
వ. అని సన్నుతించుసమయంబున,

సీ. ఇదియద్భుతంబని మదిగణించెటివారు, పోడిమిచెడిఁజిన్నవోవువారు
నెవరితోఁజెప్పక నిళ్లకేగుడువారు, నొకరిచాటున నొకరుండువారు
తలవంచియేమియుబలుకకుండెడువారు,వెచ్చనినిట్టూర్పులిచ్చువారు

* * * *

గీ. నగుచునందలి పెద్దలువగచుచుండు
సమయమునవచ్చి యురులింగసద్గురుండు
తనకుమ్రొక్కిన శిష్యునినెనరుదొలుక
గృచ్చికౌఁగిట జేరిచి మెచ్చుదనర. 244

క. శైవాగమోక్తసరణి, న్నావన తరలింగమొసఁగభక్తవరేణ్య
నీవే నేనే నేనే, నీవేనిద్దఱికి భేదమించుకగలదే. 245

క. జాతిఁ దుబిళ్లముచే, ఖ్యాతిఁగనినపగిది భక్తగణములలోనీ
చేతగడువన్నె కెక్కితి, మాతండ్రీ నీవు శిష్యమాత్రుఁడవగు దే.

గీ. అనఘ నీమామ పూర్వమై యస్మదీయ
నామధేయంబుగలుగంగ నాకుగోర్కె
బెఱిగెనటుగాన నురులింగ పెద్దయాఖ్యఁ
దాల్చుమనిపల్క నీతఁడు దాల్చి వెలసె. 247

క. ఉరులింగపెద్దినిర్మల, చరితముసద్భక్తి సభలఁ జదివినవినినన్
గురుకారుణ్యంబున సుస్థిరవాంఛాఫలసమృద్ధిజెందు నరుఁడిలన్.248

⟶ ఈండ్రఁగ మారయ్యకథ. ⟵

వ. అదియునుంగాక. 249

క. వేండ్రుకినుకరనాదు, త్రెండిపయింబొడమి వాని తలయిలగూలం
గండ్రించువేల్పుపగతుం, డీండ్రఁగమారయ్యయితనినెన్నఁగదరమే.

వ. ఇతండు కల్యాణపురంబుననుండుచు యనుదినంబున. 251

చ. మొలచుట్టున్వడిగోలుదానగుబల్సొలావయిం గీతక
త్తులునూరున్ మునలంబువామభుజమందున్ దానికిర్వంకలన్
కలుపొట్లుండిడకట్లనిచ్చనపిరుందంగొమ్ము కొల్చిందమున్
తలకోరాముడిగుడ్డయున్ దనరపాత్రెఁకాలమం దెప్పుడున్. 252

క. నిజకాయకమునకై యం, గజరిపుపదపూజనములు గావించిమనోం
బుజమలరనేగినురదె, చ్చిజనులకమ్మియు ధనంబు జేకొని యలమిన్.

చ. తనయులు జేరి వాడియడిదంబున నాత్మకరద్వయంబు ఖం
డనమొనరించి శర్వనికరంబున మ్రొక్కఁగ తారకాద్రికిం
బనిచి భజించివచ్చి మునుపంటివిధంబున నంటికొన్న పా
వనశయవారిజాతముల భావగణార్చలొనర్చు నిత్యమున్. 254

క. ఈరీతివ్రతమునలుపుచు, మారయనొకనాఁడు నగరమార్గంబున రా
ధారుణిపతి సభ కేగుచు, దారినబసవండుగాంచి దండమొనర్చన్.

గీ. మగుడ నతియొనరించు నమ్మహితుఁడేఁగు
పిదప బసవండు సభ కేగి వేగమఱలి
తత్ప్రసాదేచ్ఛమారనిధామమునకు
జనియె ముదమున మూఁడవజాముతరిని. 256

క. చనిదంపతులకువందన, మొనరింపఁగ నుల్కివారుదండేసుని గ
న్గొనియుట్లుగోల్లునలుపుచు, వినయంబుననిట్టులనిరి వికసిత ముఖులై.

ఉ. పావసమయ్యె మాగృహము పాపములెల్ల నణంగె పుణ్యముల్
ప్రోవుగజేరె ముక్తిసతిపొందుటఁగూడె ఫలించెగోరికల్
దేవరదారలిందు నరుజే నిఁక జాగొనరింప కీశ్వరా
ర్చనవిధిసల్పఁగా వలయు జంగమవర్యులతోడ నీవనన్. 258

గీ. అట్లుగాకయనుచునమ్మంత్రిశేఖరుం, డపుడెపారలిడినయమృతమయమ
హాప్రసాదతృప్తుఁడై తదనుజ్ఞచే, నెలమి నిజగృహామున కేగెనంత.

క. కొండెదమాచయధరణీ, మండలపతిఁజేరి యాంధ్రమారనియింటం
బండారిగుడిచెననిబలు, కొండెముగాదెలుపనతఁడు కోపోద్ధతుఁడై.

క. అప్పుడె బసవామాత్యుని, రప్పించిటువల్కె మొగమురాజగమికే
తప్పులు లేవనితలఁచితొ, చెప్పఁగవినరానిపనులు సేయందగునే. 261

మ. కులశీలంబులు నీటబుచ్చి విభుధోక్తుల్ గాలిఁబోఁజేసి పూ
* ర్వులచర్య ల్విడనాడి శాస్త్రంబుల్ రోసి కల్లమ్ముమవా
* రలయిండ్లచుటతగవు సర్వజ్ఞుండ వాఁడై నత
త్కులముందెగడి నీవుమిన్నకనొ కకూల్కార్తి బడంజెల్లునే. 262

ఉ. చేతులుఁగోసి ఈశ్వరునిచెంతకు నిత్యము బంచుచున్నవి
ఖ్యాతిగణించి తేమొ యది గారుడమా బలుగంగ లేక నీ
వాతని [illegible]

భూతలనాథతన్మహిమ పొల్లునె నాడుట నీకు బాడియే. 263
క. మారయమదవిభుని, మారయయనివినుతికెక్కె మహినెల్లెడనా
మారయతన్మహిమమున, న్మారయుగాగలమెభూవరాధిపయనినన్.
ఉ. మాటలకేమి యీశ్వరసమానుఁడువాఁడనునంతనమ్మన
న్నాటి యతండు ప్రత్యయముఁజూపఁగనోపినవాఁడయేని యు
ప్పాటుననమ్మితింతుమని పల్కనత ద్బసవేశ్వరుండు మో
మాటములేక వానిమహిమోన్నతిజూపెదరమ్మభూవరా. 265
క. ఆపరివారముగతన, జనపతితోడుకొనివానిసదనంబునకుం
జని గనియాతఁడెదుర్కొని,వినయంబున మ్రొక్కి బసవవిభుఁడిట్లనియెన్.
చ. అకుటిలపావకవ్రతమహత్త్వముఁజూచుట కిన్నరాధినా
యకు డరుదెంచె గావున రయంబుననీతనికోర్కెదీర్ప వే
సకలజనాక్షిపర్వముగ శంకరతుల్యయటన్న నాత డిం
చుకమదిగొంకులేక దననుందరిదాసును భక్తినమ్రులై. 267
క. చెరుకులుఁ నరికినచాడ్పున, కరుకుకరుక్కనగనాత్మకరములునాల్గుం
దరిగికొనుసంతలోనన్, కరకంపఁడువురికిఁజనియెఁ గగనతలమునన్.
చ. అటుజనిపార్వతీశుల పదాంతికమందునవ్రాలె నయ్యెడం
బటుగతిసిద్ధరాముఁడను భక్తరేణ్యుఁడు గాంచి వచ్చి మా
కిట నటనైనభూధరను తేశ వివాదముఁదెల్ప నేను వి
న్నటులను వీరభద్రవసుధాధిప నీకెఱుఁగింతు నంతయున్. 269
క. ఆరీతితనదుపదముల, మారాంతకచరణములగ్రమంబునబడునీ
రేరుహావదనపూరుష, దారు కరాబ్జములుగాంచి శైలజమదిలోన్.
గీ. అద్భుతంబంది విభుగాంచి చనియె నీశ
సంతతము రెండుపురుషహస్తములు వచ్చు
చుండు నేడిదియేమొకో యువిదకరయు
గంబు నరుదెంచె తెలుపునిజంబుగాగ. 271
చ. అనవినిశంకరుండుగిరిజాత్మజకిట్లనుసీంద్రమారడా
త్మనిరుపమప్రభావముత్తమఁక బసవానుమతిందరాధినా
థునకెఱుఁగింపబూనితనతోయరుహాననహస్తపద్మముల్
*నినుఁగొలువంగబంచె నన నెమ్మది సంతసింపుచున్. 272

ఉ. దీనజనానురాగభవదీయపదార్చకసన్మహాత్వముల్
వ్రానినుతింపధాతృఫణిపుంగవజీవులకైనశక్యమే
మానితసత్యసంధులసమానతరారతులద్రిధైర్యులం
హానిచయాపహారులసమున్నతితేజులునీతికోవిదుల్. 273

చ. అనికొనియాడుచుఁ గిరిజయాత్మలినీలకచామృతంబులో
కనికరసన్నుతాద్భుతసుగంధముబంధురపాండురప్రభా
* వినికృతహంసమైనసురవృక్షసుమన్నిదామమప్పుడా
ఘనకరయుగ్మయుగ్మమునఁగట్టిగఁజుట్టిప్రియుండునవ్వఁగన్. 274

ఉ. అంతటతత్కరంబులుశివాంఘ్రులునన్నిధినుండిధాత్రికిన్
వింతగవచ్చెనభ్రిపదవింబరివేష్టితపారిజాతపు
ష్పాంతరసింధుపారణసమాగతషట్పదబృందఝాంక్రియా
*కాంతదిగంతరంబులైనరాజముఖ్యల్వోఱగంధిచూడఁగన్. 275

క. ఆరీతివచ్చితత్కర, వారిజయుగయుగముపూర్వవైఖరియపుడా
మారనికినతనిసాధ్వికి, ధారుణిజనులెల్లచూడదవిలివెలింగెన్. 276

చ. అడిగనిబిజ్జలావనితలాధిపుడద్భుతసాధ్వసత్రముల్
హృదయములోనముప్పిరి వహింపఁగశ్రీబసవేశుఁగాంచియా
సదమలచిత్తుసన్మహిమ స్వాంతమునన్ దెలియంగలేకనే
బదరితికొన్నిమాటలవిపాటియొనర్పకనన్నుఁబ్రోవరే. 277

చ. అనివినుతించిమ్రొక్కుచుధరాధిపుఁడాత్మగృహంబుజేరునం
తనచటిభక్తవర్యులుముదంబునమారనిగాంచిబాగురే
ఘనతరభక్తినిష్ఠలకుగాయజుసంహరసత్కృపారతిం
గనుటకునీవెమేటివికగల్గుదురేనినుఁబోలువారిలన్. 278

చ. బసవనిదూరనాఁడుజనవర్యుఁడులజ్జవహింపలోకము
ల్వినువకసన్నుతింపనిజవిశ్రుతకీర్తిలతావితానము
ల్దెసలనలంకరింప గణధీరులకెల్లనుసంతసంబుమా
నసములనింపనిత్తరిగనంబడచేసితినీమహాత్వముల్. 279

వ. అని పెక్కువిధంబులఁ బ్రస్తుతింపుచు బసవేశ్వర ప్రముఖభక్తులాత్మని
వాసంబులం జెంది రట్లుగావునవీరభద్రావనీపాలా యితని మహిమం
బెత్తెఱుంగు. 280

క. ఈయాంధ్రమారయచరిత్రము, పాయకసద్భక్తివినినబఠియించినదీ
ర్ఘాయువునారోగ్యశ్రీ, శ్రేయస్సంతానవృద్ధిజెందునరుఁడిలన్. 281
వ. అదియునుంగాక. 282
చ. సుజనహితంబుసద్వ్రతమునూనృతవాక్యము శాంతవృత్తిభా
వజరిపుపాదభక్తిగణవల్లభదాస్యము దివ్యబోధన
ర్వజనవశీకరంబుగతరాగతనై జగుణంబులొౌటచే
నిజగుణధాముఁడయ్యెధరణీస్థలిసీతఁడు మానవేశ్వరా. 283

గుణేంద్రునికథ.

వ. ఇమ్మహాత్ముండు కల్యాణగుణంబునం దనుదినంబు. 284
క. రేవణకప్పెంకతరా, జీవంబునఁ దాల్చిభక్తసింహులయిండ్లం
బావనభిక్షుముగొనినై, జావాసముజెందిదానతత్క్షయలీలన్. 285
ఉ. వచ్చినజంగమావళికవారితభక్తిభుజింపబెట్టుచున్
నచ్చరితుండితండనుచుసర్వజనంబులుసన్నుతింపఁగా
తెచ్చినఖ్యాతివర్తి గణేతరులెవ్వరువేలసంఖ్యలై
వచ్చిననిష్టభోజనములవారలదన్పుచునుండునంతటన్. 286
చ. * జనపతితత్క్రమంబువిని సైపకనాదుర్మతినాగుణాఢ్యవం
చనమొనరింపఁబూనియొకసక్కముగాబనవేశుతోడని
ట్లనియె మహాత్ముయిప్పరమునందొకభక్తుఁడువేలసంఖ్యవ
చ్చినమనుజాళికిప్సితముచేకురనట్టుమనోహరాన్నమున్. 287
క. అనివింటినదియెనిక్కమొ, యనృతమోబసవఁడనియెనవనీశ్వరనీ
వినినంతమట్టుసత్యం, బనఘాత్ముండతనిమహిమయలవియెతలఁపన్.
చ. కరమునఁబట్టిభిక్షుగొనుకప్పెరగొప్పదిగాదుమానెడా
టరుదదినిండతండులములవ్వల నెవ్వరివేడకింటికిం
బరువున వచ్చి సద్గురుకృపాగతియక్షయమైనవాటిచే
గురుతుగకోటిసంఖ్యజనకోటులకాతఁడుబెట్టునన్నమున్. 289
వ. అనిన నమ్మహీశ్వరుం డిట్లనియె. 290
గీ. అట్టులయిననంతతాన్నదానవ్రత, నిష్ఠఁదైచరించునిజగుణేంద్రు
మందిరమునగుడవమాకిప్పటమైనది, నేడుపోదమనిననృపతిఁగాంచి. 291
చ. బండరివల్లె... నట్లపో

*దండరు దెండిపాగ మదిదార్కొనుకూహకుమీరలే
దండరథాశ్వవీరభటదానసుహృజ్జనబంధుయుక్తుఁడై
దండిగ నేగుదెంచె వసుధావరుఁ డా బసవండుతోడ రాన్. 292

గీ. అటుల తనయింటికే తెంచు నవనిజాని
బసవనామాత్యుఁ గనుఁగొని ప్రమదసమాత్మ
నలరె నెదురేగి నిజగుణియచటభక్తి
నికరములకెల్ల కేల్మోడ్చి నిలుచు నంత. 293

ఉ. ఆతని గాంచి పల్కె బసవన్నమహాత్ముఁ ధరావరుండు నీ
ఖ్యాతికి బ్రీతి జెంది భవదాలయమందు భుజించు వేడ్కచే
నీతరి వచ్చినాఁడితని యీప్సితముల్ ఫలియింపఁ జేయవే
పాతకజాతదుర్విపినపావకతావకభావమేర్పడన్. 294

చ. అనిన మహాప్రసాదమని యందరిఁ దోడ్కొనిపోయి మున్నుగా
ఘనతరభక్తిచే శరణకాండసమర్చ్చలొనర్చి పిమ్మటన్
వసనిధిగాంచి భక్తపరివారముతోడను భాసనంబులం
దొనరఁగఁ జేసి దివ్యమహిమోన్నతిసద్గురు సంస్మరింపుచున్. 295

మ. కదళీరాజనఖాజపంక్తులమరంగా నైచియంతర్వృతం
బౌదనం బాకశలాటిమూపరసభక్ష్యాఖాద్యపాయ్యంగపే
య దధిక్షీరసమేతపాండురకలమాన్నం బప్డు వడ్డింపనే
మొదలిర్వుర్ భుజియింపముఖ్ కొనిరి భూమీపాలకుండాదిగన్. 296

దండకము. యీరీతి శక్లైన లాలోగణంబాప్పగాఁ జేయుచుం దారుర
మ్యోక్తులిం పొందఁగా నొండొరుల్ సారె నీభక్తవర్యప్రధానంబు
లెక్కింప నాకొక్కముని నాథ ముఖ్యాళులుల్ శక్తులేవ్వాని తాఁ జేయు
చున్నట్టి యాకాయకంబెంత యావచ్చివాచ్చున్న సంఘంబు సంఖ్యా
న్విచారింపఁగా నెంత మువ్వారి కెవ్వారినేలీయగా నిష్టమానట్టి చందం
బు సంతృప్తిగా వేడి వడ్డింప నారాభళీ బాగు మేలామ నిట్లుండవ
ద్దానతాంతానదానక్రమంబుంచు నీరీతిగా భోజనం బబ్బునం బిం
ముకం తైనముం దోఁచఁదాయుంగదాయింట నేసంటకం బిసర్జించియే
తెంతు నంమర్ మహా దొసుద్దు వేయువస్నంబు లున్నంతకం బెర్

గజంబై ముహూర్తం బవర్తింపమేలన్న చందంబునఁ హీనమౌజైన వంశంబునం బుట్టి యేభోగము న్లేక చింతింపుచుఁ పెక్కుగాలంబు జీవించుకంటెఁ క్షణంబైనభక్తాగ్ర్యుఁడై యుండుట లేమ్లటంచుఁ మరింగుత్తు కంటంగభక్త్యావళులెక్కి సంతృప్తిలేకయ్యోమోనెత్తిపై నోరుగల్పించిచే యింకనుంగొన్ని బుట్టింపవచ్చుఁ గదాయట్టుగా నేటికిఁ జేయఁడాబ్రహ్మ పాపాత్ముఁడంచాతనిందూరుచుం గూసి పాండ్యుండు నాసాంఖ్యతొండజాహ్వయుండాదియౌవార లీజైనవంశోద్భవుల్గారె మాకారి భక్తాగ్ర్యులయియంతవారైరి యారీతినీ బౌద్ధవంశాభిమానంబుపెన్నీటిలోముంచి నేడాడిగా వీరశైవంబుచే కొందమంచుఁ వివాహంబులుఁ పండుగుఁ పబ్బముల్ మున్ను మాయిండులఁ జేయుటల్లేదో యీవస్తుజాలంబులఁ దండిగావండ లేదో భుజింపంగలేదో యహోయిట్టిసౌకర్య మేమెన్నడుంగంటిమే వీరిచేనైనపాకంబు తీరిట్టిదో లేక శ్రీకంఠభక్తాళిగేహంబులందంతటఁ సౌష్ట్రవంబిట్టుగానుండునో యంచు నానట్టిసౌఖ్యంబునందానగీల్కొంటచేకదా సర్వదేశాగతానేకభక్తావళుల్ లక్షయంతో బదార్వేలు బండారియిల్వెళ్లఁగాలేక యేచోటికిం బోయెదరురండిరం చుంవడింగేరుచుఁ త్వరందెమ్మటంచుఁ నురంబెత్తికొంచుఁ చరంబయ్యె నించుఁ శిరంబంటికొంచుఁ గడుందియ్యమంచుఁ వడిఁ బావుకొంచుఁ గదఁ జూచుకొంచుఁ న్నెదఁ ద్రిప్పుకొంచుఁ గడుంజుట్టునంజుట్టుచ్చుఁ గట్టునం దేన్పుచుఁ నిట్టునంనీల్గుచుం వేడ్కతో బిజ్జలాధీశ పూర్వంబుగా నందరుంభోజనం బొప్పుగా జేసి యప్పిమ్మటన్. 297

క. నిజగుణిసన్నుతిఁ జేయుచు, నిజగేహంబునకుఁ జనియె నృపతిలకుఁడు వా నిజనములతో మేలనివ్వాని జగంబులు మెచ్చనితఁడునెగడెఁ భక్తిన్.

-- మీమాంసుని కథ. --

చ. అనియునువీరభద్రవసుధాధిపుతో ననునాగమాంబికా
తనుభవు డీమహాత్ముని కతంబున నయ్యెమదీయమాతులా
వనివర దేశికేంద్రులకు వాద మదెట్లనబిజ్జలుండువో
యునిజగుణేంద్రుని నింటభుజియించుట దానతికోపచిత్తుఁడై. 298

శా. మీమాంసుం డిదియేవకోతలఁప భూభర్తయాత్మీయవం
శామందకి్రయ మెల్లమిన్నకయె మాయంజేసి దుశ్చేష్టుఁడై
కామించెన్ శివ భక్తులిండ్ల గుడువంగా నిట్టి దుర్వర్తనం
బేమాస్వింకయున్న పాపమగునాకిప్పట్టునం చెంతయున్. 300

చ. సరగునపైనమైబలసి ఛాత్రిసహస్రిము గొల్వ పుస్తకో
త్తరభరభృత్కరుల్ నడువ తమ్మటకాహళశంఖభేరికా
దిరవములుల్లసిల్లపరవీరభయంకరమైతనర్చు మే
ల్చిరుదవితాన మొప్పవెడలెంగురుడందలమెక్కియుక్కునన్. 301

శా. ఈరీతిన్ జనుదెంచి భవ్యతరకల్యాణాంతికోద్యానవి
స్ఫారాక్షోణితలంబున న్విడియునవ్వార్తల్ ధరానాథుతో
చారుల్ దెల్పినలేచి యప్పుడనుహృత్సంఘుంబుతో వేగప
చ్చారుండై చనిజొచ్చె సూర్యకిరణాసాధ్యోపవన్యంతమున్. 302

వ. చొచ్చి చనిచని ముందట. 303

చ. కనుఁగొనె నేలరేడుమణికాంచనభూషణభూషితున్ మృగా
జినయుతు గోపిచందనవిశిష్టసముంచితఫాలుకక్షదే
శనిరుపమేంద్రజాలమనుసంచయనంపుటునంగలిప్తచం
దనస్ఫటికాక్షమాలజనతండసమాతుడ్రుఁడునైజదేశికున్. 304

ఉ. కాంచి నమస్కరించి మణికాంచనముఖ్యము లైనవస్తువుల్
సంచితభక్తి ముోలనిడ సర్వముఁ జూచి యితండు చిత్తమం
దెంచమదీయ భక్తియెడ నేమరడంచుముదంబు నొంది ము
క్తాంచితహార మొక్కటి ప్రియంబుగ దీవెనతోడ నిచ్చినన్. 305

చ. అదియరుతం ధరించుకొని యాకురువర్యనిభద్రదంతిపై
ముదమున నెక్కఁగా బనిచి ముంగలకాంచనవేత్రహస్తుఁడై
పద తొలగుం డనంచును యవాయజనంబుల దా నదల్చుచున్
సదనము జేరదెచ్చి మణిసౌధమున న్వసియించి భక్తితోన్. 306

గీ. సింహపీఠంబునందుంచి చెంత నర్హ
మైన గద్దియ తానున్న యవసరమున
బసవ డేతెంచినిజపీఠమునవసింప
గాంచి మీమాంసుఁ డాత్మలో గనలుగదుర. 307

చ. నరవరుతోడ నిట్లనియె నగ్గని(మ్రొక్కఁగ మోఁలిగద్దెపై
నరుగునగూరుచుండె మదిజంకొకయించుకలేక యోగి యో
గురువరుఁడో యితండుపరిలికూలుని రాజసభాంతరంబులన్
దిరుగుచునుండ నీదగునె తెల్పుము వీఁ డెవడన్న నమ్రుఁడై. 308

ఉ. దేశికసార్వభౌమ గణుతింపక యీతఁడు మర్త్యమాత్రుఁడే
పాశుపతాగ్రిగణ్యుఁ డరిభంజనుఁ డాశ్రితపోషణుండు భా
షాశరదిందు సన్నిభయశఃపరిపూరితదిక్తటుండుపం
చాశుగదుర్వికారహరుఁడంచితసూనృతవాక్యుఁ డిమ్మహిన్. 309

సీ. తనయిల్లు దోఁచవచ్చిన తస్కరులుఁగాల్చు
వంగకాయలొనర్చె లింగములుగ
జంగమం బడిగిన ముంగలిజొన్నల
రాశి ముత్యములగా జేసి యొసఁగె
బండార మొకమిండ భర్తునకిచ్చి య
ప్పటిగతినాకు గన్పడగఁజేఁసె
వాదించి సభవెలి వాఁడభక్తుల కేలి
నేలజాలై పాఱిపాలుపితికె

గీ. చల్లలమ్ముచు పురవీథిగోపడతి
పంకమునజారి యొఱఁగుచో బసవయనుచు
పల్కలిటనుండి పడకుండఁబట్టెదాని
నితని మహిమావధం బిట్టిదిదియఁగాక. 310

చ. శాత్రవలోకసంచయము సల్పి చతుస్సరిధీనమధ్యయా
థాత్రికివేడ్కమీర నను దక్షునిఁ గా నొనరించి మారభి
ద్గోత్రశశాంకహీరశరకుండలినాథ సదృశకీర్తికిం
బాత్రునిఁజేసి మాన్పె బసవండితఁ డెన్నిమంత్రిమాత్రుఁడే. 311

క. ప్రతివాదిభయంకరుఁడూ, ర్జితశాంభవభక్తి ధనుఁడుజితషడ్వర్గుం
డితనినిసామాన్యజనుని, గతిచుల్కఁగమీరు చూడఁగావలదనినన్.

ఉ. వాలముదొక్కబడ్డ ఫణివైఖరినాజ్యముబోయ భగ్గునన్
జ్వాలలుగ్రక్కు తీవ్రశిఖచందమునన్ గనలొంది యోరి భూ
పాలకయింటి వీవు పరవాదిభయంకరుఁ డాయితండు చాల్

జాలుమదీయ సన్నిధివశంబగు నేనుడువెత్తదీనికిన్. 313

గీ. వేదవేదాంతశాస్త్రాగమాదులందు
మంత్రతంత్రసిద్ధక్రియామహిమలందు
చోద్యమానేంద్రజాలాదివిద్యలందు
నాకుసరివోల్పఁగలరె భూలోకమునను. 314

క. ఏనిత్యవలనదానా, తోనాదించఁగలఁడనుచు దండేశునిది
క్కై కవెనదిరిగి మహాప్రభావం బేర్పఁడఁగ వైచె వాకట్టెలిపిన్. 315

వ. ఇట్లు వైచిన. 316

క. మనమునవించుకగొంకక, కనుఁగొనలగ్ని నవ్వితనదుకట్టెదుటవసిం
చిననందికోలశాంతయ్యనుఁ గనిబసవయ్య సైఁగనటుజూపుటయున్.

సీ. ఆలిపిపత్రికయాతఁడుగైకొని, కొంకొకింతయు లేక గోఱజీరె
మీమాంసుఁడదివోవతానుసంబున చెడక, కిట్టవైచినదానిగాలమమరె
గడువడిక్రమ్మఁడి కనుకట్టువైచిన, బున్సునవెగమాది పోవఁజేసె
యిట్టితొల్కట్టదండేశుని మర్దింప, వైచినశాంతయ్యచూచితనదు

గీ. పాదరక్షలు వదిలినమీఁదికెగసి
రొకటియాకట్టు హరియించె నొకటివాని
మోముపైఁబడి పండ్లూడ మోదె సభకు
లెల్ల విస్మయ చిత్తులై తల్లడింప. 318

క. ఆదెబ్బకుమీమాంసుఁడు, మేదినిఁబడిమూర్ఛచెంది మెల్లనదనకే
లూనుకొని లేచిబసవని, పాదంబులమీఁదఁ వ్రాలి ప్రణుతించెనిటన్.

ఉ. మారటరుద్రమూర్తియసమానజగద్భరితాచ్ఛకీర్తిదు
ర్వారకళాప్రపూర్తి నినువర్ణన సేయఁగ నెవ్వఁడోపునీ
చారుమహత్త్వముల్ దెలియఁజాలక నగ్గొనరించినాఁడ నా
నేరములెల్లసైచి కరుణింపఁగదే శరణాగతావనా. 320

క. దోషాచలమదసంహర, శేషునిమహిమంబు దెలియనెఱుఁగకఖలుఁడై
దూషించిభద్రుచేగని, పూషునిగతినన్ను జెందెభూనుతనీచేన్. 321

చ. అనివినుతించునాతని దయంగని శ్రీబసవండు బిజ్జలేం
ద్రునియెడపీడు కోల్పడసితోషము మీరఁగనందికోలశాం
తునిమదిమెచ్చుచుం గ్రమాగతుం దగుతిమ్మటరాజదేశికుం

* డునచట వేడుకకడున్మదిబర్వఁగవేగన త్తఱిన్. 322

వ. మిత్రశిష్యయుతుండై యసమతశుభకరం బైనబసవేశ్వరమందిరంబున కేగిన నతనిరాక యంతర్గేహంబుననున్న తనతోడఁ జారుండొక్కరుండు ప్రొక్కుచు నవినయంబున. [లావ

గీ. తెలుపవచ్చియిందుకొలువుకూటంబున, నతఁడుఁదాను ననునయాను ములవసించు నంతననలుదెసఁగోడల, వ్రాసినట్టిభ క్త వరులఁజూచి.

క. మీమాంసుండచ్చెరువడి, స్వామీ బసవేశయిట్టిసలలితభక్తో ద్దామాకృతిగనుప్రతిమల, కేమహిజీవములుగలుగు నెటులుండునొకో.

క. అనవుడుదరహాసితానన, మొనరఁగనీకోర్కెయటులనుండునటులనే గనుపించెదనిటుగనుమీ, యనిశరణొనరించిపిలువనతుణమాత్రిన్.

క. కీలూడిపడినకైవడి, నేలకు దిగనురికితోడనేజీవములుం గీలుకొననందడింపుచు, కాలాంతకభక్తవరనికాయములంతన్. 327

సీ. జడముడులీడ్చిన నవరగాముడుచుచు
జిలుగువన్నియల బొంతలు దులుపుచు
తళుకుమనెడు శూలములు లీలద్రిప్పుచు
వీవనలను మేనువిసరికొనుచు
వాలుగడ్డంబులు కేలజాడింపుచు
మొలకట్ల కచ్చడంబులు జెఱుపుచు
జటిలమౌ రుద్రాక్షసరములు విప్పుచు
కక్షపాలలు భుజాగ్రముల నిడుచు

గీ. నిలచిన తదీయపదముల కెలమి ప్రొక్కి
మంత్రివర్యుండు నగుచు మీమాంసుఁజూచి
తే యనిన నద్భుతంబంది యాయమాత్యు
నభినుతింపుచు నటగురుఁ డరిగె నంత. 328

క. బసవేశ్వరుఁడెప్పటిగతి, వసుధీశ్వరరాజ్యభారవహుఁడైగణప ద్బిసరుహపూజలొనర్చుచు, నసమానమహత్వయుక్తుఁడై విలసిల్లెన్.

వ. అని యిట్లు చెప్పి చెన్నబసవేశ్వరుండు వీరభద్రావనీశ్వరునిలో మఱియు నిట్లనియె. 330

—— కూలిచామయ్యకథ. ——

మ. గణపర్యం డనపన్నెకెక్క మహినీకై కూలిచామయ్య స
ద్గుణవర్ణ్యవ్రతసత్యవాక్యనిలసద్గాంభీర్య శేషాహిభూ
షణపాదాంబుజ భక్తికామముఖహృచ్ఛత్రుత్యక్తకర్పూరితో
ల్బణకీర్త్యన్వహదీనరక్షణకళా ! ప్రావీణ్యసంపత్తిచేన్. 331

గీ. అతులప్రఖ్యాతిగాంచి కల్యాణమందు
నిత్యమీతండు భక్తులనిలయములను
చేత నగు కూలిపనిచేసి చేరుధనము
వలన జంగమపూజలు సల్పుచుండి. 332

క. ఒకనాఁడు లేపకడఁకఁ, దున్కలీలం బసవమంత్రిఁ జూచుటకై త
త్ప్రకటాలయబాహ్యద్వా, రకవాటసమీపచత్వరంబుననొకచోన్.

సీ. అధివసించియాత్రయాత్రజనంబుల, సందడివలికిజంకుంగ నేర
కొక్కెంతనిలచియొయ్యననాస్థాన, సదనముఁ జేరంగ జనియఁగణ్య
భక్తసముచ్చయపరివేష్టితుండగు, బసవనిఁ గనుఁగొనఁబడయలేక
యెడగల్లనిలచియయ్యెడనున్నవారలఁ, గనిదండనాథునిఁ గనఁగనీరు

గీ. పూర్ణమగుకోశమంతట్టఁ బొదవికొనిన
మతీకంబులకై వడిమాదృశులను
మిగులనన్యాయ మిదియిట్లు దగునెయనుచు
నందరవినంగ నాడ నయ్యవసరమున. 334

సీ. వినికొందిరయ్యలుకనలుచుజూచి వీఁ, డెక్కడనుండిటకేగుదెంచె
నెవరురానిచ్చిరీమాహాత్ములనెల్ల, చులకఁగాగణియించిపలుకజొచ్చె
కైకూలిమాటలుగాదనకున్న వీఁ, డేగతిబల్కునింకెన్నియేని
గానయిచ్చటనుండఁగానీక వెడలింపుఁడని మెడపట్టితోయంగవెడలి

గీ. కన్నుగవనీరుజారగదధికమీర, కలతమదిదేర మోముపెల్వెలఁగబార
చేరివంచకతతిజేరిచమటలూర, చనియెఁగఁగూరసిజనివాసంబు జేర.

వ. ఇట్లుచని పరిభవచింతాడోలాయమానసుండై యేమియుందోఁచక నిజభవనాంగణప్రాంతస్థితశాండిల్యమహీరుహమూలవితర్దికనాసీనుండై యాత్మగతంబున. 336

చ. బసవనిఁజూచి వేడ్కమది బర్వఁగ నేనట కేలపోతిత
ద్వసతివసించునట్టి గణవర్గము నేటికి తూలనాడితిం
గసరునవారునన్నుఁ దువఁగాబడి యుండఁగ మోసెనేడయో
కుసుమశరారినిత్యమగు కూలికిఁబాసితి మోసపోయితిన్. 337

ఉ. పాపము లేమియు న్బొదువజేసెగదా గణవర్గమెల్ల రు
దాౖసరమూర్తియైన బసవాధిపు జూడకనీకరొల్వులో
జూపర నన్వనాతనువు స్రుక్కటజేయుట కల్మికల్గుదా
రీపగిదింతిరస్కృతిపహింతురె ధారుణిధారుణీరథా. 338

ఉ. ఏమిటబూజచేసె బరమేశ్వరయీబసవండుతొల్లి నే
నేమికొ అంతఁజేసితి నభీష్టనిరంతరభాగ్యయుక్తుఁగా
నామహితాత్ముఁ సంచిలఘులైన దరిద్రముసంఘటించి బ
ల్పాములనొందఁజేసితిది భావ్యమె నన్నుగణాలిలోపలన్. 339

క. కూరిమి నెవ్వరుసిరిగల, వారలకేకూర్తురనెడువార్తయె ధరపై
నాగూఢమయ్యెనీవిటు, గౌరీధవనన్నుమిగుల గాసియిడుటచేన్. 340

వ. అని యిట్లుపరమేశ్వరు దూరనాడుచు సాయుకంబునకఱుఁగక జంగ
మార్చనవిధి దలంపక యుండె నక్కట. 341

శా. దండేశాలయమున్దు నెప్పటిగతిం దత్పూపకాకావళుల్
వండంబూనిన తండులప్రముఖమౌ వస్తువ్రజంబంతయున్
భాండాకంబుల నించునంతనవి గానంరామివిభ్రాంతితో
నుండగా నేజని తత్క్రమంబుదెలుప న్వాతాకుఁడైయత్తఱిన్. 342

ఉ. * ఎన్నడు లేనివింత యిది యేమకొ నేడుగంటిచేలింగసం
పన్నగణేశ్వరప్రకరభవ్యకృపారతినొందుదక్కవౌ
నన్నది లేదుతొల్లి యిదియద్భుతమైకనుపట్టె యేమికా
కున్నదొ యింతమీదశరణోచితకృత్యములేమితప్పెనో. 343

సీ. అయ్యలబాడగనునంతనెమెదురేగి, యడుగులకొఱిగెనో యర్ఘ్యపాద్య
ములొసంగనోపీఠములనిల్పనో నేమ,ములు దెలియంగనో యడలగలుగు
తలపులీడేర్పనో పంపినపనిసేయ, నో రుచికరముగాసారభోజ
న మొనర్ప [illegible] ంబునొంద

గీ. సలుపనో హంసతూలికాశయ్యల శయ
నింప నుంచనో తత్పదనీరజంబు
లొత్తనో యేమికతమొద్రవ్యోత్కరంబు
మాయమయ్యె గణార్చనాపాయమొదవ. 344

చ. అనియిటుచింతనొందుసమయంబున చారుఁడొకండువచ్చి వం
దనమొనరించి యోబసవ తావకసేవకవిన్నపంబుహృ
ద్వనజమునంబరాకిడక తాలిమితోవిను విన్నవింతు నీ
దినమునని ప్పురంబునను ధీరుఁడు వొక్కరుఁడొక్కచోటునన్. 345

క. మారేడునీడశివుకరు,నీ కేరుహమందునిల్పనిగళద్బాష్పా
పూరితముఖుఁడై తత్తఫణి,హారునిదూరుచువసించెనదియెట్లన్నన్.

చ. గురుతరమైనలేమి సమకూరిచి యవ్వరికందరాని రా
సిరిగలదండనాథుగృహసీమకుఁబోవఁగఁబంచియచ్చటన్
శరణులచేత తాడనమొనర్పఁగఁజేసి వ్రతంబుబాపి యి
ద్ధరననుపల్కఁగాఁగనుట ధర్మమె నీకిది ధర్మపావనా. 347

చ. అనుచు వచించెనాబసవ డద్భుతమందుచు లింగదర్పణం
బునకయి కూలిచామయ విభుక్రమమంతయు గాంచితప్పవ
చ్చెననితదీయమాధవనసీమకుసత్వరవృత్తినేకతం
బునజనితత్పదాబ్జముల పొంతధరాస్థలిజాగిమ్రొక్కుచున్. 348

ఉ. దీనతఁదోఁపనిట్లనియె దేవకృపారసదృష్టిమీరు నన్
గానఁగవచ్చులేనపుడు గానకమోసముజెందినాఁడ నె
చ్చోననుబోలిదుర్మదవశుండు ధరాస్థలిలోన గల్గునే
జ్ఞానములేదు భక్తియును సౌజ్ఞయెఱుంగ వివేకహీనుఁడన్. 349

ఉ. కావున యింకనైన దయఁ గన్గొని నాయెడ తప్పులెల్లయున్
నావలద్రోచియేలుమెడ మైనగణార్చనవేళ దప్పు త
త్పావనజంగమావళిశుభావ్యధజిక్కుతదీయసేవనా
జీవనమాటమీరు మును చిత్తమునందెలిగున్న దేకదా. 350

వ. అని యిట్లాత్మనిందయు భక్తోత్కర్షంబు దోఁపనాడుచున్న బసవేశు
నింగని చామయ్యభక్తియుక్తప్రమ్మోదనమస్కరింపుచు నిట్లనియె.

శా. దేవా నన్నిటు పెద్దసేయఁదగునే దీనుండ మీపాదస
త్సేవానక్తుఁడ మీమహత్త్వములునాచేఁజెప్పశక్యంబెయీ
జీవాహీనులకైనమాదృశుల రక్షింపంగనిద్ధాత్రిపై
భావపోద్భవసంహారాంశమునసుత్పన్నుండవైభక్తిచేన్. 350

క. సురమణికన్నులగేలం, బరుసముధరియించిసకలభక్త్యార్థ్యసము [న్.
త్కరములకీప్సితమొసఁగుచు, ధరవెలసితివిట్టులొరులతరమెయొసర్ప

క. శరనిధులుమేరదప్పిన, గిరులుచరించిననునింగి క్రిందికొఱఁగినన్
స్థిరధైర్యకోఱఁతయుగునే,యురుతరభవదీయమహిమయొకచోనైనన్.

వ. అనిన విని వినయసల్లాపంబులననునయించి బసవేశ్వరునిజమందిరం
బునకుఁబోవంబనిచిన,నతండునంతోషితస్వాంతుండై యెఱిఁగి యంత
కమున్న యప్పటియట్లయక్షయంబైన పదార్థంబులుగాంచి యచ్చె
రువందుచు తత్క్రమంబు వారలతో నుగ్గడింపుచునుండె నిటచామ
య్యయు తనసాధ్వికిందనవృత్తాంతంబెఱిఁగించి నిత్యకృత్యంబున కేమి
నింతప్రొద్దుజరిగెననివిచారింపుచు వీథి కేగునప్పుడు దైవయోగంబున
నొకభక్తుండు తనయింటికి కూలికింగొనిపోయి యప్పటియాతనిపడి
యొసంగిననగొనితెచ్చి జంగమార్చనవిధిసలిపెఁ గావున నితనిమహా
త్త్వంబిట్టిదని తెల్పి వీరభద్రనృపతింగాంచినఁ బసవేశ్వరుండిట్టి మా
పథవర్తులైన జంగమమూర్తులలో నేనెంతవాడ నన్నుమీరిన్నిభం
గులం గొనియాడఁదగునేయనిన క్రమ్మరనతం డిట్లనియె. మహాత్మా
యిమ్మహాత్ముల చర్యలువిని కృతార్థుండనైతి. కల్యాణంబునభక్త
తృప్తివలననాత్మవృత్తివహించుశరణుండు గలఁడనివిందు నతండెవ్వ
రనిన చెన్నయ్య మన్నించి యిట్లనియె. 355

సీ. ప్రతికూలభార్యయాకతనసింటగణార్చ,పొసఁగకచేన్గావఁ బోవునప్పు
డప్పురినెదురైనయయ్యనొక్కనిగని,చనిమును తాదెచ్చుమద్రసాన్న
ములతద్ఘనునిత్రృప్తిఁబొందించియాతని,తృప్తియేనిజలింగతృప్తిగాఁగ
వరలుకొన్నాళ్లిటుజరగఁగనొకనాడు,తావెంటగొనిపోవుశైవవరుఁడు

గీ. కనులనొప్పిజనించినతనువువీడు,సందర్శమునొందికసఁజాలకాత్మదేహ
మెడలదలచిప్రత్యక్షమామ్రుడుతదీశ,భక్తులతోగూడెకంగళబసవవిభుడు.

చ. అనియిటుశాంభవోత్తమమహత్త్వము దెల్పుచు వేడ్కమీర నా

దినమటువచ్చియట్టి వగిదిన్ని రతంబును భక్తవర్యగో
ష్ఠినలువుచుంశివార్చనము సేయుచునచ్చటకొన్నినాళ్లుశ్రీ
*బసవేశ్వరుండనిలచెన్నసుధీశుఁడుసంతసించుచున్. 357

గీ. అటులనుండితోడియయ్యలువీరభద్రోర్విపతియుఁదానునొక్కనాఁడు
సముచితేష్టగోష్ఠిసలుపుచుదద్ధరా, వరునిఁజూచిచెన్నబసవఁడనియె.

ఉ. ఈశ్వరమూర్తియైనబసవేశుదయన్నిముబోఁటివీరమా
హేశ్వరపాదసేవనలభీష్టము దేరఁగఁజేయగంటినీ
విశ్వములోనజన్మములు వీశకృతార్థుఁడనై తినింకనే
శాశ్వతమైనమోక్షపదసౌఖ్యముఁజెందఁగనూహచేసితిన్. 359

చ. అనవుడుకేలుమోడ్చివసుధాధిపుఁడిట్లను దేవ మిమ్ముగ
న్గొనినదిగోలెనన్యమగు కోరికలెల్లతృణీకరించి పా
వనభవదంఘ్రియుగ్మమెడఁబాయకయుండఁదలంచినాఁడఁగా
వునసహచారిచేసికొనివుణ్యునిగా ననుఁగావవేదయన్. 360

క. శరణాగతజలవాంఛా, పరిపూర్తియొనర్చుటుచితపద్ధతిగాదే
వరగుణులకెందునేమీ, వరవుడనాకోర్కిదీర్ప వలదేయనినన్. 361

చ. చిరునగవాననాబ్జమునఁ జెన్నువహింపఁగనాగమాత్మజుం
డరిమురిపల్కునీతలఁచినట్టుల యౌనిఁకనేఁడు వేవిన
న్మరిమురిచీకటింగణసమూహముతోనిటుదెల్పఁబోకనం
దఱమరుగన్వలెన్ సురవితాననుతామృతపెన్నఁజేరఁగన్. 362

క. అప్పెన్నసదీతటమున, పిప్పలభూజద్వయంబుఁబేరొందగు వె
ల్తిప్పకరుగసాధనమై,యొప్పుననుచుఁదెల్పనృపతియుత్సుకుఁడయ్యెన్.

వ. అంత. 364

రజతశైలంబుకరుగుట.

క. లేపినపిమ్మటనాగాం, బాపరతనయుండుకల్యవర్తనలెల్లన్
వేవేగదీర్చిసహచరు, లావీరగణాళితోడనతఁడిట్లనియెన్. 365

గీ. సన్నుతంబైనవసుధలోనున్ననదుల
కన్నిటికిమిన్నయెన్నఁదగియున్నయట్టి
పెన్నయున్నతిదలఁచినయన్నరాళి
కెన్నఁగా వెండి... 366

ఉ. కావుననన్నదీవరము గన్గొనవేడుకయయ్యెపోదమే
పావనులారయంచునొడబాటొనరించినసమస్తభక్తులన్
కోవిదుఁడైనవీరనృపకుంజరుఁడుందనతోడఁగూడిరా
పావకసంభవాంశజుఁడుప్రాభవమొప్పఁగనేగె నత్తరిన్. 367

వ. ఇట్లు చని చని. 368

సీ. ఆత్మాంబుసంస్మరణానందమానవ, సంఘమరంహోభుజంగనకుల
స్వవనసందర్శనాసక్తజనస్తోమ, పాపకాంధధ్వాంతభానుదీప్త
వైరిజనస్నాత్యవరలోకసప్తజ, స్మార్జితవృజినానిలానిలాశి
నిజతోయపాయిమనుజసముదయకృత, పాపభూమిజాతపరశుధార

గీ. పూరిసుకృతవంశోద్భూత భోగిమీన
కమఠనక్రజలూకకర్కటకముఖ్య
జంతుసముదాయవిహరణస్థానమగుచు
కన్నులకువన్నెఁ జెన్నొందు పెన్నఁగనిరి. 369

మ. కనిడాయంజనునంతవీచెపయితత్కల్లోలినీతుంగభం
గనితాంతోజ్ఝితశీకరవ్రజలరంగత్తుంగభూమాలతీ
కనకామ్రాదివసుంధరారుహసమాక్రాంతప్రసూనప్రభూ
తనిరాఘాటసుగంధబంధురజగత్ప్రాణాంకురవ్రాతముల్. 370

గీ. అమ్మరుద్వ్రాతములపథాయాసమువన
యించియొక్కరమ్యతలమున నెల్లభక్త
వరులుదానును శ్రీచెన్నబసవవర్యుఁ
డెలమితోడుతఁగూర్చుండి యిట్టులనియె. 371

ఉ. భక్తవరేణ్యులార ననుభవ్యకృపారతి మీప్రసాదసం
యుక్తుని జేసియేకొఱతయున్ ఘటియింపఁగనీకయేలుటన్
వ్యక్తిగసర్వవాంఛితసుఖానుభవంబులఁ జెందితింక నే
ముక్తిపదంబుఁ జెందెదనమోఘముగా సెలవిచ్చిపంపరే. 372

చ. అనవుడు తద్గణాధిపులు హాయిటులాడఁగఁగూడునయ్యనం
గనబసవేశ్వరుండుకడగాంచినపిమ్మట నీవెమాకుది
క్కనిమదినమ్మిమోదమెలయన్ నినుఁజుట్టుకయుంటిమిట్లుగా
వునమమ్ముఁబీడిసిపోకడవుంజనుటొప్పునె వెండికొండకున్. 373

క. నినుఁబాసియొక్కనిమిషం, బును భూమి జరింప బుద్ధి పుట్టదు మాకో
యనఘాత్మమమ్ముఁదోడ్కొని, చనునీతోఁగూడననినసమ్మతమతియై.
గీ. చెన్నబసవనిపలుకుమిాచిత్తమెట్టు,లటులయానింకజాగు సేయంగవలవ
దఱుగవలెరండుశివపురికతిరయమున,ననినతద్భక్తపుంగవులతనితోడ.
ఉ. కోవిదవర్యయిందఱముకుండలికుండలురాజధానికిం
బోవఁగ మార్గ మెప్పగిది బొందులతోడనొ లేక కాయముల్
బోవఁగఁ దోఁచిరో కరుణ బూని వచింపుము నామహాత్ములా
రా వినుఁ డిండఱొక్క మొగి రాజధరుం గనురీతిఁదెల్పెదన్. 376
ఉ. శారభమూర్తియై హరుఁడు చండరయంబున నేగుచున్నదీ
తీరజపిప్పలాఖ్యజగతీరుహయుగ్మము మీఁదనిల్చి నా
భారము వైచె నీతరులు బాపురె యంచు గణించి కామసం
చారము నిత్యజీవితమొసంగెద యామతితోడ నన్నిటిన్. [లు
సీ. ఆవృక్షములనున్న యాకులుతండముల్, సాచిమేయుదిగంతసామజము
వేడ్కనాకుజముల వేరులువట్టియు,య్యాలలూగుదురు పాపతలిరుబోండ్లు
న్వార్చాలలాచెట్లశాఖలచాటున, సంతరింతురు గికురింతలాట
లామ్రానిగపనీడ నధివసించుజనాళి,దివమునఁగాంక్షించుదీపకాంతి
గీ. పన్నగోపరినీడజాతప్రతాన, సంతతులలోరహస్యముఁజరుగకునిక్[ౌకైన.
లోనగనెచింతలోకపాలోత్కరంబు, వానిగొనియాడదరమెవాగ్వరుని
గీ. అమ్మహీజపతిచ్ఛటికనతిదూర, మున వసించిన నచటికి జనివిలాన
గతిదధిరోహణమొనర్చిఖండపరశు, పదము జేరుదుమనిప్రేమముదవజేసి.
గీ. అచటబాసిబసవనామాత్యభాగినేయుఁడుసముపభక్తియుక్తుఁడగుచు
జనినదీసమీపముననున్నకుంజరా, శనయుగంబుగాంచిసమ్మదమున.
వ. తద్భక్తపరులతో ని ట్లనియె. 381
క. అనఘాత్ములారయల్లదె, కనుగొంటిరెపిప్పలాఖ్యగనుకుజవరముల్
దిననాథ దారుణాతప, జనితశ్రమపథికజాతసమ్మదకరముల్. 382
క. అనిడాయనేగునంతక, మునుశర్వుఁడుభక్తసింహములతోభువిపై
డ్కొనినిజతనయుఁడువచ్చం,దనపురికినిమిగులసమ్మదంబిగురొత్తన్.
చ. నిరుపమరత్నకాంచన ఘుణివ్రజకాంతము లైననుయ్యెలల్
సిరిగలవెండికొండ ... వేలుపు ... నుంబల్లవ

* త్తరువరుశాఖలస్మరణ తండములందఱికిన్ని భా
సురతనయాగమంబెదురుచూచుచునుండె సుమానసమేతుఁడై. 384
ఉ. ఆతరి వేడ్క చెన్నబసవాధిపుఁడాతరుశాఖలందు సం
భూతములయ్యెనో యన నపూర్వముగాఁ జెలువొందునట్టి సం
ఘాతముగాంచి యోశరణకాండములార భవుండు మీకు వి
ఖ్యాతిగ పంపెకాంచననుయానసముల్ గనుఁగొంటిరే యనన్. 385
చ. హరిగుహనాశ్రయించినజనాళికవారణమా త్తికంబు వే
మరుభవగవత్కటాక్షవిభవాతిశయంబున జెందుమాకు శం
కరకృపగాంచుటేగణన గావున పోదమె యంచు తద్గణో
త్కరములుపల్కన త్తరిమొగంబున లేనగవంకురింపఁగన్. 386
వ. చెన్నబసవేశ్వరుండున్నయంతకమున్ను బసవేశ్వరు గర్భంబు
జొచ్చినపిమ్మట కొందఱు భక్తవర్యులతోఁ గప్పడి సంగమేశ్వరంబు
న వసియించిన నాగమాంబికతనయుఁడు కైలాసగమనోన్ముఖుం
డగుట లింగదర్పణంబునం గని సంతోషభాష్పధారాపూరితశరీరి
యై యెదురేగి మాయమ్మ యడుగులు తన ఫాలభాగంబు సోకం
బ్రణమిల్లిన కుమారునిం గ్రుచ్చియెత్తి పెద్దదడవు కౌఁగిటఁ జేర్చుకొని
మూర్ధాఘ్రాణంబొనరించి బహుకాలవియోగదుఃఖంబు వాసి
సంతోషించుచున్న జననీదోడ్కొని పిప్పలాపాతంబునకుం జని త
ద్భక్తవరులనందఱి నాలోకించి. 387
ఉ. ఓగుణులార యెక్కుఁడిదె యయ్యలతోఁటలనింక నిత్తరిం
జాగొనరింపనేల యని సంతసమొప్పఁగ తల్లినొక్కఁది
త్యాగమనూనదామమయమై చెలువొందెడు తోఁటనుండి వే
వేగమ వీరభద్రపృథివీవరుతోఁ నొక తోఁటలోపలన్. 388
క. వసియించియుంతతద్గణ, విసరారోహణముగాంచి విశ్వేశ్వర స్రదెన్.
ద్విసరములుదలఁచునంతనె, యసదృశపూర్వావతారుఁడై చెలువొం
క. ద్వాదశములు కేల్గన్నులు, మేదురముఖషట్కమునున మేయములౌశ
క్త్యాదివరసాధనంబులు, పాదుకొను వెలుంగుగుహునిభక్తగణంబుల్.
క. కనితోడనె పూర్వప్రమథ నికాయశరీరసమితిదాల్చి రిశావం
బున బాసినాగమాంబిక, యనుపమనాగేంద్రగమనయై చెలువొందెన్.

ఉ. నరహరివైరిమంత్రనుతనాగలతాదళభక్షణంబుచే
కురుపదకృత్రిమంబయినకొంచముచేదగు తొర్రికుక్కఁడైనచో
వరఁగఁగ పుల్లనౌగృహవిభాషితలక్షణమైన తియ్యనా
ధరణినిమంత్రవేత్తలిటుతప్పకబోధలుచేతురీయిలన్. 392

ఉ. కుండలిహారసూనుఁడిదిగో చనుదెంచెనటంచు వేడ్క నా
ఖండలముఖ్యనిర్జరనికాయముసంతసమొందెభేరికా
డాండరవంబులన్ సురజనప్రభవాక్షివిలాసనృత్యముల్
మండితపుష్పవర్షములు మాగధసన్నుతులొప్పెమిన్నునన్. 393

క. అత్తరినద్భుతమొదవఁగ, తత్తరుయుగ్మంబుసురపదంబునకెగయన్
మొత్తముగయింద్రముఖసుర!సత్తము లెదురేగుదెంచెసరగుననతులై.

సీ. గజముపైధ్వజమూని క్రతుభుగ్వరేణ్యుండు
ధూపపాత్రధరించె తోయజుండు
వేత్రహస్తుం డయ్యె చిత్రభానుసుతుండు
ఖడ్గంబుధరియించె కర్బురుండు
జలకలశముదాల్చె సలిలాధినాధుండు
కేలవీవనగొనె కీర్తసఖుఁడు
బంగారుపావలు పట్టెకుబేరుండు
నూటిమార్గముచూపె శూలధరుఁడు
గీ. పడఁగఁగొడుగున్నపైవిప్పెఁపరేడు
స్వస్తిజెప్పంగఁ దొరకొనె జలజభవుఁడు
తోరణాకృతిఁజెలువొందె తారకాళి
యమరసేనాని కైలాసగమనవేళ. 395

ఉ. ఈగతిషణ్ముఖుండు గిరిజేశ్వరుసన్నిధి కేగినమ్రుఁడై
జాగిలిమ్రొక్కవార లతిసంభ్రమ మొప్పఁగ నాత్మనందనుం
వేగముగ్రుచ్చియెత్తి కనువిందుగచూచుచు కౌఁగిలింపుచుం
రాగముమీరషణ్మరుశిరంబులుమూర్కొనుచుండి రయ్యెడన్. 396

క. నాగేంద్రగమనతొల్లిటి,లాగునగిరిజాతఁగొలుచులలనలలోనం బ్రవన్.
దాఁగలసియుండెప్రమథులు, నాగతిహరుగొలిచియుండిరతిముదమొద
క. ఆపిప్పలతరుయుగ్మము, [illegible] చుతద్భావ

రోపాంతంబునఛాయా, వ్యాపకమైనిల చెం(బ్రమధు లచ్చెరువందన్.
క. అంతటనిటభూతలమున, నంతంతట చెన్నబసవనారాధ్యుఁడుమా
కాంతుపురికఖిలజంగము, సంతతితోతనువులిడక చనెననువార్తన్.
క. వినికొండొరులతోనపుడి, ట్లని రాహోయిట్టిచిత్రమవనింగలదే
తనువులతోశివపురికిం, జనఁటొవ్వనె యీతఁడెంతసద్భక్తుండో. 399
క. తానొకఁడె కాఁడుతనతో, మానకచరియించుభక్తమండలినెల్లన్
బూనికొనిపోయినాఁడట, గానఁగలేమైతిమతని గలసిచనంగన్. 400
గీ. పసినిపండైనవృత్తంబుపట్టువీడు, గాకకనుకాయకెంపైనఁగలదెవిడుట
తపనుపండినవారితోతగిలి చనఁగ, నేలసమకూరుమనబోఁటిహీనమతికి.
ఉ. ఎన్నిభవంబులెత్తినగిరీశుసిసన్నిధి కిట్లుబోవఁగా
జన్నెయితండువీరనృపచంద్రునిప్రోలవసించునాఁడె నీ
కన్నసమర్థు లెవ్వరిక గల్గుదురాత్ముల బ్రోవుమంచునా
పన్నతజేరికొల్చిన కృపావరుఁడాతఁడు వీడనాడునే. 402
చ. వలదనిమాన్చినన్విడక వానికిముజ్జనియొక్క రొక్కరే
చలదళశాఖపైకొమలసందులనందుల డాగివారలా
గొలుసులతోట్ల లెక్కతరి గొబ్బున చేరులువట్టి వ్రేలినం
గలుగు గిరీశలోకమటుగాకయవెఱ్ఱులమైతి మక్కటా. 403
చ. గురువుల నిందచేసితిమొ కూడితిమో యితరాంగనారతిం
శరణులగాంచి మొక్కమొప్రసాదములో రుచు లెంచినారమో
పరధనకాంతజెందితిమొపాసితిమో వ్రతనిష్ఠపార్వతీ
శ్వరునిసపర్యకాలమున సల్పమొభక్తిని భక్తిమార్గముల్. 404
క. ఆడితిమోయనృతంబులు, కూడితిమోయేరుమాలి కుజనులపొందుల్
వీడితమో లింగార్చన, నోడితిమోయంతరాహితోత్కరమునకున్.
క. కొలచితిమో పెరవేల్పుల, నిలచితిమో శూలధరునినిందించుసెడల్
తలచితిమోదుర్వ్రతులు, విలచితిమో వేదమంత్రవిద్యావితతుల్.
క. కాకున్న చెన్నబసవం, డాకాంతమ్మనలగొంచు నరుఁగడె యనిచిం
తాకులమతి నుండిరి భూ, లోకంబున నఖిలశరణులుం గడుభక్తిన్.
చ. సదమలమానసంబున రసాస్థలి యిక్కథమెవ్వరేనియున్
చదివిన విన్న వ్రాసిన నిశాకరమాళికృపా సమృద్ధిబెం

పొదవఁగ భోగభాగ్యములు పొందిచిరాయురుపేతులై తుదిఁ
ముదమునఁగాంతు రబ్జభవముఖ్యులకందని మోక్షసంపదన్. 408

వ. అని యిట్లు రేణుక గణాధీశ్వరుండు బాహులేయువృత్తాంతంబు సవిస్తరంబుగాఁ దెల్పిన కుంభసంభవుండు నచ్చటి మహాసీశ్వరులును సంతోషితస్వాంతులై దేవా భవదీయకృపావిశేషంబున సమస్తసాధనహేతుకం బైనచరిత్రంబువినగలిగి కృతార్థులమైతిమని పెక్కువిధంబుల గొనియాడుచున్న వారలనుచితసల్లాపంబులవీడ్కొని యయ్యోగిపుంగవుండు నిజేచ్ఛంజనియె నబ్బాసవాలుగమియు నేతత్కథాశ్రవణం బొనరింపుచు నెప్పటియట్ల సుఖంబుననుండిరి. 409

చ. వనరుహరాజతేజనరవాహనకర్ణసమానదానపా
వనశివలింగసంగసురవల్లభమంత్రవిశేషభాషణాం
చనసగవర్యధైర్యరిపుసంచయఖండనశౌర్యధుర్యశో
భనసుగుణాలవాలకవిబంధుబుధాశ్రితజాలపాలకా. 410

క. కందర్పసదృశవితరణ, కందలతాంతాస్త్రశీకకరనిభరూపా
కుందాభకీర్తిపూరము, కుందాగ్రజబాహుబలయుకుంతశవిభవా.

ఉత్సాహము. శర్వశర్వరీంద్రచంద్రశారదాభ్రఫేనగో
పార్వమారుతాశనేశ హారహీర శారదా
పర్వతాధినాథగోప పారతాబ్జతారకా
గిర్వరాత్మజాతతుల్య కీర్తిపూరితోర్వరా. 412

గద్య. ఇది శ్రీమచ్చెన్నమల్లికార్జున కరుణాకటాక్షలబ్ధ కవితా మాధురీ ధురీణ కౌశికగోత్రపవిత్ర సుకవిజనస్తుత్య పాపయామాత్య ప్రణీతం బైన చెన్నబసవపురాణం బనుమహాప్రబంధంబునందు సర్వంబును పంచమాశ్వాసము సంపూర్ణము.

---

చెన్నపురి: వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారి
ఆదిసరస్వతీనిలయముద్రాక్షరశాలయందు
ముద్రితము.—1916.

శ్రీ ర స్తు.

శ్రీమదుమామహేశ్వర సేవనాసక్తచిత్తుండనై బసవరాజవిజయంబు మొదలుగాగల కొన్ని గేయప్రబంధంబులు విరచించి తత్ప్రబంధంబులచే నచ్చటచ్చట సజ్జనసముదాయంబున కానందంబుగలిగించి వారివలన గొంత ద్రవ్యం బార్జించి తద్ధనంబు నడ్డికిచ్చుకొనక దాతపుత్రాదులకు వినియోగించక పరమేశ్వరార్పితంబుగను కృష్ణాజిల్లాలో జేరిన పాలకొలను యనుగ్రామంబున నన్నదానంబు గావించుటకు ద్రవ్యసాహాయ్యం బొనర్చిన వదాన్యశేఖరుల వివరము.,

| | | రూ. | అ. |
|---|---|---|---|
| ముచ్చెర్ల నాగభూషణంగారు | ... | ౫౦ | ౦ |
| బొండాడ నారాయణమూర్తిగారు | ... | ౧౫ | ౦ |
| మాచేపల్లి మాణిక్యంగారు | ... | ౫ | ౦ |
| చక్కా శేషయ్యగారు | ... | ౫ | ౦ |
| అంత్యం కొండయ్యగారు | ... | ౭ | ౦ |
| అద్దేపల్లి గంగరాజుగారు | ... | ౮ | ౦ |
| పాలను వెంకట్రామయ్యగారు, చోడిశెట్టి శ్రీరాములుగారు | ... | ౬ | ౦ |
| రావూరి రెడ్డయ్యగారు, మాణిక్యంగారు | ... | ౬ | ౦ |
| పెనుగొండ నారాయణమూర్తిగారు | ... | ౬ | ౦ |
| పెనుగొండ వీరన్నగారు వెంకటరత్నంగారు | ... | ౩ | ౦ |
| అంత్యం మామిళ్లయ్యగారు | ... | ౨ | ౦ |
| జోగి భద్రాచలంగారు | ... | ౨ | ౦ |
| యల్లావర్ఝుల వెంకటరత్నంగారు | ... | ౧ | ౦ |

| | | రూ. | అ. |
|---|---|---|---|
| పత్తి రెడ్డయ్యగారు | ... | ౨ | ౦ |
| పెనుశెట్టి జగన్నాథంగారు | ... | ౧ | ౦ |
| దగదప్పుల నరసయ్యగారు | ... | ౨ | ౦ |
| అల్లు వెంకన్నగారు | ... | ౩ | ౦ |
| వేకేటి వెంకటశివయ్యగారు | ... | ౩ | ౦ |
| కడియము సన్యాసయ్యగారు | ... | ౧ | ౦ |
| చుండూరు రెడ్డయ్యగారు | ... | ౨ | ౦ |
| పెనుగొండ రామయ్యగారు | ... | ౨ | ౦ |
| తూతిక బసవలింగంగారు | ... | ౧ | ౦ |
| సముద్రాల చంచయ్యగారు | ... | ౨ | ౦ |
| బిక్కిన వెంకటస్వామిగారు | ... | ౧ | ౦ |
| గద్దె రామన్నగారు | ... | ౧ | ౦ |
| తిప్పా సుబ్బారాయుడుగారు | ... | ౧౦ | ౦ |
| నల్లా కోటయ్యగారు | ... | ౨ | ౦ |
| చాగా వీరనాగయ్యగారు | ... | ౨ | ౦ |
| వరదా మల్లయ్యగారు | ... | ౨ | ౦ |
| కారుపర్తి శివనాగమయ్యగారు | ... | ౨ | ౦ |
| కామిశెట్టి రామలింగయ్యగారు | ... | ౨ | ౦ |
| బట్టు సుబ్బారాయుడుగారు | ... | ౨ | ౦ |
| కొడవటి మహాలక్షుమయ్యగారు | ... | ౨ | ౦ |
| దేవపూజల గంగయ్యగారు | ... | ౨ | ౦ |
| లంకా వీరన్న | ... | ౨ | ౦ |
| మానేపల్లి వెంకన్నగారు | ... | ౨ | ౦ |
| లంకా గంగయ్య } ఆ వెంకన్న } | ... | ౨ | ౦ |
| మానేపల్లి నాంచేరయ్య | ... | ౧ | ౦ |

| | | రూ. | అ. |
|---|---|---|---|
| లంకా వెంకబ్బాయి | ... | ౧ | ౦ |
| ముత్యాలపల్లి సుబ్బయ్య | ... | ౧ | ౦ |
| ముత్యాలపల్లి గంగయ్య | ... | ౧ | ౦ |
| పేట వెంకటరెడ్డి | ... | ౧ | ౦ |
| లంకా శీతయ్య | ... | ౧ | ౦ |
| పూటుకూర్తి సుబ్బారాయుడు | ... | ౧ | ౦ |
| తాంబ్రాడ వెంకన్న | ... | ౧ | ౦ |
| పోతుమూడి ముసలయ్య | ... | ౧ | ౦ |
| లంకా చినవీరయ్య | ... | ౧ | ౦ |
| యేనుగుపల్లి మల్లయ్య | ... | ౧ | ౦ |
| దొడ్డిపట్ల మీరయ్య }<br>లంకా పోలయ్య } | ... | ౧ | ౦ |
| పేట అయ్యప్ప | ... | ౧ | ౦ |
| దొడ్డవరపు సూరయ్య | ... | ౧ | ౦ |
| లంకా వెంకన్న | ... | ౧ | ౦ |

---

శ్రీమద్రాజరాజేశ్వరీకృపాకలితమహదైశ్వర్యసంపన్నులును భస్మ రుద్రాక్షమాలికాలంకృతులును మహాపంచాక్షరీమంత్రపారీణులును మాలినీశాస్త్రవిచారధౌరేయులును అష్టావరణవిచక్షణదక్షులును వదాన్యశేఖరులును కృత్రిమశీలమర్యాదనిర్వాపణులును కందుకూరి వంశపయఃపారావారరాకాసుధాకరులును కృష్ణాజిల్లా నరసాపురవాస్తవ్యులునగు జమీందారుగారు శివప్రసాదరావుగారు మహద్గ్రంథంబగు నీపురాణమునకు సహాయకులైరి.

